# తెలుగు స్వతంత్ర



## విషయసూచిక

సంపుటి 1. సంచిక 31

శుక్రవారం, మార్చి 4, 1949

పుట






(భాగేశ్వరి)

పోనిలే పోనులే పూలచాయలకు
పూలసేవయె ప్రోవలిడె మాకుమాకు!

గోపూజ పూలునే
కోయగా తడవాయె—
పువుపువు నడుమ కవ్వుల
కెవరికో ఎరనంట! ॥ పోనిలే ॥

తను దలచి పూలె నా
తలనుంచ తప్పాయె—
తనకంటె పూలె నా
తల నేలు శ్రీ లంట! ॥ పోనిలే ॥

ఈ మేని పూ తావె
గొడము మా కిడ నాయె—
తావి తెర వనలక్ష్మి
దాచుకొన్నా నంట! ॥ పోనిలే ॥

మనసు తెలియని వేళ
మంచియే చెడుగాయె—
ఈ పూసరుల సిరులు
ఎంకి కవసర మటే! ॥ పోనిలే ॥

శ్రీ స్వతంత్ర

సంపుటి-1
సంచిక-3
మార్చి 4, 1949



# పన్నుల పెరుగుదల

గడచిన సోమవారం రాష్ట్ర శాసనసభా సమావేశపు బడ్జటు చర్చలో పాల్గొంటూ సర్ ఎం. ఏ ముత్తయ చెట్టియారు గారు యిలా అన్నారు: "బడ్జటుపై మనం ఎంతదూరం చర్చసాగించినా, అది కేవలం అసహజంగానే పరిణమిస్తుంది. ప్రభుత్వం నిర్ణయించిన విధానంలో మార్పు తీసుకురావడం అసంభవం; ఒకవేళ మనం చేసిన ఏ సూచనతోనైనా మంత్రులు ఏకీభవించినా, డబ్బులేదు - ఏం చెయ్యగలం అంటారు డబ్బు లేదు: కాబట్టి ఆహారం, వస్త్రసమస్య, గృహనిర్మాణం—వీటిగురించి ప్రభుత్వం ఏం చెయ్యడానికీ శక్తిలేదు"-అంచేత యీ చర్చనిప్రయోజనమనే భావాన్ని ఆయన సూచించారు.

ఆ సమావేశంలోనే ప్రస్తావిస్తూ ప్రముఖ వాణిజ్యవేత్త శ్రీ కోథారీ యిలా అన్నారు: "కొత్తగా విధించిన పన్నులు కేవలం తాత్కాలికమనే ఆర్థిక మంత్రి హామీ నమ్మశక్యం కాదనే నా వివేకం చెపుతోంది; వెనుదిరిగి ఆయా ఘట్టాల్లో విధించిన కొత్తపన్నుల చరిత్ర సింహావలోకనం చేస్తే, ఒకసారి ప్రవేశపెట్టినవి మరి తిరిగిపోవు. అయినా ఆర్థికమంత్రి ఆడితప్పని వ్యక్తి అని ఆశిద్దాం."

మాజీమంత్రి శ్రీ కె. ఆర్. కరంత్ చర్చలో పాల్గొంటూ, గృహనిర్మాణం, విద్యాసౌకర్యం, స్థానికపాలన—అత్యంత ప్రాముఖ్యంగల ఏ సమస్య తీసుకున్నా, ప్రభుత్వవిధానం సరియైనదనికాని, సమగ్రమైనదనికాని అనగల్గడానికి అవకాశం లేదన్నారు.

శ్రీ కరంత్ అభిప్రాయంతో వ్యతిరేకించడానికి ఏ వర్గానికీ అవకాశంలేదు; అటువంటి నిరాశాపూరితమైన, సర్వతోముఖ నిష్ప్రయోజనకమైన బడ్జటు నిర్మించడంలో ఆర్థికమంత్రి కృతకృత్యుడైనందుకు ఆయనను అభినందించక తప్పదు- సామాన్యుని జీవితావసరవస్తువులు ఏవీ ఆర్థిక మంత్రి దృష్టి తప్పిపోలేదు; దాదాపు అన్నిటిమీదా సరికొత్తపన్ను విధించబడింది. కొబ్బరి, నూనెవిత్తులు, చెరుకు, మిరపకాయలు, కాఫీ, బంగాళాదుంపలు, మిరియాలు, పసుపు, అరటిపళ్లు-వీటన్నిటిమీదా మొదటి అమ్మకంపై పన్ను విధించబడింది. బస్సు చార్జిలపై నూటికి ఎనిమిదోవంతు సర్ చార్జి విధించబడింది. పంచాయితీ, మునిసిపల్ ఆవరణాలలో ఉండే యిళ్ళ పన్నులపై ఆ రకంగానే సర్చార్జి విధింపబడింది. కాఫీహోటళ్లు, సినిమా హాలులు, అన్నవిక్రయశాలలు-

అన్నిటిమీదా పన్ను విధించబడింది. ఆర్థికమంత్రి అంచనా ప్రకారం రాష్ట్రబడ్జటులో లోటువచ్చింది. లోటు భర్తీ చెయ్యాలి. అంచేత యీ వస్తుసముదాయం అంతటిమీదా పన్ను విధించారు. ఇదివరకు ఏ కారణాలవల్ల యీ వస్తువుల మొదటి అమ్మకంపైపన్ను మినహాయించారో ఆ కారణాలు యీ కొత్తపన్నులవల్ల అదృశ్యం అవవు సరికదా, క్లిష్టతరం అవుతాయి

వీటన్నిటి పర్యవసానంగా సామాన్యుడి జీవనభారం మరింత అధికం అవుతుంది దేశంలోని అధిక చలామణీ అరికట్టి, వస్తువుల ధరలు తగ్గించే ప్రభుత్వ లక్ష్యసాధనకి యీ పన్నులు తీవ్రమైన అవరోధం కల్గిస్తాయి. ఈ పన్నులన్నీ తిరిగి తిరిగి ఎవర్ని వేధిస్తాయి? అమ్మకపు పన్ను ఆఖరికి కొనుగోలుదారుడే యిచ్చుకోవాలసి ఉంటుందని ప్రభుత్వమే అంగీకరించింది. జీవితావసర వస్తువుల ధరలన్నీ పెరిగిపోతాయి అనునిత్యం వంటింట్లో ప్రతి సంసారికీ కావలసిన సామానులే కాక, బస్సు చార్జీలు, రవాణా చార్జీలు, యిళ్ళ అద్దెలు, సినిమా రేట్లు,ఎలక్ట్రిసిటీ ఖర్చులు-అన్నీ పెరిగిపోతాయి. జీవనవ్యయం హెచ్చవుతుంది. బడ్జెట్ ప్రవేశపెడుతూ, కొత్త పన్నులన్నీ, అధికచలామణీ అరికట్టేందుకు చేసే ప్రయత్నమేనని ఆర్థికమంత్రి ఉద్ఘాటించారు. అంత విభ్రాంతికరమైన ప్రకటన యింకోటి ఉండబోదు.

అసలే కార్మికవర్గం, మధ్య తరగతి ప్రజలు చాలా దుస్సహమైన జీవితాల గడుపుతున్నారు. సర్వత్రా అసంతృప్తి క్రమ్ముకుని ఉంది. మూడు సంవత్సరాల కాంగ్రెస్ పరిపాలన తరవాత సామాన్య పౌరుడి జీవితం మరింత అధ్వానం అయింది అంటే, శోచనీయమైన విషయం. పులిమీద పుట్ర అన్నట్టు, కేంద్రప్రభుత్వపు బడ్జెటుకూడా మరికొన్ని కష్టాల్నే తెచ్చి పెట్టింది. దినదిన గండంగా జీవితం గడుపుతున్న వారందరికి భవితవ్యం ఇంకా అంధకారంగా గోచరిస్తుంది ఆపైన అశాంతి చెలరేగి హెచ్చుజీతాలకోసం ఆందోళన, అందువల్ల ఉత్పత్తిధరలు పెరగడం, ఆపైన మరీ హెచ్చుధరలు, ఆందోళన, అధిక చలామణీ-యీ విషచక్రానికి మహాప్రస్థానం ఎలా ముగుస్తుందో ఊహించడానికే భయం వేస్తుంది దేశం విపరీతమైన పరిస్థితుల్లో ఉంది. రక్షణశాఖకి ఆదాయంలో సగానికి పైగా వ్యయమవుతోంది; అంతటితో ఆగేటట్టుకూడా లేదు. ఆర్థికరంగంలో అసమర్థుల పరిపాలనకిది సమయంకాదు. ఉప్పుపై పన్ను వెయ్యడం సహించలేక మహాత్ముడొక మహోద్యమం లేవదీశాడు. ఆ ఉద్యమం పవిత్ర త్యాగఫలితంగా అధికారం చేపట్టిన నేటి కాంగ్రెస్ మంత్రులు ఉప్పు మినహా తక్కిన అన్నిటిమీదా పన్ను విధించి మహాత్ముని సిద్ధాంతాలకే వికృత వ్యాఖ్యానం సృష్టించారు ప్రజాపరిపాలన బాధ్యతారహితమైన కేళీరంగం కాదు: అసిధారావతం శతాబ్దాల క్రితం పృథ్వీ చక్రవర్తి- "నా రాజ్యంలో ప్రజల్ని సుఖపెట్టలేకపోతే నా దిగ్విజయయాత్రలు నాకే ఎదురు తిరుగుతాయి" అన్నాడు. ఎన్నికలలో కాంగ్రెస్ విజయం పొందాలి ఎందువల్ల? రాష్ట్రమంత్రులు ఓసారి ఆవిషయమై ఆత్మశోధన కావించుకొనడం ఎంతో అవసరం.

# యథాలాపం ::

హృదయంయొక్క ఉన్మాదప్రకో
పమే ద్వేషం—బైరన్.

ప్రధాని శ్రీ. రామస్వామిరెడ్డియార్ కోరికపై శ్రీ కళా వెంకటరావుగారు యీ వారం మద్రాస్ వచ్చారు. వచ్చి రావడంతోనే, కాంగ్రెస్ లెజిస్లేచర్ పార్టీ నాయకుని ఎన్నికతో తనకేమీ ప్రసక్తి లేదని ఒక ప్రకటనచేశారు తత్సందర్భంలో తన విరాగభావం నిరూపించడానికో అన్నట్లు, ప్రతిసంవత్సరం నాయకుని ఎన్నిక జరగాలనే నియమాన్నే రద్దు పరచమని ఒక సూచనకూడా వెలువరించారు. మద్రాసులో ఆయన అడుగుపెట్టిననాడే, ఆయన గౌరవార్థం ఆర్థికమంత్రి శ్రీ గోపాలరెడ్డి ఒక విందు ఏర్పాటుచేశారు. మంత్రివర్గాలకి చెందిన ఎసెంబ్లీ సభ్యులంతా విందుకి ఆహూతులయారు. శ్రీ ఓమాందూరునే నాయకునిగా తిరిగి ఎన్నుకోవాలని ఆ సమావేశంలో ప్రతిపాదింపబడ్డ ఒక సూచనకి తీవ్రమైన ప్రతిఘటన ఎదుర్కొన్నదని తెలుస్తోంది. ఒకరిద్దరు మినహాయించి, తక్కినవారంతా నాయకత్వంలో మార్పునే వాంఛించారు: యీ ప్రధానితో విసుగెత్తిపోయామనీ, ఏమైనాసరే ఆయన నాయకత్వం అక్కరలేదనీ, వాళ్లన్నారు.

* * *

ఓమాందూర్ నాయకత్వంపట్ల నల్ల చొక్కాలవారు ప్రదర్శించే ఉత్సాహం ఒక చిత్రమైన పరిణామం. ఆ ఉద్యమ నాయకులు తరుచు శ్రీ ఓమాందూరును స్వర్గీయ పానగల్ రాజాతో సరితూగగల నాయకుడని అభినందిస్తారు. పానగల్ రాజా ఉచ్ఛదశలోనున్నది బ్రిటిష్ పరిపాలన ఉజ్వలంగా సాగే దినాలలో. దేశభక్తులకి సముచితమైన అవధులు మీరి పానగల్ రాజా రాజకీయాలు నడిపించాడనీ, అతడు సామ్రాజ్యవాద సహాయకారి అనీ- ఆ రోజుల్లో స్వాతంత్ర్యపోరాటం సాగించిన కాంగ్రెసు నాయకుల నిశ్చితాభిప్రాయం. ఈ ఖండనల వల్ల ఏమీ కలతచెందినట్లు పానగల్ ప్రవర్తించలేదు. కాని, వాస్తవంలో, బ్రిటిష్–వ్యతిరేక శక్తుల ఉనికిని ఊతగా తీసుకుని, బ్రిటిష్‌వారి ప్రాపు తనకు ఇతోధికంగా లభించేటట్లు చూసుకున్నాడు. అయితే అలా సంక్రమించిన అధికారాన్ని ప్రభుత్వశాఖలు భారతీయులపరం అయే మార్గంలో అనన్యంగా వినియోగించాడు: ఆ రోజుల్లో అది గురుతరసమస్య తన పదవి సురక్షితంగా ఉండడానికి ఏ సాధనమైనా నిరాక్షేపణగా ప్రయోగించాడు: కాని ఆయన అనుసరించిన విధానాలు ఉదారత్వంతోనే కూడుకొని ఉండేవి. తక్కిన సాధనసంపత్తిని ఉపయోగించినట్లే, కులతత్వవాదం కూడా తన పదవి సురక్షితంగా ఉండడానికి ప్రయోగించేవాడు. ఆయన కులతత్వవాదం పైపైని నిలిచిపోయేది కాని రక్తమజ్జాస్థిగతమైన ద్వేషభావాల క్రోడీకరణకాదు. నాగరికులలో నాగరికుడు పానగల్. హుందా, మర్యాదా అతన్ని ఎన్నడూ వీడి ఉండేవి కావు సిద్ధహస్తుడైన చిత్రకారుడు వర్ణ

స్నిగ్ధతపట్ల ఎటువంటి అభిరుచి చూపుతాడో, అంత కళాసక్తితోనూ పానగల్ రాజా రాజకీయపు పన్నాగాలలో పాల్గొనేవాడు. తత్ఫలితంగా ఓడిపోయిన తన ప్రతికక్షుల హృదయాల్లో ఏ విధమైన స్పర్థభావమూ రగుల్కొడానికి వీలు లేకుండా చేసేవాడు.

* * *

పానగల్ తో ఓడిపోయిన ప్రతికక్షులు, ఆ ఓటమిని క్రీడారంగంలో ఓటమివలెనే స్వీకరించి, ఆయనతో పోటీకి దిగడమే మహద్భాగ్యం అనుకునేవారు. శ్రీ ఓమాందూరు విషయంలో, ఆయనపక్షం నిలిచి, గెలిచినా అది ఒక గౌరవంగా భావింపబడడంలేదు. మనుష్యుల్ని యీసడించి, కసిరి, కొంచపరచి నొప్పికల్గించే నేర్పు శ్రీ ఓమాందూరుకి పెట్టనిసొమ్ము. ఆఖరికి తమని ఆజ్ఞాపించేహక్కు ఆయన చేతుల్లో పెట్టినందుకు విచారంతో తమ్ము తామేనిందించుకునేటట్లు చెసే లక్షణమూ యనది. మొదట్లో ఉపవాసాలూ, నిర్ణీత దినాల్లో మౌనధారణవంటి నియమాచరణలద్వారా ప్రజాదృష్టి బలవంతంగా తన పక్కకు తిప్పుకున్నా, వెనువెంటనే అవి వాటిగాంభీర్యమాహాత్మ్యన్ని కోల్పోయాయి. తన ఉన్నతపదవిని సక్రమంగా నిర్వహించడానికి కావలసిన శక్తి సామర్థ్యాలలోటును కప్పిపుచ్చడానికి ఆయన నియమాచరణలు అవకుంఠనమాత్రమేనని తేలిపోవడానికి ఎంతోకాలం పట్టలేదు. ప్రభుత్వానికి చెందిన బాధ్యతాయుతమైన పదవుల్లో ఏ మాత్రం అధికృతి లేని తన అభిమానుల్ని కొందర్ని ప్రతిష్ఠించడానికి ఆయనపడ్డ తాపత్రయాలతో, ఆయన ధర్మాభిరతి కీర్తికూడా గాలిల్లో హారించుకుపోయింది. అతి స్వల్ప విషయాలపట్ల బ్రహ్మాండమైన శ్రద్ధచూపి దృష్టి కేంద్రీకరించే వ్యాపకంలోపడి, ఓమాందూర్ ప్రభుత్వం అతి ప్రధానమైన విషయాల్ని విస్మరించింది. అన్ని విధాలా ఆశాదృష్టికీ, పరితృప్తికీ ప్రజలు దూరం అయిపోయారు. ఒక్క నల్లచొక్కాలవారికి మాత్రమే ఆయన అభిమానపాత్రుడూ, వీరుడూ అవగల్గాడు.

* * *

నల్లచొక్కాలవారు ద్రావిడస్థాన్ పతాకాన్ని ఎగరవేసి, ఆర్యుల్ని దేశం నుండి తరిమివెయ్యడానికి కంకణం కట్టుకున్నారు. హిట్లర్ అవలంబించిన పద్ధతి వారిది. సమత, ధర్మం, సమానన్యాయం- యీ సిద్ధాంతాలకీ వారి ఉద్యమానికీ చుక్కెదురు. సదుపాయమైన అవకాశాల్ని పురస్కరించుకుని ప్రజాసామాన్యంలో అంతర్లీనంగా ఉన్న ద్వేషాగ్నిని రెచ్చగొట్టి చేజిక్కిన వాళ్లపై ప్రసరింప చెయ్యడం నల్లచొక్కాలవారి ప్రత్యేకత. వాళ్ల చేతుల్లోఉన్న పత్రికలు ప్రజాభిరుచిని కలుషితంచేసి ఘాతుకచర్యలకీ హింసాకాండకీ పురిగొల్పడంవల్ల, అవి సంఘక్షేమానికీ భంగకరం. ఈ నాడు కమ్యూనిస్టుల చర్యలు ఏ విధంగా శాంతి భద్రతలకీ రాజ్యసుస్థిరతకీ భంగకరమో, నల్లచొక్కాలవారి ప్రతిఘటనోద్యమం కూడా అంతే. ఇరువురు అనుసరించేదీ ఒకేమార్గం: ఆ మార్గం, చైనాలోవలె, ప్రభుత్వాధికారాన్ని కావని శక్తిని పరీక్షించె పార్టీసైన్యాల సృష్టికి దారితీస్తుంది! అయితే, కమ్యూనిస్టులప్రమాదం ఎంత విస్తృతమైనదో ప్రభుత్వం సరిగానే అవగాహన చేసుకుంటిగాని, నల్లచొక్కాల ఉద్యమంపట్ల ఆశ్చర్యకరమైన మెత్తదనాన్ని ప్రదర్శిస్తోంది.—(సా...

# నా దైనిక సమస్యలు

## 1

ఆ శుభం కాస్తా నా కళ్ళతో చూసే ప్రాప్తం లేకుండా నాయనా అనే మాబామ్మమాటల వల్లనయితేనేం, అవతల సంబంధం మించిపోతుందన్న తొందరవల్లనయితేనేం నా పదమూడోయేట వివాహం చెయ్యటానికి మా నాన్నగారు విషయాంతరం. అది ఇలాఉం వారంరోజులు వుందన వరకూ ఒకటి రెండు విషయాలు జ్ఞాపకం ప్రారంకోవాలి. మొదటిది- ఈ రెండు దేశాల ఆర్థిక పరిస్థితులూ ఒకదాని కొకటి అనుబంధంగా ఉండడం సహజం. ఇంతవరకూ ఇండియా అంతా ఒకటేదేశం అనే ప్రాతిపదికమీద దేశంలోనివివిధభాగాల ఆర్థికనిర్మాణం జరిగింది. కొన్ని కొన్ని రాష్ట్రాలు పారిశ్రామికంగానూ, మరి కొన్ని వ్యవసాయికంగానూ మాత్రం అభివృద్ధిపొందినా రాష్ట్రాంతర వ్యాపారంద్వారా వివిధభాగాల అవసరాలు తీరేవి. సింధురాష్ట్రంలోని పత్తి బొంబాయిరాష్ట్రంలోని మిల్లులలో బట్టగా తయారయి తిరిగి ఆరాష్ట్రానికి వెళుతూ ఉండేది. తూర్పుబెంగాలులోని జనపనార కలకత్తా మిల్లులను నిరాఘాటంగా వస్తూఉండేది. సింధురాష్ట్రంలోబట్టలమిల్లులు కాని, తూర్పుబెంగాలులో జనపనార ఫ్యాక్టరీలుకాని స్థాపించడం అంతగా అవసరం కాలేదు. ఈ కారణంవల్ల ప్రస్తుతం పాకిస్తాన్‌గా ఏర్పడిన రాష్ట్రాలలో పరిశ్రమలు లేనేలేవని చెప్పవచ్చును. అక్కడ కావలసిన పారిశ్రామిక పదార్థాలు ఇండియా నుండి ఎగుమతికావాలి. ఆ విధంగానే ఇండియాలోని మిల్లులకు కావలసిన ముడిపత్తి, జనపనార పాకిస్తాన్ నుండి దిగుమతికావలి. అది జరగక పోతే పాకిస్తాన్‌లో పారిశ్రామిక పదార్థాల కొరత ఏర్పడుతుంది; ఇండియాలోని మిల్లులకు




నేను నా భర్త కష్టసుఖములలో పాలొని తగిన సలహా ఇవ్వగల జ్ఞానం వచ్చేటప్పటికి ఆయన బి. యే. పరీక్షమీద (రాబర్టు బ్రూస్) దండయాత్రలు నాలుగు సాగించారు. మరల ఆ సంవత్సరం పరీక్షకు కూడా వెళ్లారు. నా పోరువల్లనయితేనేమి; మునుముందు పుట్టినవాడివి, యేమో ఉద్ధరిస్తావని నా కష్టార్జితమంతా నీ చదువుకు పోశాను, నిన్నుగాకుండా నీ భార్యను కూడా పోషిస్తూ నీ పరీక్షరుసుములు కూడా చెల్లించనే. అనే మా మా[పాకిస్తాన్] నుండి 6½ లక్షల బేళ్లు దిగుమతిఅయినా, ఇంకా నాలీనా సుమారు 10 లక్షల బేళ్ళ కొరత ఉంటుంది. పాకిస్తాన్‌లో 13 లక్షల బేళ్లు ఉత్పత్తి అవుతూన్నా, అక్కడినుంచి అందులో సగంమాత్రం వచ్చేఏర్పాట్లు జరిగినవి. అయినా పూర్తిగా రావడానికి ఎన్నో ఆటంకాలు. ఆ కారణంవల్ల ముడి పత్తి విషయంలో సరియయిన ఏర్పాటులు జరిగితే తప్ప మన వస్త్రపరిశ్రమ విపత్కర పరిస్థితులలో చిక్కుకుంటుంది.

ఇది జనపనార విషయంలో ఇంకా నిజం. జనపనార ఫ్యాక్టరీలు కలకత్తాలోనూ, కలకత్తా ప్రాంతంలోనూ వందకు మించిఉన్నవి; పాకిస్తాన్‌లో ఒక్కటీలేదు. దేశవిభజనకు పూర్వం లెక్కలప్రకారం నూటికి 73 వంతున పాకిస్తాన్‌లోనూ, మిగతా 27 వంతున ఇండియాలోనూ జనపనార ఉత్పత్తి జరుగుతున్నది. ఇండియాకు 50 లక్షల బేళ్ళ జనపనార పాకిస్తాన్ నుండి దిగుమతి అయితే తప్ప, జనపనార మిల్లులకు ముడి పదార్థాల కొరత ఏర్పడుతుంది.

పాకిస్తాన్‌లో పరిశ్రమలు లేనికారణంగా మనం అక్కడికి కొన్ని ముఖ్య పారిశ్రామిక పదార్థాలను ఎగుమతి చెయ్యవలసి ఉంటుంది. ఇండియా-పాకిస్తాన్‌ల మధ్య జరిగే వ్యాపారం క్రింది పట్టికలో

స్నిగ్ధతపట్ల ఏటువంటి అభిరుచి చూపుతాడో, అంత కళాసక్తితోనూ పానగల్ రాజా రాజకీయపు పన్నాగాలలో పాల్గొనేవాడు తత్ఫలితంగా ఓడిపోయిన తన ప్రతికక్షుల హృదయాల్లో ఏ విధమైన స్పర్థభావమూ రగుల్కొడానికి వీలు లేకుండా చేసేవాడు.

* * *

పానగల్‌తో ఓడిపోయిన ప్రతికక్షులు, ఆ ఓటమిని క్రీడారంగంలో ఓటమివలెనే స్వీకరించి, ఆయనతో పోటీకి దిగడమే మహాద్భాగ్యం అనుకునేవారు. శ్రీ ఓమాందూరు విషయంలో, ఆయనపక్షం నిలిచి, గెలిచినా అది ఒక గౌరవంగా భావించబడలేదు. మనుష్యుల్ని యోగ

| | |
|---|---|
| పంచదార | 10.0 |
| ఉక్కు—[illegible]0 వేల టన్నులు<br>టన్ను 1-కి రూ. 500/- | 2.5 |
| బొగ్గు—టన్ను 35 రూ. చొ॥<br>35 లక్షల టన్నులు | 10.5 |
| వనస్పతి | 2.0 |
| టీ | 3.0 |
| సిమెంటు | [illegible].0 |
| మొత్తం | 65.2 |

పై పట్టికనుబట్టి మనకు పాకిస్తాన్ నుండి జనపనార, పత్తివంటి ముడి పదార్థాలు దిగుమతి కావాలనీ మనం అక్కడికి బట్టలు, పంచదార, బొగ్గు, ఉక్కు మొదలైన పారిశ్రామిక పదార్థాలు ఎగుమతి చెయ్యాలనీ తేలుతుంది. అక్కడినుంచి ముడి పదార్థాలు లేకపోతే మన పరిశ్రమలు సాగవు; మన వస్తువులు లేకపోతే అక్కడ ప్రజాసామాన్యం ఇబ్బందిపడుతుంది. కాని ఒక్క తేడా ఉంది. పారిశ్రామిక పదార్థాలు లేకపోయినందువల్ల ఎక్కువగా ఇబ్బందిపడినా ఏదోవిధంగా పాకిస్తాన్ ప్రజలు గడపగలరు; కాని ముడి పదార్థాలు లేనిదే మనం ఒక్క సంవత్సరమైనా గడపడం అసంభవం. రెండు దేశాలమధ్య వ్యాపారం

యోగ్యతలపట్ల బ్రహ్మాండమైన శ్రద్ధచూపి దృష్టి కేంద్రీకరించే వ్యాపకంలో పడి, ఓమాందూర్ ప్రభుత్వం అతి ప్రధానమైన విషయాల్ని విస్మరించింది. అన్ని విధాలా ఆశాదృష్టికీ, పరితృప్తికీ ప్రజలు దూరం అయిపోయారు. ఒక్క నల్ల చొక్కాలవారికి మాత్రమే ఆయన అభిమానపాత్రుడూ, వీరుడూ అవగల్గాడు.

* * *

నల్లచొక్కాలవారు ద్రావిడస్థాన్ పతాకాన్ని ఎగరవేసి, ఆర్యుల్ని దేశం నుండి తరిమివెయ్యడానికి కంకణం కట్టుకున్నారు. హిట్లర్ అ[illegible] యంత్రాల దిగుమతి వారిది. ప్రస్తుత[illegible] అవసరమైన ధనం ఉండదు. ఇది చాలా ప్రమాదకరమైన పరిస్థితి. అందుచేత పాకిస్తాన్‌కు ఇంకా ఎక్కువ ఎగుమతులను చేసే అవకాశాలను మనం పరిశోధించాలి.

ఈవిధంగా ఎంతో కాలం నడవడానికి వీలు లేదు. ఈలోపుగా మనం ముడిపత్తి, జనపనారా దేశంలోనే కావలసినంతగా ఉత్పత్తి చేసుకోడానికి ప్రయత్నించాలి. తిరువాన్కూరులోనూ, ఇతరచోట్లా జనపనారను ఉత్పత్తిచెయ్యడానికి ప్రభుత్వం ప్రయత్నాలు చేస్తూండడం ముదావహమైన సంగతి. ఈవిధంగానే పాకిస్తాన్‌లో కూడా పరిశ్రమల స్థాపనకు ప్రయత్నాలు జరుగుతూన్నవి. అప్పుడు మనకు అక్కడనుండి ముడిపదార్థాలు అసలేరావు. ఆ కాలంనాటికి మనదేశంలో ఆహార పదార్థాలతోబాటు ముడిపదార్థాల ఉత్పత్తిని కూడా హెచ్చించాలి.

ఈ మధ్యకాలంలో పాకిస్తాన్‌తో సంప్రతింపులుజరిపి ఒక వ్యాపారపుటొడంబడిక చేసుకోవాలి. కాశ్మీర్ యుద్ధవిరమణ ఫలితంగా రాజకీయసంబంధాలలో ఏర్పడిన సుముఖపరివర్తనం ఆర్థిక వ్యవహారాలలో ప్రతిఫలించడం అందరూ ఆశించదగినది. నైసర్గికంగా రెండుదేశాలకూ గల ఐక్యం తాత్కాలికంగా రాజకీయరంగంలో చెడినా, ఆర్థికరంగంలో సాఫల్యం పొందకపోతే రెండు దేశాలూ తీరని నష్టానికి గురికాక తప్పదు.

# నా దైనిక సమస్యలు

## 1

ఆ శుభం కాస్తా నా కళ్ళతో చూసే ప్రాప్తం లేకున్నా నా యవ్వా అనే మా బామ్మ మాటల వల్లనయితేనేం, అవతల సంబంధం మించిపోతుందన్న తొందరవల్లనయితేనేం నా పదమూడో యేట నా వివాహము చెయ్యటానికి మా నాన్నగారు నిశ్చయించారు. వివాహం వారం రోజులు వుందనగానే మా యింటికి బంధువులంతా రావటం ప్రారంభించారు. వాళ్ళందరికీ తగిన మర్యాదలు చెయ్యలేక, మా అమ్మ, నాన్న మొదలైనవారంతా సతమతమవుతూండేవారు; అయితే, అప్పుడు బియ్యం రేషన్, మొదలగునవి లేవుగాబట్టి, కేవలం డబ్బు సమకూర్చుకోటానికే మా నాన్న, అమ్మ యెంతో కష్టపడేవారు. అప్పుడు వాళ్ళ కష్టాల్లోగాని, వాళ్ళ ఆలోచనలలోగాని పాల్గొనే అవసరమే వుండేదిగాదు నాకు. మా బంధువుల పిల్లలతో హాయిగా కథలతో కబుర్లతో కాలక్షేపం చేస్తుండేదాన్ని. ఎలాగయితేనేం వివాహం జరిగిపోయింది.

నాకు వివాహసమయంలో, మా అత్తారు పెట్టిన చంద్రహారము తళ తళ మీద, బెనారసు చీర జరీ డిజైనుమీద వుండేది గాని మనస్సు- ఈ మెరుపుల వస్తువుల యెరతో, నా స్వేచ్ఛావాతావరణానికి సరిహద్దులు నిర్మిస్తున్నారనిగాని, నా జీవితంలో నూతనాధ్యాయ ప్రారంభమనిగాని తెలియదు. మా అమ్మను యెవరన్నా మీ అల్లుడు యేం చదివాడమ్మా అని అడిగితే, బి. యే. చదువుతున్నాడమ్మా, ఇది కాగానే బి. యల్. చదివి ప్రాక్టీస్ పెడ్తాడమ్మా అని మా అమ్మ చెబుతుంటే, నేను, నిజంగా ప్లీడర్ భార్యనైనట్లే భావించుకొని గర్వపడేదాన్ని. ముందు జీవితంలో, ప్లీడర్ భార్య లేకపోగా, ప్లీడర్ గుమాస్తా భార్యను గూడా కాని జీవితసమస్యలను యెదుర్కొనవలసి వుంటుందని తెలియదు.

నేను నా భర్త కష్టసుఖములలో పాలొని తగిన సలహా ఇవ్వగల జ్ఞానం వచ్చేటప్పటికి ఆయన బి. యే. పరీక్షమీద (రాబర్టు బ్రూస్) దండయాత్రలు నాలుగు సాగించారు. మరల ఆ సంవత్సరం పరీక్షకు గూడా వెళ్ళారు. నా పోరువల్లనయితేనేమి; మునుముందు పుట్టినవాడివి, యేమో ఉద్ధరిస్తావని నా కష్టార్జితమంతా నీ చదువుకు పోశాను, నిన్నుగాకుండా నీ భార్యను గూడా పోషిస్తూ నీ పరీక్షరుసుములు గూడా చెల్లించలేను అనే మా మామగారి శాసనశింపులవల్లనయితేనేం- ఆసంవత్సరం పరీక్ష ప్యాసయ్యారు.

దానితో చదువుకు స్వస్తిచెప్పటం, ఉద్యోగాన్వేషణ ప్రారంభమయినాయి. ఎలాగయితేనేం, ఉద్యోగంలో చేరారు. సరియైన బహుమతులతో పైవాళ్ళను తృప్తిపరచను చేతగాక, ఉన్న కొద్ది ఆస్తిని అమ్మి కాలేజీలకుపోసి, ఉద్యోగము అనేది లభిస్తుందా లేదా అనే ఆదుర్దాతో కాలేజీలోనుంచి బయటికి వచ్చింది మొదలు పరితపించే మధ్యతరగతి జనులకు లభ్యమయ్యే గుమాస్తా ఉద్యోగం లభించింది. ఆ గుమాస్తా ఉద్యోగంతోనే మొదట యెంతో సంతోషించాము.

ఆ ఉద్యోగనిమిత్తం వేరే వూళ్ళో మేము కాపురం పెట్టవలసివచ్చింది. ఈ ఉద్యోగంతో వచ్చే నూరు రూపాయలు మాకే చాలుతుందా- ఉన్నడబ్బు కాస్తా కొడుకుమీద పెట్టుబడిపెట్టి, యేదో పెద్ద ఉద్యోగంచేసి ఇల్లు నింపుతాడనే కొండంత ఆశతో యెదురుచూస్తున్న తల్లి దండ్రులను తృప్తిపరచటానికే చాలుతుందా! ఎటూ చాలని సంపాదనతో, అశాంతితో సంసారాన్ని భారంగా ఈడుతుండగానే స్వాతంత్ర్యమనే ఆశాజ్యోతి పొడచూపింది. స్వాతంత్ర్యంవస్తే దేశంలో కరువు అంటూ వుండదు, రామరాజ్యంగా వుంటుందని వూహించి నిర్మించిన వూహా సౌధాలన్నీ మొదలంట కూలినాయి. పాత గవర్నమెంటు

పోయింది. క్రొత్త గవర్నమెంటు వచ్చింది. ప్రపంచంలో యెన్నోమార్పులు జరుగుతున్నాయి గాని మా జీవితంలో మాత్రం యే మార్పూ లేదు. ఏదో అలవెన్సు పది రూపాయలు యెక్కువ వచ్చినయి గదా అని సంతోషిస్తే, ఆ పదిరూపాయలకూ సరిపోను ఇవతల జీవితావసర వస్తువుల ధరలు హెచ్చాయి. ఏనాటికైనా ఈ 'జీతం చాలదు' అనే సమస్యతీరి మంచి పరిస్థితులు వస్తాయనే మూఢవిశ్వాసంతోటి యెదురు చూస్తున్నాను.

ధన్‌బాద్ — పి. సరోజిని

## 2

నేనొక విద్యార్థినిని. ఎంతో ఆనందమయంగా, ఏ తాపత్రయం లేకుండా స్వేచ్ఛగా గడుప వలసిన విద్యార్థినీ జీవిత మీ విధంగా నాశనమయి పోతున్నందుకు నా కెంతో విచారముగావుంది. కాని యేమి చేయగలం? స్వార్థపరులైన తోటి మానవుల మూలంగా మేమంతా నాశనం కావలసి వచ్చింది.

నేనంటే చిన్నప్పటినుండి ఇష్టమగుటచే మా అమ్మమ్మ నన్ను తన దగ్గరే పెట్టుకుంది. తానే చదివిస్తూవుంది. నాకు ఒక మామయ్య వున్నారు. ఆయనకిక్కడ యిరువురు పిల్లలు, తాను స్కూల్సు యినస్పెక్టరుగా పనిచేసేవారు. నేను స్కూలు ఫైనలు ప్యాసైనతరువాత, మా అమ్మమ్మ ఆడ పిల్లల కెక్కువ చదువెందుకని ఎంత గోలపెట్టినా వినకుండా, మా మామయ్య నన్ను కళాశాలలో చేర్పించారు. అంతపట్టుపట్టి నన్ను చదివించినందుకు మనస్సులో ఎన్నో అభివందనాలర్పించాను. అభ్యుదయ మార్గముల నన్వేషించి, వాటి నాచరణలో పెట్టేవారిలో అగ్రగణ్యులు మా మామయ్య. స్త్రీకి, పురుషునితో పాటు సమానమైన హక్కుగలదని వాదించేవారిలో ప్రప్రథములు. జాతిమతవివక్షత లేకుండా సంచరించేవారు అన్నిటికంటే ఎన్న దగిన మంచిగుణమేమిటంటే అనుమాన మిసుమంతైనా లేదు. తన స్నేహితులెంతమంది వచ్చినా నన్ను తీసుకువెళ్లి వాళ్ళతో పరిచయంచేసి మాట్లాడించేవారు. సనాతన ధర్మాచారములు మంటగలుపుతున్నావురా, అని మా అమ్మమ్మ ఎంతచెప్పినా వినేవారు కాదు.

ఆగలాయనయొక్క అభ్యుదయా శయాలు ఆమెకు అర్థమయేవి కావు. ఆమేకాదు, ప్రపంచమే అర్థముచేసుకొనలేక పోయింది. మానవులందరు సమానులనీ, వారిలోగొప్ప బీద అన్న వివక్షత వుండ కూడదనీ, ప్రతివారు సమాజమున కుపకరించే పనిచేసి మరల దానివల్లనే అనుకూలఫలిత మనుభవించి ఐకమత్యంగా శాంతియుతంగా జీవించుట అవసరమనీ ఆయన వుద్దేశము. జమీందారులన్నా, పెద్ద భూస్వాములన్నా అతనికి యిష్టముండదు. రైతుకూలీ ప్రజల రక్తము పీల్చిపిప్పిచేసి గడించిన డబ్బుతో కాలుమీద కాలు వేసుకొని పంచభక్ష్యపరమాన్నాలతో భుజించు నికృష్టమైన ద్రోహులని అతని అభిప్రాయం. డబ్బున్న కొందరావిధంగా వుండుట, కొందరు గంజిత్రాగుతూ ఆకలిబాధతో వుండుట చూచి— ఎందుకీ మానవులమధ్య యింత భేదమని ఎప్పుడూ నాతో అనేవారు.

ఈ విధంగానే ఆయన సమయం వచ్చినప్పుడెల్ల పదిమందిలో గట్టిగా వాదించేవారు. ఇది మాత్రం చాలమందికి బాగున్నప్పటికీ, కొంతమందికి చాల కష్టంగా వుండేది. ముఖ్యముగా కాంగ్రెసు ఖద్దరుదారులు మా మామయ్యకు కామ్రేడ్ అనే బిరుదు పారేశారు. అదే ఇంతవరకూ మా నాశనానికి కారణం. ఈ విధంగానే ఎంతమంచిపని చేసినా, మామయ్యను కమ్యూనిస్టనేవారు.

ఈ విధంగా కాంగ్రెసు ప్రభుత్వం దృష్టిలో దేశద్రోహిగా ఎన్నబడిన మామయ్యను వుద్యోగం నుండి అకారణంగా తొలగించారు. మాట్లాడుటకు వీలులేదు స్వతంత్ర భారతం. అరెస్టు చేయలేదు కదా అంతే చాలనుకుంది మా అమ్మమ్మ.

ఇప్పుడు మా పరిస్థితి త్రిశంకుస్వర్గంలో వ్రేలాడుచున్నట్లున్నది. డబ్బు లేకపోతే జీవించే దెలాగా? కూర్చొనితింటే ఎన్నాళ్లు గడుస్తుంది. మా మామయ్య చదువు చానిపృథ్యోగా నికేగాని స్వతంత్రజీవనాని కుపకరించదు కదా! అటువంటప్పుడు తనపై ఆధారపడివున్న మా అందరిని ఎట్లా భరించగలరు! ఇటువంటి పరిస్థితులలో నన్ను చదివించుటెట్లా! కళాశాల విద్య అంటే సామాన్యమా! ప్రతి చిన్న విషయానికి

దెబ్బే. చదువులకుకూడ ఖర్చు ఎక్కువై పోయింది. భావిభారతపౌరులను మా జీవితం చూసి మామయ్య దుఃఖిస్తారు.

స్వార్థభూయిష్ఠమైన ఈప్రపంచంలో నావంటి వారికముందు జీవించడ మెలా గన్నదే ముఖ్య విషయం. నన్ను ప్రతినిమిషం బాధిస్తున్నదీ సమస్యే. డబ్బులేకపోతే పనికిరామూగదా? ఇటు వంటప్పుడు నా కర్తవ్య మేమిటి?

నే నేరాజకీయపక్షానికి చెందిన దానిని కాను. మాయింటి పరిస్థితినిబట్టి, ముఖ్యముగా ప్రతిదినము నాకండ్లముందుజరుగుచున్న విషయాల బట్టి నేనీవిధంగా వ్రాశాను.

విశాఖపట్టణం — ఎస్ అమ్మాజి

# 3

పచ్చగా బంగారంలాగు పండిన వరివెన్నులను వొయ్యారంగా ఊపుతూ వీచే గాలికమ్మదనంలో అనుకుంటూ వుంటాను. 'మా తాత చాలా తెలివైన వాడని! ఏ కాలువలూ లేక చెమటతో నే చేనుతడుపుకోవలసివచ్చినా, దున్న డానికి ట్రాక్టర్లు లేకపోయినా, పంటకంతా రెట్టింపు పన్నున్నా, ఆ మట్టితోనే కుస్తీపట్టి మోక్షం చెందేడు. ఇంత శ్రమ ఎందుకని రెండు ఇంగ్లీషుముక్కలు చదువుకునేవుంటే ఏ డిస్ట్రిక్ట కలెక్టరో చేసి గొప్ప గౌరవం సంపాదించివుండును. కాని ఆయనగారి స్వయానా మనుమళ్ళమైన మేము మొన్నటి కరువులో ఏమయి పోయి వుందుమో?

మాతాత అంత తెలివైన పనిచేశాడు గనుక మా కీనాడు తిండికి కొదవలేదు. మాకే కాదు మా చుట్టూతిరిగే కాకులకూ కుక్కలకూకూడా పొట్ట నిండుతున్నది. దేశంఅంతా ఎండి మాడిపోయినా ఈ కాలువకాలో మా పచ్చదనానికి విరుపురాదు. అందుచేత మా కైనందిన సమస్యలు మాకు మరో యుద్ధంవచ్చినా బోధపడవు.

ప్రపంచకం ప్రతిమూలలోనూ మారుమ్రోగుతున్న తిండి, గుడ్డ, కొంప ముఖ్యసమస్యాత్రయం మా జోలికి రాలేదు. ఇప్పట్లోరాదు. ఎందుకంటే మే మే గుడ్డకట్టుకున్నా సాయంత్రానికి పేడ కంపు కొట్టవలసిందే. కనుక మా అడంగుల చినిగి పోయిన పీరబాబు నాలుగుమూళ్ళముక్క చింపుకుని చుట్టబెట్టుకున్నా మాకు మూడిన ముప్పేమీ లేదు. మా తాతలు కట్టిఇచ్చిన పాతకొంప చూరు కింద నడుంవాల్చినా సుఖంగానే కునుకుపట్టుతుంది. కనుక మా గృహనిర్మాణంకోసం ప్రభుత్వం భారీ ప్రణాళికలను తయారుచేయ నక్కరలేదు.

ఒక సంవత్సరంపాటు 'నాగలి పారవైచి ఇది మా పనిగా'దని అన్నామంటే మమ్మింత నీచులుగా మీరు చూపిస్తున్న నాగరికత కైలాస ప్రయాణం కొనసాగిస్తుంది. మీపట్నాలు స్మశాన వాటిక లౌతాయి. మీలాంటి సోమరిపోతులకు ఇంత గంజి దొరకాలంటే మా వృత్తి దివ్యంగా కొనసాగాలి. అందుకు మాకు శాంతి అవసరం. స్వాతంత్ర్యం రానేవచ్చింది. అభ్యుదయాన్ని ఎవరూ అరికట్టలేరు. కాని శాంతి నెలకొల్పడమే సామర్థ్యం. మీ నిపుణుల ఉ. కు. ప్రజ్ఞలు, మీ పత్రికల పిచ్చివ్రాతలు, మీ ఫిరంగుల ఘీంకారాలతో మమ్మ విసిగించకండి.

ఇంతశాస్త్రం చదువుకున్నాం, ఇన్నిదేశాలు పర్యటనచేశాం, ఇన్నివిషయాలు కనిపెట్టాం అంటే 'కాబోలు' అనుకున్నాం గాని అందువల్ల నల్లపూసంత ఉపయోగమైనా కనబడిందా? దేశంలో కరువు వచ్చేస్తున్నది- ఇకే మరొది రెండునెల్లయా లోపునే పుట్టమునిగిందని-చిందులు, ద్రొక్కాతే ఏమయింది. ఎప్పుడయినా పంట వృద్ధిచేయడానికి రైతుకు న్యాయంగా సరిపడేటంత ఎరువులు దొరకేయా? ఎరువుల డిపోలువెట్టి డిమాన్‌స్ట్రేటరు అనే మరొక కమిషన్ ఏజంటును నియమించి, రూపాయికి పావులా తక్కువగాకుండా ఆయన ముట్టించుకుంటే దానిని ఆపగలిగేరా? ఉన్న చేలనే పండించలేనప్పుడు బంజరుల దున్నించి ఏం సాధించారు?

స్వతంత్ర భారతదేశంలో ప్రజాప్రభుత్వం అంటేకాదు. 'ఏటికి ఎకరానికి 2 నుండి 5 రూపాయలవరకు లంచం తింటున్న పి. డబ్ల్యు. డి. వారి ఆకలి మాన్పగలిగేరా? ఎంతకాలమని ఈ బాధ గలను సహించం? ఓర్పు తప్పితే 144 అంటున్న మీరు ఓర్పుతప్పవలసిన అగత్యం ఏమిటో తెలుసుకోరా?

రాళ్ళనుగొట్టి, బీళ్ళను దున్ని, చెమట, కాలువలతో తడిపి పండించిన మా రాజనాలను నరకు

మైన (కంట్రోలు) ధరలకంటే కొంచెం తక్కువకు సేకరించి పట్టుకుపోతున్న మిమ్మొకటి అడుగుతాను. మీరు ప్రాజెక్టులు కట్టకపోతే పోనీండి. కాలువలు మరమ్మతుచేయించకపోతే కొత్తయేమీ లేదు. మా వోట్లవల్ల ఇంత అధికారం సంపాదించుకుని మామాటే మరచిపోతే - మా ఖర్మ. కాని కలుపు తీసుడానికి చిన్ని తొళికయినా సరసమైన ధరకు సరఫరా చేసిఎరుగమన్న మాట గుర్తుంచుకొని మరీ రండి రేపు వోట్లకు ప్రాధేయపడడానికి. మాతో వ్యవహారం ఏనుగుతో చెలగాటం. విశ్వాసం ఉంచినంత కాలమే మోయడం.

రామచంద్రపురం    దే. కేశవరావు

## 4

నేను అనుభవంమీద, దేని గూర్చీ ఆశపడకూడదని, ఆ విధంగా ఆశిస్తే నిరాశే అవుతుందనీ, గ్రహించుకున్నాను. నేను ఆశించిందల్లా నిరాశే అయింది. నిరాశే అవుతున్నది. ఓ పనిచేసి దాని గూర్చి మర్చిపోయి నప్పుడే అది అవుతున్నది. ఈ సంపాదకుడు నా వ్యాసం వేసుకొని బహుమానం ఇస్తే ఇవ్వొచ్చు, లేకపోతే లేదని ఈ వ్యాసం రాస్తున్నాను.

పత్రికల్లో నావ్యాసం పడుతుందని, వ్యాసంతోపాటు నాపేరు పడుతుందని నాకు లేదు. ఆ తాపత్రయం పోయింది ఏనాడో. దానికి కారణం చిన్నచిన్న కథా రచయితలు ఎక్కువ అయిపోయ్యారు. వాళ్ళ వ్యాసాలు వెయ్యలేక-వేస్తున్నామనీ, లేదా వెయ్యలేమనీ సమాధానాలు ఇవ్వలేక మన పత్రికాసంపాదకులంతా సతమతం అవుతున్నారు. అది చాలక ఇంకా పారితోషికం కూడా ఇస్తారా? పూర్వం నా వ్యాసాలు పత్రికల్లోపడితే చూసి గంతులేసేవాడిని. కాని నా దైనికసమస్య ఒక్కడబ్బే అవ్వటంవల్ల ఇప్పుడా ఉత్సాహం పోయింది. ఆదాయం తక్కువ, ఖర్చు ఎక్కువ. కాబట్టి డబ్బు ప్రధానసమస్య అయి కూర్చుంది!

సరిగ్గా యిరవై సంవత్సరాలకే నేను జిల్లా బోర్డు ఆఫీసులో అప్పర్ డివిజన్ గుమస్తా పోస్టు కొట్టాను. లక్కీ ఛాన్సు అన్నారు అందరూ. ఎందుచేతనంటే స్కూలుఫైనలు ప్యాసయిన మొన్నటివాణ్ణి, ఎకౌంటెస్టు ప్యాసవ్వడంవల్ల అది దొరికింది. గవర్నమెంటులో మాత్రం అంత వేగంగా దొరకదు. అయితే ఏంలాభం? నేను వుద్యోగం చేస్తున్నాను. కాని గుండెలు మాత్రం బితుకుబితుకు మంటుంటాయి రోజూ. ఆఫీసులో యముడొచ్చి ప్రాణాలు తీసుకుపోతాడన్నట్టుగా ఎప్పుడూ గర్జనలు, ఛీంకారాలు. ఏంచేసేది? పెర్మనెంటువాణ్ణి కానుకదా! ఏ రెండు సంవత్సరాలకో అవ్వొచ్చు: అంతవరకు వుంటానా, వూడతానా అని భయం. ఇదే నా దైనికసమస్య! 'వుంటానా, వూడతానా?' దినదిన గండం. ఎలాగో కంటిన్యూ అయిపోతున్నాను. దేవుడా నీదేభారం అనుకుంటాను రోజూ. డబ్బులున్నప్పుడు ధర్మంచేస్తాను. 'నీకు ధర్మం చేస్తున్నాను, భగవంతుడు నాకు మేలు చేస్తాడు' అనుకుంటుంది అంతస్సు. స్వార్థంతో ధర్మంచేస్తే సంతృప్తి పొందుతుంది.

ఇప్పుడు నా జీవితం చాలకుండా వున్నది. ఎక్కువ సంపాదించాలి. ఎక్కువజీతం దొరికే వుద్యోగంకోసం ఆలోచన ఎప్పుడూ. నెలకి రెండు వందలు వస్తే బాగుండు ననుకుంటుంది మనస్సు. కాని ఎంతచెట్టు కంతగాలి అనుకోదు. ఆశలకంతేమిటి? ఇంకొకరు నేనో పెద్ద సినిమా స్టార్ అయిపోవాలనుకుంటారు. నేను అందంగా టిప్ టాప్‌గా వుంటే నాకూ పిచ్చికూడా వుండును. డబ్బుంటే మంచి పత్రిక ప్రారంభించి డబ్బు సంపాదిద్దామని వుంది. పిచ్చి! ఇలాగే ఏవో ఆడియాసలు. ఇవన్నీ నిరాశలైతే తప్పా? నా అనుభవంబట్టి నిరాశే అవుతుం దనుకోవాలి. కాని పాడు మనస్సు వూరుకోదు. బహుమానంకోసం కొట్టాడుతుంది.

విశాఖపట్టణం    బి. భాస్కరరావు

క్రిందటివారం యీ శీర్షిక కింద ఉత్తమరచనకు 10 రూపాయలు బహుమానం పొందినవారు: చన్నా ప్రగడ తిరుపతిరావు, నిజాంపట్టణం.

ఈ వారం ఉత్తమరచన బహుమతి వచ్చేవారం ప్రకటించబడుతుంది-[సం.]




చెప్పుకోతగ్గ స్నేహితులెవరూ ఆమెకు లేకపోయినా, పేటలోవుండే చాలమంది భానుమతియెడల సానుభూతి కనపరచేవారు. ఆమె చాలా అమాయకురాలని యిరుగు పొరుగు వారి విశ్వాసం.

భానుమూర్తి కొన్ని నెలలక్రితం చిన్న ప్రమాదానికి గురియై మరణించాడు. అతడు భార్యను పెట్టిన కష్టాలు తెలిసినవాళ్లెవరూ అతని చావుకి విచారించలేకు. భానుమతి వంటి సద్గుణసంపన్నురాలు భానుమూర్తివంటి కిరాతకుడికి భార్య కావటం చాలా విచారకరమైన విషయంగా పరిగణించేవారు.

ప్రమాదం జరిగినరోజున, భానుమతి మేడమీద నుండి చాలరోజులనుంచి ఉపయోగంలేక మూల పడివున్న 'ఎలెక్ట్రిక్ ఫైర్' కిందకు తీసుకువచ్చింది. చలి విపరీతంగా వున్నందువల్ల పడకగది కాస్త వెచ్చచెయ్యవచ్చు గదా అని ఆమె వుద్దేశ్యం. కాని దానికి ప్లగ్గు అమర్చబడి వుండకపోవటంవల్ల దాన్ని పడకగదిలో మంచంమీద పెట్టి ఎలెక్ట్రిషియన్ కొరకు కబురుపంపే ప్రయత్నంలోవుంది.

ఇంతలో భానుమూర్తి చలితో వణుకుతూ యింటికివచ్చి 'ఫైర్' చూసి, దానివల్ల వేడిపుట్టించి చలిపోగొట్టుకోవచ్చు కదా అని తనే దానికి ప్లగ్గు వెయ్యటానికి పూనుకున్నాడు. ఫైర్ వంటింట్లోకి తీసుకెళ్ళి స్క్రూడ్రయివర్‌తో పని సాగించాడు. ప్లగ్ అమర్చిన వెంటనే మామూలుగా యిస్త్రీపెట్టెకు వుపయోగపడుతున్న ప్లగ్ పాయింటుకి యీ ప్లగ్ పెట్టాడు, టెస్టు చెయ్యడానికి. వెంటనే ఒక్క మెరుపు మెరిసింది. ఉత్తరక్షణంలో భానుమూర్తి కిందపడిపోయాడు.

ఈ సందర్భంలో పంచాయతీదార్లు వేసిన ప్రశ్నకు జవాబిస్తూ, ఇంటికి వచ్చేటప్పటి తన భర్త మితిమీరి త్రాగివున్నాడని భానుమతి చెప్పింది. ఇంకొకప్రశ్నకు జవాబిస్తూ, తన భర్తకు విద్యుచ్ఛక్తి గురించి అంతగా తెలీదనీ, 'ఎలెక్ట్రిక్ ఫైర్'కు కట్టబడివున్న చిన్న కార్డుమీది సూచనలననుసరించి ప్లగ్ బిగించినాడనీ ఆమె చెప్పింది.

పోలీసువారి పరిశోధననుబట్టి భానుమూర్తి చేసిన పొరపాటు సులువుగా గ్రహించవచ్చు. ఫైర్ యొక్క కేబిల్‌లో మూడు సన్నవైర్లు వున్నై. వాటిలో రెండు— ఒకటి ఎరుపూ, ఒకటి నలుపూ—కరెంటుకి కలపడానికి ఉద్దేశింపబడినవి. ఆకుపచ్చ రబ్బరు తొడిగిన మూడో తీగె, ప్లగ్ యొక్క 'ఎర్త్‌పిన్'కు తగిల్చేది. భానుమూర్తి ఎరుపూ ఆకుపచ్చతీగలలో తికమకపడి, ఫైర్ యొక్క లోహభాగంనుండి వెళ్లే ఆకుపచ్చ తీగెను యర్త్‌కు అమర్చకుండా కరెంటుకిపెట్టాడు. ఆసమయంలోనే ఫైర్‌ను తన యెడమచేత్తో పట్టుకునివున్నాడు. అందువల్ల విద్యుచ్ఛక్తి అతడి శరీరంలో ప్రవహించి తత్ఫలితంగా ప్రాణాలు పోగొట్టుకున్నాడు.

పంచాయతీ తీర్పు 'యాక్సిడెంటల్ డెత్' అని వేరే చెప్పనక్కర్లేదు.

పాపం! ఆవిధంగా భానుమతి భర్తను పోగొట్టుకొని తనకు గల కొద్దిరాబడితో నిరాడంబర జీవితం గడుపుతోంది. ఆమె ఎవరియిళ్ళకూ వెళ్ళనూ వెళ్ళదు, ఎవరూ ఆమెయింటికి రారు. కాని యీమధ్య పురుషోత్తం పెళ్ళాం పార్వతి మాత్రం భానుమతిని చూట్టానికి తరచు వస్తోంది.

పార్వతి పూర్వం భానుమతి యింటిపక్కనే వుండేది. భానుమూర్తి మరణించిన కొద్ది రోజులకి పట్నంలో యింకో యింటికి వెళ్ళిపోయింది. ఆమె ఎక్కడవుంటున్నదీ యెవ రికీ వివరంగా తెలీదు.

పార్వతి భానుమతివద్దకు చాలసార్లు వచ్చింది. ఇవన్నీ పిలవని పేరంటాలే. వచ్చినప్పుడల్లా కుశల ప్రశ్నలయిన వెంటనే భానుమూర్తి మరణాన్ని గూర్చి మాట్లాడుతుంది, ఎంతో శ్రద్ధతో. భానుమతి మాత్రం అనాయకంగానూ, ఆవేశం లేకుండానూ మాట్లాడేది. ఆమె పార్వతి నేమీ ప్రశ్నించేది కాదు. ఆఖరుకి పార్వతి ఎక్కడ వుంటున్నదీ కూడా ఆమె కనుక్కోలేదు.

ఈ విధంగా కొన్నాళ్లు గడిచాక, పార్వతివచ్చి యితర విషయా లేమీ మాట్లాడకుండా భర్త మర ణాన్నిగూర్చే తవ్వుతూండటంవల్ల భానుమతికి ఆమె రాక విసుపునూ అసహ్యాన్నీ కలిగించటం మొదలుపెట్టింది. సాయంత్రం పడుతుందంటే భాను మతికి గుండెదడ మొదలుపెట్టేది. ఏ క్షణంలో పార్వతి వస్తుందో, ఏమేం ప్రశ్నలువేసి తనను బాధిస్తుందో అని ఆమెకు విపరీతమైన భయం వేసేది. అసలు పార్వతి తన యింటికి ఎందుకు రావాలి? తన్నా విధంగా ప్రశ్నించి, అసలే భర్త మరణానికి కుమిలికుమిలి ఏడుస్తోన్న తన్నెందుకు యింకా ఏడిపించాలి? పోనీ, అసలు యింక రావా ద్దని చెప్పేస్తే— ఈ విధంగా ఆలోచించేది, ఒకో క్కప్పుడు. కాని తీరా పార్వతి వచ్చాక ఏమీ అనలేకపోయేది - ఎందుకో, ఆమె కా మనో దౌర్బల్యం!

రెండురోజులు తిరక్కుండానే మళ్లీ పార్వతి వచ్చింది. ఈసారి ఆమె మామూలుగా వచ్చే ట్టు సాయంత్రం కాక ఉదయాన్నే వచ్చింది, తన రాకలో ఏదో విశేషాన్ని సూచిస్తూ.

'నీ భర్త మరణాన్నిగూర్చి మాట్లాడాలి' మా మూలుగా వేసే కుశలప్రశ్న యినా వెయ్యకుండా, గుమ్మంలో కాలుపెడుతూనే అంది పార్వతి.

అసలు పార్వతి వస్తుందంటేనే భానుమతికి గుండె దడపుడుతుంటే, ఇంక యీ ప్రశ్న వినేటప్ప టికి ఆమెమనస్సు ఎట్లా వుంటుందో వర్ణించటం అనవసరం.

'—అంటే విగో ప్రశ్నలతో ప్రాణాలు తీస్తా వన్న మాట' భానుమతి అంది. తన ఓర్పును పిడి కిట్లో బిగించి.

'అక్కర్లేదు. నిన్ను యిప్పటికే ఎన్నోసార్లు ప్రశ్నించాను. ఇక వాటిని సింహావలోకనం చెయ్యా టమే తరవాయి.'

భానుమతి గాభరా ఎక్కువైంది. ఆమె మౌనం వహించటంకన్న యింకేమీ చెయ్యలేకపోయింది.

పార్వతి మళ్ళీ అందుకుంది.

'మీ ఆయన వచ్చేలోపున నువ్వే ప్లగ్గు అమర్చ టానికి ప్రయత్నించలేదని ఆ రోజున చెప్పావు. నీకు చేతకాదు కాబట్టి చెయ్యలేదని చెప్పావు. ఈసంగతే నువ్వు పంచాయతీలోకూడా చెప్పావు- అవునా?'

భానుమతి అవునన్నట్లు కిందచూస్తూ వూరు కుంది.

'నీ భర్తకు కొద్దిగా వర్ణదోషం (కలర్ బ్లయిండ్ నెస్) ఉందన్నావు!' దొరికిపోయావులే దొంగవి, అన్నట్టు చూస్తూ అంది పార్వతి.

పార్వతి మాట్లాడుతున్నంతసేపూ భానుమతి ముఖవర్ణం అనేకరకాలుగామారుతోంది. ప్రస్తుతం ఎర్రగా కందగడ్డలాగా వున్న ఆమెముఖం అణచి వుంచిన కోపాన్ని తెలియబరుస్తున్నది. ఆమె యేమీ మాట్లాడలేదు.

"ఈ విషయాలన్నీ ఆలోచించి నేను కొన్ని సత్యాలను బయటపెట్టవలసివుంది— నువ్వు యుద్ధ కాలంలో— అంటే నీ పెండ్లికిముందు విద్యుచ్ఛక్తి పరికరాలను తయారుచేసే కార్ఖానాలో పని చేశావు. అందువల్ల నీకు ప్లగ్గు అమర్చే స్వల్ప విషయం తెలీదంటే దాంట్లో యేమీ అర్థంలేదు. నువ్వు చెప్పినది అబద్ధమని నేను వేరే చెప్ప నక్కర్లేదు."

భానుమతికి ముచ్చెమటలూ పోశాయి. పెద వులు చప్పరించి వూరుకుంది.

"ఇక వర్ణదోషం వున్నవాళ్లని విమానంలో పైలట్ గా తీసుకుంటారంటే నువ్వు నమ్ముతావా? —భానుమూర్తి యుద్ధంలో విమానపు పైలట్ గా పనిచేశాడు. అందువల్ల అతడికి వర్ణదోషం వుందం టం పూర్తిగా అసత్యం. పోనీ ఆ తర్వాత వచ్చిం దనుకుందామంటే వర్ణదోషం పుట్టుకతో వచ్చేదనీ, మధ్యలో ఎప్పుడూ రాదనీ నువ్వు ఏ డాక్టరు

అడిగినా చెబుతాడు—నువ్వు ఆశ్చర్య పడనక్కర్లేదు. ఇవన్నీ, నేను వాకబు చెయ్యగా బయట పడిన సత్యాలు—అతడు పైలట్ గావున్నప్పుడే కదూ, నీతో మొట్ట మొదట పరిచయం ఏర్పడింది?"

ఈ స్థితిలో భానుమతి మనోభావాలను చెప్పటం కష్టమే. బహుశా- కోపం, ఓటమీ, అన్నిటి కన్నా ఎక్కువ—భయం కలిసి ఆమె మనస్సును కలచి వుండొచ్చు.

"అయితే నువ్విప్పుడు చేసేదేమిటే?—ముందు నా యింట్లోంచి బయటికి నడు. నన్ను ప్రశ్నించటానికి నీకేం అధికారంలేదు." మొండిధైర్యం తెచ్చుకుని రబ్బరు బుడగలా పేలింది, భానుమతి.

"చెల్లీ, శాంతించు. ఇప్పుడు నేను బయటికి పోయినా నీకేమీ లాభముండదు. ఈ మాటే మొట్ట మొదట అంటే నీకు లాభించివుండును." ఎంతో శాంతాన్ని ప్రదర్శిస్తూ అంది, పార్వతి.

"నాకులాభం వుండనక్కర్లేదు. ముందు బయటకు నడిచి మరీ మాట్లాడు." కోపంతో వణికి పోతూ అంది, భానుమతి.

ఈ మాటని నిర్లక్ష్యంచేసి తన 'హాండ్ బాగ్' తెరిచింది పార్వతి.

ఒక్కసారిగా ముఖంలోని రంగంతా పోగొట్టుకొని తెల్లగా పాలిపోయింది, భానుమతి. దాన్లోంచి ఏ యాటంబాంబు బయటపడుతుందో అని సంచీ మీదే దృష్టి నిలిపింది.

యాటంబాంబు బయటపడలేదు కాని పార్వతి అరచేతిలో రెండు సన్నని రబ్బరు గొట్టపుముక్కలు కనపడ్డాయి. ఒకటి ఎరుపూ—మరొకటి ఆకుపచ్చా. భానుమతి మూర్ఛపోవలసిందే కాని మూర్ఛ పోలేదు. అప్రయత్నంగా అంది.

"ఇవి...యివి నీకెట్లా..."

"అవును, ఇవి నా దగ్గరకు వచ్చాయి, నీ అశ్రద్ధవల్ల—జ్ఞాపకంలేదూ? నువ్వు ఆ రోజున చీకటిపడ్డాక, అంటే ప్రమాదం సంభవించినరోజున,



మీ యింటికీ మా యింటికీ మధ్యనున్న గోడదగ్గర నిలబడి ఏదో విసరటం, నేను షికారునుంచి తిరిగి వచ్చి చీకటిమాటున్నూ నా గదికిటికీలోంచి స్పష్టంగా చూశాను. కాని అప్పుడావిషయం పట్టించుకోలేదు. తరవాత కొన్ని గంటల్లో, ప్రమాదం విషయం తెలిసింది. మర్నాడు పంచాయతీనుండి తిరిగి వచ్చాక వీటికోసం వెతకటంలో నే నాట్టే ఆయాసపడవలసిన అవసరం లేకపోయింది.

భానుమతికి భయము, కోపమూకూడా ఎగిరిపోయాయి. ఆమె గంభీరంగా అంది—

'అవును. అవి నేను విసిరినవే.'

'ఇప్పుడు వివరంగా చెప్పు. నువ్వేం చేసింది.'

'చెప్పేదేముందీ?—నే నతడిని చంపితీరాలి. అంతకన్న వేరేమార్గం కనపడలేదు. ఒక్క నిమిషంకూడా భరించలేని బాధలు పెట్టాడు. ఎన్నాళ్లని సహించనూ...'

'ఆగు, నిన్ను నేను ఎందుకు చంపావని అడగటంలేదు. ఎట్లా చంపావని అడుగుతున్నా.'

'దాంట్లో ఏమీ వింతలేదు. చాలా స్వల్ప విషయం. తంతిలో మొత్తం మూడు సన్నతీగెలు వేర్వేరు రంగులుగల రబ్బరుతో కప్పబడి వున్నై. నేను చేసిందల్లా సుమారు అంగుళం పొడుగున ఎరుపూ ఆకుపచ్చా తీగెలనుండి రెండు రబ్బరు ముక్కలు తీసి ఆకరెంటుని తారుమారుచేసి తగిల్చాను. అంతే నే చేసింది. అంతకంటే యింకేమీ చెయ్యవలసిన అవసరం కూడా లేదు.

'మరి యీ రబ్బరు ముక్కలు?'

'అవి, తరవాత నాకు కావలసిన పని జరిగిపోయాక' పోలీసువాళ్లకు అనుమానం కలగకుండా, జాగ్రత్తగా కోసితీసేసి విచక్షణలేకుండా మీ యింట్లోకి విసిరాను. తర్వాత ప్లగ్గు అవిధంగానే కరెంటుకు తగిల్చి పోలీసుస్టేషనుకి ఫోన్ చేశాను.

'అదా సంగతి. అయితే నా తీర మా దు ముందే అంతా జరిగిపోయిందన్నమాట.'

'అవును.'

పార్వతి లేచింది వెళ్ళడానికి. భానుమతి జాలిగా అడిగింది—

'నువ్విప్పుడు పోలీసుస్టేషనుకి వెడుతున్నావా?'

పార్వతి కొద్దిసేపాలోచించి అంది—

'ఇంకా లేదు. వెళ్లేదీ లేనిదీ నీకు కొద్దిరోజుల్లో తెలియబరుస్తాను. ఈలోపల ఏమీ అఘాయిత్యం చెయ్యబోకు—నమస్తే'—పార్వతి వెళ్లిపోయింది. భానుమతి ఒక్కనిట్టూర్పు విడవటంకంటె ఏమీ చెయ్యలేకపోయింది.

సుమారు వారం గడిచాక భానుమతి గుండెలో టెలిఫోన్ గంట గణగణ మోగింది. తన 'వ్రాత' తెలుసుకోటానికి రిసీవరు అందుకొని చెవిదగ్గర పెట్టుకుంది.

'హాలో! ఎవరు మాట్లాడేది' టెలిఫోన్లో ప్రశ్న.

'నేనూ, భానుమతిని—భానుమూర్తి భార్యని.' ఆదుర్దాతో తడబడుతూ అన్నది, భానుమతి.

'మంచిది. నీకు శుభవార్త. నువ్వింక బెంగపెట్టుకోనక్కరలేదు'—ఈమాట వినపడ్డమేమిటి, భానుమతి తెల్లటిముఖం గులాబివర్ణంగా మారడమేమిటి—రెండూ ఒక్కసారి జరిగినై. 'హమ్మయ్య' అని ఒక్కనిట్టూర్పు విడిచి అంది—

'నీకు నేను చాలా కృతజ్ఞురాల్ని. నీ ఋణం ఎట్లా తీ...'

'దానికేంలే — అన్నట్టు నువ్వు సంగతి విన్నావా! పాపం-మా వారు మొన్న లక్ష్మీవారం నాడు విద్యుత్ప్రమాదంవల్ల స్వర్గస్థులయారు. పంచాయతీ తీర్పు యిప్పుడే తెలిసింది-ప్రమాదంవల్ల మరణం.'

(ఇంగ్లీషు కథకి స్వేచ్ఛానువాదం)

---

పిల్లవాడు: నాన్నా, మొదట మాట్లాడేయంత్రాన్ని ఎడిసన్ చేసిన మాట నిజమేనా?

తండ్రి: లేదుబాబూ దేవుడుచేశాడు. ఆపివెయ్యడానికి వీలుండే మొదటిదాన్ని ఎడిసన్ చేశాడు.

 

# రచయిత—విమర్శకుడు



పోతుకూచి సూర్యనారాయణమూర్తి

సాన పెట్టనిదే వజ్రానికికూడ శోభలేదు. సంస్కారంలేనిదే మానవునిలో మానవత్వం గోచరించదు. సరియైన విమర్శ, తగు వ్యాఖ్యానం లేనిదే మహాకావ్యంకూడ రాణించదు.

రెండు మాసాలు - యీ మధ్య, "తెలుగు స్వతంత్ర"లో అనేకవ్యాసాలు, వాటిపై విమర్శలు, ప్రతివిమర్శలు, ఎన్నో ప్రచురితమయ్యాయి. నిజంగా అటువంటి విమర్శలు, వాదోపవాదాలు సకారణంగా జరుగుతూండడంవల్ల పత్రికని చూడ్డానికి చాల కుతూహలంగాను, ఆత్రుతగాను ఉంటోంది. మానసికంగా స్థాణుత్వాన్ని అపాదించుకునే కొందరికి, యీ వాదోపవాదాలు, విమర్శలు చాల అనవసరంగాను, నిష్ఠురంగాను కన్పడవచ్చు. కాని సాహిత్యానికి, దాని అభివృద్ధికి ముఖ్యంగా యిటువంటి విమర్శలు, వ్యాఖ్యానాలు చాల ఉపయోగకరం. ప్రభుత్వంలో ప్రతికక్షపు పార్టీ చేసే అమూల్యసేవ ఏమిటంటే ప్రభుత్వంలోని లోటుబాటుల్ని ఎత్తిచూపి, నిష్పాక్షికంగా విమర్శించి, ప్రజల కత్యంత ప్రయోజనకరంగాఉండే శాసనాల్ని అమలుజరపడం, ప్రజాహితంగా ప్రభుత్వాన్ని నడిపేటట్లు ఏర్పాట్లు చేయడమున్నూ. ఇది ఎంతవరకు జరుగుతోంది అన్నది వేరేప్రశ్న. జరగవలసినది మాత్రం అది అని మరచిపోకూడదు. ఇంచుమించుగా యీ సూత్రమే సాహిత్యానికి కూడ వర్తిస్తుంది.

రచయిత ఏ ఉద్రేకంలోనో, ఏ మహత్తర భావసంచలనంలోనో ఒక వాక్యాన్ని సృష్టిస్తాడు. పూర్తిచేసేదాకా, కావ్యంలోని రసవిశిష్టతగాని, రసవిహీనతగాని అతనికూడ కన్పించదు. సంపూర్ణమైన కావ్యానికి, చివర, మెరుగులు దిద్దుతాడు రచయిత. రచయిత వ్రాసిందల్లా ప్రతీసామాన్యుడికి అర్థంకాకపోవచ్చు. అర్థంకాదుకూడ. అందరికీ సుగమంగా బోధపడేట్లుచేసేది వ్యాఖ్యానం, లఘువిమర్శ. అంచేత వ్యాఖ్యానాలకి, విమర్శలకి సాహిత్యంలో ఎంతైనా అవశ్యకత ఉంది.

కేవలం రంధ్రాన్వేషణం చేయడంమాత్రమే విమర్శ అని చాలమందికి దురభిప్రాయం ఒకటుంటుంది. రచనలోని తప్పుల్ని, అసభ్యతల్ని ఎంచడం మాత్రమేకాదు విమర్శ. కావ్యంలోని గుణగణాల్ని సహేతుకంగా, నిష్పాక్షికంగా, సంపూర్ణంగా విశదపరుస్తూ,ప్రజానీకానికి గ్రాహ్యమయ్యేట్లుచేయడం విమర్శకుల విధి. అదే వారి లక్ష్యంకూడ.

ఏదైనా రచన బాగులేదని అన్నామంటే దానికి రెండు కారణాలుండోచ్చు: నిజంగా ఆ రచన నిరర్థకంగానైనా ఉండాలి; లేదా ఆ రచనలోని విశిష్టతని అవగాహన చేసుకొనే బుద్ధి కుశలత మనకి ఉండకపోవాలి. అందుచేత దేనినైనా విమర్శించేముందు, మన ధీశక్తిని యోచించి మరీ మొదలుపెట్టాలి. నా కర్థంకాని రచనను నిరర్థకం అని దూషిస్తే ప్రయోజన మేమిటి! నేను కూడ విమర్శించాను అనే ఆత్మతృప్తి ఉంటుందేమో! ఇది ఎంతసంకుచితమో ఆలోచించండి. నా కర్థంకాని రచన ఏదైనా ఉంటే, దానిమీద వ్రాయబడిన వ్యాఖ్యానాలకోసం, విమర్శలకోసం వెతుకుతాను.

అప్పుడు రచనలోని యథార్థతత్వం తెలుసుకుంటాను. అంతే కాని నా యిష్టం వచ్చినట్లు ఆ రచనని, ఆ వ్రాసినమనిషిని, ఆ ప్రచురించిన సంపాదకుని తిట్టిపోస్తూ నాకసిని తీర్చుకోడానికి సాహసించను. నేను సర్వజ్ఞుణ్ణికాదు కదా! నిజానికి ప్రపంచంలో ఎవరూకారు. అందుచేత ప్రతీది ప్రతీవారికి సులభంగా అర్థమవుతుంది, అర్థమవాలి అనుకోవడం భ్రమ, అన్యాయం. ప్రతీరచయిత వ్రాసింది అర్థం కావాలంటే వ్యాఖ్యానకర్తల్ని, విమర్శకుల్ని ఆసరా చేసుకొని చూడడం శ్రేయస్కరం. అదే సరైన మార్గం.

షేక్స్పియరును వ్యాఖ్యానించి, విమర్శించే మేధావుల్ని చూస్తే, నిజంగా ఆ షేక్స్పియరు ఆ చిన్న వాక్యంలో అంత భావాన్ని యిమిడ్చే వ్రాశాడా అనిపిస్తుంది ఒక్కొక్కప్పుడు. విమర్శకుని ప్రతిభ, అసలు కావ్యానికి వన్నెలు దిద్దుతుంది. అందుకనే విమర్శకునికి సూక్ష్మగ్రాహ్యత, నిశిత బుద్ధి, ఉద్రేకశూన్యత అత్యవసరం. రచనలోని

సొగసుల్ని, కొత్త అందాల్ని, నూతన భావాల్ని మనకి వ్యక్తంచేస్తాడు విమర్శకుడు. దానిలోని లోటుల్ని కూడ చూపుతూ-ఆ లోటుల్ని ఎట్లా తీసి వేయాలోకూడ తనకి తోచినవిధంగా కావ్యానికి కళంకంరాకుండా చూచిస్తాడు. సామాన్యునికి సులభంగా అర్థంకాని విషయాల్ని, సుకరంగా తెలియ చెప్పడంలోనే ఉంది విమర్శకుని బుద్ధి కుశలత.

రచయిత ఉద్దేశాలతో మనం ఏకీభవించక పోవచ్చు. ఆ పంథా మనకి నచ్చకపోవచ్చు. మన యిష్టానిష్టా లనుసరించి రచయితని, అతణ్ణి మెచ్చుకునే యితరుల్ని నిర్హేతుకంగా, సంకుచితంగా దూషించడం సాహసం. రసగ్రహణ శక్తిలో భేదాలున్నాయి. ఒక ఉద్దేశాన్నే తెలియపర్చ డానికి అనేక మోస్తర్లుంటాయి. కాని మనకి నచ్చిన మోస్తరే విశిష్టమైనదనుకోడం సమంజసం కాదు. మనకి నచ్చని కావ్యవస్తువుల్ని ఏవగించుకోవడం భావ్యంకాదు. రసికుడికి ఎప్పుడూ ప్రణయం, ప్రియురాలు, వసంతాలు, కోకిలలు, పుష్పసౌరభాలు కావ్యవస్తువులుగా కన్పిస్తాయి. ఆకలితో అటమటించే ఆర్తునికి క్షామం, దౌర్భాగ్యం, అశాంతి, నిర్దాక్షిణ్య ప్రపంచం-యివే గోచరిస్తాయి. బాహ్యజగత్తులో అట్టే ప్రమేయంలేని వేదాంతికి ఆత్మ,పరమాత్మ, నిర్గుణబ్రహ్మం, ఆనంద స్వరూపం-యిట్లాంటివి కన్పిస్తాయి వర్ణనకి. మానసిక ప్రవృత్తుల భేదాల ననుసరించి కావ్యవస్తువులు కూడ మారుతూంటాయి. రచయిత తనకోసం మాత్రమే వ్రాసుకోడు. తనలాటివారు ప్రపంచంలో అనేకులుంటారు. వారందరూకూడ అతనిలాగే ఆలోచిస్తూ ఉండవచ్చు. అటువంటివారికి అతనిరచన రుచిస్తుంది. ఇతరులకి వెగటుగా తోచవచ్చు. దాన్నిబట్టి ఆ రచనలోని విశిష్టతని కాదంటామా?

రచయితని సరిగా అర్థంచేసుకోవాలంటే, అతనిలో మనం లీనమయిపోవాలి. అతని హృదయానికి దగ్గరగాపోవాలి. అతని భావనాపద్ధతిని శ్రద్ధగా గుర్తించాలి. అప్పుడే అర్థంఅవుతాయి అతని ఆశయాలు, భావాలు. మొదటిసారి 'శ్రీశ్రీ' గారి 'జగన్నాథ రథచక్రాలు' చదివినప్పుడు, ఎందుకా యిన్ని 'జగన్నాథ'లు యిన్ని 'రథచక్రాలు' అనుకొన్నా. మామూలుగా చూస్తే అవన్నీ వ్యర్థంగా కన్పడతాయి. కాని ఒకసారి ఆయన ఎక్కడో చదువుతే విన్నాను. శ్రోతలందరూ ఎంతో నిశ్శబ్దంగా ఉన్నారు. వాతావరణంలో నిశ్చలత, గాంభీర్యం బాగా అలముకొన్నాయి. చీమ చిటుక్కుమన్నా వినిపించే ఆ ప్రశాంత గంభీర వాతావరణంలో ఆయన ఆ 'జగన్నాథ రథచక్రాలు' చదువుతూంటే, ఎంతో ఉద్రిక్తులమయాం అందరం. ఆయన చిత్రించదలచుకొన్న భావానికి సమీపంగా పోగలిగాం. అప్పుడనిపించింది ఆ 'జగన్నాథ' ల్లోనూ, ఆ 'రథచక్రా'ల్లోను ఏఒక్కటి తగ్గించినా, ఆ విశిష్టత, ఆ ఎఫెక్టు పోతాయని. తప్పనిసరయిన మాటలన్న మాట అవి. ఆ పునరుక్తిలో ఉంది ఆ ఎఫెక్టు అంతా. ఇవన్నీ గ్రహించడానికి తగు ఆత్మవికాసం, హృదయ సంస్కారం ఉండాలి. కవికి, అతిసాధారణుడికి అక్కడే ఉంది తేడా. మన మనుకొన్న దాన్నే రసప్రియుడైన రచయిత ఎంతో అందంగా, ముచ్చటగా చెపుతాడు. మనం చెప్పకోలేని ఎన్నోభావాల్ని, అవలీలగా, అత్యంత రసవత్తరంగా వెలిబుచ్చగలడు. నిద్రితమైన జీవాణువుల్ని నిశ్ఛిద్రం చేస్తాడు. మూగబాధలకు భాష నిస్తాడు. అవ్యక్తమధురములైన సున్నితభావాలని అలంకారాలతో శోభిల్ల చేస్తాడు. అణగారిపోయిన జాతినే ఉద్రిక్తం చేయగలడు.

అటువంటి ప్రతిభాశాలిని, రసపిపాసువుని నిర్దాక్షిణ్యంగా విమర్శించడం ఎంత సాహసమో, ఎంత అసమంజసమో ఆలోచిస్తే తెలుస్తుంది.

మనకి కావలిసినది సాహిత్యాభివృద్ధి. అందుకే మనం పాటుపడాలి. సంకుచితమైన కుటిల విమర్శలతోనూ, అపార్థభూయిష్ఠమైన వ్యాఖ్యానాలతోనూ అభ్యుదయం చేకూరదు. సాహిత్యం పెంపొందడానికి, రసవత్తరంగా విరాజిల్లడానికి అనువుగాఉండే విమర్శలు, వ్యాఖ్యానాలు చేస్తూ సాహిత్యసేవ యత్నించడం మంచిది. విమర్శించవలసిన విషయం వచ్చినపుడు, నిష్పాక్షికంగా, సహేతుంగా విమర్శించాలి. వ్యక్తిగత దురభిప్రాయాలకు, యిష్టానిష్టాలకు ఏమాత్రం తావుండకూడదు అప్పుడే అవిసరసమయిన విమర్శ అనిపించుకొంటుంది. అప్పుడే విమర్శకుడు ఆపేరుకి తగినవాడవుతాడు. లేకపోతే నిష్కృతిలేదు.

# మన రైళ్ల తీరు

బి. వెంకటేశ్వరరావు

మిత్రుణ్ణి రైలెక్కించడానికి స్టేషనుకెడితే మరచిపోదామంటే సాధ్యంకాని సంఘటన మా కళ్ళముందు జరిగింది...నా కసలు సంబంధం లేని సంగతిని ఎందుకుపట్టించుకోవాలని వూరుకుంటే, నా కళ్ళముందు ఆ దృశ్యం మళ్లీ మళ్లీ ప్రత్యక్షమై నా హృదయానికి శాంతిలేకుండా చేస్తూంది.

నాడు మెయిలు సరైన టైముకే వచ్చి ప్లాట్‌ఫారంమీద ఆగింది. ఒక నిముషం కూడా ఆక్కుండా, అమాంతంగా ఒక్కసారి వెనక్కి కదలిపోయి మళ్లీ ఒక్క వూపుతో ముందుకు పోయింది...ఈ ప్రయత్నమంతా ఇంజన్ నీళ్లు పట్టుకునేందుకు ఏనుగు తొండంలాంటి గొట్టం క్రిందకు సరిగ్గా చేరేలా డ్రైవరుగారు ఎడ్జస్టుచెయ్యడమన్నమాట!...దీనివల్ల ఎంతమందో ఎక్కుతూ పడిపోతూండడంకూడా మామూలే!...అసలు యింజన్ని ట్రైన్నుంచి వేరుచేసి వాటరింగుకు తీసుకుపోతే ఏ బాధావుండదు...అలా జరగడం చాలా అరుదైపోతేనే! అసలు అడిగేవారెవరు! అడిగితే సమాధానం చెప్పేవారెవరు?...ఇలా అనుకుంటూ ఎవరికివారు వూరుకోవడం!...

మెయిలుకి వుండేవే రెండున్నర మూడోక్లాసు కంపార్టుమెంట్లు...ఇక అందులో 300 మైళ్లకు పైని కొన్ని...పైగా చాలామంది దబాయింపుల్తో పక్కస్టేషనుకు ప్రయాణం చేసేవాళ్లు! ప్రతీపెట్టె చీమదూరడానికి సందులేకుండా జనంతో క్రిక్కిరిసిపోయి వుండడం మరీ మామూలైపోయింది! అసలీ రైళ్ళు ఎందుకు నడుస్తున్నాయో అర్థంకాదు.

ఇంతలో వో గర్భిణీ స్త్రీ ఒక్కతే, యితరుల సహాయంలేకుండా, ఒక చిన్న సూట్‌కేసు చేత్తో పట్టుకుని కంగారుగా మెయిల్లో ఎక్కుదామని ప్రయత్నిస్తూంది...కాలు ఫుట్‌బోర్డుమీద పెట్టడానికి కూడా చోటుదొరకలేదు. రైలు ఆగినంతసేపూ ఒక్కొక్కపెట్టె గాలించేసింది. జానెడు జాగాకోసం! ఎక్కడా చోటుదొరకలేదని వేరే చెప్పక్కర్లేదనుకుంటా!

కళ్ళనీళ్లు జలజలా రాలిపోతున్నాయి!... చోటు దొరకనందుకు, రాత్రి ఏడుగంటలదాకా వుండిపోవాల్సొచ్చినందుకు విచారిస్తూందేమో అనుకున్నా నేను.

ఇంతలో రైలు 'కుయ్యి' మని మళ్ళీ వెనక్కి కదలి ముందుకు పోయింది!

ఆ చూలాలు నిరాశా నిస్పృహల్తో యింకా కన్నీళ్లు విడుస్తూనేవుంది. ఇంతట్లో స్టేషన్లో పూరీ పకోడీలు అమ్ముకునేవాడు నాదగ్గరకొచ్చి 'చూశారా! పాపం ఆ నిండుమనిషిని, రైలెక్కుతూంటే గార్డు రెక్కపట్టుకు లాగేశాడు! వెల్లకితలా పడిపోయింది!' అన్నాడు.

నా నెత్తిమీదో పెద్దబండ పడిందా అనిపించింది. 'వెల్లకితలా పడిపోయిందా!' అన్నా.

'అవునండీ!... చూడండి గర్భిణీస్త్రీ కూడా! మామూలు మనిషైతే పర్వాలేకపోయే'దన్నాడు, ఆఖరికి ఆ పకోడీ లమ్ముకునే ఆసామికూడా ఎంతో జాలిగా!...ఆ గార్డు అసలు మనిషేనా, హృదయం అనేది వుందా, దెబ్బలు తగిలేయేమో గట్టిగా!...అనుకుంటూ ఏమేమో ఆలోచిస్తున్నా!

ఇంతలో ఆ స్త్రీ రెండణాల నష్టానికి టిక్కట్టును వాపసుచేసింది. కాని నాకళ్లు ఆ ఆసామి చెప్పినట్టు జబ్బ పట్టుకులాగడం, ఆమె క్రింద పడిపోటం...మొదలైన వాటిని చూస్తూన్నాయి!... ఆ అమ్మాయిదగ్గర స్టేట్‌మెంటు తీసుకుని కంప్లయింటు దాఖలుచేద్దామా అన్న ఆలోచన తట్టింది.

ఇది రాక్షసకృత్యం. ఆ స్త్రీ తన గర్భంలోని శిశువుకు అపాయం సంభవించిన పక్షంలో ఆ గార్డును ఆజన్మాంతం తిట్టదూ?

ఏమైనాసరే గార్డుమీద రిపోర్టు చేద్దామని ఆ అమ్మాయికోసం చూస్తే ఆమె వెళ్లిపోయిందని తెలిసింది.

రిపోర్టు చేసినామాత్రం జరిగేదేమిటి, ఏదో గుడ్డిగా 'వార్నింగ్' ఇచ్చాం అని అధికారులనడం తప్పించి!

ఎన్నాళ్ళయినా డాములు కొట్టడంమటుకు తెలుసు మనవాళ్ళకు!...ఇదిగో ఎక్కువ ట్రైయినులు వేస్తాం, ఎక్కువ సౌకర్యాలు చేస్తాం అని.

ఏవీ? ఇవన్నీ ఎప్పటికైనా నిజమవుతాయా అని?...లేక ఓ శతాబ్దం పడుతుందో!

# కమ్యూనిస్టు సిద్ధాంతం: ఒక సింహావలోకనం

[ఈవ్యాసంలో వీనుమిగిలిన ఆర్థికశాస్త్రవేత్త, కమ్యూనిజమును తరచిచూచిన ప్రజ్ఞానిధి క్రిస్టఫర్ హాలిస్ నేటిప్రపంచపరిస్థితుల దృష్ట్యా మార్క్సువాదసిద్ధాంతాలను సమాలోచించాడు.]

కమ్యూనిస్టువాదాన్ని విమర్శించాలంటే- మనం ముందు ఆ వాదనలోని బలాన్ని, బలహీనతనూ కూడా అవగాహన చేసుకోవాలి.

ఒక శతాబ్దం కిందట, యీనాడులాగే, చాలా మంది చరిత్ర మార్పులేకుండా సాగుతూ ఉంటుందని భావించారు మానవస్వభావానికి మార్పు లేదనీ, ఒకకాలానికి సరిపడ్డ మానవసంస్థలే యింకొక కాలానికి కూడ సరిపడక తప్పదనీ అనుకున్నారు. ఆ అభిప్రాయానికి వ్యతిరేకంగా, హెగెల్ తన యుగధర్మ సిద్ధాంతం ప్రచారం చేశాడు. హెగెల్ సిద్ధాంతం ప్రకారం, చరిత్ర కొన్నిదశల పరంపరగా సాగింది. ప్రతి దశకి ఒక ప్రత్యేక ధర్మం ఉంది. ప్రతి దశలోను, సమాజం కొన్ని వ్యతిరేకశక్తుల సంఘర్షణకి లోనయింది. ఆ సంఘర్షణ ఫలితంగా—యీ పక్క శక్తులకీ కాకుండా, ఆపక్క శక్తులకీ కాకుండా—యితరేతరశక్తులు వేటికో విజయం సంఘటపడుతూ వచ్చింది. ఈ యితరేతర శక్తులు చరిత్రలో నూతనదశ రావడానికి కారణభూతం అయాయి. ఈ మోస్తరుగానే- ఉదాహరణకి- పదహారవ శతాబ్దంలో కేథలిక్కు మతానికీ, ప్రొటెస్టెంటు మతానికీ మధ్య జరిగిన సంఘర్షణ ఫలితంగా—యీ మతానికీ కాక, ఆ మతానికీ కాక-మధ్యగా మతసహానంతో కూడిన రాజ్యవ్యవస్థకి విజయం వచ్చింది.

## గతితార్కిక భౌతికవాదం

మార్క్సు, జగత్తు మూలతత్వం స్థితికాదు గతి కాని అన్న హెగెల్ వాదం తీసికొని,ఆర్థికపరిస్థితులే సమాజస్వరూపం నిర్ణయిస్తాయి- అన్న ఫోయర్ బక్ వాదంతో జతచేశాడు. 'తిండికి పడే తిప్పలే మనిషికథ' అని ఫోయర్ బక్ ఉద్బోధ. అందుచేత, మార్క్సు మత మేమిటంటే, చరిత్ర దశల పరంపరతోటి- సంఘర్షణలతోటి సాగిందని; కాని సంఘర్షణలుమాత్రం ఎప్పుడూ ఆర్థికవర్గాలమధ్యనే జరిగాయి. వర్గసమరమే చరిత్ర వాస్తవరూపం. సామాజికచరిత్ర మొదటినుండీకూడా రెండువర్గాల చరిత్రగా సాగింది: కొల్లగొనే కొద్దిమంది వర్గమొకటి; కొల్లపోయే పెక్కుమందివర్గ మింకొకటి. నవీన ఉత్పత్తి విధానాలు బయలుదేరి, సరికొత్త సామాజికవ్యవస్థ కావలసివచ్చినప్పుడల్లా—కొల్లపోయిన వర్గమందరిలో శక్తివంతమైనవాళ్లు తిరుగుబాటుచేసి, సర్వజన సామాన్యమైన స్వేచ్ఛాజీవితం కాంక్షించే నినాదాలే చేస్తూ — ఇంతవరకు పాలకవర్గంగా వుంటూవచ్చిన వాళ్ళని పదభ్రష్టుల్ని చేసి, వాళ్ళ స్థానంలో—వర్గరహిత సమాజానికి బదులు- తమనే కొత్త పరిపాలకవర్గంగా సంస్థాపించుకున్నారు. ఈ విధంగానే—ఉదాహరణగా- మాగ్నాకార్టా దండించిపుచ్చుకున్న ప్రభువర్గం కింగ్ జాన్ కు ప్రతికూలంగా తమను నిలదొక్కుకున్నారు. ఇదేవిధంగా, మార్క్సుకు పూర్వం, 'ఫ్రెంచి రివల్యూషన్' తాలూకు నాయకులు తిరగబడి - పూర్వపాలకులు, వారి అనుగ్రహపాత్రులు అనుభవిస్తూన్న అసామాన్యాధికారాలకి స్వస్తి చెప్పారు. కాని యీ విశేషాధికార విరహితమైన పరిపాలన, ఆచరణలో, పెట్టుబడిదార్లు కోరినట్టు వర్తించడానికి అడ్డువచ్చే అధికార మేదీలేని పాలనమాత్రమే అయి వూరుకుందన్నాడు మార్క్సు. కాని వాస్తవానికి సామాన్యుడి విషయంలో జరిగిన దేమిటంటే-యజమానులు మారారంతే. జాగీరుదార్ల యాజమాన్యంపోయి, ఆ స్థానంలో పెట్టుబడిదార్ల యాజమాన్యం అవతరించింది.

## కేపిటలిజం ఎందుకు నిలవదు?

జగత్తులో ప్రతివస్తువు విడుపులేకుండా పరివర్తన చెందుతూనే ఉంటుందని మార్క్సు వాదం;

పెట్టుబడిదార్ల యేలుబడికూడా, దానివంతు వచ్చినప్పుడు, విధిగా నశించి తీరుతుంది దానిలో స్వతస్సిద్ధంగా ఉన్న వైరుధ్యమే దాని వినాశానికి హేతువు. పెట్టుబడిదారీ పద్ధతిలో ఫలప్రదమైన అర్థసంపద యావత్తూ కొద్దిమంది ధనాఢ్యుల చేతుల్లో పోగుపడి ఉంటుంది. తక్కిన సమాజమైన శ్రామికజనం పెట్టుబడిదారులకింద పనిచేసి బతకాలి. తమపాటుకు ప్రతిఫలంగా వాళ్ళకి 'జీవనభృతి' మాత్రం ముడుతుంది. జీవనభృతిని మించి అధికంగా, ఒకవేళ యిద్దామనుకున్నా, యివ్వరాదని 'అర్థశాస్త్ర సూత్రాలు' ధనికులపై నిషేధం పెడతాయని చూపడానికి- తన కాలంనాటి 'రికార్డో' వంటి ధనికవర్గానికి చెందిన ఆర్థికశాస్త్రవేత్తల గ్రంథాల్లోంచి మార్క్స్ సునాయాసంగా ఉదహరించగలిగాడు. కాబట్టి- ఉత్పాదకశక్తి వృద్ధిఅయినకొద్దీ, ధనవంతులకీ ధనహీనులకీ మధ్య ఉన్న వ్యత్యాసం హెచ్చుతుందన్నది స్పష్టమే. ఎందువల్లనంటే- ధనహీనుల రాబడి జీవనభృతిదగ్గరే ఆగిపోయి, హెచ్చురాబడి అంతా ధనికుల చేతుల్లోకే పోతుంది. ఈవిధంగా ఏర్పాటయిన సమాజం రెండుకారణాలవల్ల విచ్ఛిన్నం కాకతప్పదు. ఒకటి-నైతికం: మనిషి యెప్పుడూ ప్రాథమికంగా సమానత్వం వాంఛిస్తాడు; అందుచేత పెచ్చుపెరిగే అసమానత్వరూపమైన దురన్యాయంపై అనివార్యంగా తిరగబడతాడు. రెండవ కారణం-యాంత్రికం: ఈ నూతన పారిశ్రామిక కృషి ఉత్పత్తిచేస్తూన్న సరుకువంటి సరుకు పతివారికీ కొద్దికొద్దిగానే కావాలిగాని, ఎవరికీ కొండలుగా అవసరంలేదు. ఎంత భాగ్యవంతుడయినా అయిదు భోజనాలు తింటూననేవాడు, లెక్కకు మించిన మోటారుకార్లు కొంటూననేవాడు ఉంటాడా? అందువల్ల సమాజంలోని ఆదాయపు పంపకం బొత్తిగా అసమానంగా జరిగినంటే, సమాజపు ఉత్పత్తులు కొనేవాళ్ళెవరూ లేకపోవడం తప్పనిసరి అవుతుంది. ధనికప్రాబల్యపు సమాజంలో ఉన్న అవకతవకే యిది: ఉత్పత్తి చెయ్యడమేమో సమానాదాయాలు కావలసిన సరుకును ఉత్పత్తి చేస్తుంది; ఆదాయాల పంపకంలో మాత్రం నానాటికి అతిశయిస్తూన్న అసంపర్కమైన అసమానత్వం కనిపిస్తుంది. ఈ కారణాలచేత కేపిటలిస్టుసమాజ నిర్మాణం కూలిపోవడం తథ్యమని మార్క్స్‌వాదన. అది కూలినప్పుడు, కమ్యూనిజం లేక వర్గరహిత సమాజం దాని స్థానంలో వస్తుంది. ఈ వర్గరహిత సమాజాన్ని వెనువెంటనేస్థాపించడం సాధ్యంకాని మాటనిజమే. మధ్యగా,'శ్రామికజన నియంతృత్వ' మనే యింకొక దశ ఉంది. ఇప్పుడు రష్యాలో జరుగుతున్నది యీ దశే; కాని, యీ దశ గడచిందనగానే, అప్పుడు 'రాజ్యవ్యవస్థ అంతరించిపోతుంది', 'చరిత్రకి పూర్వదశ ముగిసి, చరిత్ర ప్రారంభిస్తుంది', కమ్యూనిజం ప్రవేశమవుతుంది, మార్క్స్‌నోట వెలువడిన యితర ప్రవచనాలన్నీ సఫలం అవుతాయి.

## మార్క్స్‌వాదం ఎంతవరకు సత్యం?

ఇప్పుడిందులో ఎంతవరకు సత్యం, ఎంతవరకు కాదు ?

మొట్టమొదట— ధనస్వామ్యం నిలుకడగా ఉండేది కాదని, మార్క్స్ నొక్కిచెప్పడంలో ఏమీ పొరపాటులేదు. 19వ శతాబ్దంలో స్వేచ్ఛావ్యాపారమన్న అర్థంలో యీపదం వాడినంతమట్టుకు యిది వాస్తవమే. రికార్డో అర్థంలో ధనస్వామ్యం అప్పుడే చాలావరకు గతించిపోయింది.

కాని ధనస్వామ్యం, మార్క్స్ జోస్యం చెప్పిన కారణాలవల్లమాత్రం గతించిందనడానికి వీల్లేదు. కొనుగోలుశక్తి కొరతవచ్చి, అది కూలిపోతుందని మార్క్స్ అన్నాడు. కాని సామ్రాజ్యతత్వం పెంపొందడం ద్వారా, 19 వ శతాబ్దంలో కొంతకాలం యీ సంసిద్ధాన్ని తప్పించుకో గలిగారు. బ్రిటిషు పారిశ్రామికులు తయారుచేసిన వస్తువులు కొనడానికి చాలినంత కొనుగోలుశక్తి బ్రిటిషు శ్రామికుల చేతుల్లో లేక పోయినా, యీ శతాబ్దపు ఉత్తరార్థంలో ధనస్వాములు ఖండాంతరాలలోని కొత్త దేశాల అభివృద్ధికి పెద్ద పెద్ద మొత్తాలు బదుల్లు యిచ్చారు. ఈ బదుల్లు బ్రిటనులో యంత్రసామగ్రి కొనడానికి వినియోగింపబడ్డాయి- ఆ యంత్రాలు ఉత్పత్తిచేయడం ద్వారా బ్రిటిషు పరిశ్రమకు పనికలిగింది.

అయినప్పటికీ, సరిగ్గా లెనిన్ చెప్పినట్టుగానే, యితరదేశాల్లోకూడా పారిశ్రామికవాదం  సామ్రాజ్యతత్వంకూడా [illegible] ణాలకి దారితీసింది. ఈ యితరదేశాలకికూడా అదనపు సామగ్రిని విడు

వల్ల చేసుకోడానికి ఖండాంతరాలలోని తమ మార్కెట్లు కావలసివచ్చాయి. పోటీసామ్రాజ్య శక్త్యాల మధ్య త్రోపుడు అనివార్యమయింది. ఈ పోటాపోటీ - 1914, 1939 ప్రపంచ యుద్ధాలకి ఏకైక కారణం కాకపోయి నప్పటికీ, అధమపక్షం ఒక పెద్ద కారణమేనా అవును.

## మార్క్సువాదం ఎక్కడ తప్పింది?

ఆ విషయంలో మార్క్సు పక్షీయుల వాదం ఎంతైనా సహేతుకమైందని ఋజువైంది. కాని యింకొకవిషయంలో మార్క్సు అంచనా పూర్తిగా తప్పిపోయింది. అతనివాదం పేదవారిదుస్థితి పెరుగుతుంది అన్నదానిమీద ఆధారపడింది; ధనవంతులకీ దరిద్రులకీమధ్యవుండే అఖాతం వృద్ధిఅవుతూ వెడుతుందని అతను విశ్వసించాడు. 19 వ శతాబ్దపు పూర్వార్థంలో పారిశ్రామికాభివృద్ధివల్ల అతిశయించిన అర్థసంపదలో శ్రామికుల కేమీ పాలు లేకపోయినమాట వాస్తవమే. కాని ఆ శతాబ్దపు ఉత్తరభాగం విషయంలోగాని, యీ ఇరవయ్యో శతాబ్దం విషయంలోగాని ఆమాట నిజం కాదు. పూర్వకాలపు అర్థశాస్త్రజ్ఞులు, మార్క్సు సిద్ధాంతవేత్తలు 'ధనస్వామ్యవిధానాన్ని కల్లకొందలు చేస్తేనేగాని అర్థశాస్త్రపు తిరుగులేని సూత్రాల జోలికి వెళ్ళడానికి వలనుపడ'దని అట్టహాసం చేసినా, ఆ విధానంలోనే శ్రామికులకు తమ శ్రమఫలితంలో యింతోధికభాగం అందివ్వడానికి మార్గాలు కనిపించాయి. ధనస్వామ్యంలోని శ్రామికుల జీవనప్రమాణం ఎన్నోరెట్లు పెరిగింది.

ఇది యిలా వుండగా, సాంకేతికశాస్త్ర విషయకమైన పురోగతి కారణంగా ఉత్పత్తి విధానానికి సంబంధించిన వివిధాంగాలు, మార్క్సు నాటికంటె, ఎంతో విస్తృతి పొందాయి. దాని ఫలితంగా, '930 వ పడిలో ప్రవేశించే టప్పటికి ఇంగ్లండులో - లేబరు ప్రభుత్వం అధికారానికి రావడానికి యింకా చాలా ముందుగానే - పూర్తిగా కొత్త పరిస్థితి ఏర్పడింది. ఉపన్యాస వేదికలనుంచి మాత్రం, పెట్టుబడిదారులంటే ధనాఢ్యులైన కొద్దిమంది వర్గమనే యింకా దబదబలాడిస్తూవచ్చారు. కాని వాస్తవపరిస్థితులేమిటంటే - ధనవంతులమీద దిట్టంగా పన్ను వెయ్యడంచేత, వారు, చివరికి నిలువ చెయ్యడంపోయి, ప్రతి సంవత్సరము మదుపు పెట్టిన దానికంటె ఎక్కువగా పరిశ్రమల్లోంచి బయటికి తియ్యవలసిన పరిస్థితికి వచ్చారు. అటు, దినసరి వేతనం అభివృద్ధి కావడంవల్ల, శ్రామికులిదివర కెప్పుడు లేనంత ఎక్కువగా నిలువచెయ్యడానికి ఆస్కారం కలిగింది. దానితో పరిశ్రమలకి కావలసిన మదుపు క్రమక్రమంగా సామాన్య సంపాదన గలవారినుండి రానారంభించింది. ఈ పెట్టుబడి సామాన్యంగా ద్రవ్యనిధి సంఘాల ద్వారా పరోక్షంగా సాగింది.

## సొత్తనదారుల నూతనవర్గం

ఇది చాలా లాభకరమైన విషయం; దీనివల్ల ఒక సత్ఫలితంకూడా కలిగింది. ఇందుమూలంగా, మార్క్సు కాలంలో ప్రత్యక్షంగా యే కొద్దిమంది సొమ్ముగానో ఉంటూవచ్చిన పారిశ్రామిక సంపద, యిప్పుడు పరోక్షంగా దేశమంతటా చెల్లాచెదరుగా ఉన్న లక్షలాది ప్రజల సొత్తుగా పరిణమించింది. ఈ కొత్త ప్రపంచంలో, సొంతదారు, మార్క్సు కాలంనాటి కార్యకర్తగా వ్యవహరించడానికి కింక వీలుపడదన్నది స్పష్టమయింది. దీనితో ఆధునిక ప్రపంచపు అతి ప్రధానలక్షణం బయలుపడింది - ఇటు పెట్టుబడిదారులకుగాని, అటు శ్రామిక జనానికిగాని చెందని కొత్త పాలకవర్గమొకటి అవతరించింది. సరిగా హెగెల్ ప్రవచించినట్టుగానే - కేపిటలిస్టులకూ, సోషలిస్టులకూ మధ్య జరిగిన సంఘర్షణఫలితంగా కొత్తగా వచ్చిన సొత్తనదారులవర్గాన్ని విజయం వరించింది.

వాస్తవానికి సోషలిజం కూడా కేపిటలిజం సాటిదే. కేపిటలిజాన్ని విమర్శించడానికైతే అది పనికివచ్చింది. కేపిటలిజం ఎందుచేత తాత్కాలిక దశమాత్రమే అయిందో, ఎందు కది విధిగా నశించితీరాలో తెలియచెప్పడానికి సోషలిజం కావలసివచ్చింది. కాని కేపిటలిజం స్థానం సోషలిజం ఎందుకు ఆక్రమించాలో అది సరిగా చెప్పదు. అందుచేత - కేపిటలిజం పోయి, నూతన పరిస్థితులు నెలకొనడం ప్రారంభం కావడంతోనే, సోషలిజం అప్రస్తుతం నిరుపయోగం అయిపోతుంది.

## కమ్యూనిస్టుల నియంతృత్వం

మార్క్సు లేవదీసిన చారిత్రిక పరిణామవాదం ప్రకారం - వెనక దాస్యవిమోచకులుగా అవతరిం

భక్తులకొరకు, పాషండులకొరకు, ఈడురాని వాళ్ళకోసం, ఒకరినికోరే ఇద్దరి కోసం, ఎదిరించే పిడుగురికోసం

సులోచనాల జోడూ! మమ్మల్ని విను.

ఊరుము చప్పుడు విని జడుసుకొనే కన్యకోసం, భర్తని లొంగ దీసుకున్న భార్యకోసం, ఆఫ్రికాను ప్రేమించే అవివాహిత కోసం

భయంకర భల్లూకమా! మమ్మల్ని విను.

విభజనవల్ల పెరిగేవాళ్ళకోసం, అమాయకత్వాన్ని ప్రకటించే వాళ్ళకోసం, మరణాన్ని నిరాకరించేవాళ్ళ కోసం

నీలి రంగు సివంగీ! మమ్మల్ని విను.

ఆరువు పుచ్చుకొనే వాళ్ళకోసం, అప్పిచ్చే వాళ్ళ కోసం, ఎదురుపడితే మొగం చాటుచేసేవాళ్ళ కొరకు, ఇంట్లో ధర్మరాజని పేరు పొందిన వాళ్ళ కోసం

రెండు తలల హంసా! మమ్మల్ని విను.

ఆతపస్నానం చేసే వాళ్ళకోసం, మర్యాదగా దుస్తులు ధరించే వాళ్ళకోసం, తమ గొప్ప తనం గురించి సందేహంలేని వాళ్ళకోసం, భజనచెయ్యడం నేర్చుకున్న వాళ్ళ కోసం

శ్వేతాశ్వమా! మమ్మల్ని విను.

బాధపడాలని నిశ్చయించుకున్న వాళ్ళ కోసం ప్రకృతిని శాసించగలమని విశ్వసిస్తున్న వాళ్ళ కోసం

బాకా ఊదేవాడా! మమ్మల్ని విను.

ఎగరగల వాళ్ళకోసం, ఇబ్బంది పడుతున్న వాళ్ళ కోసం, నిరుత్సాహాన్ని ఆరాధించుతున్న వాళ్ళ కోసం

అందమైన అమ్మాయీ! మమ్మల్ని విను.

పొదరింట్లో బతకదలచుకున్న వాళ్ళకోసం, కొండెక్కే వాళ్ళకోసం, ఇక్ష్వాకుల కాలం ఇప్పుడు కావాలనే వాళ్ళకోసం

రంగూన్ రౌడీ! మమ్మల్ని విను.

మౌనవ్రతం అవలంబించిన వాళ్ళకొరకు, అవలంబించని వాళ్ళకోసం, కొడుకులు చనిపోయిన తర్వాత గుళ్ళకి వెళ్ళేవాళ్ళ కోసం

ఏడూళ్ళ చక్రవర్తీ! మమ్మల్ని విను.

పరాన్న భుక్కులకోసం, శవాన్న భోక్తల కోసం, జంట గులాబి పూలకోసం, మచ్చికయిన జంతువుల కోసం

ఆకుపచ్చ మనిషీ! మమ్మల్ని విను.

నీదయ, మరి నీ ప్రజలని ఎలా పడుకోబెడతావో

ప్రభూ! నిన్ను ప్రార్థిస్తున్నాం, వినవూ?

(*W-H Auden* రచనకు అనువాదం)



"జాతీయ స్థయిర్యమునకూ ప్రపంచవ్యవస్థకూ కూడా నూతనజీవిత విధానమొకటి మూలము కావాలి. అది అన్నితరగతుల, అన్నిజాతుల, అన్నిదేశముల ప్రజల ప్రయోజనములనూ కాపాడగలిగి ఉండాలి. ఎవరైతే స్వార్థమనే అవిద్యాంధకారమునుండి తప్పించుకొని బయటపడ్డారో, వారే ప్రపంచశాంతికోసం పాటుపడి దానిని స్థాపించగలవారు. ప్రపంచశాంతి అంటే మానవకోటియొక్క జీవితంలోనూ ప్రవర్తనలోనూ, కొన్ని సార్వలౌకిక సిద్ధాంతాలూ, ఆదర్శాలూ రూపం దాల్చడమే. అందుకోసం నీతిని వికృతము చేయని, మానవజీవితమును వినాశనము చేయని, ఆయుధములద్వారా మనము పోరాడాలి. ఈ ప్రయత్నంలో మనకెట్టి కష్టనష్టాలు తటస్థించినా, మనము ఓర్చుకోడానికి సంసిద్ధంగా ఉండాలి."—డాక్టర్ రాధాకృష్ణన్.







[ఉన్మత్తుల కాలం-భీకరనరహత్యలు, మాన భంగాలు జరుగుతూన్న రంగం-నిర్భాగ్య జీవులు ఆస్తిపాస్తులు. ఆలుబిడ్డలు లెక్క చెయ్యకుండా వలసపోతూన్న ఘట్టం-]

విజ్ఞాని : నే నాలోచిస్తున్నాను - మధ్య మాట్లాడించకు.

చరిత్రకారుడు : ఏ మాలోచిస్తున్నావు? నా పుస్తకంలో ఓ కాగితం చిరిగిపోయింది-ఆవేళ తారీకు ఎంత! అక్టోబరు ఇరవైతారా, ఏడా...!

వి : చెప్పుతా చెప్పుతా! నిన్నరాత్రి ఆ రక్తకల్లోల ప్రారంభానికి అరగంట ముందే నా కొక సూచన కనుపించింది-నా ప్రయత్నం ఫలోన్ముఖం కాబోతూందని. కాని—

మానవుడు : అదిగో! మళ్లీ వస్తున్నారు. (పెద్ద కేకలు) బాబోయ్-చూడలేను-నరకం!

చ : నాదిరుషా దేశంమీద దాడి చేసినప్పుడు నేను చేసిన వర్ణన చదివితీరాలి.

మా : నీచరిత్ర మండిపోను-అవతల పీకలు ఎగిరిపోతూంటే మధ్య నీ గోలేమిటి? నాకాళ్లు లాగుకుపోతున్నాయి-ఆకలి, ఆకలి-

వి : ఆకలిలేకుండా చేస్తాను మానవజాతిని, యీ ప్రయాణం మాగియనీ - దేశానికి స్వాతంత్ర్యం రావడం మంచిదే గాని, నా పరిశోధనాగారం దెబ్బతింది-లేకుంటే...

మా : లేకుంటే- దేశంలోనేకాదు- దేశంనుంచి దేశం వలసపోవలసి వచ్చినా నీ విజ్ఞానం వల్ల ప్రయాణం సుకరం చేస్తావుకాబోలు.

చ : అలాంటి విషయాలు మరీ మజాగా వుంటాయి- తైమూరు దండయాత్ర చేసినప్పుడు ఢిల్లీనగరాన్ని పదిహేను రోజులు దోచుకొన్న సందర్భంలో నేను చేసిన రికార్డు

మా : జలియన్‌వాలాబాగ్‌లో నువ్వెక్కడా అగుపించలేదేం? పశువా! అటు చూడు! చంటిపిల్లల్ని బ్రతికివుండగా సగం పాతిపెట్టి—

చ : ఇబ్రహీమ్ లోడీ ... (అంటూండగా ఒక పెద్ద గూండామూక దూసుకుపోయి ముగ్గుర్నీ వేరుచేసింది- ఐదు నిమిషాలలో మళ్లీ కలుసుకున్నారు.)

వి : ఇదంతా చూస్తే నాకొక ఆలోచన తట్టింది- మానవుణ్ణి అమరుడుగా చెయ్యడంకన్న అదృశ్యుడు గానో, మానసవేగగామి గానో చెయ్యగలిగిన సాధనం కనిపెట్టాలి.

చ : గొప్ప వుద్దేశం— ఏంపోయింది— ఓయ్ మానవుడా- ఇవాళ తారీకెంత? మన విజ్ఞానానికి కలిగిన వుద్దేశాన్ని ఆధారపరచుకుని, ఒక జరగని విషయాన్ని జరిగినట్టు రికార్డు చెయ్యాలి—

మా : (ఆశ్చర్యంగా) అబద్ధాలు రాస్తావా!

వి : అబద్ధాలు రాయకూడదు—నా విజ్ఞానం యావత్తూ సత్యం మీదే ఆధారపడివుంది- కాని పరమసత్య జిజ్ఞాసువు అయిన విజ్ఞాని...

మా : జీవితంలో సత్యం పూజ్యం—

వి : పొరపడ్డావు — సత్యదూరమైన జీవితం మానవకళ్యాణానికి తోడ్పడలేదు.

మా : ఇది ప్రత్యక్షవిషయం.

వి : కాని నేను చేస్తున్న కృషివల్ల—
ప్రయాణం ఎంతసుకరం అయిపోయిందో
విమానంవల్ల—

(ఢన్‌మని బాంబుపడింది)

చ : వచ్చాం! జ్ఞాపకం వస్తున్న నేటి లేదీ
మర్చిపోయా—

మా : పేలింది!!

వి : (నివ్వెరపోతాడు.)

చ : అయ్యో, నా చెయ్యి తెగిపోయింది—
నెత్తురు!

మా : (విజ్ఞానితో) అయితే విమానాలు—
సౌకర్యమైన ప్రయాణానికా - భీకరమైన
బాంబులకా—

వి : అది నా తప్పుకాదు—మానవుడా! నీ
తప్పే! నీ జీవితాన్ని గులాబీతోటలో
ప్రతిష్ఠించడం నా వంతు—అనుభవించడం
నీ వంతు. చూడు, మనిషి కాలుకదపక్క
ర్లేకుండా పొట్టలోకి ఆహారం వచ్చేమార్గం
కనిపెట్టాను-భూమిని తడిపి-దున్ని-'

(మహాసంక్షోభం - భీషణకోలాహలం - మాట
వినపడదు-విజ్ఞాని మానవుడి చెవిలో అరుస్తున్నాడు
కళ్లు పెద్దవిచేసి)

'నూర్చి, మిల్లు ఆడించి, వంటచేసి...

(ప్రళయశివతాండవంలాడు పుట్టిన శబ్దాన్ని
ధిక్కరిస్తూ - యినక జల్లినట్టు గుళ్లు చెరుగుతూ
మెషిన్‌గన్ అమర్చినట్రాక్టర్ దూసుకుపోతూంది)

'యంత్రాలు పని చేస్తూంటే......మానవుడు
హాయిగా...'

(ఆక్రందనాలు-స్త్రీల హృదయ విదారక రోద
నలు)

మా : అహ్హహ్హా! ఏం చేస్తున్నాడు-పనిలేక కొవ్వి
పశుతుల్యంగా తోడిమానవుల్ని చిత్రవధ
చేస్తూన్నాడు. పనిలేక వున్మత్తుడై పట్ట
పగలు బహిరంగంగా అన్నఎదుట చెల్లెలినీ,
కొడుకు ఎదుట తల్లిని — భర్త ఎదుట
భార్యనీ...ఛీ!

చ : (ఏడుస్తూ) మానవుడా ! రెండుముక్కలు
రాసిపెట్టు—ప్రయాణం సుకరంగా వుందని-
సర్వసదుపాయాలు పరిపాలకులు చేస్తూ
న్నారనీ, స్త్రీలకు ప్రత్యేకం- పురుషులకు
ప్రత్యేకం- రోడ్లు బాగున్నాయని
అయ్యో చెయ్యి తెగిపోయింది...నెత్తురు !

మా : ఇంకా, యింకా...

చ : ప్రయాణీకుల సౌఖ్యంకోసం రోడ్ల కిరు
ప్రక్కలా చెట్లు వేశారని, నూతులు
త్రవ్వించారని

మా : గోతుల్లో పాతిపెట్టారనీ - పొట్టగాడిదా—
అటు చూడు ఈజీచైరులో కూచుని కాఫీ
తాగుతూ దొంగరాతలు రాయడంకాదు-
ఆ ఏడుస్తూన్న అనాథలైన చంటిపాపల్ని
తొక్కుకుపోతూన్న నరరూపరాక్షసుల్ని
చూడు—ఆ పరుగెడుతూన్న నిర్భాగ్య
యౌవనాంగుల వస్త్రాలమీద యింకా
ఆరని నెత్తురుమరకలు చూడు—

చ : ఉ ! ఉ ! ఉ ! నాచెయ్యి నొప్పి

(దూరంనుంచి మెషిన్‌గన్ లోంచి రెండుగుళ్లు
వచ్చి విజ్ఞాని రెండుకళ్లూ లొట్టకొట్టేయి)

వి : అబ్బ ! అహాహాహా ! నాకళ్లు !

(ప్రజాసముద్రం మళ్లీ విజృంభించి వీళ్ళమధ్య
నుంచి దూసుకుపోయింది- వెరయిపోయారు—
దుర నిమిషాలు పోయాక.)

వి : అయ్యో మానవుడా - నాకు ప్రపంచం
అంతా నిబిడాంధకార సమావృతం అయి
పోయింది- నా సాధనసామగ్రి- నా పరి
శోధనాగారం !

చ : మానవుడా ! నా చెయ్యి చిల్లికుండవలె
నెత్తురు కారిపోతూంది - నా గ్రంథాలు
అసంపూర్తిగా వుండిపోతాయి కామోసు.

మా : అదిగో మన గమ్యస్థానం-అదిగో సింహ
ద్వారం-పదండి.

వి : నాకేమీ కనుపించదు-నేను అంధకారంలో
మునిగిపోయాను.

మా : నువ్వేకాదు-నీ ప్రతాపంవల్ల ప్రపంచంలో
చాలాభాగం అంధకారబంధురం అయింది-
నీ వికటాట్టహాసంలో పుట్టిన దెయ్యపు
శక్తిని పిడికిటిలో బిగబట్టి కళ్లుకానని
దేశాలు ప్రపంచాన్ని గజగజ లాడి
స్తున్నాయి.

చ : మానవుడా-నాచెయ్యి...నెత్తురు...

మా: కారనీ కారనీ! అది నెత్తురు కాదు...నంచిత పంకిలం-ప్రబంధయుగంలో ఎవరో సౌశీల్యాన్ని పరిపాలకుల కాళ్ళక్రింద మట్టిగా మార్చి ఉదరం పోషించుకుంటే- యీ యుగంలో సత్యాన్ని, మానవ జీవితాన్ని తారుమారు చేశావు పనిలేక నువ్వు...పదండి యిద్దరూ-అదిగో మన రాజ్య సింహద్వారం-సమీపించాం!

ద్వారపాలకుడు: (గట్టిగా) ఎవరు మీరు-ఆగండి- నువ్వెవరు?

మా: మానవుణ్ణి.

ద్వా: నాయనా, అటు వెళ్ళు- గులాబీతోటలలోకి, బంగారు మేడలలోకి- అవి మానవులకి——

(మిగిలిన యిద్దరూ గజగజ వణికిపోతూంటారు)

ద్వా: (అధికారసూచకంగా- గట్టిగా) ఎవరు మీరు!

వి: (తొట్రుపాటుతో) అ-జ్ఞా-ని

చ: (తొందరతో) అసత్యకారి-

ద్వా: హుః! ఇటు వెళ్ళండి. ఇటు-

(మానవుడు కొంతదూరం వెళ్ళి తనతో వచ్చినవారు యిటువేపు త్రోసివేయబడడం గమనించి- ద్వారపాలుడితో)

మా: అటేముంది?

ద్వా: (నవ్వుతూ) ఉన్మాదశాల!

# సంఘస్వామ్యం : మతవిశ్వాసం

'సామాన్యుడు'

జీవితావసరముల ఉత్పత్తి సరఫరాలతో యేవిధమయిన సంబంధం లేకపోయినా, మతం మానవజాతుల జీవితంలో ఆక్రమించే భాగం, ప్రాముఖ్యం మరేదీ ఆక్రమించుకోవడం లేదు.

మన కెదురుపడినవా డెవర్నయినా, 'నువ్వే మతస్థుడ'వని అడిగితే- హిందూ మతస్థుడననో, క్రైస్తవ మతస్థుడననో వెంటనే జవాబు చెబుతాడు. 'నిత్యజీవితంలో నీ మతానికి అర్థమేమి'టని అడిగితే, పురాణం చెప్పిన శాస్త్రుల్లవారిదగ్గరో, ముల్లా దగ్గరో, ఫాదరీదగ్గరో విన్నదాన్నో, తీరికవున్న సమయంలో చదివిన మతగ్రంథంలోవో ఏకరువు పెడతాడు. ఇతర మతాలకూ నీ మతానికీ భేదం యేమిటంటే, విగ్రహారాధనో, కులాలో, మొగవాడు రెండు పెళ్ళిళ్లు చేసుకోడమో యేదో జవాబు చెబుతాడు. వీరందరికీ నిక్కచ్చిగా తెలిసింది తమదు 'ఫలానా మతానికి చెందినవార' మనేది ఒక్కటే! వారివారి మతాలమీద ప్రతివారికీ అభిమానమూ; దాన్ని సంరక్షించాలనీ, వ్యాప్తి చెయ్యాలనీ నిశ్చయమూ సాధారణంగా కనుపిస్తూవుంటవి. ఇవన్నీ చాలామందిలో, ఆలోచనమీదకన్న, అలవాట్లమీద అభ్యాసంమీద యెక్కువ ఆధారపడివుంటవి. మతాభిమానం లేనివారు లేరు. మతమంటే ఇదమిత్థమని తెలుసుకున్నవారు చాలా అరుదు.

తర్జనభర్జన చేసి చూస్తే, ప్రతిమతమూ భగవంతుడికి సంబంధించి వున్నట్లు తోస్తుంది. మతాలవారందరూ భగవంతుడు ఉన్నాడనో, లేడనో విశ్వసించేవారు. ఉన్నాడని విశ్వసించేవారు ఆస్తికులు. లేరనేవారు నాస్తికులు. ప్రపంచంలో ఆస్తికుల సంఖ్య చాలా విపరీతం. నాస్తికుల సంఖ్య చాలా 'స్వల్పం'. ఇందుకు కారణాలు చాలా వున్నవి.

మతమనే మాటకు ఇంగ్లీషులో సమానమయిన 'రెలిజియన్', రెలిజియోన్ అనే లాటిన్ మాట నుంచి పుట్టింది. దానికి 'భయం' అని అర్థం. దేన్నో గురించిన భయాన్ని కల్పించేది మతం.

'ప్రపంచంలో ప్రతి సంఘటనకు ఒక కారణం వుంది. కారణంలేని కార్యం లేదు. ప్రకృతిధర్మాల ననుసరించి యీ కార్యాలన్నీ నడుస్తున్నవి అని విశ్వసిస్తే, భగవంతుడితో నిమిత్తం లేకుండాపోతుంది. ఆ కారణాలను అన్వేషించడమే విజ్ఞానంయొక్క ప్రయోజనం' అంటారు, కొంతమంది ఆధునిక మేధావులు.

అయితే, ఏటావచ్చే మాన్ సూన్ కొన్ని సంవత్సరాల్లో యెందుకురాదో, ఏటా పండే పంటలు కొన్నిసంవత్సరాల్లో యెందుకుపండవో, విజ్ఞానం విశ్వసనీయంగా వివరించలేదు. అందుకు కారణాలు వుండితీరాలి. కాని అవి మనకు ప్రస్తుతంలో తెలియవు. వైజ్ఞానిక సత్యాన్వేషణలో ఎప్పుడో ఒకప్పుడు తెలియకతప్పవు అన్నికార్యాలకు కారణాలు కనుక్కున్ననాడు, విజ్ఞానం భగవంతుడి స్థానం ఆక్రమించుకుంటుంది. జీవుల శరీరాల్లో యీయీ రసాయనిక ద్రవ్యాలున్నవని కనుక్కున్న రసాయనికశాస్త్రవేత్త ఆద్రవ్యాలనే సమీకరించి జీవిని సృష్టించలేకపోతున్నాడు. స్త్రీపురుష సంయోగంతో గర్భోత్పత్తి జరుగుతుందని తెలుసుకున్నవారు, కొన్నిచోట్ల, వైజ్ఞానికంగా యే కారణాలూ కనిపించకపోయినా, ఎందుకు గర్భోత్పత్తి కావడంలేదో వివరించలేకపోతున్నారు. సదా ఆరోగ్యసంపన్నులయిన తల్లిదండ్రులకు కొందరు బుద్ధిమంతులూ, కొందరు వికలాంగులూ, కొందరు మందబుద్ధులూ ఎందుకు పుడుతున్నారో; కొందరికి కేవలం ఆడపిల్లలూ, కొందరికి కేవలం మొగపిల్లలూ, కొందరికి పిల్లలే లేకుండాపోవడం యెందువల్లనో విజ్ఞానం సర్వత్రా వివరించలేకపోతున్నది. ఈనాడు విజ్ఞానం కనుక్కున్న విషయాలు, కొన్ని వందల సంవత్సరాలక్రింద మానవులకు తెలియవు. కాని ప్రకృతిలోవున్న సంఘటనలకు కారణమేమిటో కనుక్కోవలెననే జిజ్ఞాస మానవజీవితంలో చాలా పురాతనమైందిగా కనిపిస్తుంది. కలరా, మశూచికం యెందుకు వస్తాయో తెలియనినాడు—అంకమ్మకూ, పోలేరమ్మకూ బలి యిచ్చారు. అందుకు కారణాలు తెలుసుకున్న యీరోజుల్లో జాడ్యాలు అంతరించిపోతున్నవి. కాని మానవులు, తెలుసుకున్నంత తొందరగా, చిరకాలానుగతములయిన విశ్వాసాలను మానివెయ్యరు.

నిత్యజీవితంలో తన యిచ్ఛకు వ్యతిరిక్తములూ, శక్తికి అతీతములూ అయినవి యెందుకు జరుగుతాయో, ప్రయోగపరిశీలన నిర్ణయముల ద్వారా తెలుసుకోలేని మానవుడు- అందుకు కారణమేదో శక్తి అనీ, ఆ శక్తియొక్క యిచ్ఛావిశేషాలే సృష్టిలో ప్రతిదానికీ కారణమనీ—విశ్వసించాడు. విశ్వసించి యితరులచేత విశ్వసింపజేశాడు. ఆ శక్తి ప్రీతికీ, ఆ శక్తిని తెలుసుకుంటానికీ అనేక విధానాలూ, మార్గాలూ ఏర్పరచుకున్నాడు. ఆ శక్తిని సంభావించడంలో, ధ్యానంలోనో సూచనలోనో చిత్రించుకోడంలో అనేకులనేక విధాలవలంబించి, అనేకనిర్ణయాలకు వచ్చారు. అంటే భగవంతుడి ఉనికి మానవుడి అశక్తత మీద ఆధారపడివుంది. ప్రతిసంఘటనా నిర్వహించే శక్తి, ప్రతిసంఘటననూ తన యిచ్ఛాధీనంగా నడిపించే శక్తి మానవుడికి కలిగిననాడు- అతడు భగవంతుడౌతాడు. అన్నీ కాకపోయినా, యితరులకు సాధ్యంకాని కొన్నింటినయినా అతడు సాధించిననాడు భగవదంశాసంభూతుడవుతాడు.

మనుష్యశక్తికి అతీతమయిన ఆశక్తికీ మనకూ ఉన్న సంబంధం నిర్ణయించేది మతం. మనకూ, మనకంటె యితర్లకూ మధ్యవుండే సంబంధాలను నిర్ణయించేది ధర్మం. వాటిని నిర్ణయించినవారు మతప్రవక్తలు, మతాచార్యులు, మతవ్యాపకులు. వారిని విశ్వసించి అనుసరించినవారు మతస్థులు. వారి మధ్య భేదాలు మతభేదాలు.

అన్నింటిని తన యిచ్ఛాధీనంగా చేసుకోలేనన్నాళ్లు, తన యిష్టంవచ్చినట్లుగా జీవిత సంఘటనలను నడిపించలేనన్నాళ్లు, మానవుడు ఎదోమానవాతీత భగవంతుణ్ణి సంభావించి ప్రార్థించడమో, పూజించడమో చేస్తూనే వుంటాడు.

ఆప్తులకు రోగంవచ్చి, ఏ ఘనవైద్యులు వచ్చి మందిచ్చినా తిరగని పరిస్థితిలో ఏ వెంకటేశ్వరస్వామికో, క్రీస్తుకో మరెవరికో వారివారి మతవిశ్వాసాల ననుసరించి మొక్కకుండా వుండడం, సామాన్యమానవులకు సాధ్యంకాదు. బహుజనుల శక్తిసంపన్నమైనదన్నది శక్తిసంపన్నమైనదే అవుతుంది. ఈ దేవుడికి మొక్కితే యీ పని జరుగుతుంది అని బహుసంఖ్యాకులు విశ్వసిస్తే, ఆ దేవుడు చాలా ప్రచారంలోకి వస్తాడు. తమ రనుకున్న పనులు చేసిపెట్టిననాడు, ఆ దేవుడికి మొక్కుబడులు సాగుతాయి. అట్లాజరగనినాడు, ఆయనమీద భక్తిసన్నగిల్లడమో, భగవచ్ఛక్తికి కూడా అతీతమయినదేదో వున్నదని గ్రహించడమో జరుగుతుంది. దేవుళ్లూ డాక్టర్ల వంటివాళ్లు. రోగి బ్రతికితే డాక్టరు గొప్ప; లేకపోతే వాడి కర్మ. మొక్కిన పని జరిగితే, దేవుడి మాహాత్మ్యం; లేకపోతే మన

కర్మ. '[మొక్కిన వరమీని వేల్పు... గ్రక్కున విడువంగవలయు! గదరా సుమతీ!' అనే పద్యం కూడా వుంది.

యజ్ఞాది క్రతువులుచేసినా; తపస్సుచేసినా; పట్టుబట్టలూ, వజ్రాభరణాలూ, చాలా మోజుగా పెంచుకున్న జుట్టూ, యిల్లాంటివి సమర్పించినా పని జరగనిసాడు బుద్ధిమంతు డెవరో కర్మ సిద్ధాంతాన్ని సంభావించి వుంటాడు. అందరు కాంగ్రెస్ వాళ్ళూ జైలుకువెళ్తే కొందరే మంత్రులు కావడమేం? కొందరు కాకపోవడమేం? కొందరు అయి కూడా పదవీచ్యుతులు కావడమేం? జెయిలుకు వెళ్ళనివాళ్ళని జేరపీయని కాంగ్రెసు ప్రభుత్వంలో వీళ్ళందర్నీ జెయిల్లో పెట్టించినవాళ్లు అధికారం పొందడమేం? ఇవన్నీ తర్కంతో వివరించేవి కావు. వీటన్నింటికీ కారణం ఒకటే-'కర్మ.'

కర్మ అంటే అందరూ తమాషాగా వాడేది కాదు. మనోవాక్కాయాల్తో వ్యక్తులు చేసే ప్రతీదీ కర్మే. ప్రతివ్యక్తి కర్మకీ, మరోవ్యక్తి లేక మరి కొందరు వ్యక్తుల్లో ప్రతికర్మలు ప్రకోపిస్తవి. వీటికి ఫలితంగా మానవజీవితాల్లో సంఘటనలు సంభవిస్తవి. కాంగ్రెస్‌వారి జీవితంలో జైలుకు వెళ్ళడం ఒక జన్మ, మంత్రికావడం మరొక జన్మ, అది పోగొట్టుకోవడం మరొక జన్మ. మళ్ళీ జెయిలుకుపోవడం మరొకజన్మ, స్వరాజ్యం సంపాయించడం మరొకజన్మ అనుకుంటే—యీ జన్మాంతరాలన్నిటికీ, ఒకదాంతో ఒకదానికి సంబంధం వున్నదని తేల్తుందా లేదా? నలుగురు చేరి వొకణ్ణి పై కెక్కించడానికీ, ఆ నలుగురే మరొకసమయంలో క్రిందికి లాగడానికీ, మనో వాక్కాయాలతో వారుచేసిన కర్మల ప్రతికర్మల ఫలితమేనని ఎవరు కాదనగలరు? అల్లాగే జన్మాంతరాలూ అనుకుంటే—యీ జన్మలో కారణంలేని సంఘటనకు పూర్వజన్మలో కారణం వుండివుంటుందనీ, యీ జన్మలో చేసేకర్మకు యీ జన్మలోనో వచ్చే జన్మలోనో ప్రతికర్మ ఏర్పడుతుందనీ, అందుచేత ప్రతి కర్మ, దానికి ప్రతికర్మ యిట్లా ప్రాపంచిక కార్యకలాపం సాగిపోతూ వుంటుందనీ ఊహించడం సాధ్యం.

అంటే మానవజీవితాల్లో సుఖదుఃఖాలకు వారు యీ జన్మలోనో పూర్వజన్మలోనో చేసిన కర్మ కారణం. అల్లాగే ఈ సుఖదుఃఖాలకు భగవదిచ్ఛ కారణం. అంటే, మన కర్మే భగవదిచ్ఛ. మన కర్మలకు కర్తలం మనం గనక, భగవదిచ్ఛకు మనమే కర్తలం. అంటే మనమే భగవంతుడు, భగవంతుడే మనం. ఇదే శంకరాచార్యుడు జన్మంతా తర్కించి తెలుసుకున్నది. అంటే కర్మసిద్ధాంతాన్ని సరిగ్గా అర్థంచేసుకున్నవాడు, భగవంతుడితో నిమిత్తంలేనివా డవుతాడు. అంటే, నాస్తికు డౌతాడు. 'వాడే నే' నన్నవాడికి 'వాడి'తో నిమిత్తంలేదు. ఆమాట అంత ధైర్యంగా చెప్పగలిగింది ఒక్క శంకరాచార్యుడు. ఇంకెవరూ మతచరిత్రలో కనిపించరు.

ఇల్లా వాడే నేనని అనుకోను. వాడు వేరు, నేను వేరు. వాడిప్రక్కనో, పాదాలదగ్గిరో, వాడి వొళ్లోనో, రాజ్యంలోనో నే నుంటాను; అక్కణ్ణుంచే వచ్చాను, అక్కడికే పోతాను—అనుకునే వాళ్లంటే అనుకోనీండి. మునిగిపోయిందేమిటి?

పిండిచూస్తే యింక తేలికగా కనుపించే మతం పిండకముందు నానా గజిబిజిగానూ కనుపిస్తుంది. కేవలం భగవంతుడికీ మనకీ, తోడిమానవుడికీ మనకీ ఉండే సంబంధాన్ని నిర్ణయించేది మాత్రమే అయితే, మతంజోలికి పోయేవా డుండడు. పోవడం తప్పుకూడా. కాని ఆ భగవంతుణ్ణి చేరడానికి జుట్టు తీయించుకోడం అవసరమని కొందరు, ఆ పలు తెరమే చేయించుకోకుండా వుండడం అవసరమని మరికొందరూ, అవీ యివీ కాదు సగం జుట్టూ, సగం బోడీ అవసరమని మరికొందరూ విశ్వసించి, తది తరుల్ని నాశనంచేస్తేనేగాని ఈశ్వరసాయుజ్యం కలగదనే ధోరణిలోపడినా, ఇందులో ఎవరయినా అధికారంపొంది ఆ అధికారం నిలబెట్టుకుంటానికి యీ మూఢవిశ్వాసాన్ని అధికారరీత్యా వ్యాప్తిచేసి యితరులను అణగద్రొక్కినా, మతం మానవశ్రేయస్సుకు ఆటంకం కలిగిస్తుంది. ప్రజాశాంతికీ, క్షేమానికీ నాశనహేతు వౌతుంది. ఇంతేకాదు. "నా విష్ణుః పృథివీపతిః" లాంటి వాక్యాలు ప్రచారంలోకి తెచ్చి, "రాజు విష్ణువు అంశలో పుట్టినవాడు. అందుచేత ఆయన విషయంలో అపచారం విష్ణువుకు అపచారం అనీ, యిది మతసిద్ధాంతం అనీ ప్రజల్ని నమ్మించితే, ఆ రాజు ప్రజావిద్రోహిఐతే, అతన్ని తొలగించ

ప్రజాసేవ చేయడానికి మతవిశ్వాసం ఆటంకం అవుతుంది.

అంతేగాదు. మతాలకు ప్రామాణికగ్రంథం ఒకటే అయితే, అందులో వున్నది ఉంది - లేంది లేదు అని తేల్చెయ్యడానికి వీలుగా వుంటుంది. క్రైస్తవులకు బైబిలు, మహమ్మదీయులకు కురాను ఏకైక ప్రామాణిక గ్రంథాలు. హిందూమతానికి యిల్లాకాదు. అసలు "హిందూమతం, హిందూ మతం" అని అరిచేవాళ్ళని 'ఏమిటరా యీ గోల' అంటే మే యిద్దరూ ఒక జవాబు చెప్పరు. మత గ్రంథాలు మూడు రకాలై, ఒక రకం భగవంతుడు సగుణుడూ — నామరూపభార్యాబంధుమిత్రశత్రు సమేతుడనీ, మరొకరకం నిర్గుణుడూ-నామరూపాది విరహితుడూ, ద్వంద్వాతీతుడూ, కర్మస్వరూపు డనీ బోధిస్తుంటే, దేనిని నమ్మడం? ఈ గందర గోళంలో ఆ నిర్గుణబ్రహ్మమును బోధించే పుస్త కాలు మేము తప్ప యితరులు ముట్టుకో కూడదని బ్రాహ్మణులు శాసిస్తే చేసేదేమిటి? న్యూటన్ పండితుడి సూత్రాలు విశ్వసించే విజ్ఞానవేత్త కర్మ సిద్ధాంతంతో యేకీభవించి తీరాలి. ఈ ప్రపంచం లో జరిగే ప్రతిసంఘటనా కర్మసంజనితమయింది. ఒక సంఘాన్ని మార్చి మరొకసంఘాన్ని సృష్టిం చినా,ఒక అధికారిని తీసుకొచ్చినా—అది వ్యక్తుల సాముదాయిక కర్మకు ప్రతికర్మగానే సాధ్యమవు తున్నది.

మత మెందుకు పుట్టిందో అందుకు మతాన్ని వినియోగించినవాడు, మతం మానవుడి ప్రగతికి అడ్డంరాదు. కేవలం సత్యాన్వేషణకే వినియోగింప బడ్డవాడు మతానికీ మతానికీ వైరుధ్యం రావడా నికి అవకాశంలేదు.

నాలుగవఫారంలో కాంతికిరణం నిడుపురేఖ లలో ప్రసరిస్తుందని సైన్సు మేష్టరు చెబుతాడు. కాలేజీకి వచ్చేసరికి అదే తరంగరేఖలుగా ప్రసరి స్తుందని ప్రొఫెసరు చెప్తాడు. ఉభయులూ వారి వారి వాదనలను ప్రయోగరీత్యా నిరూపిస్తారు. పౌరాణికాత్మకమయిన హిందూమతానికీ, ఉపనిష త్ప్రధానమయిన హిందూమతానికీ యీ భేదమే వుంది.

సంఘవ్యవస్థ మార్చడానికి ప్రజల సాము దాయిక కర్మతో కూడిన ఉద్యమం అవసరమయితే, ప్రపంచంలో ప్రతీదీ కర్మవల్లనే సాధ్యం అని బోధించే కర్మసిద్ధాంతప్రచారం చాలా అవసరం. ఆ విశ్వాసం మానవుల్ని స్తబ్ధుల్ని చేస్తుందా, కర్మని ప్రతికర్మతో ధిక్కరించి సాధించే మార్కండే యుల్ని చేస్తుందా అంటే—అది ఆ సిద్ధాంతాన్ని అర్థం చేసుకునే విధానంమీద ఆధారపడుతుంది. ఒకమాటు భగవంతుడు కర్మస్వరూపుడనీ, అన్నిం టికీ కారణం కర్మేననీ, సర్వవ్యాప్తమయిన ఆత్మ శక్తి ఒకటేననీ ప్రజాబాహుళ్యం విశ్వసించిన నాడు, కులమత వర్గవిభేదాలకు తావుండదు. ప్రతివాడూ కార్యశూరుడై, తన బాగుకు తానే పుప్రక్రమిస్తాడు.

భారతీయుల మనఃప్రవృత్తికి మతం మూలా ధారం. స్వచ్ఛస్థితిలో వారి మతవిశ్వాసాలు సర్వ మానవసమత్వానికీ.దానిని సాధించే సంఘస్వామ్యా నికీ దారితీసేవి. మతమే పనికిరాదని ప్రజావిశ్వాస ప్రవాహానికి ఎదురీదడం కంటే, తమ ఉద్యమానికి అనుగుణమయిన పద్ధతిలో వారికి విశ్వాసాలను ప్రచార చెయ్యడం చాలా సులభమూ, శక్తి వంతమూ అయిన పద్ధతి.

---

గాంధీమత మనేది ఎక్కడా లేదు. నా అనంతరం అటువంటి మతస్థులు ఉండవలెననికూడా నేను కోరను. నేనొక క్రొత్త సిద్ధాం తాన్నో, మతాన్నో స్వయంగా సృష్టించినట్లుగా చెప్పుకోవడంలేదు. మన నిత్యజీవితంలోని సమస్యలకు శాశ్వత సత్యములను అను వర్తింప చేయడానికి మాత్రమే నేను ప్రయత్నించాను. ..—గాంధీజీ.



# నారీ జగత్తు

## అమెరికా మహిళ

ఆధునిక అమెరికా స్త్రీలలో విశిష్టంగా గోచరించే ప్రధానలక్షణం వారి స్వాతంత్ర్యం. ఎలిమెంటరీ స్కూళ్లలో, ఉన్నత పాఠశాలల్లో, తోడి పురుషులతో పాటే చదువుకుంటారు. తాము కోరుకున్న కాలేజీ విద్య అభ్యసించడానికి అన్ని సదుపాయాలూ ఉన్నాయి. ఆటపాటల్లో ఏ తేడాలూ లేకుండా పాల్గొంటారు; ఉద్యోగాలు చేస్తారు; శాసనసభల్లో సభ్యురాళ్ళుగా చేరుతారు. వివిధ వృత్తుల్లో ప్రవేశిస్తారు; కంట్రాక్టులు మొదలైనవి తీసుకు వర్తకం చేస్తారు; పురుషులతో సమానంగా ఓటు చేసి, పదవులకి పోటీ చేస్తారు.

అంతమాత్రాన స్త్రీలకి అమెరికాదేశం భూతల స్వర్గం అని కాదు. అక్కడకూడా ఎక్కడిలాగే చట్టం కంటె ఆచారమే వెనకపడి ఉంది. అన్నిచోట్లా స్త్రీ పురుషులకి సమస్యలనేవి లేకుండా ఉండవు. అలాగే, వాళ్ళకి ఉండవలసిన సమస్యలు, బరువులు, బాధలు, హృదయవేదనలు—అమెరికా స్త్రీలకీ ఉన్నాయి. అయితే ఒకటి మాత్రం గుర్తించాలి: అమెరికా సంయుక్తరాష్ట్రాలు ఒక ప్రత్యేకజాతిగా ఏర్పడి 175 సంవత్సరాలు పూర్తికాకముందే, అమెరికామహిళలు అనల్పమైన వ్యక్తిస్వాతంత్ర్యం అందుకోగల్గి, సమాజ జీవనంలో బాధ్యతాయుతస్థానం పొందారు. సంఘాన్ని అభ్యుదయ మార్గాన నడిపించడానికి ఎందరో స్త్రీ పురుషులు చేసిన కృషి, సంఘక్షేమం కోసం, వారి శ్రేయస్సుకోసం కూడా స్త్రీకి సంపూర్ణ స్వాతంత్ర్యం ఉండడం అవసరమని సమాజం గుర్తించడం—వీటిని పురస్కరించుకునే నేటి అమెరికా స్త్రీ యింతటి ఉన్నత స్థితికి రాగల్గింది.

అమెరికాదేశపు ఓటర్ల పట్టికలో నేడు సగానికి పైగా స్త్రీలున్నారు. ప్రజాస్వామికపు ఓట్ల ద్వారా ఎన్నుకునే ఏ ప్రభుత్వపదవికైనా పోటీ చేసేందుకు స్త్రీలకీ కూడా హక్కుంది. ఆచారంలో మాత్రం హక్కు ఉన్నంతమేరకు స్త్రీలు పాల్గొనడం లేదు. అయినా జాతీయ కాంగ్రెస్‌లో యాభైమంది స్త్రీలకి సభ్యత్వం ఉంది: ఇద్దరు మహిళలు రాష్ట్రగవర్నర్ పదవులు నిర్వహించారు.

బాల్యంలో అమెరికా బాలికలకి మగపిల్లలతో సమానమైన స్వేచ్ఛ ఉంది. స్కూలు తరగతుల్లో పాఠాలు. నేర్చుకునే విషయాలు - అన్నీ ఒకటే. ఇక ఆటపాటల విషయమూ, యీత, మంచుమీద జారడం, టెన్నిస్, పడవలు నడపడం, బేస్‌బాల్, గోల్ఫ్, ఎక్స్కర్షన్లు, వనభోజనాలు, వీటన్నిటిలోనూ ఆడపిల్లలు మగవాళ్ళతో కలిసి మెలిసి పాల్గొంటారు. బాలబాలికలు, యువతీయువకులు, అంతా ఉమ్మడిగా సంగీతం నేర్చుకుంటారు: స్కూలు బ్యాండులలో, ఆర్కెస్ట్రాల్లో స్త్రీలకు కూడా స్థానం ఉంది.

హైస్కూలు విద్య ముగించిన తరవాత, అమెరికన్ యువతి స్త్రీ పురుషులకి సమానంగా ప్రవేశం యిచ్చే కాలేజీకిగాని, యూనివర్సిటీకిగాని వెళుతుంది. స్త్రీలకి ప్రవేశం యివ్వని వైద్యకళాశాలలు, లా కాలేజీలు, ఇప్పటికీ కొన్ని ఉన్నాయి. అయితే, ప్రత్యేకం స్త్రీలకోసమే నడిచే చక్కని కాలేజీలు కూడా లేకపోలేదు. కావలిస్తే అమెరికా యువతి. ఉపాధ్యాయత్వం, కెమిస్ట్రీ, బయాలజీ, ఇంజనీరింగ్. ఫిజిక్స్, సంగీతం, ఎకౌంటింగ్—ఏదైనా చదువుకోవచ్చు. వీటిలో అమోఘమైన ప్రావీణ్యం సంపాదించిన స్త్రీ లెందరో ఉన్నారు. ప్రతి సంవత్సరం వీరి సంఖ్య అధికం అవుతోంది.

ఆటల్లో పురుషులతో సమానంగా అమెరికా మహిళ పోటీచేస్తుంది. వివిధ రకాల ఆటల్లో స్త్రీలు ప్రదర్శించే సామర్థ్యం అందరి మన్ననకి పాత్రమైంది. కనీసం యిరవై అయిదు రకాల ఆటల్లో ప్రతి సంవత్సరం పోటీలు జరుగుతాయి: సైకిలు తొక్కడం, కత్తిసాము, మంచుమీద జారడం, యీత, కసరత్తు, పడవ నడపడం.

అన్నిటిలోనూ స్త్రీలు పాల్గొంటారు. ఇంగ్లండ్ ఇంగ్లీషు ఛానల్ అడ్డంగా యీదడంలో గెలుపొందిన మొట్టమొదటి స్త్రీ అమెరికా దేశస్థురాలు. ఆమె పేరు గెర్ట్రూడ్ ఎడెర్లే. అమెరికా పశ్చిమ ప్రాంతాల్లో పురుషులతోపాటు స్త్రీలుకూడా గుర్రాలెక్కి ఆవుల మందలకి కాపాలా ఉంటారు. మైళ్ల కొలదీ గుర్రపు స్వారీ చెయ్యగలిగిన నేర్పు ఉంటేగాని ఆ పని నిర్వహించడం కష్టం.

అమెరికన్ స్త్రీలలో విశేషభాగం మోటారు కార్లు నడపడం నేర్చుకుంటారు. సాధారణంగా పదహారోయేడు వచ్చేసరికి అందులో ప్రావీణ్యాన్ని సంపాదించి, లైసెన్సు కూడా తీసుకుంటారు. హైస్కూళ్ళలో తక్కిన విషయాలతోపాటు మోటారు నడపడం సహితం నేర్పబడుతుంది.

చదువు పూర్తయాక, సాధారణంగా ఇక్కడి యువతి ఏదో ధనార్జనవృత్తిలో ప్రవేశిస్తుంది. తల్లిదండ్రులు కొంత కలవారై, కుమార్తెను పోషించగలిగినప్పటికీ, యువతులు నిర్వ్యాపారతలో పడిపోరు. నిర్వ్యాపారత ఒక్క కాపురుషలక్షణమే కాదనీ, స్త్రీలకికూడా వర్తిస్తుందనీ, వాళ్లు ఏనాడో గ్రహించారు. చదువు ముగియగానే ఏ అమెరికన్ యువతీ సాధారణంగా వెంటనే పెళ్ళి చేసుకొని కాపురానికి వెళ్ళిపోదు. ఆమె జీవనప్రణాళికలో ఉద్యోగంకూడా నిర్వహించవలసిన ఒక ధర్మం.

వివాహకాలానికి అమెరికా యువతికి కనీసం ఇరవై ఒకటి, యిరవై రెండు సంవత్సరాల వయసైనా ఉంటుంది. భార్యకన్న భర్త వయస్సు సరాసరిని మూడేళ్ళు ఎక్కువుంటుంది. అమెరికన్ స్త్రీకి దామాషాని ముగ్గురుకంటె ఎక్కువ పిల్లలుండరు. అయినా, ఆమెకు 26 సంవత్సరాలు లకు నిండేసరికే ఆ లెక్కని, మామూలుగా ఆఖరు కొడుక్కుగాని కూతురికిగాని పద్ధెనిదేళ్ళు వచ్చే



సామాన్య అమెరికాగృహిణి వంటయింట్లో ఆధునికసౌకర్యాలన్నీ అమర్చిఉంటాయి.

వరికి తల్లికి 45 ఏళ్ళు ఉంటాయి. వాళ్ళందరికీ పెళ్ళిళ్ళయేసరికి యింకో అయిదారేళ్ళు పడుతుంది. అప్పుడు మళ్ళీ యింట్లో ఒక్క భార్యాభర్తలే మిగులుతారు.

ఇరవైయేళ్ళకి పైగా ఉన్న అమెరికన్ స్త్రీలని తీసుకుంటే, అందులో నూటికి డెబ్భైమంది వివాహమై కాపురం చేస్తున్నవాళ్ళుంటారు. పదహారు మంది వైధవ్యం పొందినవాళ్ళుంటారు, తక్కిన పద్నాలుగురూ అవివాహితలుగానే ఉండిపోతారు.

చాలామంది అమెరికన్ స్త్రీలు ఒకపక్క సంసారం దిద్దుతుంటూనే, యింకోపక్క ఉద్యోగాలు చేస్తారు. అనేకుల కది తప్పని సరిగా నెత్తిన పడుతుంది. భర్తలను కోల్పోయినవాళ్ళు, విడాకులు పొందినవాళ్ళు, తమ పిల్లల్ని పోషించుకోవాలి. లేదా భర్త ఉన్నప్పటికీ, పిల్లల కాలేజీ చదువులకోసమో, స్వంత యిల్లొకటి ఏర్పరచుకుందుకో—అనేక కారణాలకోసం ఉద్యోగం చెయ్యవలసి వస్తుంది.

విశేష భాగం అమెరికా స్త్రీలు పల్లెపట్టుల్నే జీవిస్తూవచ్చారు. కాని, క్రమంగా దేశ పరిశ్రమలు అభివృద్ధి అయినకొద్దీ, జనాభా గ్రామసీమల్ని వదలి పట్టణాలు చేరుకుంటున్నారు. నేడు నూటికి అరవైమంది పైగా స్త్రీలు పట్టణ జీవితమే గడుపుతున్నారు.

ఏమంత ఎక్కువ కాకుండా సాధారణమైన ఆదాయంతో పట్టణంలో సంసారం నిర్వహించే అమెరికన్ గృహిణికి, తన యింటి భాగంలో ప్రత్యేకంగా స్నానాలగది, ఎలక్ట్రిసిటీ, టెలిఫోన్, రేడియో, ఎలక్ట్రిసిటీ పొయ్యిలు—యీ సదుపాయాలన్నీ ఉంటాయి. పల్లెటూళ్లలో పొలాలమధ్య నివసించేవారికి సైతం యీ సదుపాయాలు అందుబాటులో ఉంటాయి. అమెరికా కేంద్ర ప్రభుత్వం వారు అమలు జరుపుతున్న ప్రణాళికలు, కొన్ని ప్రయివేటు కంపెనీల కృషి—వీటివల్ల మూలమూలలా ఆ దేశంలో ఎలక్ట్రిసిటీ లభిస్తోంది.

అమెరికన్ గృహిణికి సాధారణంగా గృహకృత్యాల్లో తోడ్పడేందుకు పనిమనుషు లుండరు. ఇంట్లో పనిపాటలు తనే చేసుకుంటుంది. అయితే, అనేక రకాల యంత్ర పరికరాలవల్ల అనుకున్నంత శారీరక శ్రమ ఉండదు. బట్టలు ఇస్త్రీ చేయటానికి, రొట్టెలు ముక్కలుగా కొయ్యడానికి, చెంబులూ



పిల్లల్ని వాహ్యాళికి తీసుకు వెడుతున్న అమెరికన్ ఇల్లాలు.

గిన్నెలూ తోమడానికి, రొట్టెలపిండి కలపడానికి అన్నిటికీ ఎలక్ట్రిక్ యంత్రాలున్నాయి. ఇల్లు తుడవడానికి సైతం ఎలక్ట్రిక్ చీపుళ్లున్నాయి.

ఉద్యోగాలుచేసే అమెరికన్ స్త్రీల సంఖ్య క్రమంగా అభివృద్ధి చెందుతోంది. అక్కడి కార్మికుల్లో నూటికి ఇరవై తొమ్మండుగురు స్త్రీలు; ముఖ్యంగా ఫ్యాక్టరీల్లో స్త్రీల సంఖ్య దినదినాభివృద్ధి చెందుతోంది: పొగాకు, కుట్టిపెట్టిన వస్తువులు, బట్టలు, తోళ్లు, ఎలక్ట్రిక్ సామానులు, రబ్బరు, కాగితం—యీ ఫ్యాక్టరీ లన్నిటిలోనూ స్త్రీలు బహుళంగా పాల్గొంటున్నారు. ముద్రణాలయాలు, పుస్తక ప్రచురణ కంపెనీలు—వీటిలో నాల్గోవంతు పనివాళ్లు స్త్రీలే.

అమెరికా కేంద్రప్రభుత్వపు ఉద్యోగాల్లో నాలుగోవంతు స్త్రీలే నిర్వహిస్తున్నారు. అంటే నాలుగులక్షలకి పైగా ఉద్యోగాలు స్త్రీలవే నన్నమాట. పత్రికా కార్యాలయాల్లో, సంపాదకులూ, విలేఖరులూ—మొత్తంలో నాలుగోవంతు స్త్రీలు. రేడియో, బ్రాడ్ కాస్టింగ్ శాఖల్లో పదిహేను వందలమంది స్త్రీలు ఉద్యోగాలు చేస్తున్నారు.

స్వంతవిమానాలుండి, అవి స్వయంగా తామే నడిపే అమెరికన్ స్త్రీలు నేడు దనేకు లున్నారు. వారిలో కొందరికి విమానం నడపడంలో ప్రత్యేక బహుమతులు వచ్చాయి. 1946వ సంవత్సరంలో నాలుగువేలకి పైగా స్త్రీలు ప్రైవేట్ లైసెన్సు పొందారు.

మొన్నటి ప్రపంచ యుద్ధంలో అమెరికన్ స్త్రీలు చాలా ప్రముఖ బాధ్యత నిర్వహించారు. మూడులక్షలకి పైగా యుద్ధరంగంలోకి వెళ్లారు; ఇంకా అనేకులు డాక్టర్లు, నర్సులు, ఇంజనీర్లు,— అనేక రంగాల్లో పనిచేశారు. మూలనున్న ముసలమ్మలు. పసిమిబుగ్గల బాలప్రాయులు, అంతా నడుంబిగించి ముందుకు దూకారు. పొలాలుపట్టుకు పోలాలు దున్నారు. రైళ్లు, బస్లు, ఓడలు, మోటార్లు—అన్నీ నడిపారు.

ఏదో ఒక సంస్థకో, మండలికో, చెందని అమెరికన్ స్త్రీలు నేడు చాలా అరుదు. సమైక్యత వల్ల సాధించవలసినవి ఎన్ని ఉన్నవో మొట్ట మొదట చర్చిల కార్యకలాపాల్లో పాల్గొనడంవల్ల నేర్చుకుని, తరవాత సంఘసేవకోసం అనేక సమాజాలు నిర్మించారు. ఈనాడు అమెరికా మహిళలకి కులాసాగా కాలంగడపడానికీ, వినోదానికీ, అనేక క్లబ్బులూ. మహిళామండలులూ ఉన్నాయి— కాని అక్కడితో వాళ్లు తృప్తిపడి ఊరుకోలేదు. రాజకీయరంగంలో, బాధ్యతాయుతమైన సంఘ జీవనంలో నిరంతరాభ్యుదయం సాధించడంకోసం అనేక సంస్థలు నెలకొల్పి తీవ్రంగా కృషి చేస్తున్నారు. వివిధవృత్తుల్లో, వాణిజ్యాలలో ఉన్న స్త్రీలు ప్రత్యేక సంఘాలు నిర్మించుకున్నారు. ప్రపంచం అంతటికీ సంబంధించిన సమస్యలు గురించీ, రాజకీయాల గురించీ, చర్చలూ, పరిశోధనలూ సాగిస్తున్నారు.

అమెరికా కేంద్రప్రభుత్వం మహిళాభ్యుదయం పట్ల ఎంతో శ్రద్ధవహిస్తుంది. ప్రభుత్వ కార్మిక పరిపాలన శాఖలో స్త్రీలకి ప్రత్యేకంగా ఒక అంతశ్శాఖ ఉంది. వృత్తివ్యాపకాలూ, ఉద్యోగాలూ చేసే స్త్రీలకి ఏయే సదుపాయాలు కావాలి, వారి ఆదాయం ఎలా ఉంది—యీ విషయాలు ఆ శాఖ పరిశీలిస్తుంది.

గల్పిక

# 'ఎలాగంటూ, ఈ మనిషితో'

చోడవరపు బాబూరావు

'ఇదుగో వస్తానని వెళ్ళినవారు ఇప్పటికీ రావటం? అప్పుడే పదకొండు గంటలయింది గదా, ఇంకా ఎప్పుడు పొయ్యిమీద ఎసరెయ్యటం? ఏవీ, బజారుకెళ్ళి ఏమేం కూరలు తెచ్చారో చూపించండి! అవేనా తెచ్చినవి? అవేం వంకాయలు. వాటి మొహంమే చెప్తోంది, సగానికి సగం పుచ్చు వంకాయలని. ఉన్నవాట్లోకల్లా చవకవి ఏరి తీసుకొస్తారు. అందులో సగానికి సగం పనికిరాక పారెయ్యవలసినవే నాయె, ఏం లాభం నా మొహం! ఆ మాటంటే, నీకేం మహరాజులాగా చెప్తావు, ముప్పై రూపాయలు తెచ్చుకునేవాడికి అసెంబ్లీ మెంబరు భోజనం కావాలంటే యెక్కణ్ణించి వస్తుందే పిచ్చిదానా-అంటారు. ఆ పుచ్చువేరి అవతలపారేసి త్వరగా పొయ్యి రాజెయ్యండి. నేను స్నానంజేసి ఇవతల కొచ్చేవరకూ ఈ మూడురోజులూ కాస్త ఆసరాగా వుంటారుగదా, ఆ పిల్లల్ని బళ్ళోకి పంపించట మెందుకూ అంటే విన్నారుగాదు. చదువుకునే పిల్లల్ని ఇంట్లో కూర్చోబెట్టట మెందుకంటారు. తమరు ఇంతా చదివి ఏదో పెద్ద వెలగబెడుతున్నట్లు! డిగ్రీ సర్టిఫికెట్లు చక్కగా పటాలు కట్టించి గోడకి తగిలించారుగాని తింటానికి మెతుకుండను! ఆ పటాలయినా యెట్లా కట్టించారు? కొత్తఫ్రేము కొనటానికి పైసాలేక వద్దంటున్నకొద్దీ ఆ భద్రాచల రాములవారి పటం కాస్తా వూడదీసి కట్టించారు!

'చూడండి, కళ్ళూ ఒళ్ళూ ఎట్లా పీక్కుపోయాయో! అదేమిటో అర్థరాత్రివరకూ ఏమిటో చదవటం, రాయటంతోనే సరిపోతుంది. పగలల్లా ఆఫీసులో పని చేసింది చాలక రాత్రిళ్లుకూడా ఆ ఆముదం దీపం ముందర అంతసేపు రాయట మేమిటమ్మా మరీనూ! అసలే కాస్త కిరసనాయిలువస్తుంది. ఆ కాస్తా హరించిపోయేదాకా రాశారు. ఇప్పుడు ఆముదం దీపంతో రాస్తున్నారు. పైగా ఆముదందీపం కళ్ళకి చాలా మంచిదని ఈమధ్య యెవరో రాజకీయ వినాయకులు వుపన్యసిస్తూ అన్నారని కూడా చెప్పారాయెను. ఇహ నే నేండేసేది? కడుపునిండా తిండీ, కంటినిండా నిద్దరా లేకపోయింతర్వాత ఇహ యెట్లాగంటూ యీమనిషితో.

'మొన్న ఆ ఎమ్. ఎల్. ఏ. గారి మరదలు పినతండ్రి మేనకోడలు చక్కగా బంగారపు గడియారంగొలుసు వేసుకుని పేరంటానికి కెడుతుంటే చూడ ముచ్చటవేసింది. పోని నాకేమీ అక్కర్లేదు- నేనిట్లా మోడులాగానే వుంటాను. పసివాడికి ఒక్క వెండిపుగ్గనైనా చేయిద్దామనుకుంటాను. అమ్మో, రాత! కోరికలు గుర్రాలెక్కమంటే, కర్మ గాడిదల్ని తోలమందిట!— ఉగ్గగిన్నె వద్దు, యేమీవద్దు - జరుపడిలేచిన పిల్లాడు గదా, కాస్త హార్లిక్సు సీసా తీసుకురమ్మంటే తీసుకొచ్చారు గనకనా? ఇదుగిదుగో ఇంక్రిమెంటు వస్తోంది, వచ్చేనెలలో తెస్తాలే అన్నారు. ఆరో వాడు పుట్టినప్పుడామాటే అన్నారు, వాడితరవాత దానికీ ఆమాటే అన్నారు, ఆతరువాత వాడికీ ఆమాటే అన్నారు, ఇప్పుడు దీనికీ అదే చెప్తున్నారు! వాళ్ళకర్మాన సత్యానికి బతుకుతున్నారే గాని ఏం ఆహారముండి బతుకున్నారు?

'పెద్ద పిల్ల పెద్దదై రెండేళ్లు కావచ్చింది గదా, దాని పెళ్ళిమాటేమన్నా తలపెడతారా. నేను నోరు చేసుకోవటమేగాని నామాట చెవిని పెడితేగద! 'ఇంకో ఏడాది ఆగవే. అప్పటికి కాస్త వెనక వేసుకోవచ్చు-అంటారు. ఏమిటి వెనకవేసుకునేది? నెలనెలా వెనకవేసుకుంటూనే వున్నారు అప్పులు! బోలెడు కట్నంపోసి ఇప్పుడు పెళ్లి కూడ చేసేనంటారు! చెయ్యకుండా అట్లాగే వుంచుతారా. మీకు ఇంక్రిమెంటొచ్చేదాకా?

స్వరాజ్యంరానీతే, పెద్దపిల్ల పెళ్ళి వైభవంగా చేస్తాను—అన్నారు. స్వరాజ్యం, స్వరాజ్యం అని చంకలు కొట్టుకున్నారు. అప్పుచేసి టీపార్టీ కూడా చేశారారోజున! ఇంతవరకూ పెళ్ళీలేదు నా మొహమూ లేదు! రెండోది కూడా పెళ్ళి కెదిగి కూర్చుంది!

కాస్త వినుకుపడిందంటే చాలు ఇల్లంతా వరదలే నాయెను! కాస్త కప్పుమీద పెంకు తిరగ వేయించండని ఎన్నాళ్ళనించో మొత్తుకుంటుంటే విన్నారూ? అదేకి—ఆ హైదరాబాదు సంగతి తేల నీవే, అప్పుడు ప్రభుత్వం మన కోరికలన్నీ తీరుస్తుంది, అప్పుడు ఇంటికప్పు తిరిగివేయిద్దామన్నారు. హైదరాబాదు యుద్ధమై అన్నాళ్ళయింది, ఇంతవరకూ అతీ గతీ లేదు తిరగనేయించటం సంగతి! అన్నింటికీ అన్నిసాకులూ చెపుతారాయె! మట్టిగోడల్నిండా ఎలుకకన్నాలే! అవి మెత్తించమంటే, కాశ్మీరు యుద్ధం పూర్తిగానీ మన్నారు! ఇహ యెట్లాగంటా, యీ మనిషితో!

'ఆ, ఆ, ఆగండాగండి! ఆగుడ్డల్తో పూరగాయ జాడీ కాస్తా ముట్టుకుని మైలపడేస్తారా యేమిటి? రెండేళ్ళనాటి పూరగాయ, కొద్దిగా మిగిలింది. ఆ కాస్తా మైలబడేస్తే యిహ తిన్నట్టే! మళ్ళీ ఈ యేడు పూరగాయి సంగతెత్తితే, ఇంక్రిమెంటు రానీ అంటారు. మొన్న రాకరాక మాతమ్ముడూ మరదలూ వస్తే వున్న కొన్నాళ్లూ రెండేళ్లనాటి ఆవకాయ ముక్కేసి అన్నం పెట్టటానికి చచ్చిపోయినంత సిగ్గేసింది. పాపం మన స్థితిగతులు గ్రహించినవాళ్లు గనక, అదే సరిపెట్టుకుని యేమీ అనుకోకుండా వెళ్లారు. ఆ మాటంటే పుట్టింటివాళ్ళని వెనకవేసుకొచ్చి పోట్లాడావంటారు. ఆ విస్తట్లో కాస్త అన్నంపెట్టి ఆ పూరగాయముక్క మడితోనే తీసివేసి ఇట్లా నాముందర పడెయ్యండి. నాకు నెయ్యక్కర్లేదు. గూట్లో నేతిగిన్నెలో కొద్దిగా నెయ్యివుంది. అది మీరూ పిల్లలూ వేసుకోండి, ఈపూట కొస్తుంది. నాకుపెట్టి మీరు కూడా పెట్టుకుని అన్నంగిన్నెమీద మూతవేసి మరీ వెళ్ళండి.

'అదుగో, సమయానికి లేచాడు వుయ్యాల్లో వాడు! ఆకలితో ఏం నిద్ర పట్టేడుస్తుంది వాడికి మాత్రం! మడిబట్ట విడిచి వాణ్ణి నాదగ్గర పడుకోబెట్టి మళ్ళీ మడి గట్టుకోండి.....దూరంగా, దూరంగా! అట్లా తాకుతారేం, మతిలేదా యేమిటి, యెన్నేళ్ళొచ్చినా...! పిల్లాణ్ణెత్తుకోటం చాతగాదు! ఆ విస్తర రక్కడపెట్టి ఇహ మీపని చూసుకోండి.

'అనుకున్నంతా అయింది, నలభీమ పాకం! ఇది అన్నమో బియ్యమో తెలియటంలేదు! కూరంతా వుప్పుమయం, పులుసేమో గొడ్డుకారం! అందులో వెయ్యవలసిన కారం ఇందులోనూ, ఇందులో వుప్పు అందులోనూ వేశారు గావును! ఇహ తినండి యేం తింటారో! గాంధీగారు మేక పాలు తాగి వుండేవారని మీరేగా చెప్పారు. ఇహనేం మీరుకూడా ఆపనే చెయ్యండి సరిపోతుంది! ఇవాళిటికి వుపోషం! బియ్యంకూడా నిండుకున్నట్టున్నై. అట్లా తెల్లబోయి గుడ్లు వెళ్ళబెట్టి చూస్తారేం? బళ్ళోంచి పిల్లలు ఆకలి అంటూ వస్తే యేం సమాధానం చెపుతారో చెప్పండి! కాశ్మీరులో ప్లెబిసైటు పూర్తయేదాకా ఆగమంటారు గావును!'



ప్రఖ్యాత సినిమా నటీమణికి జబ్బు చేసింది. చోటు మార్చడం, కార్యక్రమంలో కొంత మార్పూ అవసరమని డాక్టరు సలహా యిచ్చాడు. ఆమె యిలా అంది: 'మార్పా! మీకు తెలుసా, గత ఎనిమిది మాసాల్లో నేను నాలుగుసార్లు వివాహం చేసుకున్నాను; అయిదు కార్లు మార్చాను; రెండుసార్లు ఇంట్లో దొంగలు పడ్డారు; మూడు సినిమాల్లో నటించాను—ఇంకా ఏం మార్పు కావాలి?'

# జనవాక్యం

సంపాదకునికి ప్రకటనార్థం పంపించిన లేఖలు యీ శీర్షిక క్రింద ప్రచురితమవుతాయి. లేఖలు క్లుప్తంగా, కాగితానికి ఒక పక్క వ్రాసి పంపాలి.

---

## సమ్మెల సత్వర సమాప్తికి-

పెట్టుబడిదారులు, కార్మికులు కీచులాడుకొని కార్మికులు సమ్మెలు చేయడంతో ఉత్పత్తికి అడ్డు తగులుతూంది. కఠినమైన ఈగడ్డు రోజుల్లో దాని వలన ప్రజలు మరింత కష్టనష్టములకు గురి అవవలసి వస్తోంది.

అందువలన ఏ పారిశ్రామిక వ్యవస్థలోనైనా కార్మికులు సమ్మెకట్టినప్పుడు ఆ వ్యవస్థను (అమెరికాలోవలె) ప్రభుత్వం స్వాధీనం చేసుకొని, ప్రభుత్వముచే నియోగింపబడిన కార్మికులతో వుత్పత్తికి అంతరాయం లేకుండా దానిని నడపాలి. అంతే కాక ప్రభుత్వ యాజమాన్యములో ఉన్న కాలములో ఆ పరిశ్రమలోనున్న పూర్వపు కార్మికులను, మేనేజింగ్ డైరక్టర్లకు తదితరులకు జీతాలు ఇవ్వకూడదు; షేర్‌హోల్డర్సుకుకూడా ఆ కాలంలో డివిడెండ్సు యివ్వకూడదు.

పైని సూచించిన విధంగా చెయ్యడంవలన ప్రజలు యిబ్బందిపడవలసిన అవసరం వుండదు. పైపెచ్చు ఇరుకక్షులవారు చాలా తక్కువ కాలంలోనే సమాధానానికి వస్తారు. ఈ విధానాన్ని అవలంబించే పక్షంలో ప్రభుత్వం' ఇప్పుడు ఆలోచిస్తున్న బిల్లు (నియమిత పరిస్థితులయందు సమ్మెలు చట్టవిరుద్ధములని ప్రకటించే) ప్రవేశపెట్టే అవసరమే వుండదు.

కాకుమాను వెంకటేశ్వరరావు
మచిలీపట్టణం

## పజిల్స్—ప్రభుత్వ కర్తవ్యం

ప్రస్తుతం ఏ దిన, వార, పక్ష, మాసపత్రికలు చూచినా 'గెల్వండి 26 వేలు, గెల్వండి 35 వేలు, గెల్వండి 70 వేలు' అని పెద్దపెద్ద అక్షరాలలో చదరపుగళ్ళ అంకెల, అసంపూర్తి మాటల, పజిల్స్ తప్పకుండా ప్రత్యక్షమౌతాయి. ప్రభుత్వం వాటి అనుమతి ఉన్నట్లుకూడా ప్రకటిస్తారు. పజిల్స్‌కు రూపాయి మొదలు కొన్నివందల రూపాయల వరకు రుసుము కట్టవలసి ఉంటుంది.

వీటిద్వారా అనేకమంది తమ విలువైన సొమ్మును, కాలాన్ని పాడుచేసుకొంటూన్నారు. అమాయకులైన ప్రజలను, ముఖ్యంగా యువకులను పజిల్స్ యొక్క మానేజర్లు మోసపుచ్చుతున్నారు.

'నేటియువకులే రేపటి భావిపౌరులు' అంటూ అనేక బహిరంగ సభలలో ఉపన్యాసములిస్తూండే ప్రభుత్వపు మంత్రివర్గంవారు ఈలాంటి పజిల్స్‌కు అనుమతి యివ్వడంద్వారా 'నేటి యువకులను రేపటి ఫకీర్లుగాను, సన్యాసులుగాను, జూదర్లుగాను' తయారుచేసిన వారౌతున్నారు. కనుక యిప్పటినుంచి అయినా ప్రభుత్వంవారు ప్రజలను, యువకులను మోసపుచ్చే పజిల్స్‌ను నిషేధించటం ముఖ్య కర్తవ్యం.

జోశ్యుల వెంకట లక్ష్మీనరసింహారావు
సత్యవరం

## హిందూస్థానీ పండితులు

ఆంగ్లేయుల పరిపాలనమున నిరంకుశ జాతీయ భాషాద్వేషముచే క్రుంగి కృశించిన హిందుస్థానీ పండితుల, ప్రచారకుల కష్టములు ప్రజాప్రభుత్వము వలన గట్టెక్కునని యాశించిన వారి యాశలు నిరాశలైనవి. సమ్మె కట్టెదమని ఆందోళనచేసిన ఆంగ్లభాషా, ప్రాంతీయభాషా ఉపాధ్యాయులకు 1-1-47 నుండి జీతములు హెచ్చించి, త్వరలో హిందుస్థానీ పండితుల స్కేల్సుకూడా హెచ్చించెదమని మదరాసుప్రభుత్వమువారు ప్రకటించడమేకాక శాసనసభలోకూడా అనేకపర్యాయములు తెలిపి యుండిరి. ఇప్పటికి దాదాపు రెండు సంవత్సరములు గడచినను, రాయబారములు వెళ్లి మొర పెట్టుకొన్నను నిష్ప్రయోజనమైనది. చిత్తూరు జిల్లా బోర్డులోని కొందరు హిందుస్థానీ పండితుల జీతములనుండి నెలకు [illegible] రూపాయల లెక్కన, వాపసు తీసికొమ్మని స్పెషల్ ఆఫీసరు ఆర్డరుపంపి, వాపసు పుచ్చుకొనుచున్నారు. వారి మొరలను పెడచెవినిబెట్టి, పర్మనెంటు చేయక-యింక్రిమెంట్లు, ప్రావిడెంటు ఫండు యివ్వక టెంపరరీగానే యుంచినందున వారి సర్వీసు లెక్కకురాదు. ఒక చేతితో యిచ్చిన రెండు యింక్రిమెంట్ల పైకము ఇంకొకచేతితో వాపసు తీసికొనుట 'మూర్ఖుడు నక్కపైతాటిపం'డన్నట్లున్నది. సుమారు 11 ఏండ్ల నుండి ఈ చిత్తూరు డిస్ట్రిక్టుబోర్డును నమ్మి జీవితమంతయు అర్పించి సేవజేయుచున్న పండితుల కిదేనా ప్రతిఫలము?

మదనపల్లి — యం. వి. పాపన్న గుప్త

---

## వేరుశనగకాయలు

'తెలుగు స్వతంత్ర' 25-[illegible]-49 సంచికలో వేరుశనగకాయలకు 'గాంధీఫలము' లని బాపూజీ స్మారకచిహ్నంగా వాడుకలో పెట్టమని, కొందరు సంస్కర్తలు విజ్ఞప్తి చేశారు. ఫలములని పిలుచుటకు, అవి కాయలుగాని, పండ్లుకావు. బాపూజీ వాటిని పుష్టినిచ్చు ఆహారమని సేవించారు కాని పై వారు పేర్కొన్న కారణము మాత్రముకాదు.

దీనినిబట్టి మేకపాలు, అంగవస్త్రం (వారి [illegible] ప్రాయానికి సరిపోతుంది) పేర్లను కూడా గాంధీపాలు. గాంధీవస్త్రములని కొందరు పిలువమని విజ్ఞప్తి చేస్తారు రానురాను, గాంధీశబ్దానికి, వ్యుత్పత్యర్థాలు, నానార్థాలు, అపార్థాలు ఎక్కువై, హేళనగా, అసభ్యంగా ఉపయోగించడం జరుగుతుంది. ఆయన స్మారకచిహ్నాలు ఎన్ని లేవు? ఇది ఒక్కటే కోటా?

విజ్ఞాపకులు విమర్శచేసికొనక ఇచ్చిన విజ్ఞప్తిని ఆంధ్రులు పాటిస్తే, ప్రపంచంలో వైవిధ్యముగ తయారై, ఆయన పేరును అవమానపరచినవారవుతారు. ఆ విజ్ఞప్తిని పాటించవలదని ఆంధ్రులను ప్రార్థిస్తూ, విజ్ఞాపకులను ఉపసంహరించుకొనవలసినదని కోరుచున్నాను.

విజయవాడ — లంకంశెట్టి తాతయ్య

---

## రాజమండ్రి ఎలక్ట్రిక్ సప్లయి

[illegible]3-11-48 తేదీని కార్పొరేషను యింజన్లలో ప్రధానమైనది విరిగిపోవుటవల్ల ఆ రోజులగాయితు వీధి లైట్లకుగాని, ఇండ్ల లైట్లకుగాని కరెంటు సరిగా సరఫరా అగుటలేదు. నీటి కొళాయిలకు కూడ కరెంటు పూర్తి సరఫరా లేకపోవుటవల్ల నీటి సప్లయికూడ తగ్గిపోయినది. వేసవి ప్రవేశించినది. ఇంతవరకు కరెంటుకొరకను ప్రజలు ఏదోవిధముగా అష్టకష్టాలు పడి ఓర్చిరి. కాని నీటికొరకను భరించుట కష్టము. అంతేగాక కరెంటుతో పనిచేసే సుమారు 45 చిన్న పరిశ్రమలు, పిండిమరలు వగైరాలు మూడు మాసములనుంచి మూల పడివున్నవి. వీటివల్ల జీవించే అనేకమంది నిరాధారులైనారు.

ఇట్టి స్థితిలో కార్పొరేషను చైర్మను శ్రీ అలపాటి భాస్కర రామయ్యగారి తాలూకు '[illegible]0 హార్సుపవర్' మోటారుతో నడుపబడే 'హంసా మిల్సు' అనే రంపపుకోత మిల్లుకు ఏవిధమైన కొరత లేకుండా కరెంటు సరఫరా చేయబడుతూ ఉన్నది. కరెంటులేక మూడు మాసములనుండి బాధపడుతూవున్న చిన్న పరిశ్రమల యజమానులు సరఫరా చేయించమని ఎన్నిదరఖాస్తులు పెట్టుకున్నప్పటికీ వాటికి పంజాయిషీ అయినా యివ్వకుండా వారి స్వంతమిల్లుకు కరెంటు సరఫరా చేయించుకొనుట అన్యాయం.

ఇట్టి పరిస్థితులలో ప్రభుత్వంవారు కూడ ప్రజల మొరయెడ ఉదాసీనభావం వహించుట శోచనీయం.

రాజమండ్రి — లంక రాములు

ప. యు. కాం. అధ్యక్షుడు




# విషయసూచిక

సంపుటి 1. సంచిక 36

శుక్రవారం, ఏప్రిల్ 8, 1949

# వృద్ధాప్య యౌవనములు

ప తా భి

రసమయమగు కాలమ్మది
యౌవన ప్రాయంబు మిగుల,
అసహ్యమగు ముసలితనము
కలిగించును కడు విసుగుల;

పరమవాంఛితమ్ము ప్రపం
చమున యౌవన ప్రాయము,
మధుమాస నిశాంతమట్లు
ఆనంద సుధామేయము.

జగమునంత చంపు సుఖము
వృద్ధాప్యము తనచేతను
చలికాలపు దివసమటుల
పుట్టించును కడురోతను

జవ్వనంబు ఛంగుఛంగు
ఉడుకుచున్న ఉడుకుదుడుకు
ముసలితనము మూల్గుచున్న
నడువజాలనట్టి నడకు

యౌవనమ్ము భయవిహీన
నిరుపమాన సాహసమ్ము.
వృద్ధాప్యము వెరపుగొల్పు
భయంకరపు నీరసమ్ము.

ముదుసలితనమున్ మిక్కిలి
నేనున్ సహియింపజాల
కాని జవ్వనము మట్టుకు
ప్రేమింతును నేను చాల

(షేక్స్పియరునుండి)

శ్రీ స్వాతంత్ర

సంపుటి-1
సంచిక-36

ఏప్రిల్ 8, 1949

ప్రచురణ:
ప్రతి శుక్రవారం

# మద్రాసు మంత్రాంగం

వంశానుగతంగా వచ్చినవారి చేతుల్లో కాకుండా, ప్రజానీకం వాంఛించిన వారి చేతుల్లో రాజ్యాధికారం ఉండడం ప్రజాస్వామికం: తత్ఫలితంగా, ప్రజాస్వామికానికి ప్రాథమికసూత్రం సరియైన నాయకులను యెన్నుకోవడం. నాయక పీఠం మీద ఎవరిని ఆసీనుల్ని చెయ్యాలి? పాలనాధికారం ఎవరి హస్తగతం చేస్తే మంచిది? అనేది ప్రజాస్వామికంక్రింద నివసింపదల్చుకొన్న వారందరూ తెలిసికోవలసిన అవసరం యెంతైనా ఉంది. చేతిలోని రాజ్యాధికారం దుర్వినియోగంచేసే నాయకులను అనుసరించిననాడు దుష్ఫలితాలు సంప్రాప్తం అవుతాయి.

ఎటువంటివారిని సరియైన నాయకులుగా పరిగణించవచ్చు? ఆ ప్రశ్నకు సమాధానం వారిని ఎందు నిమిత్తం యెన్నుకున్నామో దానిపై ఆధారపడి ఉంది. ధన్వంతరివంటి వైద్యుడైనా, ఇంజనీరింగులో ఎందుకూ కొరగాని వాడు కావచ్చు. కర్తవ్య నిర్వహణకి కావలసిన శక్తి సామర్థ్యాలు ఉన్ననాడే నాయకత్వపు విలువ. వర్గవిచక్షణలు లేకుండా, నిష్పాక్షికమైన దృష్టితో, సమాజంలోని అందరి క్షేమాన్నీ ఇతోధికం చెయ్యడమే సంకల్పంగా పెట్టుకుని, ధార్మికమైన మానవ సౌభ్రాతృత్వం దృక్పథంగా అలవరచుకొని, సంఘంలోని ప్రజ్ఞాధురీణుల శక్తి సామర్థ్యాలు సమష్టి ప్రయోజనంకోసం వినియోగమయ్యే మార్గాలవలంబిస్తూ ముందుకు సాగే నాయకత్వమే ప్రజాస్వామికంలో అన్నివిధాలా అభిలషణీయం.

జాతీయ కాంగ్రెసు యావద్భారత దేశ సౌభాగ్యమే లక్ష్యంగా కలిగిన సంస్థ. అందువల్లనే, వ్యక్తిస్వతస్సిద్ధమైన హక్కుల విషయంలో పాక్షికమైన వర్గభేదా లుండరాదనీ, సమానధర్మ సమానన్యాయాలకు అందరూ వారసులేననీ నిర్ణయించింది. భారతదేశ విభజన జరిగిన తర్వాత చెలరేగిన హిందూ మహమ్మదీయ సంఘర్షణల ఫలితంగా అశాంతి, అంధకారం దేశాన్ని క్రమ్ముకున్న వేళల, మహాత్మాగాంధీ, జవహర్‌లాల్ నెహ్రూలవంటి జాతీయనాయకులు ప్రాణాలకు సైతం తెగించి మత దురహంకార భూతాన్ని ప్రతిఘటించారు. ప్రజాస్వామికమైన లౌకిక రాజ్యస్థాపనమే తమ లక్ష్యమని ఎలుగెత్తి చాటారు.

అటువంటి జాతీయాదర్శమైన లౌకిక ప్రజాస్వామిక రాజ్యాంగం అప్రమత్తతతో కాపాడుకోవలసిన నాడు, దేశ పాలనశాఖల్లో కులతత్వవాదులకిచోటు లేదు. ఏది భారతదేశపు జాతీయాదర్శ

మొక్క సుచ్చుకుంటుంటే బాగుచెయ్యటానికి వడ్రంగిని పిలిచేవాడుకూడ ఇంజనీరింగు కాలేజీమీదే ధ్యాస పెట్టుకుంటాడు, ఇంజనీరింగంటే మహా పడి చచ్చిపోయ్యేవాడిలాగ. నిజంగా, డబ్బు సంపాదిద్దామని గాకపోతే ఇంత మందికి (చదివే వాళ్ళల్లో) ఇంజనీరింగు కాలేజీ మీద వ్యామోహమే ఉండదు. వృత్తివిద్యలు చదువుకునే వాళ్ళల్లో చాలమందిని, ఆవృత్తిలో కంటె డబ్బుమీద ఉన్న అభిమానమే ఆచదువు చదివేట్టు చేస్తుంది. ఉద్యోగం దొరికిం తర్వాత, దేశసౌభాగ్యంకంటె,అంతకుముందు చదువుకోసం పెట్టినడబ్బు గుర్తుకొచ్చి, ఇక ఏంచెయ్యాలో అదే చేస్తుంటాడు, ప్రతివాడూను. అందువల్ల చదువుకోవటంగూడ వ్యాపారానికి పెట్టే పెట్టుబడిలాంటిదై పోతున్నది. ఇక చిక్కు ఎక్కడ వచ్చిందంటే, అవసరమైతే ఎంతైనా పెట్టుబడి పెట్టటానికి సాహసించలేని బ్రాహ్మడి వ్యాపారంమల్లేనే, కావలసినంత బుఱ్ఱని వినియోగించడానికి చేతకాని వాళ్ళ విద్య(!) తయారైంది. ఇక మనకి తగిన ఇంజనీర్లు అమెరికానుంచి రాకపోతే ఎట్లా?

వెనకటిరోజుల్లో బ్రాహ్మలు తప్ప ఎవళ్లూ విద్యావంతులు గారనుకోవటం చాల అపోహగా కనబడుతుంది. అయితే, ఆరోజుల్లో ఏవృత్తికి దగ్గ విద్య ఆకులస్థుడికి అమోఘంగా వచ్చి ఉండవలసిన అవసరం ఉండేది. పొలాల్లో పంటలు తగ్గుతుంటే, లేబరేటరీల్లో ఎక్స్పెరిమెంట్లు చేసి రైతుకు సహాయం చెయ్యదగిన విశాల (!) హృదయులు లేని ఆరోజుల్లో కూడ, పంటలు ఇంత కంటె బాగానే పండేవి. ఎందువల్లనంటే, ఏం చేస్తే ఏపంట ఏకాలంలో ఎట్లా పొతుందో రైతుకు తెలిసిఉండేది. అట్లాగే కామర్సులో డిగ్రీలు లేనిరోజుల్లో భారతదేశంలో అమోఘమైన వ్యాపారకేంద్రాలుండేవి: మరి, 'మార్కెటింగ్' వాళ్ల కెట్లా తెలిసేదో. ఈమధ్య ఒకాయన తన అనుభవంమీద చెప్పాడు : 'పొలాలకు పంది పెంటవేస్తే నంజురోగం పుట్టింది; అమ్మోనియా వేస్తే చలిజ్వరాలు వస్తాయి' అని. ఈమాటలు వింటే, ఇంగ్లీషులో చదువుకునే, పొలాలమొఖం చూడని అగ్రికల్చరిస్టులకు నవ్వురావచ్చు. కాని ఏపొలాల్లో యీవిధంగా జరుగుతుందో విచారించటానికి పూనుకునేవాళ్లేరి ! ఒకవేళ ఎవళ్లైనా ఉన్నా, డజనో, రెండుడజన్లో ఉన్న కమిటీ లేకుండా పనిగడవదు. మరి చదువులేని రైతు ఎట్లా ఎక్కువపంట పండించేవాడో, వెనక ! పూర్తిగా చెప్పాలంటే ఇట్లాంటివి చాలా ఉన్నై. కులాలపద్ధతిమీద సంఘంనడిచేరోజుల్లో ఒక కులవిద్యను ఇంకో కులంవాళ్లు అభ్యసించ లేదనే చెప్పాలి. అయితే, యీ పద్ధతి మహమ్మదీయులు రాకముందే; చాలవరకు కట్టు తప్పిపోయిందని తెలుస్తుంది, చరిత్ర చూస్తే.

అసలు దేశం బాగుపడాలంటే, వెనకటి వర్ణాశ్రమధర్మాలిప్పుడు పనికిరావు; గాబట్టి, ప్రతివాడికీ పోటీచెయ్యటానికి వీలు కలుగచెయ్యవలసిన అవసరం ఉంది. అంతేగాని, లాటరీ వేసింతర్వాత 'రామూడనివాడికి మొదటి బహుమానం వచ్చింది గాబట్టి, ఇవ్వటం మానేస్తున్నాం' అనే తత్వం అయితే ఎట్లా ?

ఆర్. యస్. యస్. వాళ్లూ, ముస్లింలీగు వాళ్లూ- 'మేం హిందువులం', 'మేం ముస్లింలం' అంటూ ఒకళ్లపై ఒకళ్లు ఆధిక్యం సంపాదించుకోవటంకోసం చేసిన హంగామాలాగే ఉంది, యీ కమ్యూనల్ జీ. ఓ. పోటీలేకుండా, ఏ వృత్తికి గావలసిన విద్యను, ఆవృత్తి అవలంబించబోయేవాడికి చెప్పిస్తుందా, యీ జీ. ఓ ? అంటే అదీ లేదు. పోనీ, 'సర్వైవల్ ఆఫ్ ది ఫిట్టెస్టు' అనే తత్వమా దీనిది ? అంటే, అది అసలుగాదు. ఇక దీనివల్ల కలుగుతున్న ప్రయోజనం ఏమిటంటే, కలెక్టరాఫీసులో గుమాస్తా పెద్ద జీయాలజిస్టు అయిఉంటాడు; రేషనింగు ఇన్స్పెక్టరొక పెద్ద కెమిస్టు అయిఉంటాడు. గట్టిగా పదిమందిలో మాట్లాడలేనివాడు, డైరెక్టర్ ఆఫ్ పబ్లిక్ ఇన్స్ట్రక్షన్ అయికూర్చుంటాడు. మరి ఇటువంటితంతు ఇంకా కొంతకాలం సాగుతునే ఉండాలంటే, మద్రాసు ప్రభుత్వాన్ని చూసైనా మిగతా రాష్ట్రాలవాళ్లు వాళ్ళరాష్ట్రాల్లో కమ్యూనల్ జీ. ఓ. లు జారీచేయించుకోటానికి, వీలైతే ఏకగ్రీవంగా యాక్టు చేయించుకోటానికి పెద్ద గందరగోళం చెయ్యటం అవసరంగా కనబడుతుంది ! ఎంతకైనా, మద్రాసీలు తెలివితేటలకి పేరుపడ్డవారు.

# మన ఆహార సమస్య

భీమవరపు రాధాకృష్ణ

ఆహారవిషయంలో బాధ్యతకల్గిన ప్రభుత్వ వర్గాల్లో కూడా, ఒక తప్పుఅభిప్రాయం ప్రబలి వున్నట్లు, ప్రభుత్వంతోబాటు కొందరి వ్యక్తుల ఉపన్యాసధోరణి చూస్తే వెల్లడవుతుంది. విపరీత తాత్కాలికపరిస్థితులవల్ల కల్గిన కాందిశీకులు మొదలైన సమస్యలవలెనే ఆహారసమస్య కూడా, ఏర్పడిందని వారు నమ్మినట్లు తోస్తుంది. ప్రస్తుతం దిగుమతి చేసికొనే కొరతమట్టుకు, మనం పండించగల్గితే, ఆహారసమస్య సాధించినట్టే నని వారు అనుకోటం పొరబాటు.

ఆహార సమస్యను సరిగా అర్థంచేసుకోటానికి దేశంలో జనాభా, పెరుగుదలరేటు పండేపంట, పండించే అవకాశాలు- ఇవన్నీ మనం ఆలోచించాలి.

ప్రస్తుతం మన జనాభా 350 మిలియనులు సాలీనా 42 మిలియను టన్నులదాకా ధాన్యాదులు పండించే స్థితిలో మనం ఉన్నాము. లోటు రమారమి నూటికి పదిపాళ్లు వుంటుంది. మన జనాభా, సాలీనా నూటికి ఒక్కటి చొప్పున పెరుగుతోంది. ఇప్పుడున్న యీ ఆహారంకొరత అలావుండగా, ఈ జనాభాలో పెరుగుదల సాగితే, ప్రతిసంవత్సరం అరమిలియను చొప్పున మన అవసరాలు పెరుగుతాయి. ప్రతి సంవత్సరం జనాభాలో అభివృద్ధి మూడున్నర మిలియనులు ఉంటుంది. వీళ్ళకు రోజుకు పౌను చొప్పున పైచెప్పిన ఈ మిలియను టన్నులు అదనంగా కావలసివుంటుంది.

ఇక మన పంటభూముల విషయం చూస్తే మన యూనియను, అవిభాజ్య భారతదేశంతోబాటు 78% జనాన్ని పోషించాలి. కాని మిగిలిన అవకాశాలు యీనిష్పత్తిలో లేవు. వరిభూములు 70% న్నూ గోధుమభూములు 64% న్నూ మాత్రమే మనకు లభించాయి. పాకిస్తాను విడిపోటం మూలంగా మనకు సంవత్సరానికి మిలియను టన్నుల గోధుమల సరఫరా తగ్గింది.

ఒకప్రక్క జనసంఖ్య పెరుగుతోంటే పంటభూములు తగ్గాయి. ఇది శాశ్వతమైన పెద్ద సమస్య. పరిస్థితులు చల్లబడటంతోనే, సమసిపోయే సమస్యకాదు. ఎంతో శ్రమ, ప్రయత్నం వ్యయం- ప్రభుత్వం చేస్తేనేగాని, పరిస్థితి అదుపులోకిరాదు.

ఈ సమస్యను ఎదుర్కోటానికి. దీర్ఘవర్ష ప్రణాళికలూ, సత్వరం ఫలించే ప్రణాళికలూ కూడా అవసరం. ఉన్న పంటభూముల వైశాల్యాన్ని పెంచటానికి, చిత్తడిభూముల్ని చిట్టడవుల్ని బాగుచేయించి సాగులోకి తేవటం, నీటిపారుదల బాగా జరిగేనిమిత్తం, వర్షంమీద ఆధారపడకుండా, నదులకు కట్టడాలుకట్టి యిరిగేషను స్కీములు అమలుజరపటం- ఇవన్నీ దీర్ఘకాల ప్రణాళికలక్రింద వస్తాయి. ఈ ప్రణాళికలు పంటలుపండించే సహజావకాశాలను పెంపొందింపచేస్తాయి.

తర్వాత ప్రభుత్వ వ్యవసాయ పరిశోధనాలయాల్లో కనిపెట్టి మేలుజాతి విత్తులను వ్యవసాయదారులకు సరఫరా చెయ్యటం, రెండో పంట అవకాశాలను అభివృద్ధిచెయ్యటం మంచి ఎరువులు ఇయ్యటం, గొట్టంబావులు క్రొత్తవి తవ్వించి, ఉన్నవాటికి మరమ్మత్తు చేయించటం, ఇవన్నీ సత్వరం ఫలించే ప్రణాళికలు. ఈరెండో రకం కార్యక్రమానికి ప్రభుత్వానికి వ్యవసాయదార్ల సహకారం ముఖ్యంగా కావలసివుంటుంది. ఇచ్చిన అవకాశాలను వారు సరిగా వుపయోగించుకొన్నదీ లేనిదీ ప్రభుత్వం చూడవలసివుంటుంది.

ఇట్టి సమస్యను కేవలం తాత్కాలికమని తలచి, నోటిమాటలతో సాధించటం దుస్సాధ్యం. ఆహారము ప్రధానావసరము కనుక ప్రభుత్వమీ విషయమున చాల శ్రద్ధ వహించవలసివుంటుంది.

# ప్రజలెట్లో, పాలకులట్లే—

కే. వెం. నృ. అప్పారావు

నిక్కం చాలమంది కాంగ్రెసు ప్రభుత్వాన్నీ, కాంగ్రెసునూ నిందిస్తూ ఉంటే చాలా బాధ కలుగుతూంది. నిందకు కారణం? కాంగ్రెసులోనే ఎక్కడచూచినా చీకటి బజారు, లంచగొండితనం పదవులకోసం, ప్రాకులాట, విశ్వాస ద్రోహం, మూతా కలహాలు ఉండడం. 1940 కి పూర్వం ఉన్న కాంగ్రెసేనా ఇది? అనిపిస్తున్నది. నిజమే! కాని దీనికి కాంగ్రెసుగాని, నిజంగా కాంగ్రెసువారని పిలువదగినవారుగాని కారణం గాదని నా నమ్మకం. కాంగ్రెసు లక్ష్యంగాని, కార్యక్రమంగాని పైవాటిని నిరసిస్తుందేగాని ప్రోత్సహించదు. ఇక కొద్దో గొప్పో దేశంకోసం త్యాగంచేసి జైల్లో దేవతాపులును, అవసరమైతే లాటీదెబ్బలు తిన్న కాంగ్రెసువాదికూడా సాధారణంగా తనస్వార్థంకోసం దేశాన్ని అమ్మివెయ్యడానికి ఒప్పుకోడు. అమ్మివెయ్యడం అని ఎందుకంటున్నానంటే, నేడు తమ స్వార్థంకోసం పైని చెప్పిన పనులు చేసేవారంతా కమ్యూనిస్టులకు దోహదంచేస్తున్నారనే నమ్మాలి.

ఇక దీనికి కారణం ఎవరు? ఒక విధంగా ఈ విమర్శించేవారే అనాలి. ఎందుకంటే, కాంగ్రెసు సంఘాలకు ఎన్నికలు వచ్చేటప్పటికి మీరు వోటు ఇవ్వడంకోసం ఆలోచించేది-ఇతడు నిజంగా కాంగ్రెసు సేవకుడేనా, కాదా? అని కాదు. ఇతడు మన జాతివాడు, కులంవాడు. మూతావాడు అవునా, కాదా? ఇతనికి వోటు ఇస్తే రేపెప్పుడైనా మనకుపకారం ఉంటుందా? ఇతడు డబ్బు, దానినిబట్టి పలుకుబడి కలవాడు కదా! అని. దాని పరిణామం ఇట్లా ఉండడంలో ఆశ్చర్యమేముంది? వోటర్ల స్వభావమే ఎన్నుకోబడినవారిలోను ప్రతిఫలించింది. ధనవంతునకు మనము విలువ యిచ్చాము; అతడింకా ధనము పోగుచేసి ఆ విలువ పెంచుకుంటున్నాడు. కులతత్వానికి మనం దోహదం చేశాము; అతడు తన కులంవారికి పలుకుబడి కలిగించడానికి పాటుపడుతున్నాడు. దీనికి కాంగ్రెసు ఏమిచేస్తుంది? కాంగ్రెసు 'సర్వేజనా స్సుఖినోభవంతు' అనే చెపుతుంది. వోటు అనే ఆయుధం మనచేతి కిచ్చింది. మన మెలాంటి వారిని ఎన్నుకొంటే మన కలాంటి ప్రభుత్వమే వస్తుంది. ఎన్నుకొనేటప్పుడు బంధుత్వాలు, కులతత్వాలు కావాలి! పరిపాలనమాత్రం బాగుండాలి. కాకరకాయలు తెచ్చి పడేసి కూర చేదుగా ఉందని తల్లిపై ఎగిరితే పాప మావిడ యేం చేస్తుంది! ప్రకాశంగారి ప్రధానిత్వంలో అందరికీ లాభించే ఉత్పత్తి వినిమయ సంఘాలు పెడితే ఆయనను తీసేసిదాకా గోల పెట్టినాము. ఇప్పుడు మిల్లువాళ్లు కట్టుకట్టి ధాన్యం బస్తా రు 16/- లకు కూడా కొనటంలేదని, బియ్యం బస్తా మాత్రం రు 50/- లకు అమ్ముతున్నారని మొత్తుకుంటే ఎవరి దా తప్పు?

ఇకనైనా మేల్కొని రేపు రాబోయే కాంగ్రెసు ఎన్నికలలో గ్రామం మొదలు అఖిల భారతందాకా సాధ్యమైనంతవరకు త్యాగంలేక పోయినా, అధమం స్వార్థమైనా లేని కాంగ్రెసు సేవకులను సంఘాలలోనికి ఎన్నుకొంటే ఆపైన వచ్చే ప్రభుత్వాలుకూడా దానికి అనుగుణంగానే ఉంటాయి. కాంగ్రెసులోకూడా వయోజనులందరికీ వోటు ఉన్నది. దానిని సద్వినియోగం చేసుకోవలసిన బాధ్యత ప్రజలమీదనే ఉన్నది. చేసుకోలేకపోతే కాంగ్రెసును అనవలసినపని లేదు. కాంగ్రెసు సేవకులను అనవలసినపని అంతకంటే లేదు. ఇప్పుడు కాంగ్రెసు సంఘాలలో లెక్కవేస్తే సగంమందికి పైగా సంగ్రామ కార్యక్రమంలో పాల్గొనినవారే కనిపిస్తారు. వారందరు చేసే పనులకూ, కొద్దో గొప్పో నిస్వార్థంగా సేవ చేసి ప్రస్తుత దుస్థితికి దుఃఖిస్తూఉన్న కాంగ్రెసు సేవకులనుగాని, మాతృ సంస్థఅయిన కాంగ్రెసునుగాని నిందించడం అనుచితం.

కాంగ్రెసు ఓడ (లక్ష్యం) గట్టిది; దాని పరికరములన్నీ (నిర్మాణకార్యక్రమాలు) ఉత్తమమైనవి; దాని కర్ణధారులు (ప్రసాద్, నెహ్రూ, పటేలు) సమర్థులు. ఇక యిట్టి ఓడ మునిగిందంటే-అట్టి దన్నదూ జరుగకుండుగాక-అందులో ప్రయాణంచేసే మనం క్రమశిక్షణ లేక కలహించుకొని కలగ ద్రొక్కుటచేతనే అవుతుందని గుర్తు పెట్టుకోవాలి.

# సంఘస్వామ్యం : దేశకాలపరిస్థితులు




ఒక కాలంలో ఒక దేశంలో ఉద్భవించిన మహాపురుషుడు, ఆ దేశకాల పరిస్థితుల్ని అనుసరించి ఏర్పరచిన ప్రణాళికలోని మూలసూత్రాలు యితరదేశాలకూ యితర కాలాలకూ స్థూలంగా సరిపోవచ్చునేమో గాని, యథాతథంగా సర్వవివరాలతో ఎప్పుడూ యితరులకు సరిపోవు. అనేక విషయాలను గురించి అనేక సమయాల్లో గాంధీజీ వెల్లడించిన అభిప్రాయాలు 'గాంధీజం' అనే పేరు దాల్చినవి. ఆ గాంధీజంలోని మూలసూత్రాలు యితరదేశాల వారికి కూడా అన్వయించినా, ఆ తత్వం ప్రస్తుత కాలంలో భారతదేశాన్ని, భారతజాతినీ మనస్సులో వుంచుకుని మహాత్ముడు తయారుచేసింది. ఏ అమెరికాలోనో, ఆస్ట్రేలియాలోనో గాంధీజమును ప్రచారంచేదామని ఎవరయినా పూనుకుంటే, అందులో మూలసూత్రాలను ఆ దేశపరిస్థితుల కనుగుణంగా వ్యాప్తిచేయగలరే గాని, అన్ని వివరాలతో ఆ తత్వాన్ని ఆ దేశంమీద రుద్దలేరు. వర్ణద్వేషం హతమారిన రష్యాలో ఆయన హరిజనోద్ధరణగాని; మాంసాహారం తప్ప వేరే ఆహారం లేనిచోట ఆయన అహింసా సిద్ధాంతంగాని; దేశవిస్తీర్ణత హెచ్చు, జనసంఖ్య తగ్గు అయినదేశాలలో ఆయన బ్రహ్మచర్య సిద్ధాంతంగాని, ఎవరూ ప్రచారం చేయడానికి వీలులేదు. చేసినా నలుగురూ అపహాసించడం తప్ప వేరే ఫలితం వుండదు.

ఇతరదేశాల విషయంలో గాంధీజమునకు అన్వయించే యీ ధర్మమే, మనదేశంలో అనుసరించవలసినప్పుడు యితర "యిజము" లకు అన్వయిస్తుంది.

గాంధీజం, గాంధీజీ తన జీవితకాలంలో తన దేశాన్ని, సంఘాన్ని, ప్రపంచాన్ని పరిశీలించి ఆలోచించగా తయారయిన తత్వం. ఒక శతాబ్దానికి ముందుగాని, కొన్ని శతాబ్దాల తరవాత గాని, ఉండే సంఘానికి అది అన్వయించదు. అయినా ఆయన సత్యం, అహింస, సర్వజన సమత్వం—యిటువంటి మూలసూత్రాలు సర్వకాలాల్లో సర్వదేశాల్లో మానవజాతి గౌరవానికి పాత్రములౌతూనే వుంటవి.

అలాగే తాను నివసించిన బ్రిటనుదేశ పరిస్థితుల్నీ, యిరోపాదేశాల పరిస్థితుల్నీ తన కాలంలో పరిశీలించి అనేక సందర్భాల్లో కారల్ మార్క్సు అనేక అభిప్రాయాలు వెలిబుచ్చాడు. ఆలోచించి, ఆలోచించి కొన్ని సిద్ధాంతాలు లేవదీశాడు. ఆ సిద్ధాంతాల ప్రకారం సమకాలిక పరిస్థితుల్ని వివరించాడు. గతానికి అర్థం చెప్పేడు. సంఘం భవిష్యత్తును సూచించాడు. ఆ దేశాలచరిత్రను పరిశీలించి, ఆయన నిర్ణయించిన సిద్ధాంతం, ఆ దేశాలవారికి చక్కగా యిమిడింది. దాంతో ఆయన రాజకీయంగా త్రికాలవేది అయ్యాడు. సంఘంలోవున్న లోపాల నివారణకు ఆయన కొన్ని సూచనలు చేశాడు. వాటిలో ప్రధానమైంది—మానవ జీవితావసరములను ఉత్పత్తిచేసే కేంద్రములు, సాధనములు వ్యక్తుల స్వాధీనంనుంచి, వర్గముల స్వాధీనంనుంచి తొలగి - సంఘం అంతటికీ సాముదాయకంగా స్వాధీనం కావాలనేది చాలా ముఖ్యమయింది. ఆవిధంగా "సంఘస్వామ్య" సిద్ధాంతాన్ని పునరుద్ఘాటించిన వారిలో కారల్ మార్క్సు అగ్రగణ్యుడు. అతఃపూర్వం ఊహించినవారిలా కాకుండా, "సంఘస్వామ్యం" ఒక స్వప్నం కాక, వాస్తవిక ప్రపంచంలో ఆచరణ సిద్ధమయిన ఒక జీవితవిధానమని సకారణంగా నిరూపించాడు. ఈ నిర్ణయం వెన్నెముకగా, ఆయన అనేక యితర సిద్ధాంతాల్ని కూడా లేవదీశాడు. అవన్నీ కలిసి "మార్క్సిజము" అనే పేరుతో వ్యవహరింపబడుతున్నవి.

ఆయన వాదంలో సంఘస్వామ్యసూత్రం-వ్యక్తిస్వామ్యంతో లోపభూయిష్ఠమయిన జీవితాలు గడిపే అన్ని జాతులవారికీ, అన్ని దేశాలవారికీ, అన్ని మతాలవారికీ-అన్వయించడానికి వీలయింది. ఆ నిర్ణయానికి ఆయన రావడానికి ప్రాతిపదికగా వివరించిన

సిద్ధాంతాలూ, చేసిన వ్యాఖ్యానాలూ కేవలం గడచిన కొన్ని శతాబ్దాల్లో పాశ్చాత్య దేశాలకు సంబంధించినవి. భారతదేశానికీ, భారతదేశ పరిస్థితులకూ వాటిని యథాతథంగా అన్వయించడానికి వీలులేదు. సంఘస్వామ్య సిద్ధాంతానికి ఆధారంగా ఆయన చేసిన చారిత్రిక మీమాంస, వ్యాఖ్యానం- పెక్కుమంది అనేక విధాలుగా అర్థం చేసుకొని- అనేక రాజకీయతత్వాలకు దారి తీసినవి. ఆ తత్వాలమధ్య వైషమ్యం వైరుధ్యం ఆధునిక ప్రపంచంలో అనేక అనర్థకాలకు దారి తీసినవి.

ఇంతకూ చెప్పవచ్చిందేమిటంటే- మార్క్సిజం మూలసూత్రమయిన సంఘస్వామ్యం తప్ప, తక్కిన సిద్ధాంతాలు భారతదేశ చరిత్రకు, భారతజాతికీ అన్వయించేవి కావు. మన దేశచరిత్రలో సంఘటనలూ, మన సంఘంలో లోపాలూ ఆయన సిద్ధాంతం ప్రకారం వివరించడానికి వీలులేదు. మన హిందూ మహమ్మదీయ సమస్యగాని, మన కుల వైషమ్యాలు గాని, మన హరిజన సమస్యగాని ఆయన సిద్ధాంతాల ప్రకారం విశదీకరింపబడవు. ఆయన దేశాలకూ, మన దేశానికీ చాలా వ్యత్యాసం వుంది. ఆయన కాలానికీ, మన కాలానికీ చాలా భేదం వుంది. ఆయన సంఘానికీ, మన సంఘానికీ చాలా తేడా వుంది. సంఘస్వామ్యాన్ని గురించి యోచించిన ఓవెన్, ప్లేటో, ఫూరియర్ మొదలయిన యితర పాశ్చాత్య ధీమంతుల వాదాలను గురించి చెప్పవలసిన అగత్యమూ, వాటిని అర్థం చేసుకోవలసిన అవసరం మనకెంతైనా వుంది. ఎందుకంటే, మన దేశంలో సంఘస్వామ్యమును స్థాపించడానికి ప్రయత్నించే సోషలిస్టు పక్షమూ, కమ్యూనిస్టు పక్షమూ యీ రెండూ కూడా మార్క్సిజం మూలసూత్రమయిన సంఘస్వామ్యాన్ని కాక, యథాతథంగా మార్క్సిజాన్ని, తమకు తోచినట్లుగా అర్థం చేసుకుని, తమ ప్రణాళికలు ఏర్పరచుకున్నవి.

దేశసంపదను అల్పసంఖ్యాకుల స్వాధీనంలోనుంచి తప్పించి- దరిద్రంతో, నిరుద్యోగంతో మాడిపోతూ అందరికీ జీవనోపాధి కల్పించదలచుకున్న యీ పక్షాశయాలు, వెయ్యికి 999 మంది దరిద్రులుగా వున్న మన సంఘంలో, వేసవిలో గడ్డివామికి నిప్పు అంటుకున్నట్లుగా అంటుకోవలసిందిపోయి, వ్యక్తి స్వామ్యాన్ని పునరుద్ధరించబూనుకున్న కాంగ్రెస్ పక్షాన్ని ప్రజాబాహుళ్యం అనంతంగా, నిస్సంకోచంగా బలపరచడం, యీ పక్షాలను విశ్వసించి అనుసరించలేకపోవడం ఎందువల్ల? అందుకు కారణం- యీ పక్షాల కైతవమా? మన మతవిశ్వాసమా? 'అభివృద్ధి నిరోధకశక్తు'లా? 'రాజకీయ జీవితం' లేకనా! ఎన్నికల్లో కాంగ్రెస్ అభ్యర్థికి విపరీత విజయమూ, సోషలిస్టు అభ్యర్థికి అపజయమూ ఎందుకువస్తున్నవి? ఈ ప్రశ్నలు ఏబుద్ధిమంతున్నయినా కలవరపెట్టక మానవు.

ఇందుకు కారణం - యీ పక్షాల వారు, మార్క్సు మూలసూత్రమైన సంఘస్వామ్యాన్ని కాక, ఆయన యితరసిద్ధాంతాలను, యితర అభిప్రాయాలను భారతీయులనెత్తిన రుద్దడానికి ప్రయత్నించడమని నా ఉద్దేశ్యం. ఈ వాదాన్ని సమర్థించాలంటే- మార్క్సిజం అంటే ఏమిటో; ఆయన వాదంలోని ప్రధానాంశాలేమిటో; ఆ నిర్ణయాలకు ఆయన ఎందుకు వచ్చాడో; అందుకు కారణములయిన పరిస్థితులకు, మన సమస్యలకు కారణములయిన పరిస్థితులకు ఉన్న భేదమేమిటో సమగ్రంగా చర్చించాలి.



ప్రశాంతమైన మనస్సులు, ఎన్నడూ భయ పడవు, విభ్రాంతి చెందవు; సుఖమునందూ దుఃఖమునందూ ఒకేరీతిగా, బయట పెనుతుపాను వీచినా లోపల నిశ్చలంగా తిరిగే గడియారం వలె ఉంటాయి—(స్టీవెన్‌సన్).

# సంస్కృతికి పోషకులూ, రక్షకులూ ఎవరు?

'మీ జాతియొక్క విశిష్టత ఏమి'టని ఎవరన్నా అడిగితే మనం ఏమని చెప్పుతుంటాం? 'మాలో ఇటువంటి సాహితీపరులూ, చిత్రకారులూ, గాయకులూ, సంస్కర్తలూ ఉన్నా'రని చెప్పుతుంటాం.

నిజమైన సంస్కృతి ఏదో ప్రతివాడి హృదయానికి తెలుసు. మనం చాటుగా అసభ్యసాహిత్యం చదివి ఆనందించవచ్చు. ఉత్తమ తరగతి నటులను చూడటానికీ, సంగీతం వినటానికీ కానీ ఖర్చు చేయకపోవచ్చు. కాని దేన్ని గురించి గొప్పగా చెప్పుకోవాలో మనకు తెలుసు.

అయితే మన కళాసంస్కృతులకు ఈవ్యాపార యుగంలో రానురాను స్థానం లేకుండా పోతున్న సంగతి మనం సరిగా గ్రహించటంలేదు; గ్రహించి నప్పుడుకూడా ఉదాసీనభావంతో ఉంటున్నాం. మన ఉదాసీనతవల్ల మన కళాకారులు మొదలైనవారు ఎటువంటి మార్పులకు గురి అవుతున్నారో మనం గుర్తించటం లేదు.




ఇటీవల ద్వారం నాయుడుగారికి పెద్దలు సన్మానం చేసి 35 వేల రూపాయలు బహూకరించారు. ఇది 1949. నాయుడుగారు ఫిడేలు చాలా బాగా వాయిస్తారని నాకు 28 ఏళ్ళక్రితం తెలుసును. 1927 కల్లా ఆయనకెంత కీర్తి వచ్చిందంటే, నేనూ మరో స్నేహితుడూ కలిసి ఆయన కచేరీ వినటానికి ఆరుమైళ్ళు నడిచి పదిహేను మైళ్లు బస్సులో ప్రయాణం చేశాం. ఆయనకు ఆంధ్రులు పెద్దెత్తుగా సన్మానం జరపడానికి నిశ్చయించటానికి రెండు పుష్కరాలు పట్టింది. ఈ నాయుడుగారే మరో దేశంలో పుట్టినా, ఏ మహారాజా పోషణకిందనైనా ఉన్నా 35 వేలు గాదు- మూడున్నర లక్షలు చేసుకొని ఉండును, అగ్రహారాలు సంపాదించి ఉండును. మనం జమీందారీ యుగాన్ని దాటి చాలా ముందుకు వచ్చామని గర్విస్తున్నాం!

ఇంకా నాయుడుగారు అదృష్టవంతులు. తెలుగువాళ్ళ కావితాలో అతిభయంకరమైన విషయాలున్నాయి. ఒక ప్రసిద్ధ ఆధునిక తెలుగుకవి ఉదరపోషణార్థం కూలీలపై మేస్త్రీగా పనిచేశాడు. ఒక ప్రసిద్ధనటుడు వంటలుచేసి కాలం వెళ్ళబుచ్చాడు. మరొక ప్రసిద్ధ నటుడు వెచ్చాల అంగడి పెట్టుకున్నాడు. అనేకమంది ప్రసిద్ధ కళాకారులూ, కవులూ ఇదివరలో దిక్కులేని చావు చచ్చారు; ఇప్పుడు అజ్ఞాతంగా ఏమూలో కాలం వెళ్ళబుచ్చుకుంటున్నారు. ఇతరులు గుమాస్తాలుగానో, గౌరవనీయమైన భిక్షాటనతోనో కాలం గడుపుతున్నారు.

ఈ సమస్య ఇక్కడ ఆగిపోవటంలేదు. కొందరు కళాకారులు తమ కళాశక్తిని వ్యాపారుల వద్ద వ్యభిచారం చేయించి నాలుగురాళ్లు తెచ్చుకుంటున్నారు. నాలుగు కళాయుతమైన భావయుతమైన బొమ్మలు వేసుకొని కానీ సంపాదించలేని చిత్రకారుడు, నిర్జీవమైన, తుచ్ఛమైన బొమ్మలు గీసుకుంటే బతకగలుగుతున్నాడు. ఉదాత్తమైన సంగీతం పాడితే పొట్టనిండనివాడు సినిమాలలో ప్లేబాక్ పాటలు పాడుకుంటే బాగుపడుతున్నాడు. పాటకచ్చేరీలలో వాద్యాలు వాయించే వారికంటె సినిమా ఆర్కెస్ట్రాలవారు అధికంగా గడిస్తున్నారు.

ప్రతిఒక్క కళలోనూ సజీవమైన శక్తులకు పరపతి తగ్గి, నిర్జీవ శక్తులకు హెచ్చుతున్నది. సజీవంగా పాత్రపోషణ చేయగల రంగస్థల నటులు సినిమాకు అవసరంలేదు. సినిమాలో నటన యావత్తూ డైరెక్టరూ, కామెరామాన్ కలిసి కామెరాచేత చేయిస్తారు. సినిమాపాటలలో ఆకర్షణ శక్తులన్నీ ఆర్కెస్ట్రాలోకి వెళ్ళిపోయాయి. సాహిత్యంలో భావాలకుండే పలుకుబడి భాషకి సంక్రమిస్తోంది. మీ సాహిత్యం ఎవడికి కావాలి? ఇప్పుడు కావలసింది ఏ చొప్పదంటు భావాన్నయినా చక్కగా ప్రదర్శించగల జర్నలిస్టులు.

ఈ విషయంలో రేడియో మిగిలినవాటికి తీసిపోవటంలేదు. రేడియో వ్యాపారసంస్థ కాదు

కాకపోతేనేం! అది ఉత్తమతరగతి సంగీతం కన్న, 'మీరు కోరిన రికార్డులు' జాస్తిగా ప్రచారం చేస్తుంది. సంవత్సరానికి ఒకటిరెండు సార్లను మించి నిజమైన పండితులూ, సాహితీపరులూ, కవులూ రేడియోమైక్ ముందుకు రారు. రేడియోలో ప్రసారితమయే మామూలు ప్రసంగాలను రేడియో సాహిత్యం అని కూడా పిలవరు; అది రేడియో జర్నలిజం.

'ఇది ప్రజాయుగం, ప్రజలే కళలని పోషించాలి', అని చెప్పవచ్చు. ఇది స్థూలంగా నిజమే గాని, ఆచరణలో దీనికి చాలా అవాంతరాలున్నాయి. రాజకీయాధికారాలన్నీ ప్రజలవేనని ప్రభుత్వం మానటంలేదు. ప్రజలు ఎన్నుకొనేవారికి పట్టంగట్టి వారికి అంతులేని హక్కులిస్తున్నాం. ప్రజలకు ఉత్తమకళలపట్ల ఆదరం ఉండదనుకోవటం పొరపాటు. ఒకవేళ కళలు నూటికి నూరుపాళ్లూ ప్రజలకు సన్నిహితంగా లేని పక్షంలో ప్రజల సంపర్కం హెచ్చినకొద్దీ వాటిలో అవసర పరిణామం కలగకపోదు. కాని ముందుసమస్య ఏమిటంటే మన కళాకారులకు ప్రచారం ఎక్కడఉంది? ఈకళాకారులను గురించీ వాళ్ళ గొప్పతనాన్ని గురించీ ప్రజలకు తెలియబరచి వారి ఆసక్తిని రెచ్చగొట్టే సాధకులెవరు?

కొద్దిమంది వ్యాపారస్థుల పోషణకింద ఉండే కళాకారులకు వారి అవసరాలకు తగ్గ ప్రచారం జరుగుతూనేఉంది. ఫీల్డులో ఉన్న వారిలో గొప్పగా ప్లేబాక్ పాటలు పాడగలవారెవరో ప్రతిచిత్రనిర్మాతకీ తెలుసును. తెలియకపోతే స్వలాభాపేక్షతో తెలుసుకుంటాడు. ప్రజల ఆదరణ ఈ విధంగా లభించదే?

మన పత్రికలు తిప్పిచూడండి. ఎంతమంది కళాకారులకు పత్రికలు ప్రచారం ఇస్తున్నాయో తెలుస్తుంది. ఒక నెలరోజులు రేడియో శ్రద్ధగా వినండి. మన రేడియో శ్రోతలు జాస్తిగా వినే తుక్కురికార్డులేవో బోధపడుతుంది.

లాభాలకోరకు, వ్యాపారదృష్టితో నడుపబడే పత్రికలను మనం శాసించలేం. రేడియోచుట్టూ అల్లుకునిఉన్న ఎర్రటేపు మనం విప్పలేం. కాని సంస్కారులమని చెప్పుకునే మేధావులమాటేమిటి? దేశంలో ఉండే ఉత్తమ కథకులెవరో, నటులెవరో, చిత్రకారులెవరో, గాయకులెవరో, కవులెవరో తెలియకపోవటం చిత్రనిర్మాతలకి గొప్ప క్వాలిఫికేషన్. ఈనాటి పత్రికాసంపాదకులు కూడా అదే శ్రేణిలోకి వస్తున్నారు. కాని ఈ మేధావులల్లాకాదే? వారు కళలను గురించి గంటలకు గంటలు మాట్లాడుతారు. కళలపట్ల తమ విచక్షణాశక్తి ప్రకటించటానికి అవకాశం దొరికితే వీరు పోగొట్టుకోరు. తమకు ఘనత చేకూరుతుందన్నప్పుడు వీరు సన్మానాలు చేయించడానికీ, చందాలు వసూలు చేయించడానికీ ముందుకు వస్తారు. వీరికి పత్రికలలో పలుకుబడివుంటుంది. ప్రభుత్వంలో పలుకుబడి ఉంటుంది. ఇటువంటివారు చేరి జాతియొక్క సంస్కృతిని రక్షించడానికీ, పెంపొందించడానికీ సమాజాలెందుకు స్థాపించరాదు? ఏ ప్రఖ్యాత నటుడైనా వంటచేసుకుని బతుకుతున్నాడన్నా, ఏ మహాకవి అయినా తిండికిమాడి చస్తున్నాడన్నా వీళ్లు ఆందోళనచేస్తే వెంటనే ఫలితం ఉంటుంది. కళాకారులకు అవసరమైన ప్రచారం ఇవ్వడానికికూడా వీరికి దక్షత ఉంటుంది. (అసమర్థులైనవారు అభిమానంతో నాలుగు ముక్కలు రాసి పత్రికలోవేస్తే అది విరుద్ధప్రచారంగా కూడా ఉంటుంది!) ఏడాదికి మూడు నాలుగు సార్లు వివిధకళాకారులకు సన్మానాలు ఏర్పాటుచేయడానికి అవసరమైతే ఇందుకుగాను ప్రభుత్వసహకారం అర్థించడానికీ వీరికి తాహతు వుంటుంది.

ఇటువంటి కార్యక్రమం అమలు జరగకపోతే మన కళలూ, సంస్కృతీ దక్కే ఆశలేదు.

---

దారిద్ర్యం, నిరంకుశపరిపాలన—యీ రెంటివల్లా పీడింపబడేవాళ్లలో ఏమీ తేడా లేదు. నివారించడానికి మార్గాలు ఉన్నప్పటికీ దారిద్ర్యం పీడించే సమాజానికి స్వాతంత్ర్యం ఉందనడం అసత్యం. ఏ సమాజంలో అయితే అధికసంఖ్యాకులు సాంఘికంగా పీడింపబడు తుంటారో, ఆ సమాజంలో భావస్వాతంత్ర్యంగాని, జాతిసామరస్యంగాని లభించవు. అటువంటి చోట్ల వాటి మనుగడకి ఆస్కారం లేదు—(జెన్నీ లీ)

రూపకం

# శాంతి సాధించారు

"శారద"

[గొప్ప జనసమూహం ప్రవాహంవలె సాగిపోతూంటుంది. ఎడారులూ, కొండలూ, మైదానాలూ దాటిపోతుంది. ప్రవాహం మధ్యమధ్యన అరుపులూ, ఘోషలూ వినబడతాయి. ఆగిపోయిన వాళ్ళు శవాలల్లే వున్నారు. ప్రవాహం వాళ్ళని గమనించదు. ప్రవాహం వాళ్ళని ఆగనివ్వదు. గమనించనివ్వదు. పోతున్నారు, ఎక్కడా ఆగకుండా. వాళ్ళ వెనుక తగలడిపోతున్న పట్నాలూ, పల్లెలూ; ఆరినవి కొన్ని, ఆరనివి కొన్నినూ. ఈ ప్రవాహంలోనే అక్కడక్కడ మంటలు కనిపిస్తుంటాయి. వీళ్ళు ఎక్కడికి? ఏమో!]

ఒకగొంతు: నేను ఎక్కడికి? ఏమిటిది! నాయిష్టలేకుండానేనా?

ఇంకోగొంతు: నీయిష్టం ఏమిటి మధ్య? అంతా ఎక్కడికో అక్కడికే నువ్వు.

మొదటిగొంతు: నేను ఇక్కడే ఉంటాను. నడవను. నడవలేను.

రెండవగొంతు: ఉండగలిగితే ఉండు. నిన్నెవరొద్దన్నారు?

[ప్రవాహంలో ఎన్నో గొంతులు నిరంతరంగా వినపడతాయి. ఆనవాలునుబట్టి పేరు పెట్టచ్చు.]

అ: నాకవిత్వం వినండి. మీరంతా ఇట్లా ఎందుకు పోవటం? మీలక్ష్యం ఏదో తెలుసుకొని వెళ్ళండి మరీ.

ఆ: నా పత్రికలు అమ్ముడు పోవడంలేదు...

ఇ: ఆ పత్రికలు తిరిగి తీసుకోండి, దండగ నేను భరించలేను.

ఈ: నాకు దమ్మిడీ ఇవ్వరు: రచనలు ఏంతిని చెయ్యను?

ఉ: ఈ కథలేం బాగోలేవు. ఏం పత్రికలు! బొమ్మల డాబు తప్ప.

ఊ: సినిమాలు చూడండి. నాకు చెత్త సినిమాలు తియ్యడం రాదు.

ఎ: వేల లెఖ్ఖన దబ్బిస్తేనే స్టార్లు దొరుకుతారు...

ఏ: కుటుంబ స్త్రీలు సినిమాల్లోచేరండి ...

ఐ: ఇటుచూడండి. ఇవి సర్వనాశనకారులు. వీటితో నేను ప్రపంచాన్నే జయిస్తాను. అదిగో ఆపట్నం చూడండి! ఇప్పుడు చూడండి! ఏం ఉంది అక్కడ?

[పెద్ద పేలుడు వినబడుతుంది. ప్రవాహం క్షణం అటువేపుచూసి సాగుతోంది మళ్ళీ]

ఐ: మీరంతా నాతో కలవండి. లేకపోతే:

ఒ: ఏం కలవకపోతే? నేను కలవను. నేనూ పట్నాలు లేకుండా చేస్తాను.

[ప్రవాహంలో ఇంకో వైపునుంచి]

గ: నేను మిమ్మల్నందర్నీ కోరేదేమిటంటే...

స: ఓట్లివ్వమని...

ష: మా మీద...సవారి చెయ్యడానికి!

గ: కాదు, కాదు. మీ సేవకి...

స: ఆ తుపాకులెందుకు ఎన్నికలకి?

గ: క్రమశిక్షణ తెలీక కొట్టుకచస్తారని...

స: ష: మేం మా యిష్టం వొచ్చిన వాళ్ళకి వేస్తాం ఓట్లు.

గ: చంపుతాం...మాకే ఓట్లు వెయ్యాలి. మేమే మంచి వాళ్ళం.

ఎన్నో గొంతులు: ఇది అన్యాయం...

గ: అన్యాయంఏమిటి...అంతాన్యాయమే. మీది అజ్ఞానం.

[ఇంకోచోట:]

క: ఇక రాజీలేదు. వీళ్ళని బతకనివ్వకూడదు

ఖ: పొరపాటు. వీళ్ళను జైల్లో పెట్టండి. ఇది భూతవాదం.

క: వీళ్ళు మనఅభివృద్ధిని...(ఎవరో గొంతుక పిసుకుతున్నారు)

రై: నాకు భూమిలేదు. తిండి ఎట్లా?

మ: అధికాహారోత్పత్తి కావాలి.

కా: నాకుకూలీచాలదు. నేను పనిచెయ్యలేను.

పె: నీచేత పనిచేయిస్తాను. మిలిటరీని ఎరుగుదువా? తుపాకులంటే తెలుసా?

మ: ఇది బడ్జెట్. దీంట్లో చాలా లోటు వొచ్చేట్టుంది. అధికంగా పన్నులు వేస్తాం.

ప్ర: ఇవ్వం. ఇచ్చుకోలేం.

మ: మీరంతా నోరుమూసుకోండి. శాంతి రక్షణ క్రింద...

[వెనక మాట్లాడిన వాళ్ళే]

గ: మాకు అఖండ విజయం వొచ్చింది. ప్రజల సానుభూతి మాకేవుంది. [రేడియోలూ, పత్రికలూ అట్లాగే వాపోతున్నయ్].

స: అబద్ధం. సర్వాబద్ధం. కొట్టీ చంపీ సాధించింది. విజయం ఎట్లా అవుతుంది?

గ: నువ్వు దేశద్రోహివి. నిన్ను డిటెయిన్ చేస్తున్నాం.

చాలా గొంతులు: మంత్రివర్యా! ఆకలి. అంతా బ్లాకు. ఏమీ దొరకటంలేదు.ఇప్పించండి.

గ: మేమేం చెయ్యం!మీరు అల్లరిచేయకండి ఏయ్, పోలీసులూ!

స: ఇదా ప్రజాస్వామ్యం?

గ: అని ఎవరన్నారు? కాదని ఎవరంటారు?

స: మీరు మమ్మల్ని పరిపాలించొద్దు...

గ: నువ్వు కమ్యూనిస్టువి. నీకు బైటవుండే హక్కు లేదు.

చాలా గొంతులు:నువ్వెవరు, ఒకరి హక్కు లేకుండా చేసేందుకు?

గ: మీరంతా క...లే. మీకు సభ్యత లేదు. జైల్లో అవన్నీ నేర్పుతారు.

[ప్రవాహంలో జ్వాలలు కనిపిస్తున్నాయి. బ్రహ్మాండమైన ప్రేలుడులు.]

ఒకరు: ఇదేమిట్? ఈయుద్ధం మళ్ళీవొచ్చిందా? వెనుకటిమంటలింకా ఆరనేలేదు...

ఇంకొకరు:ఇది శాశ్వతంగా శాంతి నెలకొల్పే యుద్ధం. ఈ దెబ్బతో తేలుతుంది శాంతిసంగతి.

[ప్రవాహంలో దారుణమైన కేకలు: హీనమైన మానవస్వరాలు]

—అయ్యోనాఊరేదీ?ఏమైనారునావాళ్ళు?

—మీ ఊరా? ఇక్కడ మీ ఊరేమిటి?

—లేదా? తప్పకుండా ఉంది ఇక్కడే. ఆటంబాంబు వేశారేమో.

—మావూళ్ళుకూడా లేవే!

[ప్రవాహం చాలాభాగం ధ్వంసమయింది. పదిమంది మిగిలారు. నిరాశగా చుట్టూ చూస్తున్నారు. అంతా నాశనం. ఎక్కడా పచ్చగడ్డి గాని నదులుగాని పట్నాలుగాని లేవు. తింటానికి ఏమీ లేవు. ఎక్కడచూసినా గంధకంవాసన. పాడుపడిన ఊసరక్షేత్రంలోంచి నడుస్తున్నారు. ఒక్క అస్థిపంజరమన్నా కనపడదు.]

1 వ వ్యక్తి: ఇందుకేనా మన విజ్ఞానం!

2 వ వ్యక్తి: మరెందుకనుకున్నావు?

3 వ వ్యక్తి: మనం బతకడమెలా?

4 వ వ్యక్తి: నీళ్ళయినా లేవు. అంతా శూన్యమైంది.

ఒక చిన్న కుర్రవాడు: ఎందుకని ఇట్లా? ఏమీలేదేం చుట్టూ!

6 వ వ్యక్తి: చాలా ఉండేవి: పచ్చని పొలాలూ, ఫ్యాక్టరీలూ, రేడియోలూ, చాలా మంది మనుషులూ...సినిమాలూ, పాటలూ, కవిత్వం...పత్రికలూ...

కుర్రాడు: అన్నీ ఏమైనాయి?

7 వ వ్యక్తి: యుద్ధంలో నశించాయి.

కుర్రాడు; యుద్ధం దేనికి? అంతమందికి విరోధాలు వొచ్చాయా? అంత గొప్ప లోకాన్ని ఎట్లా శూన్యంచేశారు...? మీరు చెప్పేది నిజమా!

8 వ వ్యక్తి: అంతమందికీ ఏమీ తెలీదు. ఎవరో కొద్దిమందికోసం...ఆ సౌందర్యలోకం ఇట్లా నశించింది. ఇంక యుద్ధాలుండవు... అంతా శాంతే...

ఒక కుర్రాడు: ఇదా శాంతి అంటే! మనంకూడా పోతే శాంతిదక్కుతుందా? మనుషులు అక్కరలేనిదా శాంతి! వెనుకటి విజ్ఞానం నేర్పి చూపిన పర్యవసానం ఇదా!

ఒక వ్యక్తి: అవును. మనుషులుంటేనే భేదాలు; అందుకే గొప్పవాళ్లు ఆలోచించి, పరిశోధించి శాంతికోసం యుద్ధాలూ, యుద్ధాల కోసం శాంతినీ నెలకొల్పారు...బండరాళ్లదగ్గరి నుంచి పరమాణువు వరకూ అన్నిటినీ వుపయోగించి, భూమిమీద అవి లేకుండా చేశారు.

అందరు: (నీళ్లూ, తిండీ లేక మరణిస్తూ) ఇక అన్నిగోళాలవలెనే భూమికూడా శాంతిగా పరిభ్రమిస్తోవుంటుంది.(నిట్టూర్పుతో భూమిమీద పడిపోతారు.)

(తెర)

# వర్ధమానగాయని యామర్తి వరలక్ష్మి

"నారద"

ఆధునిక ఆంధ్రగాయనీలోకంలో శ్రీమతి యామర్తి వరలక్ష్మిగారు వర్ధమానశ్రేణికి చెందినవారు. గడచిన ఎనిమిది సంవత్సరాలుగా సంగీతకళను అనన్యమైన దీక్షతో, ఉపజ్ఞా ప్రతిభలతో సాధించి ఉజ్వలమైన కళాప్రాంశిలి నార్జించింది. తూర్పున కాకినాడనుండి, మద్రాసు వరకు, పడమట కర్నూలు నిజాం సంస్థానములలోను విశేషంగా పాడి సర్వజనాదరణీయురాలైంది.

గౌరవమైన కుటుంబములో గుంటూరులో పుట్టి పెరిగి, ఆంగ్ల హిందీభాషలలో కొంతవరకు విద్యనభ్యసించిన తరువాత, ఆమెను తండ్రిగారు ఫిడేలు విద్యలో ప్రవేశపెట్టారు. శ్రీ సంగీత విద్వాన్ పిరాట్ల శంకరశాస్త్రిగారు ఆమె శారీర సౌష్ఠవ సంపద కచ్చెరువొంది ఫిడేలు మాన్పించారు. పిమ్మట దాక్షిణాత్య రాజాస్థానాల మన్ననలనుపొంది, విశేషఖ్యాతిగడించిన మహా విద్వాంసులు శ్రీమాన్ విజమూరి వరదరాజ అయ్యంగారివద్ద ఆమె తన 11వ ఏట విద్యారంభించింది. ఆ మహనీయుని కృషిపరిపక్వఫలితం యీమె. చాలచోట్ల కచేరీలుచేసి యశస్సౌధాన్ని నిర్మించుకుంది.

శ్రీమాన్ అయ్యంగారు ఆమెకు గురువు, దైవము, తండ్రి: వారికీమె జ్యేష్ఠపుత్రిక. ఈమె నిద్రావస్థయందుకూడ గానమందే చిత్తవృత్తి లయము చేయుటకు యత్నించుతుంది.

ఆమె కాదర్శవ్యక్తులెవరో, (గురువుకాక) ఆమె సంగీతపుస్తకం తెరిస్తే తెలుస్తుంది. శ్రీమతి డి. కె. పట్టమ్మాళ్, యన్. సి. వసంతకోకిలం, యం. యస్. సుబ్బులక్ష్మిగార్ల చిత్రపటములు ఆమె పుస్తకంలో ఉంటవి. పట్టమ్మాళ్ ప్రౌఢత, వసంతకోకిలం భావరసపోషణ, సుబ్బులక్ష్మి రవ్వజాతి పలుకు- ఆమె గానంలో ప్రతిఫలించటమే ఆమె ఆశయము: ఆపైన ఆమె గురువుగారి ప్రతిభ.



యామర్తి వరలక్ష్మి

ఆమె గానం, సాంప్రదాయ సిద్ధం. ఆమెకు సాంప్రదాయమం దభిమాన మమితం; తద్విరుద్ధమైన సంగీతాన్ని వినలేదు. నర్వగాయ సర్వకాలాలలో అద్వైతస్వరూపంకాబట్టి, భిన్న సాంప్రదాయాలు గాన విద్యావినాశ కారణాలంటుంది.

ఆమె రాగస్వరూపనిర్ణయం మిక్కిలి ప్రశంసనీయం. అతి సాంప్రదాయంగా తీర్చిదిద్ది వ్రాసిన రేఖాచిత్రం. ఘనవయ సాంప్రదాయాలతో, నాద సౌష్ఠవంతో భావరస పోషణ మరపురానంత మనోరంజకం. ఒక్కొకసారి అమాంతం తారా జువ్వవలె వినువీధి కెగసి విహరించుతుంది: అక్కడనుంచి ప్రేలిన టౌటువలె జలజల పూలు వ్రాలినట్లు వయ్యారపు నడకలతో దిగుతుంది. ఆమె రాగాలాపనయందు విచిత్రమై, శోభాయమానమైన మనోధర్మం కలదు. సాధారణంగా గాయకులు దురితకాల ప్రస్తారంతో రాగాన్ని

శక్తికి తెచ్చుకుంటారు. ఈమె ప్రథమకాల ప్రస్తారానంతరమే మరితకాల రాగాలాపన చేసి కావలసినంత విదారణ ప్రదర్శించుతుంది. ఈ విధానం ఆంధ్రదేశమందు దాధునికంగా అరుదు. మరియు పురుషులకుకూడా దుర్ఘటమైనశక్తి: అందువల్లనే ఈమె రాగాలాపన నిలకడగా ప్రవహించే కుసుమ విలసితమైన నిండు సెలయేరు.

ఈమె కీర్తనలు శృంగారంచేసిన చక్కని. చుక్కలు. ఎప్పటికప్పుడే నిర్ణీతసూత్ర నియమాలలో నిత్యనూత్న శోభలతో ప్రకాశించుచుంటవి. కీర్తనలను పోషించి, దాక్షిణాత్యులను మరపించే శైలిలో రసానుభవ సిద్ధితో గానం చేస్తుంది. తమిళ కీర్తనలుకూడా సక్రమమైన ఉచ్చారణతో, అర్థానుభవంతో, పోషణ ప్రతిభా కౌశల్యంతో గానం చేయగల సమర్థురాలు. ఈమెను కాకినాడ, బాపట్ల, నెల్లూరు, కర్నూలు, వరంగలు ఇత్యాది పెక్కుచోట్ల తమిళ దేశస్థురాలని పొరబడ్డారు; కాదన్నా వారు నమ్మేవారు కారు. ఆమె వెంటవుండే ఆమెతండ్రిగారు తమలపాకులు నమలటంకూడా ఒక కారణమేమో!

ఈమె, స్వరప్రస్తారాలు సుఖప్రధానమైన గతులతో, మనోరంజకమైన పతకములతో, విసుగుపుట్టించనంత కాలప్రమాణంలో నడుపుతుంది. పారిశుద్ధ్యము, కాలప్రమాణం, రక్తి, మనోధర్మము, తానం, పల్లవులందు పాండిత్యగరిమ, నాదపుష్టి ఈమెగానంలోని వివిధాలంకరణాలు. ఈమె దాక్షిణాత్యులకేవిషయాలలోకూడా తీసిపోని వినయశంపత్ సౌభాగ్యవతి- లక్ష్యలక్షణ ప్రధానమైన సంగీత సాంప్రదాయాన్ని కాపాడుకొనుట యందున్న ఆసక్తి నూతన మార్గాన్వేషణములందు లవలేశంకూడా లేదు. అది వృథాకాలయాపన అంటుంది.




[కలకత్తా మెయిల్‌లో సెకండుక్లాసు కంపార్టుమెంటు: సాయంకాలం ఐదుగంటలు. మెయిలు సామర్లకోట స్టేషన్ వదిలింది. పెట్టెలో నాలుగున్నర పాసెంజర్లు వున్నారు. ఒక చంటిబిడ్డ తల్లి; ఉన్నతోద్యోగిభార్య అయివుంటుంది. చదువుకున్నట్లు కనబడుతుంది. ఆమెతో బాటు ఆర టిక్కెట్టు కుమారుడు. వయస్సు ఆరేళ్ళకు యెక్కువ వుండదు. తెలివైన ముఖం. ఇతర ప్యాసెంజర్లు—ఒక బుర్రమీసాల రిటైర్డ్ పోలీసు వుద్యోగి; తెల్లని ఖద్దరు బట్టలు కట్టుకున్న ఒక పెద్ద మనిషి. సిల్కు—చొక్కా మీద జరీఅంచు కండువా వేసుకున్న ఒక నల్లని సాహుకారు. కుర్రవాడు బెర్త్‌మీద పడుకుని పైకి చూస్తూ చదువుతున్నాడు.]

కుర్ర : దొంగ...లు...న్నా...రు...జా...గ్ర...త్త...అమ్మా!

తల్లి : ఊఁ!

కుర్ర : దొంగలున్నారంటే! ఎక్కడున్నారే!

త : రైళ్లలోనే.

కుర్ర : మన పెట్లో వున్నారా?

(కుర్రవాడు మిగిలిన పాసెంజర్లకేసి చూస్తాడు. తన సర్వీసులో పెక్కుమంది దొంగల్ని పట్టిన ఆ పోలీసు వుద్యోగి మీసాల వెనుక నవ్వుకుంటున్నాడు.)

తల్లి : (నవ్వుతూ) వట్టిదేరా. అట్లా రాస్తారు.

కుర్ర : వట్టిదే అయితే రాయడం యెందుకూ?

(ఆ కుర్రవాడి ప్రశ్నలు తల్లికి అలవాటే కాబోలు. మామూలు తల్లుల్లాగ వీపు బద్దలు కొట్టకుండా ఓపికతో సమాధానాలు చెపుతోంది.)

త : అస్తమానం వుండరు.

కు : ఎప్పుడుంటారు?

త : రాత్రిసమయాల్లో పెట్టెలో అవీ యెత్తుకు పోతూ వుంటారు.

కు : అయితే, దొంగ లున్నారని వ్రాశారేం? వుంటారని వ్రాయక?

త : (సమాధానం చెప్పలేక పోయింది)

(ఇంతలో చంటిపిల్లాడు ఏడ్చాడు. పాలసీసా నోట్లో పెట్టి తల్లి బుజ్జగిస్తోంది.)

కు : అమ్మా! దొంగలెట్లా వుంటారే?

త : ఎట్లా? మనుషులేరా, మనలాగే వుంటారు.

కు : మరి దొంగలని యెలా తెలుస్తుంది?

త : దొంగతనం చేసేవాళ్ళని దొంగ లంటారు.

కు : దొంగతనం అంటే?

త : ఇతరుల వస్తువుల్ని కాజేయడం.

కు : అయితే, మామయ్య దొంగే!

త : ఛీ! అలా అనకూడదురా.

కు : కాదే, నిన్న నా పెన్సిల్ కాజేశాడు. మరి దొంగ కాదూ?

త : అది కాదురా, పరాయివాళ్ల వస్తువులు కాజేస్తే అది దొంగతనం.

కు : పరాయివాళ్ళంటే? మామయ్య పరాయివాడు కాదూ?

త: ఛా! మామయ్య మా తమ్ముడు కాదు(టా, మనం అంతా బంధువులం.

కు: అయితే బంధువుల్లో దొంగతనం చేసుకో వచ్చునన్న మాట!

త: అదికాదు. దొంగలైతే చాటుగా వస్తువులు కాజేస్తారు.

కు: అయితే నువ్వు దొంగవే!

త: (ఎంచేత అన్నట్టుగా చూసింది)

కు: నాన్నగారి కోటుజేబులో నువ్వు చాటుగా డబ్బులు తీస్తూవుంటావుగా- (దొంగను పట్టు కున్న పోలీసు ముఖం పెట్టేడు)

త: (చిన్నగా నవ్వేసి వూరుకుంది)

[రాజమండ్రి ప్లాట్‌ఫారం- అదే కంపార్ట్ మెంటు. సాయంకాలం ఆరుగంటలు. ఒక పాతి కేళ్ళ యువకుడు ఆ పెట్టెలో యెక్కేడు. ఖరీ దైన సూట్ వేశాడు. ఒక సూట్ కేస్ చిన్నది చేతిలోవుంది. బండిలో కూర్చోగానే సిగరెట్ వెలిగించాడు.

తల్లి కుర్రవాడికి బిస్కట్లు కొనిపెట్టింది. బండి కదిలింది.]

కుర్ర:(ఆఖరి బిస్కట్ తింటూ) అమ్మా, దొంగలు యెందుకు దొంగతనం చేస్తారే?

త: వాళ్ళదగ్గర డబ్బులేక.

కు: ఎంచేత వుండదే వాళ్ళదగ్గర డబ్బు?

త: వాళ్ళంతా బీదవాళ్లురా. అందుకని భాగ్య వంతుల డబ్బు కాజేస్తారు.

కు: భాగ్యవంతులకి డబ్బు యెలా వస్తుందే?

త: సంపాదించుకుంటే వస్తుంది.

కు: మరి దొంగలది కూడా సంపాదనేగా?

త: కాదు. (ఎందుకు కాదో చెప్పలేకపోయింది)

[అదే కంపార్ట్‌మెంటు. నిడదవోలులో మెయిల్ ఆగింది. సాయంత్రం ఆరున్నర. టికెట్ ఎగ్జామినర్ పెట్టెలోకి వచ్చాడు. ఆ తల్లిని తప్ప మిగతావాళ్లందరి టిక్కట్లూ తనిఖీచేసి దిగి పోయాడు. అతడు పెట్టెలో వున్నంతసేపూ ఆ కుర్రవాడు యెగ్జామినర్‌కేసి చూస్తున్నాడు.]

కు: అమ్మా, ఆ వచ్చింది ఎవరే?

త: టికెట్ ఎగ్జామినర్.

కు: అంటే?

త: అందరికీ టిక్కట్లు వున్నాయో లేవో అని తనిఖీచేస్తాడు.

కు: మరి మనల్ని తనిఖీ చెయ్యలేదేం?

త: మనలాటివాళ్లు టికెట్లు లేకుండా ప్రయాణాలు చెయ్యరని వాళ్ళకి తెలుసు.

కు: మరి నాకు టికెట్ లేదుగా!

త: నీకూ వుంది. (కుర్రవాడికేసి మందలింపుగా చూసింది.)

(ఆ తల్లి అబద్ధం ఆడినట్టుగా ఆమె ముఖమే చెపుతూంది. పెట్టెలోని పాసెంజర్లు అది గమనించారో లేదో! అమాయకుడైన ఆ కుర్రవాడు మాత్రం యింకా ప్రశ్నలు వేస్తూనే వున్నాడు.)

కు: టికెట్ లేకపోతే యేంచేస్తారే?

త: ఏంచేస్తారు? జైల్లో కూడా పెడతారు.

కు: వాళ్లు టిక్కట్లు యెందుకు కొనుక్కోరు?

త: బీదవాళ్లు కదూ, డబ్బులేక.

కు: వాళ్లు యెంచేత బీదవాళ్లు అయ్యేరు?

(మళ్ళీ అదే ప్రశ్న వచ్చింది. ఈ లోకంలో కొందరు ధనవంతులుగానూ, కొందరు బీదవాళ్ళు గానూ యెందుకు వున్నారని యిటువంటి కుర్ర వాళ్ళంతా ప్రశ్నిస్తూనే వున్నారు. ఇంతవరకూ యేతల్లీ, యేతండ్రీ దానికి సరైన సమాధానం చెప్పలేకపోయారు. ఈ తల్లి మాత్రం యేం చెప్తుంది?)

[గూడూరు జంక్షన్, తెల్లవారుజాము మూడుగంటలు. స్టేషన్‌లో బండి నిలబడగానే తల్లి నిద్రపోతూన్న కుర్రవాడిని లేపింది. కూలీ అని కిటికీలోనుండి కేకవేస్తూవుండగా ఆమెకోసం వచ్చిన భర్త కంపార్ట్‌మెంటులోకి వచ్చాడు. కుర్రవాడు నాన్న దగ్గరికి చేరాడు. అందరూ దిగారు: జవాను, కూలీలూ సామాన్లు దింపు తున్నారు.]

తల్లి: (జవానుతో) వెంకయ్యా. సామాన్లుఅన్నీ దిగినాయా?

జవా: దిగాయమ్మా - రెండు పరుపులూ, నాలుగు పెట్టెలూ...

త: నాలుగుపెట్టె లేమిటి? అయిదూ!

(జవాను సామాన్లు మళ్లీ లెక్కపెట్టేడు)

జ: అంలేనమ్మా, నాలుగు పెట్టెలేవున్నాయి.

త: (కంగారుగా) సరిగా చూడండిరా! నాపట్టు చీరెలన్నీ ఆ పెట్టెలోనే వున్నాయి!

ఆఫీసరు: ఆకంపార్ట్‌మెంటులోనే వుండేమో చూడండి సరిగా.

(కంపార్ట్‌మెంటు అంతా వెదికారు. పెట్టె లేదు. పాసెంజర్లని అడిగేరు. మాకు తెలియదంటే తెలియదన్నారు. పెట్టెలోవున్న పింఛను పోలీసు వుద్యోగి ప్లాట్‌ఫారంమీదకి దిగి వచ్చాడు.)

పో. వు: (ఆఫీసరుతో) గుడ్‌మార్నింగ్ సార్! మీ పెట్టె పోయినందుకు వెరీ సారీ. రాజ మండ్రిలోఒకకుర్రాడు యెక్కాడండీ సూటూ గట్రా వేసుకొని! ఎక్కడ దిగిపోయాడో తెలియదుకాని, వాడే కాజేసివుండాలి. నేను మొదట్లోనే పసిగట్టేశానండీ, వెరీసారీ!

(కుర్రవాడు యీ హడావిడి అంతా గమనిస్తూనేవున్నాడు.)

కుర్ర: (ఆఫీసరుతో) నాన్నగారూ, సూట్‌వేసు కున్నవాళ్లూకూడా దొంగతనం చేస్తారా?

(తన అరటికెక్కొట్టు కొడుకు యీ ప్రశ్న యెందుకు వేశాడో ఆ తండ్రికి అర్థంకాలేదు. మెయిల్ కదిలింది.)



# ఇంకా జనవరిజీతం రాలేదు

మహమ్మద్ ఇస్మాయిల్

ఎయిడెడ్ యెలిమెంటరీ ఉపాధ్యాయులకు ఏ నెల జీతం ఆనెల ఇస్తారన్న మద్రాసు ప్రభుత్వ ప్రకటన విని చాల సంతోషించాను. కాంగ్రెసు మంత్రులు, శాసనసభ్యులు, ప్రభుత్వోద్యోగులు-ఇంతెందుకు-పండిట్ జీ, పటేలు జీలతో పాటు నేనుకూడ ఇకనుంచి ప్రతినెల జీతము పుచ్చుకుంటానని గర్వంగా నా సతీ తిలకానికి, స్నేహితులకు చెప్పేశాను. ఆదెందుకోగాని నాకీ అర్థంకాని రీతిని పిల్లకాయలకు పాఠాలు చెప్ప టలో హుషా రెక్కువైంది. ఆర్థికమైన ఇబ్బందు లకు, బాలురకు విద్య నేర్పించుటకు ఎంత అవినా భావ సంబంధం వుందో ఆ రోజు తెలుసుకో గలి గాను. నాకు అవసరమైన నా దైనిక జీవితావ సర వస్తువులు ప్రజాప్రభుత్వం పూర్తిగా సహా యం చేస్తే అప్పుడు నా సర్వశక్తులు ఏవిధంగా విద్య గరపుటలో కేంద్రీకరించగలనో వూహించ గలిగాను.

'ఇక మీకేం ఫరవాలేదు. ఏనెల కానెల పారవేస్తాం. నెల జీతములు వస్తున్నాయి' అని ధీమాలో అప్పులవాళ్ళకు సమాధానం చెప్పాను. అల్పసంతోషులైన కొంతమంది ఉపాధ్యాయులు అప్పుడే ప్రభుత్వం చేసిన ఘనకార్యాలు పొగడసాగారు. సమ్మె పరిస్థితికి దించకుండానే మదరాసు ప్రభుత్వం ఎయిడెడ్ వుపాధ్యాయుల ప్రధానమైన కోర్కెను తీర్చినందుకు సంతోషాన్ని వెలిబుచ్చుచూ ఒక అభినందన తీర్మానం డి. ఐ. గారి అధ్యక్షతక్రింద సెంటర్ క్లాసు మీటింగులో ఏకగ్రీవంగా ఆమోదించబడింది.

1949 జనవరి నెలనుంచి ఎయిడెడ్ వుపాధ్యాయులకు మూడునెలల కొకసారి జీతములిచ్చే పద్ధతికి స్వస్తిచెప్పి ప్రతినెల జీతములు ఇచ్చుటకు ప్రభుత్వం నిర్ణయించిందని అసెంబ్లీలో విద్యాశాఖామంత్రిగారు ప్రకటించారు. ఆ విశదీకరణ 'ఆంధ్రప్రభ'లో చూచి ఆనందభరితుడ నయాను. ఏజెంటుకు ఒక్క అణా తరువాత ఇస్తానని పేపరుకొని సోదర వుపాధ్యాయుల కందరికి టాంటాం చేశాను.

అఖిలభారత జాతీయ కాంగ్రెసు నాయకుల "ప్రజలంతా స్వతంత్రభారత పునర్నిర్మాణ కార్యక్రమాన్ని బలపరచాలి. బాపూజీ మనలను వీడినా, ఆయన ఆదర్శాలింకా జీవించేవున్నాయి" అన్న ప్రకటనలతో జనవరి 26 వ తేది స్వాతంత్ర్య దినోత్సవం సాక్షిగా జరిగిపోయింది. స్వర్గీయ సరోజినీదేవి కొరకు సంతాపతీర్మానాలు తయారు చేసి ప్రవేశపెట్టి, యు. పి. కు పంపుటకు ఫిబ్రవరి నెలంతా కావలసివచ్చింది. అందువల్ల నేమొ జనవరినెల జీతం ఫిబ్రవరి ఆఖరువరకు రాలేదు. మార్చినెలలో వీరభగవత్ సింగ్ వర్థంతి

చేయకపోయినా, "నేషనల్ సేవింగ్స్ స్కీమ్" వారం జయప్రదంగా జరిగింది. కాని ఇంతవరకు మా జీతాలు రాలేదు.

ప్రతిరోజూ పోస్టుకొరకు ఎదురు చూడడం, ఆశలో నిరాశ, మామూలైపోయింది. డబ్బు మొగంచూచి మూడు నెలలు కావస్తోంది. జరిగిన నెలలకంతా ఒక్కసారే ఇస్తారనుకొన్నారా? కాదు కాదు. ఏప్రిల్ నెల జరుగుతూవుంది. ఒక వేళ జీతం ఇస్తే జనవరి నెలదిమాత్రం ఇస్తారు. ఫిబ్రవరిది మేనెలలో. మూడు నెలల భేదం. దీని కన్నా మూడునెలల కొకసారి గ్రాంటు ఇచ్చే పద్ధతేబాగుంది. ప్రతినెలాజీతాలుఅంటేఇదా అర్థం?

"మీనోట్లు తప్పక ఇవ్వాలి. ఇప్పించాలి. మీ బడి పిల్లలను ఊరేగింపుగా తీసుకువెళ్ళండి. నా పేరెత్తి జై కొట్టండి. గాంధీజీ ఆశీస్సులు పొందిన భారతజాతీయ కాంగ్రెసు అధికార ప్రతినిధి అని చెప్పండి. మీకు ఎంత ఖర్చు అయినా నేను ఇస్తాను." అని చెప్పుకొంటూ, బ్రతిమాలుకొంటూ, మా పల్లెలన్నీ తిరిగి తిరిగి, మా పలుకుబడిద్వారా ఓట్లు సంపాదించిన మా నియోజకవర్గ శాసనసభా ప్రతినిధి, అఖిలభారత జాతీయ కాంగ్రెసు నాయకులు, మా జీ భారతరాజ్యాంగ నిర్మాణసభ సభ్యులు, కొన్ని వందల ఎకరాలు మాగాణిగల భూస్వామి, ఆంధ్ర కేసరితో కుస్తీచేసి 'తమిళ, కర్ణాటక, మహా రాష్ట్ర, ఆంధ్రకేసరి' అని బిరుదుపొందిన ఏకైక అసెంబ్లి నాయకులు, కాశ్మీరు రణరంగానికి పంపిన మద్రాసు సైనికులకు ప్రోత్సాహాలు కల్పించిన విప్లవాత్ములు, బర్మా భారతీయులకు భారాలు లేకుండా చేయుటకై రంగూనుకు 'హనుమాన్' లో ఎగురుటకు సిద్ధపడిన అంతర్జాతీయ రక్షామణి, బంధుమిత్రులకు సహాయం చేయుటలో త్యాగ మూర్తి, అయిదు ఎకరాలు రావలసిన రాజకీయ బాధితులు సైతం మమ్మలను మరిచారే! ఇక మాకు గతి ఎవరు? పోనీ, శ్రీవారైనా మాతోటి జీతాలు తీసుకోకుండావుంటే కొంచెం మనశ్శాంతైనా వుంటుంది! అపని ఎప్పటికీ జరుగదు.

రోజూ రోజు పూట గడుపుట ఎలా అన్నదే, నాకైనిక సమస్య! గోంగూర, మజ్జిగ అమ్మే పున్నక్కదగ్గరనుంచి షాహుకారువరకు అప్పులే! మూడు నెలలముందు వచ్చిన గ్రాంటు, ముందు వున్న బాకీలకే సరిపోలేదు. మరి ఈ మూడు నెలలు, నేను ఇన్ని రోజులనుంచి సంపాదించిన పలుకుబడినంతా వుపయోగించి కుటుంబం జరుపు తున్నాను. ఖాతాదార్లకు వాగ్దానంచేసిన గడువు ప్రకారం చెల్లించకలేకపోయాను. మాట నమ్మకం పోయింది. ఇకనుంచైనా పరువు, మర్యాదలతో బ్రతికే అవకాశం ఈ ఆజాద్ హిందూస్తాన్‌లో గ్యారంటీలేదా! 'మేము జీతాలు పంపేవరకూ ఎయిడెడ్ వుపాధ్యాయులవద్ద ఎవరూ తమ బాకీలు చెల్లించమని పీడించకూడదని శాసనం చేయకూడదా?

ఒకవేళ జనవరి నెల జీతం వచ్చింది అనుకొందాం. మధ్యతరగతి మర్యాదస్థుడనైన నేను, ఈ మూడునెలల అప్పులవాళ్ళకు ఎలా సమాధానం చెప్పాలి? నా భార్య శరీరారోగ్యం సరిగాలేదు. మందు యిప్పించలేను. డాక్టర్లకు ఫీజు ఇస్తేగాని హృదయపరివర్తనం కలుగదని నాకు తెలుసు.

ఈ పజిల్ ఎవరు సాల్వ్ చేస్తారు?

ఏప్రిల్ జరుగుతోంది. మంత్రివర్గం మారింది. కాని ఇంకా జనవరి జీతం రాలేదు.

# నా దైనిక సమస్యలు

## 1

నలుగురు మిత్రులతోనూ కలసి కాఫీ హోటలుకు ప్రొద్దుటే వెళ్ళడం తప్పదు. ఒకవేళ వెళ్ళడం మానుకుంటే, 'వీడు వట్టి పిసినిగొట్టు, కాఫీ అయినా పుచ్చుకోడు, ఓ పూట భోజనం కూడా మానేస్తే మరీ కలసి వస్తుంది' అనుకుంటారేమోనని భయం. తీరా వెళ్ళింతరువాత వాళ్ళందరూ నాలుగిడ్లీ, రెండు పెసరట్లు, రెండు దోసె, కప్పు కాఫీ తీసుకుంటుంటే, కాసిన్ని మంచినీళ్ళు, అరకప్పు కాఫీ పుచ్చుకుని చూస్తుంటే బాగుంటుందా? అధమం వారిలో సగం అయినా సరుకు వెయ్యాలి. తీరా బిల్లు కాతా వ్రాసి వస్తుంటే 'నెలయింది. ఇంకా చెల్లించారు కాదంటాడు. ప్రొప్రైటరు. పాపం అతనుమాత్రం ఏం చేస్తాడు, ఏ నెలకానెల పాతిక రూపాయలు అరువు కాతా ఐతే.

భోంచేసి స్కూలుకు బయల్దేరితే 'అ-నువ్వొక్కడవే చదివి బాగుపడేవాడవు. మేమందరం మట్టికలసేవాళ్ళం కాబోలు' అంటారు మిత్రులు. ఇంతకూ వాళ్ళ ఉద్దేశ్యం ఏమిటో అర్థంకాదు. కాని, మిత్రులు నాకు చేసే ఉపకారం అల్లా, వచ్చేనెల్లో వచ్చే డబ్బుకు ఈ నెల్లోనే ఖర్చు చూపించడం. పోనీ మామూలుకంటే పది రూపాయలు ఎక్కువ తెప్పించుకుందామంటే యిరవై రూపాయలు ముందు ఖర్చయి కూర్చుంటే ఖర్మం ?

మా మిత్రులకు ఆ ఐకమత్యం ఎలా వచ్చిందో కాని, ఒక్కడు సినీమాకెళ్ళాలని ప్రపోజ్ చేశాడా, అందరూ ఐక్య కంఠంతో అనుమతించి తీరాలి. వాళ్ళందరూ పోతుంటే మనం తలుపు బిడాయించి కూర్చుంటే బాగుంటుందా? పోనీ వెడతామయ్యా. ఏ బెంచీ టిక్కెట్టో కొని చూసే రకాలా యివి. ఒకడు 'చైర్' అంటే మరొకడు 'రిజర్వుడు'. తక్షణం రిజర్వుడు టిక్కెట్ కొని అందరూ వెళ్ళవలసిందే. అలా వెళ్ళకుండా ఏ బెంచీయో కొన్నానా నా పరువు దక్కినట్టే! ఇంటినుంచి నెలకు 60 రూపాయ లొస్తుంటే వచ్చిన మర్నాటినుంచే ఖాతాలు పెరుగుతుంటాయి.

ఇంత ఖర్చు చేస్తున్నాను కదా, అంతా కష్టపడి చదువుతున్నానా అంటే అది లేదు. తక్కిన భాగాల్లో అట్టే ప్రమాదంలేదుకాని ఇంగ్లీషులోమాత్రం వ్యవహారం చెడిపి కొట్టేలా వుంది. ఇంగ్లీషు పుస్తకం చదవడానికి తీశానా ఎప్పుడూ రాని తలనొప్పి, ఎక్కడాలేని బద్ధకం నన్నావరిస్తాయి. పోనీ చదవకపోతే మాస్టారు చెప్పింది సరిగా వింటానా అంటే, ఒక్క ఇంగ్లీషు పీరియడ్‌లో తప్ప తతిమా అన్నిట్లోనూ మెలకువగానే ఉంటా. వింటా కూడా శ్రద్ధగా. పోనీ అంత ఇష్టంలేని భాషమానేద్దామంటే ఇంటర్మీడియేట్ ప్యాస్ అవం కదా ఎలా?

•

ఇంటి దగ్గర నేను చేసే ఖర్చు ఎలా సంపాదిస్తున్నారో, ఎలా భరిస్తున్నారో కాని అది మాత్రం నాకు పట్టదు. కాని నేనుమాత్రం నా రెక్కలమీదే జీవించాలికముందు. పోనీ ఏ గుమాస్తాపనిలోనైనా చేరదామంటే, అందరూ చెయ్యలేక విసుక్కుంటున్న ఆ చచ్చు గుమస్తా పనైనా నాకు లభించడంలేదు.

రేపు పరీక్షల్లో ఇంగ్లీషు మిగిలిపోయిందంటే, మా గ్రామంలో చదువు ముక్కా మొగంకూడా తెలియని వాళ్ళు 'రోడ్లంట షైర్లు కొడుతుంటే పరీక్ష ప్యాస్ అవుతుందా?' అని చీవాట్లు పెడితే భరించగలనా అన్న భయంకూడా కలుగుతుంది.

నా యీ సమస్యలన్నీ నామిత్రులక్కూడా ఉంటాయనే నానమ్మకం. కాని మాలో మేం వెల్లడిచేసుకుంటే అది గౌరవహాని. ఇంతకూ ప్రభుత్వంవారు మిత్రత్వాన్ని రద్దు పరిచే చట్టాలేవయినా చేస్తే నా సమస్యలు చాలమటుకు తీరేవేమో !

తాణేలంక — జె. వి. నాథం

# 2

నేను పుట్టింది మధ్యతరగతి రైతుకుటుంబం. బస్తా రూ 2-8-0 లు అమ్మేరోజుల్లో నా తలిదండ్రులు వ్యయప్రయాసలకోర్చి నాకు స్కూలుఫైనల్ వరకు చదువు చెప్పించారు. తర్వాత నేను కోఆపరేటివ్ ట్రెయినింగు ప్యాసై, సహకార భూమి తనఖా బ్యాంకులో ఐదేళ్ళు సూపర్ వైజరుగా పనిచేశాను. ఎన్నాళ్లైనా చూచినా రు 59 లు లేని నౌఖరీ యెందుకని 1944 లో యమ్. యస్. యమ్. రైల్వేలో టెలిఫోను క్లార్కుగా చేరాను. నాలుగేళ్లు పని చేశాను. సుమారు రు 1500 లు అప్పుచేసి యెలాగో సంసారం బెజవాడలో గడిపాను. ఆ నౌఖరీమీద కూడా యిష్టంలేదు. మరల అధికారుల నడిగి టికెట్ కలెక్టరుగా మారాను. చేరేనాడే దొర వారు "నీకు అరవజిల్లాలలో ఉద్యోగం యిస్తాను. మళ్ళీ నీ స్వస్థానానికి ట్రాన్స్ఫరు అడుగవద్దు" అని షరతు పెట్టి, అందుకిష్టమేనని నాదగ్గరనుంచి లిఖితమూలం తీసుకున్నాడు. సరే మ్యూచుయల్ ట్రాన్స్ఫరుమీద వెళ్ళవచ్చు గదా అనే వుద్దేశంతో నార్త్ ఆర్కాటుజిల్లాలో చేరాను. నాకు తెలుగు, ఇంగ్లీషు తప్ప- మరే యితర భాషా రాదు. నా డ్యూటీలో నేను అరవం, మలయాళం, కన్నడం సామాన్యులతోను, ఇంగ్లీషు చదువుకున్న వారితోను మాట్లాడవలసి వుంది. పై జెప్పిన ప్రాంతీయభాషలు ఏవీ రానందున, నేను నా దైనందిన జీవితంలో ఎంతైనా అవస్థపాలవుతున్నాను. మా స్టేషనులో ఉన్న బుక్ స్టాలుకు "తెలుగు స్వతంత్ర" పత్రిక వస్తుంది. నేను ప్రతి వారం పత్రిక చూస్తూంటాను. ఇంట్లో యిల్లాలుకు "తెలుగు స్వతంత్ర"యే చుట్టము,పక్కము, తోడు- అన్నీ. ఒకచోట రేడియో వున్నది. అచ్చటకుపోయి వారిని బ్రతిమాలుకొని రోజూ ఒక పావుగంటో, అరగంటో విజయవాడ రేడియోపాటలు వింటున్నాను.

ఐదు సంవత్సరాలు సర్వీసు అవుతున్నా ఉద్యోగం యింకా టెంపరరీయే. జీతం రు 61 లు, కరువు భత్యంకాక. ఉద్యోగానికితగ్గ సంబళం లేదు. జీవనవ్యయానికి తగ్గ భత్యంలేదు. రూల్సు ప్రకారం, యూనిఫారం వేసుకోవాలి. ఇప్పటికి డ్రస్ సప్లయిలేదు. ఉండటానికి యిల్లు అంత కంటె లేదు. ఇప్పటికి నాకు సర్వీసులో యింక్రిమెంట్లు కంటె, పిల్లలు జాస్తి అయినారు. పెద్ద పిల్లవాడు, తర్వాత కుమార్తె; స్కూలుకు పోయే వయస్సు. "ఇక్కడ తెలుగులేదు. నా పిల్లలు చదువులేక పాడవుతున్నారు; నాకు యితర భాషలు రాకపోవడంచేత యిక్కడి జనంతో అవస్థపడుతున్నాను. నాబోటి అరవ, మలయాళ సోదరులూ ఆంధ్రదేశములో యిదేమాదిరి అవస్థ పడుతున్నారు. మ్యూచుయల్ ట్రాన్స్ఫరుకు యేమి ఆటంకం స్వామీ?" అని అధికారులతో ఎన్నిపర్యాయాలు స్వయంగా చెప్పుకొన్నా, నేను మొదట ట్రాన్స్ఫరు అడుగనని వ్రాసి యిచ్చాను గనుక, నాకు ట్రాన్స్ఫరు అయ్యే అవకాశంలేదని ఆర్డరు యిస్తున్నారు. చాలీచాలని జీతంతో స్వజనానికి 400 మైళ్ళ దూరంలో, నేనెంతకాలం యిలాఅవస్థపడాలో అని నిద్రలో కూడా ఆలోచన. పిల్లలకు తెలుగు చదువు ఎలాగా అన్నది నా నిత్యసమస్య.

1949 ఫిబ్రవరిలో ఇండియా పార్లమెంట్ రైల్వే బడ్జట్ చర్చలో గౌరవ సభ్యుడు, (ఫ్రాంక్ ఆంథొనీ అనుకొంటాను) కొన్ని జంక్షనులలో టికెట్ ఎగ్జామినర్లకు రైల్వే మినిస్ట్రీ కంటె కూడా యెక్కువ రాబడి వస్తుందని అన్నాడు. ఒక్క చీర కొనమంటే డబ్బు లేదంటావు అని యింట్లో యిల్లాలు నామీద గలాటా సాగిస్తుంది. రామ, రామ, సిగరెట్టుకు గతిలేదు అని ఒట్టుపెట్టుకొని, కావాలంటే చూసుకో అని భార్యమీద పర్సు పారవేస్తూంటాను. ఇంట్లో యీగలమోత - బైట పల్లకీలమోతగా ఉంది నా వ్యవహారం. చూచినవాళ్లు సూట్, బూట్ వేశాడు, వాడికేమనుకొంటారు. కాని నా సమాచారం వాళ్ళకేమి తెలుస్తుంది? పేరు గొప్ప, ఊరు దిబ్బ. ప్రజలపట్ల విధేయతతో మెలగాలి. రైల్వేకు ఆదాయం చూపెట్టాలి. వేషం నీటుగా ఉండాలి. వారంరోజులు రాత్రి, వారం రోజులు పగలు రోజుకు పన్నెండు గంటలు డ్యూటీ చెయ్యాలి. ఎన్నాళ్ళయినా యిదే డ్యూటీ; యిచ్చే జీతంరాళ్లు చాలవు; పిల్లలకి చదువులు, మందులు; చాటుగా కిరసనాయిలు కొనడం.

వీటికి డబ్బు యెలాగా అన్నదే నా దైనిక సమస్య.

జాలార్‌పేట          బి. యస్. పి. రావు

## 3

నేను బి. ఏ. పాసయినాను. బి. ఏ పాసు కావడం కష్టమో సుఖమో అనుభవం ఉన్న వాళ్ళకే తెలుస్తుంది. తల్లిపాలు మరిచినప్పటి నుండి ఓనమాలు నేర్చుకోవడంతో మొదలుజేసి పదునాలుగు సంవత్సరాలు కష్టపడితే లభించింది ఒక డిగ్రీ, ఒక కాగితంముక్క. ఈ పదునాలుగేండ్లలో మన విద్యా విధాన బిక్షవల్ల ప్రపంచమంతా బావిలోనే ఉన్నదనుకునే కప్పవలె జీవితమంతా పుస్తకాల్లోనే చూడడం జరిగింది. ఆరోగ్యము, తిండి, వినోదము, ఇవన్నిటికి స్వస్తి చెప్పవలసి వచ్చింది. ఉపాధ్యాయునిముఖం తప్పితే యింకొక ముఖ మెట్లుంటుందో తెలియదు. పరీక్షా సమయాల్లో రాత్రింబగలు నిద్రాదేవికి 'ట్రీ' కప్పుల లంచం ఇచ్చుకుంటూ నడుం వంగేవరకు చదువవలసివచ్చింది. అదంతా గతచరిత్ర. ఎలాగో ప్యాసయాను.

ప్యాసయే టంతవరకు చాల ఆనందంతో యేదో గడించుదామన్న ఆశతో కష్టపడి చదివాను. తలిదండ్రులు, మా వాడు బి. ఏ చదివి తహసీల్దారో లేక ఏదో ఉన్నతోద్యోగో అవుతాడని ప్రతివారితో చెప్పి ఆనందించడం సహజం! లేకపోతే వాళ్లు యేదో ప్రాణంపోని కూడు తిని, మానంపోని బట్టగట్టి, పైస పైస ముడివేసి నాకు పంపడం యెందుకు?

ఇంత జేసినా కర్తవ్యమేమిటో తెలియడం లేదు. నేను జీవితరంగంలోని యేశాఖలో ప్రవేశించాలో తెలియడంలేదు. ఇప్పటి విద్యావిధానం గ్రాడ్యుయేట్లకు ప్రభుత్వోద్యోగం తప్ప వేరే శాఖ పనికిరాదని శాసించింది. ఈ శాసన ధిక్కారంచేసి యెవరన్నా వ్యవసాయమో, వ్యాపారమో లేక ఇంకేదైనవృత్తినో అవలంబించితే వాళ్లు ఓనమాలు రానివారికన్న అధోగతి పాలు కావడమే జరుగుచున్నది. ప్రభుత్వోద్యోగాల సంగతి ఇంకా అధ్వానంగా ఉంది. గ్రాడ్యుయేట్లు ఆఫీసులముందు చప్రాసీలకన్న ఎక్కువగా హాజరుకావడం జరుగుచున్నది. ఒక ఆఫీసుకుపోతే లంచంలేంది మాట్లాడేవారు దొరకరు. ఇంకొక ఆఫీసులో పబ్లిక్ సర్వీసు కమీషను ద్వారానే కమ్మని హుకుం ఇవ్వబడుతుంది. వేరే ఆఫీసులో గుమాస్తాగిరీకి 5 ఘంటలు బాగా పనిచేస్తే యేదో 100 రూపాయల ఉద్యోగం ఖాళీ ఉన్నదన్నవార్త. మరొక ఆఫీసులో నీవు హిందువునివా? ముస్లింవా? బ్రాహ్మణునివా, బ్రాహ్మణేతరునివా? నీకు సిఫారసుఉందా లేదా! అన్న ప్రశ్న పరంపర పరోక్షంగా వచ్చి పడుతుంది. ఈవిధంగా ప్రతిదాంట్లో యేదో విధమైన కంటకాలు పడడం జరుగుతుంది. ఇన్ని కష్టాలనుభవించినా గుమస్తాగిరికన్న యెక్కువ దొరికే సూచనలే కనబడవు. ఉన్నతోద్యోగాలను యెవర్ని, యెప్పుడు, యెవరు నిర్ణయిస్తారో ప్రపంచానికే తెలియదు.

ఐతే ఇప్పుడు నన్ను వేధిస్తున్నసమస్య బి.ఏ. కావడంగుమస్తాగిరికేనాఅని. పదునాలుగేండ్లు శరీరాన్ని కృశింపజేసుకోవడం, మళ్లీ శరీరాన్ని బందపనుజేసి కుర్చీలో కూర్చోబెట్టి టేబులు, కలం, కాయితం, వీటితో స్నేహం చెయ్యడమేనా! ఈ పని చెడ్డదని నా అభిప్రాయం కాదు. ఆపని ఇష్టమున్నవాళ్లు అందులో యేవిధమైన ఆటంకం లేకుండా చేరుకుంటారు. అందరికి ప్రభుత్వం ఉద్యోగాలు ఎలా కల్పించగలదు? అక్కరలేకుండానే క్రొత్త శాఖలు సృష్టించగలదా! లేక ఇప్పుడున్నవిద్యావిధానాన్ని మార్చి వృత్తివిద్యలు పెంచి ఇష్టమున్నపని చేసుకునేందుకు తయారు చేస్తుందా!అనేది సమస్యగానే మిగిలిపోయింది.

కరీంనగరం (తెలంగాణం)          రామారావు

## 4

ప్రతిదినమూ, ప్రతిగంటా, ప్రతినిమిషమూ, ప్రతిక్షణమూ నన్ను వేధించేవి మూడే మూడు సమస్యలు.

మొదటిదేమిటీ అంటే — అస్తమానమూ మూడుకానులూ, అనేక కాగితాలు,ఎంతో సిరా నష్టంచేసే అతితీవ్రమైన సమస్య. ఎప్పుడో ఒకప్పుడు అమాంతంగా, హఠాత్తుగా, గబుక్కున

పెద్ద కవినైపోవాలని ఉంటుంది. కనీసం జార్జి బెర్నార్డుషా లాగనైనా, అధమం ఠాగూరు లాగనైనా ఐపోవాలని ఉంటుంది. కాని ఎలాగ?

'మరేం భయంలేదు. యువ రచయితలకు మా పత్రిక అభయం యిస్తుంది. యువ రచయితలకు ప్రోత్సాహమిచ్చి పైకి తీసుకురావడమే మా పత్రిక యొక్క మహదాశయం. రచన యేమాత్రం బాగున్నా మా పత్రికలో 'తప్పక' మని వేసుకొంటాం!' అని సంపాదకులు పెద్ద అక్షరాలతో తమ పత్రికద్వారా యువ రచయితలకు అభయహస్తం అందించిన వాక్యాలు చదివి మురిసిపోయి, ఉబ్బి తబ్బిబ్బయి, తల్లక్రిందులయిపోయి కాగితం కలం తీసుకొని వంచిన బుర్ర ఎత్తకుండా గంటసేపు కష్టపడి అమోఘమైన కథనొకదాన్ని వ్రాసేసి, ఆ అభయమిచ్చిన పత్రికకు మూడుకాన్ల పోస్టేజికి సమాధానంకోసం మరో మూడు కాన్లు దండగపెట్టి పంపించేసి సంతృప్త హృదయంతో చేతులు దులిపివేసుకొని —'రచన యేమాత్రం బాగున్నా వేసుకుంటానన్నాడు గదా! అమోఘమైన మన రచన వేసుకోకుండా వుంటాడా! తప్పకుండా నా రచన కళ్లకద్దుకుంటూ మరీ అచ్చు వేసుకొంటాడనీ, నా కథ తప్పకుండా అచ్చయిపోతుందనే వుద్దేశ్యంతో నా స్నేహితబృందానికి అడ్వాన్సుగానే టీపార్టీవిందు జరిపేసి చేతులు కడుక్కుని యీవతలికి వచ్చేసరికి యమకింకరుడిలాగ పోస్టుజవాను తిరిగివచ్చిన నా రచనని చేతిలో పెట్టేటప్పటికి కళ్లు తేలవేసి, కాళ్లూ, చేతులూ చల్లబడి నేలమీద చతికిలబడేసరికి నాకేదో ఫిట్సో, పుంద్రం ముక్కో వచ్చిందని నా స్నేహితులందరూ మొహంమీద నీళ్లుచల్లి గుక్కెడు కాఫీనీళ్లు నోట్లో పోశాక తేరుకొని సంపాదకుడిమీదికోపం కొద్దీ నా రచనని పరపరా చింపి పోసేవాణ్ణి.

ఇక రెండో సమస్య ఏమటంటే—తెలుగు సినిమా నటుడిగా అయిపోయి అమాంతం వెండితెర మీద తారలా మెరిసిపోతూ తెలుగుతెరని అలంకరించడం ఎలాగా అనేది. ఒకానొకప్పుడు ఒకప్రదర్శ దర్శకుడికి ఉత్తరం వ్రాశా. నేనొక అందమైన యువకుణ్ణనీ, కంఠమాధుర్యం కలవాడిననీ, స్టేజి అనుభవం కలవాడిననీన్నీ, కెమేరా ముందు అత్యద్భుతంగా యాక్టుచేసెయ్యగల సామర్థ్యం నాలోవుందననీన్నీ కావలిస్తే స్వయంగా చూసుకోమననీన్నీ కూడా వ్రాశాను. 'నా' అంటే నాలోటియువకుల అదృష్టవశాత్తూ ఆదర్శకుడే మా ఊరు రావటం జరిగింది. అప్పుడాయన్ని ప్రథమంగా కలుసుకొని మాట్లాడింది నేనే. నా మొహం చూస్తూనే ఆయన డొక్కసేటంత పనిచేశాడు. ఆయన పాడమనకుండానే నేను పాడటం మొదలుపెట్టగా ఆస్ప్రో, అమృతాంజనం మొదలైన తలనొప్పి నివారణోపాయాలకోసం వెతుకులాడాడు ఆ పెద్ద మనిషి. ఇంకాస్సేపుంటే పొమ్మంటాడనే వుద్దేశంతో నా గౌరవం కాపాడుకుందుకుగాను నేనే యివతలికి వచ్చేశాను.

ఇక నా తృతీయసమస్య ఏమిటీఅంటే—ఆలిండియా రేడియోలోంచి ఒకమాటు శ్రోతలకు నాకంఠాన్ని వినిపించెయ్యడం ఎలాగా అని. నేను యిలా అనుకుంటూండగానే విజయవాడకే ఆలిండియా రేడియో వచ్చేసింది. నా కోసమే వచ్చేసి వుంటుందని, ఈ మాటు ఆరు నూరైనాసరే ఆలిండియా రేడియోలో పాడేద్దామని నిశ్చయం చేసుకొన్నాను. విజయవాడ రేడియోవాళ్ళకి నాకో ఛాన్సు యిమ్మని వ్రాశాను. ఎలారమ్మన్నారో రమ్మన్నారు. రానుపోను నా స్వంతఖర్చులతో విజయవాడ వెళ్ళాను. నన్నక్కడ పాడమన్నారు. చప్పున ఛాన్సు యిస్తారేమోనననే వుద్దేశ్యంతో తొడలుచిట్లిపోయేలా తాళంవేసుకొంటూ బుర్ర ఊడిపోయేలా ఊపేస్తూ ఒక్క చరణం పాడేసరికి 'నాట్ సూటబుల్' అని ఫలితం తేలింది.

ఇంతకీ నా మూడు సమస్యలూ అల్లాగే ఉండిపోయాయి.

నాళ్ల చెరువు బదరీనారాయణరావు
రాజమహేంద్రవరం

---

క్రిందటివారం యీ శీర్షిక కింద ఉత్తమరచనకు 10 రూపాయలు బహుమానం పొందినవారు: కె. యస్. సౌందర్యవల్లి, మద్రాసు.

ఈ వారం ఉత్తమరచన బహుమతి వచ్చేవారం ప్రకటించబడుతుంది.—[సం.]

కథానిక

# అతడు నేర్పలేని పాటలు

టి. జగన్మోహనరావు

అతని నిరుత్సాహానికి కారణం ఎవ్వరికీ తెలిసింది కాదు. జీవితంలో ఆశ అంతరించిందనుకున్నాడు. ఇంక నూతన అనుభవాలేవీ కలుగవనుకుని జరిగిపోయిన సంఘటనలకు ఒక నిట్టూర్పు విడిచేవాడు. కాని తను చేసినదాంట్లో తప్పేమీ లేదనే అతని విశ్వాసం. జీవితం స్వప్నంలాగా గడచిపోవాలని కోరిక వుండేది. రెండేళ్ళలోనే స్వప్నాలలో కాంక్షించిన ప్రపంచం తారుమారై ఎంతో దూరమైపోయింది.

అతని పెళ్ళి జరిగి రెండు సంవత్సరాలయింది.

అంతవరకు కష్టమో సుఖమో కాలం బాగానే గడచిపోయింది. బాధ్యతలేమిటో ఎరగని దినాలలో కులాసాగా వుంటూండేవాడు. విద్యార్థిదశలో ఒక కల్పిత నాగరికతను అలవరచుకొని గగన కుసుమాలకోసం బంగారపు రెక్కలు కట్టుకొని ఆకాశంలో విహరిస్తుండేవాడు. తాను రాసిన పాటలనే పాడుకొంటూ ఆనందిస్తూండేవాడు. మనసులో అనుమానాలేవీ వుండేవికావు. అతని రెండుకళ్ళకు ఎదురుగా రాజమార్గం ఒకటి కనిపించేది. తనకోరకు నిర్దిష్టమై ఒక ఉన్నతస్థానము కలదని అతని నమ్మకం. మనోనేత్రంతో అటు చూసినప్పుడు అతనికి సంతోషాన్ని కలిగించే దృశ్యాలేవో కనిపించేవి.

చదువు పూర్తి కాకముందే అతని వివాహం జరిగింది. కొంతకాలం బాగానే కాలక్షేపం అయింది. భార్యతోపాటు భాగ్యంకూడా వచ్చింది. గర్వంతో చిరునవ్వు నవ్వేవాడు స్నేహితులతో వున్నప్పుడు. అందని వస్తువులు కొన్ని అందుబాటులోనికి వచ్చాయి. కాని ఎక్కడో మనసులో గాయం ఒకటి ఏర్పడింది. దానిస్వభావం అతనికే అర్థం అవలేదు. ఏమిచేయాలోకూడ తోచలేదు. అప్పుడప్పుడు మాత్రం అనుకోకూడని ఆలోచనలు కలిగేవి. అవికూడా అతని మనసులోని మచ్చను తుడవలేకపోయేవి.

శ్వరలోనే వివాహంతో వచ్చిన సిరియొక్క ఆకర్షణ తగ్గిపోయింది. ధనంతో కొనగల ముచ్చటల్ని అనుభవించాడు. వాటికి విలువ ఏమీ కనిపించలేదు. అంతవరకు అతని జీవితంలో ఎదుర్కొనవలసిన సమస్య ఒకటే అని తోచింది. ఆ ప్రశ్న యిప్పుడు తీరిపోయింది. అంతకన్నా ప్రధానమైనది, తాను సాధించలేకపోయినది, మరొకటి అతన్ని వేధించడం మొదలు పెట్టింది. నిత్యజీవితంలో పరిమళం పోకుండా వుండాలంటే ఏమిచేయాలో తెలిసింది కాదతనికి. అసలు ఆ విషయాన్నే అతనెప్పుడూ తర్కించి ఎరుగడు.

అనేక భావాలమధ్య నలిగిపోయేవాడతను. సరస్వతి మూర్ఖురాలని తలచుకొన్నప్పుడల్లా ఎంతో భయంగావుండేది. ఆమెకు చదువు చెప్పించనందుకు మామగారిని తూలనాడేవాడు. ఆమెకూడ తనలాగే ఆకాశంలో వెన్నెల మబ్బుల మీద ప్రయాణంచేస్తూ నక్షత్రాలతో మాట్లాడలేదేమో అని అతని విచారం. వేవుళ్ళందరూ ఏకమై తన ఆనందాన్ని సహించలేక పోతున్నారని విసుక్కునేవాడు. ఏమిచేసినా హృదయంలో భారం తగ్గేది కాదు. కొన్నాళ్లు భార్యతో మాట్లాడలేదు. ఆ ఉద్వేగంలో శాంతి కలిగిందనుకునేవాడు. కాని సరస్వతి పహానంవల్ల అతని పగతీరకపోవటమే కాకుండా, అతని దృష్టిలోనే అతను చాల అల్పంగా కనిపించటం జరిగేది.

* * *

అతనెప్పుడూ చప్పించుకొనని సంగతి అతని పెళ్లి. ఆ విషయమై అతనికేమీ ఉద్దేశ్యంలేదు. అతను లాకాలేజీలో వున్నప్పుడు అతన్నిచూడటానికి ఆడపిల్లల తండ్రులు వస్తూపోతుండేవారు. [illegible] అని చెప్తూ వుండేవాడు. సరదా ఉం[illegible]ది. అ[illegible] ఆనందం, అహం[illegible] అన్ని పరీక్షలలో

ప్రతిభావంతంగా ఉత్తీర్ణు డవుతుండే కొడుకు తప్పకుండా జడ్జీపదవిని పొందుతాడని అనుకొనే వాడు.

కాలేజీలో చదువుతున్న రోజులలో ఒక్క రోజు మాత్రం అతనెప్పుడు స్మరించుకొనేవాడు. ఒకనాడు తండ్రివద్దనుండి వార్త రాగా యింటికి వెళ్ళాడు. తండ్రిని కలిసికొన్న తర్వాత అంతా తెలిసింది. తాను చూడబోయే పెళ్ళికూతురు తండ్రి గొప్ప భూస్వామి అనీ, తన కనేక విధాల తోడ్పడగలడనీ, తెలిసికొన్నాడు. మంచి సాంప్రదాయంగల కుటుంబమని తండ్రి మెచ్చుకున్నాడు.

తండ్రి చెల్లెలుతో కలిసి వెళ్లాడు పిల్లను చూడటానికి. ఒక రోజంతా వున్నారక్కడ. ఎన్నో మర్యాదలు పొందారు. ప్రపంచంలో అందరూ తనెంతో ధన్యుడని అనుకుంటున్నట్టు తోచింది తనకి. ఆరోజు నాటకంలో తన భాగం ఏమిటో అతనికేమీ అవగాహన కాలేదు. కాబోయే భార్య చుట్టాల దృష్టిలో తనెంతో పెద్ద వాడైనట్టు గ్రహించాడు. అతనికి తెలియకుండానే మనసులో ఏదో దృఢమైన భావము కలిగింది. తన మామగారి యింటినిండా వెండి బంగారాలే. అతను త్రాగిన కాఫీకంటె కాఫీ పోసిన కప్పు, సాసరు ఎంతో రమ్యంగావున్నాయి. ఆ యింట్లో వున్న అందమైన వస్తువులను చూస్తూ ఊహా ప్రపంచంలో లీనమైపోయాడు. తన మామగారు కూడ చాలా ఆదర్శములు కలిగి నటువంటి వ్యక్తి అనుకున్నాడు.

ఆరోజు సాయంత్రం పెళ్ళికూతుర్ని చూశాడు. మెరపును చూసినట్లుందతనికి. ఒంటినిండా నగలు. ఎంతో అలంకారంచేశారు. చూడగానే బాగానే వున్నట్లు కనిపించింది. పేరేమిటని అడగానే స్ఫుటంగా 'సరస్వతి' అని చెప్పింది.

"లక్ష్మి సరస్వతులు కలిశారు" అన్నాడు అతని తండ్రి.

"అయితే చదువు బాగానే వచ్చున్నమాట."

"ఇంట్లోనే చెప్పిస్తున్నాం" అన్నాడామె తండ్రి.

'సంగీతం చెప్పిస్తున్నారా?'అని అడిగాడతను.

లోపలినుంచి వీణ తెప్పించాడామెతండ్రి. ఆమెపాటలను కూడా చాలా మెచ్చుకున్నారు తండ్రీ కొడుకులు. అతనెంతో సంతృప్తిపడ్డాడు ఆరాత్రి అతని తండ్రి కట్నాలు కానుకల సంగతి తేల్చుకున్నాడు. ముహూర్తం కూడ నిశ్చయం చేసుకొనే మర్నాటి వుదయం వెళ్ళిపోయారు.

* * *

రెండు సంవత్సరాలలో అనుకోని మార్పు కలిగించతని జీవితంలో. అంతటికీ తన వివాహమే కారణం అనుకున్నాడు. అతనిలో గాఢమైన అసంతృప్తి బయల్దేరింది. సరస్వతిలో ఆనాడు తను చూచిన మెరపు నేడు కనిపించటం లేదు. తనకున్నంత చదువులేదామెకు. అతని నాగరికత యొక్క వైచిత్రి ఆమెలో మార్పును తీసికొని రాలేకపోయింది. ఆమెమాత్రం భర్తను భగవం తుడిలా చూసేది. ఆమెలోలేని శక్తులకామెను నిందించేవాడతను.

ఆమెవాళ్లందరు తనను మోసం చేశారని అంటూండేవాడెప్పుడూ.

చాలకాలం శాంతంతోటే వినేది అతని మాటల్ని. తాను చేసిన నేరమేమిటో ఆమెకు తోచ లేదు. కాని త్వరలోనే అతని నిస్పృహకు అసంతృప్తికికారణం గ్రహించింది. అయినా మనసులో కూడా దూషించేది కాదనినీ.

ఆమె ఓరిమి ఎక్కువైన కొద్దీ అతని ప్రవర్తన దుస్సహం కాజొచ్చింది. ఆమె యెడల వైముఖ్యంగూడ ఎక్కువయింది. ఒకనాడామె భర్తనెంతో నెమ్మదిగా అడిగింది: అతని విచారానికి కారణం ఏమిటని.

'నిన్ను పెళ్లి చేసుకొనడమే' అన్నాడు.

'అందులో నా తప్పేముంది' అన్నదామె.

ఎన్నడు మాట్లాడని ఆమె ఆవిధంగా జవాబు చెప్పేసరికి అతడు సమాధానం చెప్పలేకపో యాడు వెంటనే.

'అంతా మోసం...' అని మాత్రం మామూలు ధోరణిలో అన్నాడు.

'ఏవిధంగా' అంది.

కోపంతో వెళ్ళిపోయాడు.

ఆ తర్వాత ఎప్పుడింటికి వచ్చేవాడో, ఏమి చేసేవాడో ఆమెకు ఏమాత్రం తెలిసేదికాదు.

ఒకనాడతను రాత్రి యింటికి వచ్చిన తర్వాత ఆమె ఎక్కడా కనిపించలేదు. ఇల్లంతా వెతి కాడు. చాలా అదుర్దా పడ్డాడు. నిశ్చేష్టుడై క్రింద

కూలిపోయాడు. అతనేం చూస్తున్నాడో అతనికే తెలిసిందికాదు. విచిత్రమైన దృశ్యాలు ఎన్నో కనబడ్డాయి.

ఒకసారి బంగారువన్నెగల చేప చక్కని తామరు కొలనులోనుంచి పైకి ఎగిరి ఆకాశంలో విహరిస్తున్నట్లు; కొంతసేపటికి ఎక్కువ ఆయాసం రాగా ఎగరలేక కొట్టుకుంటూ భూమిమీద పడి నీళ్లకోసం దిగులు పడుతున్నట్లు...

ఒకసారి తానే దేనికోసమో వెతుకుతూ చెట్లు పుట్టలు కొండలుదాటి వెళ్లినట్లు, తనకు కావలసిన దెక్కడా కనపడకపోతే నిట్టూర్పుతో యింటికి రాగా ఆవస్తువును భార్య నవ్వుతూ తనచేతిలో పెట్టినట్లు...

అనవసరంగా ఎంతో ప్రయాసపడి నట్లనిపించింది. సిగ్గు పడ్డాడు.

ఒకసారి ఎక్కువ మనోవ్యధతో ఎక్కడికో వేగంగా పరుగెత్తుకొనిపోతున్నాడు. వెనుకనుంచి ఎంతమంది పిలచినా జవాబు చెప్పకుండా పోతున్నాడు. ఎన్నడు చూడని ప్రదేశాల్లోనుంచి నడుస్తున్నాడు. ఒక అందమైన పూలతోట దగ్గరకు వెళ్ళాడు. దాహంవేస్తే ఆపూలలోని తేనెను త్రాగాడు. పూలచెట్లన్నీ అతన్ని చుట్టేశాయి. తెలియకుండానే ఆయాసం తేలిపోయింది. రంగురంగుల పూలను చూస్తూంటే చాలా ఆనందంగా వుంది. ప్రతీ పువ్వుమీదా ఒక అందమైన పిట్ట కూర్చొనివుంది. ఆ పిట్టలలో కొన్ని చక్కగా కూస్తున్నాయి. కొన్నిటికి ఇంద్రధనస్సు రంగులు కలిగిన రెక్కలున్నాయి. ఇవన్నీ చూస్తున్న అతనికి ఎక్కడినుంచో ఒక కంఠధ్వని వినిపించింది.

'నీకిష్టమైన పక్షిని తీసికో' అందా ధ్వని.

ఏమిచేయాలో తోచలేదతనికి. అన్నిపిట్టలూ బాగున్నాయి. ఆత్రుతతో ఒక నీలిరంగు పిట్టను పట్టుకున్నాడు.

'బాగుందా ?' అని అడిగిందా కంఠధ్వని.

ఆలోచించాడు.

'ఈపిట్ట కూయటంలేదు' అన్నాడు.

'నీవు ఆ పక్షిని పట్టుకోనేముందు ఆలోచించలేదు. నీకేమి కావాలో నీకే తెలియలేదు. రంగును చూసి మోసపోయావు.'

ఆ జవాబు విని విస్మయపడ్డాడు. కళ్ళలో నీళ్లు తిరిగాయి. ఆ పిట్టమెడ నులిమెయ్యబోతున్నాడు.

ఆగమందా కంఠధ్వని.

'పోనీ నువ్వు పాటలు నేర్పలేవూ?' అంది.

అతలో కళ్లు తెరిచాడు. అంధకారంమాత్రం మిగిలింది.

---

# ఎవరిచ్చారీ పదవి వీరికి?

వై. వెంకటరావు

"మన బానిసత్వపు బాధ యీ రోజుతో వదలిపోయింది. దీనికోసం మనమెంతో కృషిచేశాము. ఈ స్వాతంత్ర్యదినం మనకు పర్వదినం. ఈ ఉదయాన్నే నా భార్యతో "ఏమే, మరి మనం అనుకున్నది, కోరినది, కాంక్షించినది, వాంఛించినది ఆ దినం వచ్చింది. ఈ పర్వదినాన్ని సంతోషంగా గడుపుదాం. ఈ రోజున నీకు, నాకు నచ్చిన పిండివంట ఏదైనా తయారు చెయ్యి' అంటే, 'మీకు గారెలు అంటే ఇష్టం, మీకిష్టమయిందే నాకు ఇష్టం. కానీ, ఇంట్లో పప్పూ లేదు, ఉప్పూ లేదు, కొనడానికి డబ్బు లేదు' అని అన్నది. చూశారా, బానిసత్వము వదలినా మనకేవీ అందుబాటులో లేవు. బ్రిటిష్ ప్రభుత్వం ప్రజల్ని, దేశాన్ని ఇంత నీచస్థితిలో విడిచిపోయింది. జీవితావసరానికి వలసిన ఒక్క వస్తువూ మనకి అందుబాటులో లేదు."

స్వాతంత్ర్యదినోత్సవ సందర్భంలో, ఒక కాంగ్రెసు నాయకుని ఉపన్యాసధోరణి అది. శ్రుతి మించి రాగాన్ని పడుతోందని గ్రహించిన కొందరి వ్యక్తుల ఆందోళనతో, ఆ ఉపన్యాసం మధ్యలో ముగిసిపోయింది. కాని ఇంకా ఏమి చెప్పేవాడో ఆ మహానుభావుడు! ఆయన మాట్లాడిన

సంఘటలు ఏ స్థితిలోనున్న వ్యక్తికైనా, తృణ ప్రాయమైనా ఉపయోగపడవన్న మాట వాస్తవం. బహిరంగ సభలకు, ఉపన్యాసాలకు వేలాది ప్రజలు కుతూహలంతో హాజరవుతారంటే, వారిలో ఒకవిధమైన ఆశ, ఆశయాలు తప్పకవుండి తీరుతాయి. సంగతి సందర్భాలు యోచించకుండా నోటికొచ్చినట్లు వాగడమేనా ఉపన్యాసకుల లక్షణం! ఆయన మాట్లాడబోయేది, మన దేశ చరిత్రలో అపూర్వదినమని భావించబడే స్వాతంత్ర్య దినాన్ని గురించి. మనదేశం ఈ స్వాతంత్ర్య సమరంలో వివిధంగా దూకింది, దీనిలో ప్రజలు వివిధమైన కడగండ్లకు లోనయ్యారు, ఎంతమంది భారతీయులు ఈ లక్ష్యంకోసం వారి ప్రాణాలను ఆహుతిచ్చేరో మొదలయినవి, ప్రతి భారతీయుడు అవగాహనం చేసుకోవలసిన స్మృతులు, భవిష్యత్తులో జీవితాలు సాఫీగా సాగిపోవాలంటే ప్రజలకుండవలసిన దృక్పథాలు చెప్పుట మాని స్వాంతభోజనంమీద ఇష్టాగోష్ఠి మొదలు పెట్టాడు.

లోకజ్ఞానం, అక్షరజ్ఞానంలేని ప్రతి నిరక్షరకుక్షీ ప్రజల ప్రతినిధినని అధికారానికి వస్తే పరిస్థితులు ఈవిధంగా పరిణమిస్తాయి. జైలుకి వెళ్తే అతడొక శాసనసభ్యుడో లేక పట్టణ కాంగ్రెసు ప్రెసిడెంటో, ఏదో ఒకటయి కూచున్నాడు. ఖద్దరు బట్టలలో, ప్రజల ప్రతినిధిగా వీరికున్న గొప్పతనం ఒకటే—నల్గురిలో బిగ్గరగా అరవడం. పూర్వపు దినాల అలవాటు కొంచెముంది కాబట్టి. ఈరకమైన ప్రతినిధులనుంచి ఏ విధమైన సహాయాన్ని అపేక్షించగలము? చెట్టు పేరుచెప్పి కాయలమ్ముడయిపోయినట్లు, కాంగ్రెసు పేరుపెట్టుకొని పైకొచ్చారు. ఆ మహా సంస్థ దిగజారిపోడానికే కాబోలు- చెట్టు చచ్చే ముందు కుక్కమూతిపిందెలు పుడతాయన్నట్లు ఖద్దరు బురఖాలతో ఉద్భవిస్తున్నారు, కొంతమంది గోముఖవ్యాఘ్రాలు. కొంతమంది శాసనసభ్యులు, పట్టణ కాంగ్రెసు వ్యక్తుల నడవడిక చూస్తే, కేవలం తమకులేని గొప్పతనాన్ని నల్గురిలో వెల్లడిచెయ్యాలనే ఉద్దేశాలు వీరిలో అధికంగా పాతుకుపోయినట్లు కనిపిస్తవి. దుస్తులను ఖద్దరుకు మార్చవచ్చుగాని, మెదడును మనస్సును మార్చటం ఎవరితరం?

అంతటితో ఆగక వీరు, అధికారం చేతిలో ఉందని, అసహ్యమైన కార్యాలకుకూడ పూనుకొంటారు. పబ్లిక్ మీటింగులో, ఎలెక్షన్లో జయంపొందిన ఒక కాంగ్రెసువ్యక్తి, తనపై పోటీచేసిన సోషలిస్టు అభ్యర్థిని అనవసరముగా దూషించడం మొదలు పెట్టాడు. మానాభిమానాలకు, గౌరవానికి ప్రాముఖ్యమిచ్చే కొందరు అతని వాగ్ధోరణి కడ్డు తగిలేరు. జవసత్వాలుంటే కుస్తీకిరండి అని అరిచేడా శాసనసభ్యుడు స్టేజి నుండి. ఈవ్యక్తి దేశానికిచేసిన సేవ అదేనట. 1942 లో, మన పోలీసులనే, అదమారుపుగా ఉన్నప్పుడు కొట్టి పారిపోతుండేవాడట. ఈయనిప్పుడొక శాసనసభ్యుడు. పొట్టచింపితే అక్షరం ముక్క కనబడదు.

ఇలాంటి వ్యక్తులసంఖ్య కాంగ్రెసులో ప్రబలిపోయింది. మన దేశానికొచ్చే స్వాతంత్ర్య ఛాయలు మొదటనే చూశారేమో! వీరి చేష్టలు గమనిస్తే, విసుగు, హేళన, జుగుప్స మనలో ఉద్భవిస్తాయి. కాంగ్రెసు చరిత్రకంఠోపాఠం చేసి, ప్రతిచోటా, ప్రతివేళా, స్వంత అనుభవాలే మాట్లాడుతారు. మన ప్రతినిధులైపోయారిప్పుడు. దేశంలో వీరికన్న అనుభవజ్ఞులు లేరా? కాంగ్రెసును కొల్చినవారికే తప్ప, ఇతరులకి పదవులు లభించవా? నిజంగా మనమేనా, వీరిని పదవుల్లో ఉంచింది! అదే మాయగా ఉంది_






(మార్చి 11వ తేదీ సంచిక తరువాయి)

## ప్రకరణము ౨

### మొదటి హరిహరరాయలు

(క్రీ. శ. ౧౩౩౬—౧౩౫౬)

విజయనగర శంకుస్థాపనతోడను మొదటి హరిహరరాయల పట్టాభిషేకముతోడను విజయనగర సామ్రాజ్య చరిత్ర ప్రారంభమైనది. ఆంధ్రకర్ణాట దేశముల నడిమియందు సంస్థాపితమగుటచే నాద్యమునుండియు నుభయప్రజలకును సంగమస్థానమై వెలసినది; ఉభయుల ప్రయత్నమువల్లనే పెంపొందినది. ప్రారంభదశయందు విజయనగర మొక చిన్న సంస్థానము. క్రీ. శ ౧౩౩౬ లో హరిహరరాయల పట్టాభిషేకకాలమునందు వారి యాధిపత్యముక్రింద నుండిన రాష్ట్రముయొక్క వైశాల్యము స్వల్పము. కర్ణాటకమున బళ్ళారి చిత్రదుర్గ కోలారు శిమొగ్గ ధార్వాడజిల్లాలును ఆంధ్రదేశమున రాయలసీమ కర్నూలు అనంతపురం కడప కోలారు జిల్లాలును నెల్లూరు చిత్తూరుజిల్లాలలో విశేషభాగమును వారి యధికారమునకులోనై యుండినవి; ఈ రాష్ట్రమంతయు హరిహరరాయలకెట్లు స్వాధీనమాయెనో తెలియదు. జరిగినట్లెచ్చటను జెప్పియుండలేదు. ఒకవేళ హరిహరరాయలను సుల్తాను మహమ్మదు బిన్ తుగ్లాను కంపిలి మండలమునకు పాలకునిగ నియమించుటకు పూర్వమే యీరాష్ట్రమంతయు నామండలాంతర్గతమై యుండెనేమో! ఎట్లది యతనియాధిపత్యముక్రిందికి వచ్చినను నది యంత విస్తారమైనది కాదు. కాని యచిరకాలముననె రాజ్యము విస్తరించుట కారంభించినది. క్రీ. శ ౧౪ వ శతాబ్దాంతమునకు కృష్ణ మొదలు రామసేతుపర్యంతముగల యావద్దక్షిణదేశము రాయల యేలుబడి క్రిందికి వచ్చినది. చిన్న సంస్థానముగనుండిన విజయనగరము పెద్ద సామ్రాజ్యముగ మారి భరతఖండములో హిందూ రాజ్యముల కన్నిటికంటెను బలిష్ఠమాయెను.

ఈ పరిణామమెట్లు కలిగెనో గ్రహింపవలయు ననిన నప్పటి దాక్షిణాత్య రాజ్యములను గూర్చియు, రాజకీయపరిస్థితులను గూర్చియు నత్యంత సంగ్రహముగనైన కొంత తెలిసికొనవలసియున్నది. దక్షిణ భారతమున తుగ్లాకు సామ్రాజ్యము విచ్ఛిన్నమై పోయి పెక్కు నూతన స్వతంత్రరాజ్యము లేర్పడినను తుగ్లాకుచక్రవర్తులు రాజ్యనష్టమున కియ్యకొని తమ సార్వభౌమపదమును విసర్జింపలేదు. ఎప్పుడు సుల్తాను మరల సైన్యములను గూర్చుకొని వచ్చి తన యధికారమును యథాపూర్వము పునఃప్రతిష్ఠ సేయగడగునో యను భయమెల్ల వారి హృదయములను కలవరపెట్టుచుండినది. కాని సుల్తాను పైకిరుగుబడి స్వతంత్రులై క్రొత్తరాజ్యములను నెలకొల్పిన ప్రభువులేమి, మహమ్మదీయ దండయాత్రలకు లొంగక నిలిచియుండిన ప్రాచీన హిందూ రాజ్యాధిపతులేమి యైకమత్యములేక యొండొరులతో పోరుచుండిరి. ఈ రాజ్యములతో విజయనగరాధిపతులు వరుసగ యుద్ధముల జేయవలసి యుండెను. విషయము సుబోధమగుటకొఱకీ రాజ్యములనిట సంగ్రహముగ వర్ణించుట యుక్తము.

తెలింగాణము: విజయనగరమునకు బూర్వదిగ్భాగమున నాంధ్ర రాజ్యము లుండినవి. ఐకమత్యమువల్లనే తాము మహమ్మదీయులను నిగ్రహించి స్వాతంత్ర్యమును బడయగలిగితిమను నంశము నాంధ్రనాయకులు సత్వరము మఱచిరి. తమ యాధిక్యమును ప్రకటించుటకొఱకును రాజ్యవైశాల్యములను విస్త

లీకరించుటకొఱకును వారొండొరులతో పోర గడగిరి. ఆంధ్రనాయక రాజ్యములలో ముఖ్య మైన వానిని మాత్ర మిట పేర్కొనిన చాలును. తొలుత పేర్కొనదగినది ఓరుగంటి రాజ్యము. ఆంధ్రనాయక సమితి కధ్యక్షుండైన ముసునూరి కాపయనాయకుడు దీని కధిపతి. ఆంధ్రనాయకు లలో నెల్ల నితడు బలవత్తముడు. తెలుగుదేశమున చాలభాగ మితని యేలుబడిక్రింద నుండెను. కాని యితని యధికారము కృష్ణకు దక్షిణమున వెల్ల లేదు. 'ఆంధ్రదేశాధీశ్వర', 'ఆంధ్రసురత్రాణ' మున్నగు నితని బిరుదులనుబట్టి చూడగా నితఁడు ఆంధ్రదేశమునకంతటికిని దానె యధిపతియని ప్రకటించుకొని నట్లున్నది. కాని యితని యాధి పత్యమునకు వెలమ లొప్పుకొనలేదు. నల్లగొండ జిల్లా లోని రాచకొండ ప్రాంతమున పాలించుచుండిన వెలమ లతనికి లొంగరైరి. వారి ప్రభువు రావుసింగ మనీడు రాజ్యతృష్ణగల దొర. అతడు చుట్టు ప్రక్కలనున్న చిన్న చిన్న క్షత్రియ సామంతులను కూలద్రోసి వారి దుర్గములను రాష్ట్రములను ఆక్రమించి స్వతంత్రరాజ్యమునకు పునాది వేయ నారంభించెను. కావున వెలమలతో గాపయ నాయకునికి పోరాటము తప్పక పోయెను.

రెడ్డిరాజ్యము: వెలమలవలె రెడ్డును గాపయనాయకునితో బ్రతిఘటించిరి. వీరి ప్రభువు ప్రోలయ వేమారెడ్డి ముసునూరి ప్రోలయనాయకుని సహాయులలో ముఖ్యుడు. తీరాంధ్రదేశమునుండి తురకలను దఱిమి వేసి హిందూస్వాతంత్ర్యమును పునరుద్ధరించుట కత డెట్లు ప్రోలయనాయకునికి దోడ్పడి యుండె నదియు పూర్వప్రకరణమున వర్ణింపబడియున్నది. ప్రోలయనాయకుని యనంతరము కాపయతో నతని సంబంధమెట్టిదో వివరించి చెప్పుటకు వీలు లేదు; కాని ముసునూరి నాయకులకు రెడ్డ రాష్ట్ర ముపై నెట్టి యధికారమును ఉన్నట్లగపడదు. ప్రోలయ వేమారెడ్డికాలమున రెడ్డిరాజ్యము గడు చిన్నది. దక్షిణమున నెల్లూరు మండలములోని కందుకూరినుండి యుత్తరమున కృష్ణానదివఱకును పశ్చిమమున నెల్లమలలయందలి శ్రీశైలాహోబిల ములనుండి తూర్పున సముద్రపర్యంతముగల రాష్ట్ర మతని యధీనమందుండెను. మొదట నితని రాజ ధాని ఇప్పటి గుంటూరుజిల్లా యొంగోలు తాలూకాలోని యద్దంకి; తరువాత నరసారావు పేట తాలూకాలోని కొండవీడు. రెడ్డి రాజ్యము నకు దక్షిణమునను పశ్చిమమునను సరిహద్దు విజయ నగరము. కృష్ణవఱకును తీరాంధ్రభూమి నెట్లయిన తమ రాజ్యమున గలుపుకొనవలయునని విజయ నగర రాయల యుద్దేశమగుటచేత ప్రథమము నుండియు నా రెండు రాజ్యములవారికిని పోరు సహజమాయెను.

ద్రావిడదేశము: దక్షిణమున ద్రావిడ దేశమున రెండు రాజ్యము లుండినవి. మొదటిది సంబువరాయ సంస్థానము. సంబువరాయల రాజ్యము చిన్నది. ఉత్తర ఆర్కాటు చెంగల్పట్టు జిల్లాలును దక్షిణ ఆర్కాటున కొంత భాగమును నితని యేలుబడియందుండి నవి. కంచి యితని రాజధాని. పడైవీడు లేక రాజ గంభీర దుర్గము ఇతని ముఖ్యదుర్గము. సంబువ రాయడు స్వతంత్రుడుగాడు; హొయ్సల ముమ్మడి బల్లాళుని కాశ్రితుడు. సంబువరాయ రాజ్యమున కింకను దక్షిణమున మధుర మహమ్మదీయ రాజ్య ముండెను. దక్షిణ పెన్న యీ రెండురాజ్యముల కును పొలిమేర. దక్షిణ పెన్నకు దక్షిణమునందు యావద్ద్రావిడదేశమును అనగా దక్షిణ ఆర్కా టులో కొంతభాగమును తంజావూరు తిరుచినా పల్లి మధుర రామనాథపుర జిల్లాలును కోయం బుత్తూరు జిల్లాలో చాలభాగమును మధుర రాజ్య మున చేరియుండెను. మధుర ప్రధానరాజధాని. తిరుచినాపల్లి సమీపమున కావేరీతటమందలి కన్ననూరు కుప్పము ప్రధానదుర్గము. మధుర సుల్తాను బల్లిదుడు; ద్రావిడదేశమును సర్వమును దన యధికారము క్రిందికి దెచ్చుకొని మహమ్మ దీయుల ప్రభుత్వము నచట స్థిరముగ నెలకొల్ప వలయునని యతని దృఢసంకల్పము; కాని ముమ్మడిబల్లాళుని ప్రతిష్టంభమువలన నీకోరిక యీడేరినది కాదు.

హొయ్సలరాజ్యము: బల్లాళుడు ద్రావిడ ప్రభువుగాడు; కర్ణాటకచక్రవర్తి. మైసూరి దేశము లోని ద్వారసముద్రమతని రాజధాని. దక్షిణ కర్ణాట కము సర్వమును, పశ్చిమసముద్రతీరమందలి తులు రాజ్యమును అతని యేలుబడియం దుండినవి.

ద్రావిడదేశము నతడు ప్రవేశించుటకు రెండు కారణములు గలవు. తురకలను ద్రావిడదేశము నుండి వెడలనడచి హిందూ స్వాతంత్ర్యమును, ధర్మమును పునఃప్రతిష్ఠసేయుటకొఱ కతడు ద్రావిడమును ప్రథమమున ప్రవేశించెను. కాపయ నాయకునితో సఖ్యము కుదిరిన పిమ్మట ముమ్మడి బల్లాళుడు దాక్షిణాత్య హిందూసంఘమున కధ్యక్షుడాయె గదా. తెలింగాణమునుండి మహమ్మదీయులను బాఱదోలి కాపయనాయకుని యధికారమును స్థాపించిన వెనుక యొడంబడిక ప్రకారము కాపయనాయకుని సహాయముతో ద్రావిడదేశముపై నెత్తిపోయి తురకలను తొండమండలమునుండి తఱుమగొట్టి యా రాష్ట్రమునకు వెగ్రామణ్కొండసాంబువరాయని అధిపతిని గావించెను. కాని తురకలను ద్రావిడ దేశమునుండి సంపూర్ణముగ వెడలగొట్టుట సులభసాధ్యము గాకపోయెను; ఆ కార్యము నెఱవేఱువఱకును అతడు తిరువణ్ణామలను నెలవీడు గావించుకొని యచటనే నిలిచెను. ఇంతకంటె బలవత్తరమైన కారణ మతని రాజ్యకాంక్ష. అతని పూర్వికులు కావేరీతటమందలి కన్ననూరు కుప్పమును రాజధానిజేసికొని చోళమండలమును పాలించి యుండిరి. వారు పాండ్యులచే నచటినుండి తఱుమగొట్టబడిరి. ద్రావిడదేశమున నష్టమైపోయిన కులక్రమాగతరాజ్యమును మరల సాధించి తన పెద్దల వలె దాను నచట ప్రభుత్వము సలుపవలెనని యతని కోరిక. చోళమండలమంతయు నప్పుడు మధురసుల్తాను వశమందుండినందున వారిరువురికి దీర్ఘయుద్ధము సంప్రాప్తమాయెను.

విజయనగర రాయలకును ముమ్మడిబల్లాళునికిని ఆద్యమునుండియు బగ గలదు; దీనికి వాస్తవమైన కారణము తెలియదు; కాని యూహింపవచ్చును. వారి విరుగుపొరుగు రాజ్యములు: కంపిలిరాయని కాలమునుండియు ముమ్మడిబల్లాళుడు కుంతలముపై గన్నువేసియుండెను. పెక్కుయుద్ధములందు కంపిలిరాయనిచే బరాజితుడైనను ఆడియాస యతని వదలక పీడించుచుండినది. కంపిలిరాయడు గతించి యతని రాజ్యము లయమైపోయినను సంగమరాజపుత్రు లపుడతని పాలనక్రింద నుండిన రాష్ట్రమున కధిపతులైరి; కావున బల్లాళునికి విజయనగర రాయలతోడి విరోధమునకు గారణము వారిరాజ్యము నపహరింప వలయుననుదురాశయై యుండవచ్చును.

దేవగిరి: విజయనగరమునకు ఉత్తర సరిహద్దు ఢిల్లీ సామ్రాజ్యము. కృష్ణానది ఈ రెండు రాజ్యములను వేఱుపఱచుచుండినది. దక్షిణాపథము నందెల్లయెడలను ఢిల్లీసామ్రాజ్యము భగ్నమైపోయినను మహారాష్ట్ర ఉత్తరకర్ణాటము లింకను ఢిల్లీసుల్తాను క్రిందనె యుండినవి. సుల్తాను ప్రతినిధి దేవగిరియందు నివసించుచు మిగిలియుండిన సామ్రాజ్యభాగము నేలుచుండెను; కాని యచటగూడ సుల్తాను నధికారము చిరకాలము సాగలేదు. అతిదారుణమైన యతని పాలన కోర్వజాలక అమీరు లందఱేకమై తిరుగబడిరి. విప్లవకారులను జిదుగగొట్టి తన యధికారమును మరల నెలకొల్పవలయునని సుల్తాను రెండుమూడు పర్యాయములు ప్రయత్నమొనర్చెను; కాని యందువల్ల నతనికి లాభము గలుగలేదు. తుదకు విప్లవకారుల నాయకుడు 'జఫర్ ఖా' ననునతడు క్రీ. శ. ౧౩౪౭ వ సంవత్సరమున ఢిల్లీ సైన్యముల నోడించి స్వతంత్రుడై దక్కనుకు దానె సుల్తానునని ప్రకటించి, సుల్తాన్ అలావుద్దీన్ హసన్ గంగూ బహమనీ యను బిరుదనామము ధరించి, గుల్బర్గ పట్టణమున బట్టాభిషేకము జేసికొనెను. సుల్తాన్ అలావుద్దీన్ హసన్ గంగూ స్థాపించిన రాజ్యమునకు బహమనీరాజ్యమని పేరు. ఇతని సంతతివారు రాదాపు నూటడెబ్బదియేండ్లకాలము గుల్బర్గ బీదరుపట్టణములు రాజధానులుగ దక్కను బాలించిరి. బహమనీ సుల్తానులు దక్షిణాపథమున మహమ్మదీయ ధర్మము నుద్ధరింప గంకణము గట్టుకొనుటచె హిందూస్వాతంత్ర్య ప్రతిష్ఠాపకులైన విజయనగర ప్రభువులకు వారితో పోరాట తప్పినదికాదు.

రాజ్యాభివృద్ధి: — (౧) ఉదయగిరి విజయము: ఉదయగిరి విజయముతో రాయరాజ్య విస్తరణము ప్రారంభమైనది. హరిహరరాయల తమ్ముడు బుక్కరాయలు మాయణమాధవాచార్యుల సాయముతో నీ దుర్గమును సాధించెను. ఉదయగిరి నెల్లూరు మండలమున పశ్చిమోత్తర భాగమునందున్నది. పూర్వకాలమున దక్షిణదేశమున పేరెన్నిక కెక్కిన గిరి-

దుర్గములలో నిది యొక్కటి. దక్షిణహిందూస్థాన తీరాంధ్రదేశమున కిది పోరుకలుపు. ఉదయగిరిని స్వాధీనపఱచుకొన్నవారికి తీరాంధ్రమును జొచ్చుట సులువైన పని. అప్పటి రణకోవిదులు దీనిని రాయరాజ్యమందలి ప్రథమ దుర్గమని పరిగణించువారు. ఉదయగిరి విజయ మద్దంకిరెడ్డి రాజ్యాక్రమణ కంకురార్పణము; భవిష్యత్కాల తీరాంధ్రదేశచరిత్రగతి నది మాఱుత్రోవను ద్రిప్పినది. కావున విజయనగరచరిత్రాధ్యాయమునకు ఈ విజయ ప్రాముఖ్యమును జక్కగ గ్రహింపవలసి యున్నది.

(౨) హొయ్సలరాజ్యాక్రమణము:

ఉదయగిరిని జయించినపిమ్మట బుక్కరాయలు చిరకాల మచటనుండలేదు. హొయ్సలరాజ్యగడి దేశమునం దతని సాన్నిధ్య మావశ్యక మగుటచే దన కుమారుని నిరూపణ్ణను ఉదయగిరి దుర్గాధ్యక్షునిగ నియమించి యటదచటికి తరలిపోయెను. హొయ్సల ముమ్మడి వీరబల్లాళునికి విజయనగర రాయలతో గలిగిన వైరమునకు గారణమింతకు పూర్వము నిరూపింపబడినది. అందువలన నుభయ పక్షములవారికిని గడి ప్రాంతముల బలుమారు పోరాట కలుగుచు వచ్చెను. అనంతపుర కోలారు మండలములందు ఘర్షణ యతిశయించి క్రీ. శ. ౧౩౩౭-౮ ప్రాంతమున యుద్ధము సాగెను. రెండు మూడేండ్లపర్యంత మిరు పక్షములవారును సమానముగా బోరాడుచుండిరి. క్రీ. శ. ౧౩౪౦ వ సంవత్సరమున బుక్కరాయలు పెనుగొండ దుర్గమునకు ముట్టడివేసి స్వాధీనపఱచుకొనెను. బుక్కరాయల విజయమునకు రాయరాజువయొక్క బలపరాక్రమములె ప్రధాన కారణములుగావు. హొయ్సలుల దృష్టి యన్యథా లగ్నమైయుండినది. వారు పెనుగొండ దుర్గసంరక్షణమునందు దమశక్తి సామర్థ్యములను సంపూర్ణముగ వినియోగింపజాలకపోయిరి. ముమ్మడిబల్లాళుడు ద్రావిడ దేశమున హిందూస్వాతంత్ర్యమును బునఃప్రతిష్ఠ సేయుటకును, నష్టమైపోయిన చోళమండల రాజ్యమునుమరలసంపాదించుటకును తిరువణ్ణామల పట్టణమును నెలవీడు గావించుకొని మధుర సుల్తానులతో బోరాడుచుండెనని చెప్పియుంటిమిగదా! రాను రాను మధుర సుల్తానులతో యుద్ధము తీవ్రముగా జొచ్చినది. బల్లాళుడు తురకలతో యుద్ధము సంపూర్ణముగ దన సేనలలో విశేషభాగమును, సుప్రసిద్ధదండనాయకుల నందఱిని ద్రావిడదేశమునకు గొంపోయెను. కర్ణాటకమున నతని రాజ్యమును సంరక్షించుటకు దగిన దండు లేకపోయెను. ఈ కారణమున బుక్కరాయలకు పెనుగొండ దుర్గమును లగ్గలు పట్టి స్వాధీనపఱచుకొనుటకు వీలైనది. పెనుగొండ విజయము హొయ్సల రాజ్యమునకుజొక్కవాలు. బల్లాళరాజ్యక్షయమున కదియె ప్రారంభము. మధుర మహమ్మదీయు లెన్ని పర్యాయములు నిర్జితులైనను రామబాణహతి దోల్గిన రావణు శిరములవలె నభివృద్ధి నందుచు వచ్చిరి.

మధుర రాజ్యస్థాపకుడగు జలాలుద్దీన్ అహసన్ శాహు ఐదేండ్లు రాజ్యపాలన మొనర్చిన పిమ్మట క్రీ. శ. ౧౩౪౦ సం॥ లో నొక హంతకునిచే మడిసెను. తరువాత అలావుద్దీన్ ఉదౌజీ యనువాడు సుల్తానాయెను. ఇతడు మంచియోధుడు. ఇతడు రాజ్యము చేసినకాల మొక్క సంవత్సరము మాత్రమెయైనను హొయ్సల సైన్యముల నోడించి వారి యాటోపమును దగ్గించెను. కాని యొకానొక యుద్ధమున శత్రువుల సేనల నాశముగాంచి, దప్పిగొని నీరు ద్రావుటకు శిరస్త్రాణమును దీసివేసెను; ఆకస్మికముగ నెచటినుండియో బాణమొక్కటివచ్చి నాటినది యాతనికంఠమున; తత్క్షణమె విగతజీవుడై యతడు నేల వ్రాలెను. ఉదౌజీ మరణమువలన తురక బలము సగము నడుము విరిగినది. ఎచ్చటివా రచ్చటినుండి యథాయథలై పఱచిరి. బల్లాళుని అడ్డుపెట్టువారు లేకపోయిరి. పాఱుచున్న తురకలను వెన్నంటి తఱుముచు సేతువు పర్యంతముపోయి యచట నచట జయస్తంభమును ప్రతిష్ఠించి వెనుదిరిగి మధురసుల్తానునకుజెందిన దుర్గములను పట్టణములను జిక్కంటిని సాధించి కన్ననూరు కుప్పమునకు ముట్టడివేసెను. కోటయందు గాపుండిన తురకదళ మల్పమైనను బల్లాళున కది సులభముగ వశపడలేదు. ధైర్యముతో వారతని నెదిరించి కొంతకాలము పోరాడిరి. కాని వారికి శత్రువులను దఱిమివేయుటకు శక్తిచాలదు. మఱియును కోటయందు వలసినంత వస్తుసామగ్రి లేదు. ఎన్ని దినము లెదురుచూచినను మధురనుండి సహాయమువచ్చు చిహ్నము లేవియు గానరాక

పోరు; కావున కోటను సంరక్షింపగలుగుదుమను నాశయడుగంటెనది. కోట ముట్టడియైనను శత్రులకు స్వాధీనపడుననని వారికి నిశ్చయమైనది. ఈ విషమావస్థయందు కర్తవ్యమేమో నిశ్చయించుకొనజాలక త్రొక్కుడుపడజొచ్చిరి. తలవనితలంపుగ శత్రుపక్షము వారికి మార్గము జూపినది. కోటను లగ్గలు పట్టిన నందలి సైన్యము ప్రాణములపై నాసవిడిచి యుద్ధముసేయుననియు, నందువలన తురకలు సంపూర్ణముగ నశించిపోయినను, దనపక్షమునను జననష్టమగునని గుర్తెఱిగి, కోటను దనకు వశపఱచునెడల నందుగాపుండు వారికందఱికే విపత్తుగలుగనీయక క్షేమముగ స్వరాష్ట్రమునకు బోవననుజ్ఞ యొసగుగునని బల్లాళుడు వారికి వర్తమానమంపెను. కోటను వశపఱచుటకు సైన్యమున కిష్టములేదు; కాని బల్లాళుని సందేశమును త్రోసిపుచ్చుటయు మేలుగాదు; కావున వారొక యుక్తిని బన్నిరి. సుల్తాను అంగీకారము లేక కోటను స్వాధీనపఱచుటకు దమ కధికారము లేదనియు నొకపక్షము వ్యవధియొసగిన సుల్తానుకు దెలియబఱచి యతనియంగీకారమును బడసి కోటను స్వాధీనము జేయుదుమనియు జవాబంపిరి. బల్లాళుడందుకు సమ్మతించెను. అంతటవారు తమ స్థితిగతులను విశదపఱచుచు, దమకు సత్వరము సహాయమంపవలయునని ప్రార్థించుచు సుల్తానుకు సందేశమంపిరి. బల్లాళుడు దనకు కోటవశమైనట్లు తలచి స్కంధావారమున ప్రచారముననుండు కావలి కట్టుబాట్లను మఱచి ప్రమత్తుడై యుండెను. కన్ననూరుపట్టణమునుండి వర్తమానమందగనే యప్పుడే రాజ్యాభిషిక్తుడై యుండిన సుల్తాను ఘయాసుద్దీన్ దాంఘనీ తన యావచ్ఛక్తిని వినియోగించి దళముల గూర్చుకొని హుటాహుటిగ ప్రయాణముజేసి కన్ననూరున కత్యల్పకాలమున జేరి యొకనాటి మధ్యాహ్న సమయమున దటాలున హొయ్సలస్కంధావారముపై బడెను. ఎండవేడిమికి దప్పి హొయ్సలసైనికులు నిదురించుచుండిరి. తురకల తాకుడు గలిగిన యలబలమునకు మేల్కొనిన కర్ణాటకుల కాత్మసంరక్షణ కాయుధముల బట్టుటకు గూడ వ్యవధిలేకపోయినది; కసాయివాని చేజిక్కిన గొఱియలవలె హొయ్సలసైనికులానాడు తురకల ఖడ్గమున కెరయైరి; బల్లాళుని స్కంధావారమంతయు గొల్లవోయినది. అతడును బందీకృతుడాయెను.

మధుర సుల్తాను అంతటి ఘనవిజయము నెన్నడును బొందియుండలేదు. ప్రబలుడైన శత్రువు పరాజితుడయి చేజిక్కెను, అతని బలము సర్వనాశనమాయెను. హస్తగతుడైన శత్రుని విడుచుట సుల్తాను దాంఘనీ కిష్టములేదు; స్వభావముచే నతడు క్రూరుడు. హిందూజాతికి సహజశత్రువు. కాని యతడు బల్లాళుని తక్షణమె చంప దలపెట్టలేదు. బల్లాళుడు ధనసంపన్నుడైన రాజు; అతని జంపుటకుముందు అతని ధనమంతయు నెట్లయిన హరింప నిశ్చయించుకొనెను. ధనమింత యిచ్చిన విడిచెదను నంతయిచ్చిన విడిచెదనని యాసచూపుచు క్రమక్రమముగ నతని సర్వస్వమును హరించెను. అతని ద్రవ్యమునంతయు గొనినపిమ్మట ఇక నతనివలన గలుగు లాభములేదని యెఱిగి క్రీ. శ. ౧౩౪౨ వ సంవత్సరము చివర నాతని మధుర చెరసాలయందు జంపించి శిత్తొలిపించి కోటకొమ్మను గట్టించెను. దాక్షిణాత్య హిందూరాజులలోనెల్ల గొప్పవాడని పేరుపొందిన ముమ్మడిబల్లాళరాయని జీవితచరిత్ర యిట్లు మధుర చెఱసాలయందు పరిసమాప్తి నొందినది.

(సశేషము)






ఉషాదేవిని భర్త ఎంతో ప్రేమిస్తాడు. ఆపేట లోని స్త్రీలందరిలో ఎప్పుడూ దీన్ని గురించే చర్చ జరుగుతుంది. ఉషకూడా యితర స్త్రీలకంటె తను అదృష్టవంతురాల ననుకొంటుంది. తన భర్త లాగ యితర భర్తలు తమ భార్యలను యింత గౌరవించకపోవడం, యింతగా ప్రేమించక పోవడం, తనభర్త తననుకావలసిన విషయాలలో చేతనైనంతవరకు వియోగం కలిగించక పోవడం ఆమె చూస్తూ, అనుభవిస్తున్న విషయాలు.

అతడు,ఎల్లప్పుడూ తన ఉష అందంగా, ఆనందంగా ఉండాలనుకుంటాడు. అందుకనే అలంకరణకి కావలసిన అనేక వస్తువులు తెస్తాడు. అలంకరిస్తాడు. తనవెంట షికారుకు, సినిమాలకు తీసుకవెళ్తూంటాడు.

'ఆయనమీద ఏమంత్రం ప్రయోగించావో, మాకూ చెప్పరాదో?' అంటారు ఉష స్నేహితురాండ్రు.

ఉష హృదయం ఆనందంతో అల్లకల్లోలమై పోతుంది.

'నాకేనా యీప్రత్యేకత? మీభర్తలుమాత్రం ఏ విషయంలో మిమ్మలను ప్రేమించరు?' అని నవ్వుతూ అంటుంది. కాని స్నేహితురాండ్ర మాటల్లో సత్యం ఉందని మనస్సులో అనుకునేది. ఉషకు ప్రాప్తించిన పతిప్రేమ, యే స్నేహితురాలికి ప్రాప్తించలేదు. భర్త ఆప్రేమచేతనే ఆమెనుఎన్నడూ పుట్టింటికికూడ పంపడు. ఒక రోజు ఎడబాటుకూడ సహించలేడు.

* * *

హరిహర్‌లో జరిగే తిరునాళ్ళ ఆచుట్టు ప్రక్కలకల్లాప్రసిద్ధి కెక్కింది.ఇక్కడికివచ్చే పశువులు యింకే తిరణాలకురావు.అందుకని దూర దూరాలనుంచి జనం వస్తారు.

ఆవేళ తిరునాళ్ళ మూడవరోజు. గండక్ నది ఒడ్డున జనం పెద్ద గుంపుగా చేరారు. నదంతా చిన్న చిన్న పడవలతో నిండిపోయింది. ఆ పడవలు వస్తూంటే, వరదలు వస్తున్నాయా అన్నట్లు ఉంది. అన్నిపడవలు ఉన్నప్పటికి ఎక్కేవారికి చోటు దొరకటంలేదు. సాయంసమయం, జనం బోటు షికారుకు ఆత్రుత పడుతున్నారు.

ఉషకూడ తన భర్తతో పాటు ఒక పెద్ద పడవలో కూర్చుంది. నావికులు వద్దు వద్దంటూనే ఉన్నారు. ఆ గలభాలో ఎవరు వింటారు? పడవలో ఖాళీ ఉన్నంతవరకు జనం ఎక్కారు.

అప్పటి పడవలోని బరువుచూచి పల్లెవాళ్ల ధైర్యం దిగజారింది. పడవ అటూ యిటూ ఊగుతూ మధ్య ప్రవాహంలోకి వచ్చి సుడిగుండంలో చిక్కుకుపోయింది. వెంటనే నావికులు పడవ మునిగి పోబోతున్నదని ప్రకటించి, నీటిలో దుమికి తమతమ ప్రాణాలు రక్షించుకోటానికి ప్రయత్నించటం మొదలుపెట్టారు. ఒకరొకరుగా అంతా దుమికేశారు. చచ్చేవాళ్ళం, ప్రయత్నంచేసి మరీ చద్దాం అనే తలంపుతో ఈతరానివారుకూడ దూకారు.

ఇక పడవపైన ఉష, ఆమెభర్త-ఆ యిద్దరే ఉండిపోయారు. పతి కోవతి నడుముకు బిగించికట్టి

మూలం (హిందీ): కమలాదేవి చౌధురి అనువాదం: యం. వి. సుబ్బారావు

పోకడానికి ప్రయత్నిస్తున్నాడు. ఉష బెదరిన లేడిమాదిరి కన్నార్పకుండా భర్తముఖం చూస్తూంది. గుండె దడదడ కొట్టుకుంటూంది. పడవ కూడ తను మునిగిపోతున్నానని సూచిస్తోంది. వాయుదేవుడు తన గమనవేగాన్ని హెచ్చించాడు. ఉష భయంతో కళ్ళు గట్టిగా మూసుకుంది.

ఇంతవరకు ఎప్పుడూ భర్తకు మేలు కూర్చమని భగవంతుణ్ణి ప్రార్థిస్తూ వచ్చింది. కాని యిప్పుడదంతా మరచిపోయి, భర్తను గట్టిగా కౌగిలించుకుందామనుకుంది. చివరి సమయంలో కూడ వేరుకావడం ఆమెకు యిష్టంలేదు. ఉష తన రెండు చేతులు జాపి, భర్తను పట్టుకోటానికి ప్రయత్నించింది. కాని వ్యర్థమైపోయిందా ప్రయత్నం. పతిమహాశయుడు ఉషవైపు చూడకనైనా చూడకుండా నదిలో దూకాడు. ఉష కళ్ళు మూసుకుని పడవలోపడి మృత్యువును ఆహ్వానిస్తోంది.

ఒడ్డున ఉన్న వేలాదిజనుల కళ్ళు యీదృశ్యం మీదనే వున్నయి. అందరి హృదయాలు ఆ మునిగిపోబోతున్న ప్రాణిని రక్షించమని భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నాయి.

భగవంతుడు కూడ యింతమంది ప్రార్థనను కాలదన్న లేకపోయాడు. తేలికైపోవటం వల్ల పడవ మునిగిపోకుండా, ఒడ్డుకు వచ్చి చేరింది. కొంతమంది సాహసికులు, సహృదయులు అంతకు ముందే ఆమెను రక్షించటానికి నీటిలోదుముకారు. భయంతో స్పృహతప్పి పడిఉన్న ఉషను ఒడ్డుకు తీసుకవచ్చారు. అక్కడ ఉన్నవారందరి హృదయాల్లోను ఆమెపైన సానుభూతి ఏర్పడింది. ఉపచారాలు చేయటానికి జనం గుంపులు గుంపులుగా చేరారు. అంతా భగవంతుని లీలా గానం చేస్తున్నారు. ఆమెభర్తవంకచూచి నవ్వుతున్నారు. 'మంచి ఈతగాడిలా ఉన్నావు. నీతోపాటు భార్యను రక్షించుకోడానికి ప్రయత్నించటం నీకర్తవ్యం కదూ?' ఇద్దరు ముగ్గురు సిగ్గుపడుతున్న ఉష భర్తతో అన్నారు.

పాపం. ఉష బిక్కమొగంతో భర్తవంక చూస్తోంది. ఇంతమందిమధ్య ఆమె ఏం మాట్లాడుతుంది? ఒంటరిగా అయితే భర్తను అడిగేది "యిదేనా మీరు చూపే ప్రేమ' అని.

ఇప్పుడు తన దృష్టికి తానే పతితురాలుగా తోచింది. ఆమెకు నిలువలేదు. చచ్చి పోయినా బాగుండేది. అనవసరంగా బ్రతికించాడు పాడు దేవుడు, అనిపించింది. ఇప్పుడేమనుకున్నా బ్రతికి పోయింది ఇక యీవిషయం ఎరిగిన వారికి తెలియకుండా ఉంటే చాలు. అనుకొని, ఎవరైనా పరిచిత వ్యక్తులు ఉన్నారేమో అని, లజ్జాపూరిత నేత్రాలతో పైకి అందరి ముఖాల వంక ఒకసారి చూచింది. ఒకరు యిద్దరు కాదు. అనేకమంది కనపడ్డారు. ఆమె కళ్ళు వాలి పోయాయి.

ఆమెప్రేమపూరితజీవితానికిఅసూయపడేవారు యిప్పుడు సంతోషిస్తారుగదా? స్నేహితురాండ్రు వేరే విధంగా విమర్శిస్తారుగదా? ప్రేమచేత పుట్టింటికికూడ పంపక,'ఉషా! నువ్వు లేకుండఒంటరిగ యీ యింటిలో ఎలా ఉండేది?' అనే ఉష భర్త యికనేనా? అంటారు గదా ? ఇలాంటి భవిష్యత్తులో జరుగబోయే అనేక విషయాలు ఒక్కక్షణంలో ఆమె మెదడులో మెరుపుల్లా మెరిసి పోసాయి.

ఆయనప్రేమ ఎటువంటిది?ఉష చస్తేమాత్రం ఆయనకు దుఃఖం కలుగుతుందా? యింటిలో ఒంటరిగ ఉండటం సంభవమా? దినమొక యుగమైపోదా? అయినా దానికికూడ మందుఉందిగా! కొన్నాళ్ళకు లోకం యీ విషయం మరచిపోతుంది. అప్పుడు రెండోపెళ్ళి చేసుకుంటాడు. ఆమూర్తురాలుకూడ, "నాభర్త నన్ను చాల ప్రేమిస్తాడు" అనుకుంటుంది.

కాని యిదేమిటి? అనవసరంగా యిలా ఆలోచిస్తోంది! ప్రాణాలు పోవలసిన పతి బ్రతకటం దైవకృప కాదూ? నిజానికి ఆమె భగవంతునికి కోటి ధన్యవాదాలు అర్పించాలి. దాన, ధర్మాలు చేయించాలి.

అనవసరంగా దోషారోపణ చేయడమేమో యిది? స్వార్థపునీడలు లేకుండా ప్రేమించేవాడు ఎవడున్నాడీ ప్రపంచంలో? కాని కర్తవ్యమో? మానవ సమాజనం కర్తవ్యమనే సంకెలలతో కట్టబడిఉంది. కాని, దీనిలో తన ప్రాణరక్షణ చేసుకోవటంకూడ కర్తవ్యమేగదా?

భార్య, పిల్లలు - యిదంతా ఉట్టి మిథ్య, మోహం. ఎవరికి ఎవరూ కొరగారు. మోహంలో

చిక్కుకొని తన ప్రాణాల్ని రక్షించుకోకలిగివుండి కూడ, ప్రయత్నించకుండా ఉండటం ఆత్మహత్యకు దారి తీస్తుందిగదా? ఆత్మహత్య పాపం గదా? పూర్వకాలంలో భారత స్త్రీలు భర్తతో పాటు సహగమనం చేసేవారు. అది వారి కర్తవ్యం, అదే వారి ఆదర్శం. ఆ ఆత్మహత్య చేసుకోవడంకూడ పాపమేనా?

ఇటువంటి అంతూపంతూలేని అనవసర ఆలోచనా ప్రవాహంలోపడి కొట్టుకుపోతూంది ఉష. భగవంతుడు తన భర్తకువచ్చిన పెద్ద ఆపదను తొలగించాడు. స్త్రీకి యింతకంటె అదృష్టకరమైన విషయం యింకేమిటి? స్త్రీ యింతటితోనే తృప్తిచెందాలి.

తన హృదయానికి నచ్చ చెప్పి, ప్రసన్నవదనయై లేచి నిల్చుంది ఉష. 'పదండి యింటికి పోదాం-భగవంతుని దయవలన యిద్దరి ప్రాణాలు రక్షింపబడ్డాయి. ఇప్పుడెందుకు చింతిస్తారు?' అని భర్తయొక్క సిగ్గును పోగొట్టటానికి ప్రయత్నిస్తూ అన్నది. పైకి యీమాట అన్నదే కాని హృదయము తేలికపడలేదు. తమ ప్రేమను గురించిన పరిహాసాలకు, ఈర్ష్యా వచనాలకు ఏమని సమాధాన మిస్తుంది?

మృత్యుశయ్యపై పడివున్న భర్తయొక్క తలవైపు కూర్చుని, ఉష వేడివేడి కన్నీరు కారుస్తూంది. నేటికి ఆరుమాసాలనుంచి ఆమె పతిని జ్వరం ఆవహించింది. యీ ఆరుమాసాలలో ఒక్కరోజుకూడ ఆ పాపిష్టి జ్వరం విడువలేదు. విడుస్తుందని ఆశలేదు. డాక్టర్లు క్షయ (టి. బి) అంటున్నారు. క్షయంటే ప్రపంచంలో నివారించటానికి ఏ ఉపాయంలేని అసాధ్యమైన రోగమా? ఓరి భగవంతుడా! యింకేది గది?

ఇంతకంటె ఆలోచించ లేకపోయింది. కళ్లలో నుంచి నదీప్రవాహంలా పొంగింది, కన్నీరు. అదే సమయంలో, ఆమె ఆలోచనలకు అంతరాయము కలిగిస్తూ, దగ్గర రెండో మంచంమీద పడుకొన్న పిల్లవాడు లేచి, ఏడుస్తూ, "అమ్మా" అని పిల్చాడు.

ఉష కన్నులు తుడుచుకుంది. కొన్ని సెకండ్లు కన్నులు మూసుకొని, మనస్సులోనే, "భగవాన్! ఏడ్వటానికి నన్ను ఒంటరిగా యీ భూమిమీద మిగల్చవద్దు" అని ప్రార్థించింది.

పిల్లవాణ్ణి ఒడిలోకి తీసుకోవటంతోనే, ఆమెకు యింకో ఆలోచన తట్టింది. మా యిద్దరి తరువాత వీడిగతేంకావాలి? ప్రపంచంలో యీ అమాయకపు బిడ్డడికి దిక్కెవరు? పతి పోయిన తరువాతకూడ



వీనికోసం, నా ప్రాణాలు నిల్పుకోవటానికి ప్రయత్నించటం నాకు ధర్మమేనా? అని ... యీ ఆలోచనలు ఆమెహృదయంలో। పెద్ద తుపాను చెలరేపినయి. కంఠం పూడుకుపోయింది. కన్నులు నీటితో నిండిపోయినయి.

ఆమె శరీరమంతా గడగడ వణకుతోంది. ఇదేమిటి! ఆమే గాదు, యిల్లు కూడ కదులుతోంది. భర్తమంచం కూడ వణకుతోంది. ఆమె పిల్లవాణ్ణి తీసుకుని భర్తదగ్గరకు పరుగెత్తింది. అదే సమయంలో నాల్గుమూలలనుంచి "భూకంపం-భూకంపం" అనే అరుపులు వినపడ్డాయి.

"ఉషా! నాలో లేచేశక్తిలేదు. నన్ను గురించి చింతించక పిల్లవాణ్ణి తీసుకుని బయటికి పో!" రోగిష్ఠి భర్త నీరసస్వరంతో అరిచాడు.

మట్టి యిసక, గాలిలో కలిసి యింట్లోకి వస్తోంది. భయంకరమైన దడదడ శబ్దంతో యిల్లు పడిపోవాలని చూస్తోంది! యింకా ఆమెకు భర్తను రక్షించే ఉపాయం తోచలేదు. యింట్లో తను ఒంటరిగా ఉంది. చంకలో పిల్లవాడున్నాడు.

అప్పుడే గదిగోడ పడనేపడ్డది. "ఉషా! పో, బయటికి పో!" ఉష భర్త బిగ్గరగా అరిచాడు.

ఉష పిల్లవాణ్ణి హృదయానికి హత్తుకుని బయటికి పరుగెత్తింది. భయభ్రాంతుడై యేడుస్తున్న పిల్లవాణ్ణి బయటవుంచి వెంటనే భర్తను బయటకు తీసుకవచ్చే ప్రయత్నంలో తిరిగి గదిలోకి వెళ్ళింది.

ఫెళ, ఫెళ శబ్దంతో పైకప్పు కూలింది. ఉష భర్త హృదయంమీద వాలింది.

పాపం, పిల్లవాణ్ణి కాపాడమని దేవుణ్ణి ప్రార్థించేందుకైనా అవకాశం దొరకలేదు. భార్య, భర్త యిద్దరూ, ఆ ఆకలిగొన్న భూగర్భంలో కలిసి పోయారు.



# ఏరువాక సాగడం....

గుడిపాటి శ్రీహరికృష్ణ

విరోధినామ సంవత్సరపు ఉగాదినాడు వున్నవాళ్ళు వున్నంతగా, లేనివాళ్ళు లేనట్టుగా పండుగ జరుపుకొన్నారు. రైతులకు, ఇది తొలి పూజచేసే సుదినం. కృష్ణా డెల్టాలో ఏ మాగు మూలనోతప్ప దాళ్వాపంట కనిపించదు. గోదావరి తల్లి చల్లనిచూపు కారణంగా దాళ్వాచేలు ముమ్మరంగా కనిపిస్తాయి—ఆ డెల్టాలో.

ఈరోజున ముఖ్యంగా దాళ్వాపంట లేని పొలాలలోనూ, మరి మెట్టప్రాంతాలలోనూ ఉగాదిపండుగకే తొలిసారి రైతు ఏరువాక సాగుతాడేమో అనిపిస్తుంది. "ఏరువాక" అంటే పెక్కుమందికి తెలియనే తెలియకపోవచ్చు.

రెండోపూట వందలాది రైతాంగం తమ నొసటను కుంకుమ దిద్దుకొని, పసుపుపూత పెట్టి, కుంకుమతో అలంకరించిన అరక-అంటే నాగలి-భుజాన వేసుకొని ఎద్దులను కూడా అలంకరించి, చేతితో కర్రపుచ్చుకొని పొలాలవైపు సాగిపోయారు. చేతికర్రలకు మామిడికొట్ట పసుపుదారంతో కట్టబడి వుంటుంది.

పొలాలలో అడుగిడి, నాగలి ఎద్దుల మెడమీదవేసి, మేడితోకమీద (మేడితోక అంటే భూమిని దున్నేటపుడు తగిలించబడిన కొయ్యకు చివర చేతితో పుచ్చుకొనే చుక్కానిలాంటి అడ్డకర్ర) చేయివేసి తూర్పుముఖంగా నాగలిని పోనిస్తారు. దీనినే ఏరువాక సాగడమని అంటారు.

మేడితోకమీద చేయివేయడమంటే ఎంతో సంబరం. పట్టరాని ఆనందం. చెప్పలేని ఉత్సాహం. ఇవన్నీ ఒకపట్టున మనకు రైతుముఖంలో కనిపిస్తాయి. ఆ పని ప్రముఖమైనదిగా రైతాంగంలో భావిస్తారు. మేడితోకమీద చేయివేసి, కొబ్బరికాయలు కొడతారు. ఆ ముక్కలూ, నానువాలు బియ్యమూ కలిపి పంచుకు తింటారు.

ఇదే తొలిపూజ. నూతన కార్యసరళికి అంకురార్పణ.

తమ చేతికర్రలకు కట్టుకొనే మామిడికొట్ట, వారి కార్యదీక్షకు చిహ్నం. అదే దీక్షాకంకణం.

ఈ దీక్షా కంకణం దేనికి అంటారా? 'నేను నాగలిని చేబట్టి, కొండ్రనుదున్ని, పంటపండిస్తాను. వెనుకటికన్న మరింత పండాలి' అనేదే వాని సంకల్పం. 'నాపొలం బాగాపండాలి. నాయింట ధాన్యంరాసులు వుండాలి' అనే అతని కోరికలో స్వార్థంవుంది. అయినా ఆస్వార్థంలోనే పరార్థం ఇమిడివుంది. తాను పండించిన పం…, తనకు తిండికి పోగా, ఇతరులకు అమ్ముతాడు. ఇతరత్రా బ్రతికి మరోవృత్తులను అవలంబించే వారి పొట్టకు తిండిని అందిస్తాడు.

తన పండించిన పంటకు హెచ్చు ధర ఆశించవచ్చు. ప్రతివారు మరింత పెరగాలనే ఆశించడం సహజం. ప్రక్కవాని పచ్చ ఓర్వలేనితనంకూడా అగుపిస్తుంది. బోదె దగ్గర తగాదాపడడం తప్పకపోవచ్చు. గండిసాగు రైతు హక్కు అని వాదించవచ్చు. ఇవన్నీ అతనిలో మనకు అగుపించే దుర్గుణాలనే మనము నిర్ణయించడం జరుగుతుందికూడాను. సన్నకారు రైతాంగములోనే ఇవి వుంటే, లేమికారణమేమో అని సరిపెట్టుకొందాం అనుకొన్నా ఈ అవలక్షణాలు పెద్ద రైతులలో హెచ్చుమందిలో ముమ్మరంగా కానవస్తాయి. సన్నకారులో దినదినం పెరగాలనేది ఆకాంక్ష అవుతే, పెద్దలలో అదే దురాశగా పరిణమిస్తోంది. సన్నకారురైతు కొద్దిమందినే తన ఆకాంక్షకు గురిచేస్తే, పెద్దరైతు ఎందరినో దిగమ్రింగుతాడు.

ఇంతకీ నేటి ఇరిగేషన్ విధానంలోని లోపాలు చాలావరకు రైతు దొడ్డిదారి త్రొక్కడానికి ఉపకరించాయి. అలాగే సామాజిక, ప్రభుత్వ స్వరూపాలు అతనిలోని అవలక్షణాలకు తావిచ్చాయి. పరిపాలనా క్రమంలో నేటి మన రైతుకు సమష్టిక్షేమంపట్ల విశ్వాసం, సమష్టి శ్రేయస్సుపట్ల సానుభూతి సన్నగిలాయి. అతనిలో వందలాది ఏళ్లగాని పాతుకుపోయిన అవిద్య ఎన్నో దురభ్యాసాలకు దారితీసింది.

ఇంతగా స్వార్థం, అసహనం, అవిద్య అతనిలో పెద్దపెట్టున కాపరంచేస్తున్నా, 'తాను పంట పండించాలి - అందరూ బ్రతకాలి' అనేదిమట్టుకు మరవలేదు. అందుకే ఎన్ని కష్టాలుపడుతున్నా, ఎన్ని నష్టాలు వస్తున్నా, తాను ఈరోజున మేడితోకమీద చెయివేసి ఏరువాకసాగుతూ, మరింత పంటపండిస్తాననే దీక్షాకంకణం కట్టుకొని మురుస్తున్నాడు.

ఇరిగేషన్ సముపాయాలు, నిత్య అవసరాలకు సకాలంలో తేలికగా తీర్చే సామాజికవ్యవస్థ ప్రభుత్వ విధానం రైతుకు లభిస్తే- చక్రవడ్డీలను, నాములను తీసుకోవడంకాని, తనకు అవసరంలేని ధాన్యాన్ని గరిసెలలో దాచుకోవడంకాని, తన తర్వాత ఆసామికి కావలసిన పంట ముసుగు బోదెలను పూడ్చడంకాని, గండి సాగుచేయడం రైతుహక్కు అని తలపొయ్యడంగాని చేస్తాడని అనుకోలేం.

నేడు ఏ పట్టుదల, దీక్ష, ఉత్సాహం అతనికి ఏరువాక సాగడానికి ప్రోద్బలమయ్యాయో, ఆవే ఆనాడు అతనిని ఉత్తమపౌరునిగా తయారు చేయగలగటానికి సాధనలు కాగలవు. అయితే అతని దృక్పథాన్ని మార్పించగల వాతావరణం ఎక్కడా? అనేదే ఎందరినో వేధిస్తోంది.



# ఆ రోజులు వెళ్ళిపోయాయి—



# మరి నేడో?

బి. యస్. ఆర్. కృష్ణారావు

'రేపేగా ఒకటో తారీకు! జీతం వస్తుంది కదూ?' అన్న సీత మాటలు గోపాలానికి కొంచెం విసుగు కలగచేశాయి. ఆఫీసు కాయితాలు ఇంట్లో పడేసి, పగలల్లా పనిచేయటంనుంచి వేడెక్కిన బుఱ్ఱను చల్లబర్చటానికీ, మేనేజరు అన్న మాటలతో కుమిలిపోయే హృదయాన్ని శాంతింప చేయటానికీగాను కాస్త చల్లగాలి కోసం, అట్లా పార్కుకో, నది ఒడ్డుకో పోవాలని బయల్దేరాడు. ఈ స్థితిలో తనున్నప్పుడు సీత అలా అనేసరికి అతనికి మరింత చిరాకు కలిగింది.

'వస్తే వస్తుంది లేకపోతే లేదు. ఏమంత తొందర' అన్నాడు విసుగ్గా. ఒక్కరోజు జీతం రావటం ఆలస్యమయినందువల్ల కలిగే ఇబ్బందులు తెలిసినప్పటికీ జవాబుకోసం నిరీక్షించకుండానే గుమ్మం దాటిపోయాడు గోపాలం.

'ఏమీ లేదు పాలడబ్బా అయిపోయింది. డబ్బా ఊడిచి కడిగిపోస్తే ఇంకొక్కసారికి బొటాబొటీగా వస్తుంది. ప్రస్తుతం ఒక చిన్న డబ్బా అయినా పట్టుకొస్తారేమోనని' అంటూ పసిపిల్లవాడిని భుజాన వేసుకుని వంటింట్లోకి వెళ్ళిపోయింది.

మనస్సు సరిగా లేనప్పుడు మనోభావాలకు భిన్నంగా ఏ సంఘటనయినా జరిగితే నిరుత్సాహం కలుగకమానదు. ఒకమారు కలిగిందంటే, అది క్రమంగా దానినీడలో విస్తరించి ఇంక ఇతర విషయాలనుగురించి ఆలోచించకుండా చేయగల శక్తి దానికి ఉంది. అందులో డబ్బు లేకపోవడంవల్ల కలిగిన నిరుత్సాహం ఎంతటివారినయినా క్రుంగదీస్తుంది. అందులో ఏవస్తువు లేకపోయినా గడుపుకోవచ్చునుగాని పాలడబ్బా అంత చులకనగా అక్కర్లేదని తీసి పారెయ్యతగిన వస్తువు కాదని గోపాలానికి తెలుసు.

భుజాలు చిరిగిన చొక్కామీద కోటు తొడుక్కుని గుమ్మం దాటాడు. పాత బాకీ పాతిక రూపాయిలూ ఇవ్వనందువల్ల షావుకారు సరుకు సరిగా యివ్వటంలేదని తెలిసినప్పటికీ, పసిపిల్లవాడి విషయం కదా ఇవ్వకపోతాడా అనే నమ్మకంతో పెద్ద పెద్ద అంగలేస్తూ షావుకారు కొట్టుకు వెళ్ళాడు. గోపాలం కొట్టుకు వెళ్ళేసరికి షావుకారు లేడు. కుర్రాడున్నాడు. సగం దిగజారిపోయిన ప్రాణంతో గుండెలు కొట్టుకుంటూ వుంటే, వాడి నోటివెంట జవాబేమి వస్తుందో అనే ఆదుర్దాతో కన్నార్పకుండా వాడికేసి చూస్తూ - నిరాశాభావంతో, తడబడే మాటలతో 'షావుకారు లేడా?' అన్నాడు.

'కోర్టుకి వెళ్ళారు ఏమండీ' అన్నాడు కుర్రాడు, గల్లా పెట్టెలోని చిల్లర డబ్బులు లెక్క చూసుకుంటూ. పాల డబ్బాలు బీరువాలో తళతళా మెరుస్తున్నాయి. గోపాలం నవనాడులూ క్రుంగిపోయాయి.

'ఇంకా ఎంతసేపటికి కొస్తాడు?'

'ఎప్పుడు పనైతే అప్పుడొస్తారు.'

'పాలడబ్బా ఒకటి ఇయ్యి, నాపద్దులో కర్చు రాసుకో' అన్నాడు వణుకుతున్న పెదవులతో.

'నాకు తెలీదండీ! నన్ను రొక్కం బేరమే చూడమన్నాడు. రేపు రండి, ఆయన ఉండగా' అని చింతపండు పెండె విరగ దియ్యటానికి వెళ్ళాడు.

'నాకు కాశావున్న సంగతి నీకూ తెలుసునుగా?' అన్నాడు ముఖంమీద చెమట తుడుచుకుంటూ.

'షావుకారొచ్చింతరువాత రండి, ఇన్ని మాటలు దేనికి' అని చింతపండు పెండె బల వంతాన విరగదీసి కాటాలో వేశాడు.

పాతబాకీ పూర్తిగా ఇవ్వకపోవటంనుంచి షావుకారు కుర్రాడి కీవిధంగా చెప్పివుంటాడని గోపాలం గ్రహించాడు. ఇంక బ్రతిమాలినా లాభంలేదని బయటికొచ్చాడు. తన పర్సులో వున్న ఆఖరు అణాన్నరా పెట్టి మధ్యాహ్నపు అరకప్పు కాఫీ త్రాగేశాడు. డబ్బా కడిగిపోస్తే ఒక్కసారికి వస్తుందేమో అన్న సీత మాటలు చెవుల్లో గింగురుమంటూ వుండగా నడి బజార్లో కొచ్చాడు, కోటు జేబుల్లో చేతులుపెట్టుకుని కాళ్ళీడ్చుకుంటూ. జీతం రేపు సాయంత్రంగాని రాదు. ఈ ఒక్కరోజూ గడిచేవిధం? పోనీ ఎవరినయినా అప్పడుగుదామంటే అందరికీ నెలాఖరు రోజే. ఎవర్నడిగితే ఎవరిస్తారు? ఈ పరిస్థితుల్లో పాలడబ్బా వచ్చేదెట్లా?

తల వంచుకుని వచ్చేస్తున్నాడు. ఎవరో వెనకాల వీపు తట్టినట్లయింది. ఉలిక్కిపడి వెనక్కి తిరిగి చూశాడు.

'ఏమోయ్ గోపాలం! అట్లా బెదురుతున్నావేం, నన్ను మర్చిపోయావా?'

'అరె, నువ్వా రామం, ఏదో పరధ్యానంగా వున్నాను. ఏమిటి కబుర్లు. ఎక్కడా వుండటం?'

'ఫిలిం కంపెనీలో మేనేజరుగా వుంటున్నాను. కులాసా? పిల్లలా ఏమన్నా? అబ్బ, ఎన్నాళ్ళయిందోయ్ నిన్ను చూసి! కాలేజీలో చదువుతూన్న రోజుల్లో చేసిన అల్లరి, ప్రిన్సిపాలు చివాట్లూ, మన వెంకి సమాధానాలూ- అన్నీ ఒక్కసారి జ్ఞాపకం వస్తున్నాయి. జీవితంలో మరపురాని దినాలు' అంటూ తృప్తిగా నవ్వాడు రామం.

మిత్రుడికి మరపురాని దినాలు కాలేజీ రోజులు. గోపాలానికి అన్నీ మరపురాని రోజులే. కాకినాడ కాలేజీరోజుల దగ్గరనుంచి, షావుకారు కుర్రాడు పాలడబ్బా ఇవ్వననటం వరకూ అన్నీ మరపురాని దినాలే.

'అయితే నీకన్న నేనే గొప్పవాడిని' అన్నాడు గోపాలం.

'ఏం అట్లా అంటున్నావ్' అని ఆత్రుతగా మిత్రుడు.

'నీకు కాలేజీరోజులు మరపు రావటం లేదు. నాకు ప్రతిరోజూ మరపురాని దినమే. అంటే జ్ఞాపకశక్తి ఎక్కువన్నమాట' అని నవ్వాడు గోపాలం.

'ఇంకా వెనకటిమాటలు పోలేదు, అసాధ్యుడివి. కాని నిన్ను తల్చుకున్నప్పుడల్లా ఆ రోజు సంఘటన గుర్తొస్తుంది. తనవైపు అదే పనిగా నువ్వు చూస్తున్నావని నిర్మల ప్రిన్సిపాల్‌తో రిపోర్టు చేసినప్పుడు, నేను నిర్మలవైపు అదేపనిగా చూస్తున్నానని ఆవిడకెట్లా తెలుస్తుంది-అదేపనిగా నిర్మల నావైపు చూస్తే తప్ప అన్నావు గుర్తుందా? ఆరోజులే వేరు. చీకూచింతా లేకుండా పెద్ద వాళ్ళని పీడించి డబ్బులు వొడుక్కుని జల్సాగా ఖర్చుపెట్టుకునే రోజులు. ఇవి సంపాయించింది చాలకపోయే రోజులు.'

'అయితే ఇప్పుడు నీజీతమెంత' అని ఆత్రంగా అడిగాడు గోపాలం.

'అయిదు వందలు.'

ఈమాట వినేసరికి గోపాలానికి కొంచెం కోపం కలిగింది రామంమీద. డెబ్బైఅయిదు రూపాయిలు సంపాయించుకునే తనకి జీతం చాలకపోవటమే, అయిదువందలు సంపాదించే మిత్రుడికీ చాలకపోవటమే ?

'నిల్చునేవున్నాం, కాస్త టిఫిన్ పుచ్చుకుందాం, రా' అని చెయ్యిపుచ్చుకు లాగాడు రామం. మనస్సు వెనక్కిలాగుతున్నా కాళ్లు వాటంతటవే ముందుకుపోయాయి. బాల్యమిత్రుడు కనబడిందే చాలుగదా అని సంతోషంతో అన్నీ ఆర్డరిస్తున్నాడు రామం. లడ్డూ విరిచి నోట్లో పెట్టుకుంటూంటే చెయ్యి వెనక్కిలాగింది గోపాలానికి.

'నువ్విచ్చిన పనేమిటి, చేసేపనేమిటి! నీ పసిపాపకన్నా పాలికగట్టు పెద్దవాడివి' అన్నది అంతరాత్మ.

'నీ సొంతడబ్బు పెట్టుకుని తినేయోగ్యత ఈ జన్మలో లేకపోగా ఆప్తమిత్రుడు పెట్టించినకూడా స్వీకరిస్తున్నావా' అన్నది జిహ్వ. నోరు తెరిచి లడ్డూముక్క నోట్లో వేసుకున్నాడు.

'ఇంట్లో భార్యాబిడ్డలు ఆవిధంగావుంటే, నువ్వీ విధంగా పొట్ట నింపుకుంటున్నావా' అన్నది అంతరాత్మ.

'ముందు పెట్టింది తిను. తరువాత పాలడబ్బా సంగతి ఆలోచిద్దుగాని' అన్నది జిహ్వ.

లడ్డూ, పెసరట్టూ, కారప్పూస ఒకదాని తరువాత మరొకటి నోటిలోకి వెళ్ళిపోయాయి.

'ఒక పాలు, ఒక కాఫీ' అన్నాడు మిత్రుడు.

పాలు అనగానే మనస్సు చివుక్కుమంది. కడుపులో చెయ్యిపెట్టి కలిపినట్లయింది. 'పాలెవరికి?' అన్నాడు.

'నాకేనోయ్. కాఫీ తాగను. కాఫీకన్న పాలే ఇష్టం' అన్నాడు మిత్రుడు నవ్వుతూ. పాలుతాగే పసిపాపకు పాలు కరువైనాయి. పాలితే(?) పెద్దవాళ్ళకు పాలు కావలసివచ్చాయి. సృష్టిచిత్రం- అనుకున్నాడు గోపాలం. సెర్వరు కాఫీ, పాలు పట్టుకొచ్చాడు. పాల కప్పు గోపాలంముందు పెట్టాడు, కాఫీ కప్పు రామంముందు పెట్టాడు. పాలకప్పులో తన పసిపాప ప్రతిబింబం కనిపించింది: ఆకలితో ఏడుస్తున్నట్లూ, చేతులు నోట కుక్కుకుంటున్నట్లూ భార్య సీత. డబ్బా అంచులు కడిగి సరిపుచ్చి పోస్తున్నట్టు. ఒకటి ఆకటికి తట్టుకోలేక ఏడ్చే తన పసి పాపముఖం, రెండోది తన రాకకోసం ఎదురుచూసే భార్య సీత విచారవదనం: పాలకప్పులో కనబడ్డాయి. తనముందునుంచి పాలకప్పు లాగాడు మిత్రుడు. కాఫీకప్పు ముందుకు తోశాడు. కాఫీకప్పులో ఖాళీ పాలడబ్బా తళతళా మెరుస్తూ కనబడింది.

'ఇంకా కాఫీ త్రాగలేదు, వేడిగా వుందా?' అన్నాడు రామం.

'ఆ. అవును' అంటూ గ్లాసుఎత్తాడు కాఫీ తాగుదామని. చేతులు వణికాయి, కాఫీగ్లాసు జారి కిందబడి ముక్కలయిపోయింది. కాఫీ నేల పాలయింది. వేడికన్నీటిబిందువులు రెండు నేలపాలయిన కాఫీలోపడి కలసిపోయినవి.

'అదేం? చెయ్యి జారిందా?'

'అవును. తాగలేని పిల్లి బోర్లదోసుకుంది' అన్నాడు గోపాలం.

కాలేజీనాటి ఎగతాళిమాటలే మాట్లాడుతున్నాడని అనుకున్నాడు రామం.



జేబురుమాలుతో కళ్ళొత్తుకున్నాడు గోపాలం.

'అయితే మళ్ళీ కాఫీ తెప్పిస్తాను, తాగు' అని బలవంతం చేశాడు.

గోపాలం వద్దని గట్టిగా చెప్పాడు. ఇద్దరూ బైటికొచ్చేశారు.

'అయితే నీకు పిల్లలెంతమందోయ్' అన్నాడు రామం, కిళ్ళీ అందిస్తూ.

'మూడేళ్ళ ఆడపిల్ల, తొమ్మిదినెల్ల పిల్లాడూ.'

'సంతోషం. నాకాభాగ్యం ఇంతవరకూ లేదు. ఏది మీ ఇంటికి పోదాం పద, పిల్లల్ని చూపింతువుగాని.'

గోపాలం మనస్సు చివుక్కుమంది. కాఫీ హోటల్లో కడుపునిండా తిని, వొట్టిచేతులతో పాలడబ్బా లేకుండా పోవటమూ అని. ఇంటికొచ్చిన స్నేహితుడిని భోజనానికి వుండమనకపోతే బాగుండదు. కాని వంటయింటి పరిస్థితులెట్లావున్నాయో !

ఖాళీ పాలడబ్బా కడిగి కొమ్ము చెంబులో పోస్తున్నది సీత. గోపాలంచేతులో ఏమీ లేక పోయేసరికి ఆమె నిర్ఘాంతపోయింది. పెదిమల యొ్రదనం చూచి కొంచం ఆశ్చర్యపడ్డా ప్రక్కనున్న మనిషినిచూడగానే గ్రహించి పిల్లవాడిని తీసుకుని లోపలికి వెళ్లిపోయింది.

స్నేహితుడిని చాపమీద కూర్చోమన్నాడు. తానూ కూర్చున్నాడు. లోపలికివెళ్ళి సీతతో అసలు విషయం చెప్పుదామని లోపలపీకుతున్నా వూరుకున్నాడు. లోపల పిల్లవాడి ఆకలి ఏడుపు వినబడుతున్నది.

'ఏరీ మీ పిల్లలు?' అన్నరామం ప్రశ్నతో లోపలికివెళ్ళి ఇద్దర్నీ తీసుకొచ్చాడు. మూడేళ్ళ ఆడపిల్ల బెదిరిచూస్తూన్నది. ఈ క్రొత్త మనిషి ఎవరా అని. నోట్లో వేళ్ళు కుక్కుకుంటూ కాళ్ళతో తన్నుకుంటున్నాడు పసివాడు.

'ఇద్దరూ కడిగిన ముత్యాల్లాగున్నారు. అదృష్టవంతుడివోయ్ గోపాలం' అని ఇద్దరి చేతుల్లో చెరి అయిదు రూపాయిలూ పెట్టాడు. 'ఎందుకోయ్ ఇదంతా' అని పిల్లల్ని ఇంట్లోకి తీసుకువెళ్ళాడు. లోపలికి వెళ్ళగానే సీతతో విషయంచెప్పి, పది రూపాయిలూ జేబులో వేసు కొని 'అతడిని భోజనానికి వుండమంటున్నా ఏమన్నా కావాలా?' అన్నాడు.

'నెయ్యా, కూరగాయలూ కావాలి' అన్నది సీత.

'సరే, నేతిగిన్నె, కూరలసంచీ ఇవ్వు' అన్నాడు.

'పాలడబ్బా తెచ్చారా?' అన్నది కన్నార్పకుండా.

'పీటితో పాటుగానే' అని నేతిగిన్నె, సంచీ తీసుకున్నాడు. 'ఇవాళ మాయింట్లో వుండాలి తప్పదు. అడ్డుచెప్పబోకు. అట్లా బజారుపోదాం పద' అన్నాడు గోపాలంతో.

'నువ్వు అనటమూ నేను కాదనటమూనా. కాని ఏదో తతంగంమీద బయల్దేరావు. నాతిండి సంగతి నీకు తెలుసుకదా! అందులో ఇప్పుడే కాఫీ హోటల్లో తిన్నామా! కాస్తలఘువుగానే కానియ్యి సుమా!' అని నవ్వుతూ లేచాడు రామం. ఇద్దరూ రోడ్డుమీద పడ్డారు.

'ఇందాకటినుంచీ అడగటం మర్చిపోయాను. నువ్వేం చేస్తున్నావ్, గోపాలం?'

'ఆఫీసులో గుమాస్తా ఉద్యోగం' అన్నాడు గోపాలం.

# పొగాకుపంట నిషేధించాలి

"శాస్త్రి"

మన ఆహారసమస్యాపరిష్కారానికిముఖ్యంగా చెయ్యవలసిన ప్రథమ చికిత్స — ప్రభుత్వం శ్రద్ధవహించి ప్రజల జీవనాధారమైన తిండి ధాన్యాలు మాత్రమే పండించుట కంగీకరించి విలాసార్థ ముపయోగించే పంటలు- పొగాకు వగైరా- నిషేధించుట. ఈ నిషేధంవల్ల ప్రభుత్వానికి ఆదాయంలో లోటుకలిగినాసరే ప్రజల శ్రేయస్సుకోసం ఆ లోటును భరించడం, మరొక లాగ భర్తీచేసుకోడం అవసరం. సేద్య యోగ్యమైనభూమిలోఅధమం 90%అయినా ధాన్యపు పంటకే ఉపయోగించేలా ప్రభుత్వం చూడాలి.

మనదేశంనుంచి 1941-'42 లో 220 లక్షల రూపాయిల విలువగల పొగాకు ఎగుమతి అయినట్లు, 1945-'46 లో 363 వేల ఎకరాలలో పొగాకు పండిస్తున్నట్లు ప్రభుత్వపు లెక్కలు చెపుతున్నాయి. ఈ నాలుగు మూడేళ్ల లోనూకూడా ఈపొగాకుపంట ఎన్నోరెట్లు పెరిగి పోయింది. దీనికికారణం మరిపంటకంటే రైతుకు పొగాకుపంటవల్ల అనేకరెట్లు లాభం వస్తోంది. ప్రజల శ్రేయస్సును విస్మరించి ప్రత్యేకవ్యక్తుల ఆదరాభిమానాలు పొందడానికి ప్రయత్నించడం నిజమైన ప్రజాప్రభుత్వ లక్షణం కాదు. గోదావరి, కృష్ణ లంకలలోనూ, గుంటూరు, కృష్ణా జిల్లాలలోనూ, డెల్టా భూములలోనూ ఇప్పుడు కొన్ని లక్షల ఎకరాల భూమిలో పొగాకు పండిస్తున్నారు. ఈభూమిలో (ఏది పండుతుందో అది) ఆహారధాన్యం పండించేలా ప్రభుత్వం చేస్తే ఈ ధాన్యపుకొరత కొంత వరకైనా తగ్గడానికి అవకాశం ఉంది.

# పరమాణువు

కె. యస్. శివరావు

వేమన రసవాదవిద్య—అంటే ఇనుము, రాగి మొదలయిన చౌక లోహాల్ని బంగారుగా మార్చటం—సాధించాడని ప్రతీతి. ఈ రోజుకూ అది యథార్థమని నమ్మేవాళ్లు అసంఖ్యాకులు. మహమ్మదీయ సంస్కారం ఉచ్చదశలో వున్న మధ్యయుగాల్లో అనేకు లీ రసవాదవిద్య సాధన కోసం జీవితాలంకితం చేశారు. చౌకలోహాల్ని బంగారుగా మార్చే 'వేదాంతిశిల' అనే సాధన కోసం ఎంతో ప్రయత్నించారు. ఈ రసవాదంలోని సాధ్యాసాధ్యాలు తెలుసుకోవాలన్నా—

అమెరికా న్యూ మెక్సికో ఎడారిలో పరీక్షార్థం పరమాణువు బాంబును పేల్చారు. బాంబు పేలిన 9 మైళ్ళ దూరానవున్న శాస్త్రజ్ఞులకు మండువేసవిలో సహారా ఎడారిలో మిట్టమధ్యాహ్నం వుండేటంత ఎండవేడి తగిలింది. మైళ్ళ వైశాల్యంలోవున్న యిసుక బాంబువేడికి కరిగి గాజుగా తయారయింది.

1945 స॥ ఆగస్టు 6 వ తారీకున అమెరికన్ విమానాలు జపానులోని హిరోషిమా, నాగసకి పట్టణాలమీద రెండు యాటంబాంబులు వేసినవి. 250,000 జనాభా గల హిరోషిమా అదృశ్యమయింది. నాగసకి నామరూపాల్లేకుండా పోయింది. 24 పౌన్ల బరువు మించని వొక్క బాంబు అంత వినాశం ఎలా కల్గించిందో తెలుసుకోవాలన్నా—

యుద్ధానంతరం అమెరికన్ శాస్త్రజ్ఞులు పరీక్షార్థం బికినీ ద్వీపం పక్క సముద్రంలో యాటం బాంబును పేల్చినప్పుడు సముద్రం స్థంభాకృతిలో కొన్నివేల అడుగుల ఎత్తు లేచి ప్రక్కనున్న ద్వీపాన్ని ముంచేసింది. ఇంత మహత్తరమైన శక్తి మానవుడికెలా హస్తగతమైందో తెలుసుకోవాలన్నా—

పరమాణువుయొక్క స్వరూపం అర్థం చేసుకోవాలి.

**పరమాణువంటే :**

ప్రపంచంలో మనకు కనపడే సామాన్య వస్తువులన్నీ వొకే పదార్థరూపములుకాక భిన్నధాతువుల కలయికవల్ల యేర్పడ్డవి. ఏకరూపంగా కనపడే నీరు, గాలి కూడా భిన్నధాతువుల సంకలన స్వరూపాలే. నీటిని విద్యుచ్ఛక్తితో ఆమ్లజని, ఉదజని వాయువులుగా విభజించవచ్చు. గాలిని వుదజని, ఆమ్లజని, నత్రజని వాయువులుగా విడదీయవచ్చు. ఇలా విడదీయబడరాని, ఏకరూపము-ఏకగుణము కలిగిన పదార్థాలను ధాతువులంటారు. మానవుని శరీరంలో ముఖ్యభాగమయిన బొగ్గు, లోహాలయిన యినుము, రాగి, వెండి, బంగారు కూడా ధాతువులే.

ధాతువును విభజింపగా విభజింపగా చివరకు విభజింప వీలులేని, ఆ పదార్థపు స్వరూప లక్షణాలు కలిగిన అంత్యకణాన్ని పరమాణువంటారు.

రాసాయనికవేత్తలు ప్రతిధాతు పరమాణువు వొక నిర్ణీతభారం కల్గివుంటుందని నిరూపించారు. నీరును విద్యుచ్ఛక్తిలో మూల ధాతువులక్రింద విడదీస్తే ప్రతివొక కణంలోను 2 పాళ్లు ఉదజని, 1 పాలు ఆమ్లజని వుంటవని, ఉదజనిభారం 1 గా తీసుకుంటే ఆమ్లజని భారం 16 వుంటుందని తేల్చారు. మానవుని వుపయోగంలోవున్న ఏమానంవల్లా పరమాణువును కొలవ సాధ్యంకాదు. కనుక ధాతువులన్నిట్లోకి తేలికైన ఉదజని ధాతువుభారం 1 గా తీసుకొని, మిగతా ధాతువు

అన్నిటికీ సాపేక్షభారం కట్టారు. ఉదజని భారం 1, అమ్లజని 16, వెండి 107.88, బంగారు 197.2...యురేనియం 238.2.

20 వ శతాబ్దాదివరకు ఏధాతుపరమాణువైన విభజింపరానిదని గట్టి నమ్మకముండేది. **(Atom-that which cannot be divided)** రాసాయనిక సంకలనంలో వొకధాతు వింకొక ధాతువుతో కలియుట ఆధాతువుల పూర్ణపరమాణువుల సంయోగం వలన జరుగవలసిందేగాని, పరమాణువులు విభాగమయి కలవవు. ఉదాహరణకు - 2 ఉదజని పరమాణువులు, 1 అమ్లజని పరమాణువు కలిసి ! నీటి కణ మవుతుంది. కాని 1 ఉదజని ½ అమ్లజని కలవటం అంటూవుండదు.

ప్రతిధాతువు స్వరూపస్వభావాలుకూడా దాని పరమాణువులో యిమిడివున్న వన్నమాట. ఒక ధాతువు వింకొక ధాతువుగా మార్చాలంటే దాని పరమాణు స్వరూపాన్ని మార్చాలి. సృష్టిలో యింతవరకు 88 ధాతువులు కనిపెట్టబడ్డవి. అంటే 88 రకాల పరమాణువులతో యీసృష్టి నిర్మితమైందన్నమాట !

## పరమాణు పరిమాణం :

గాలిలోవున్న కణాల సంచలనం వల్ల గాలి వొత్తిడి కలుగుతుందని 19 వ శతాబ్దంలో నిర్ధారణ చేశారు. అదే Kinetic Theory of Gases అనే సిద్ధాంతం. దానిరీత్యా కొంత పరిమాణం వాయువులో ఎన్ని కణాలున్నవో కచ్చితంగా లెక్కకట్టవచ్చు. తద్వారా అందులో ఎన్ని పరమాణువులున్నవో లెక్కకట్టవచ్చు. అలా కట్టిన లెక్కల ఫలితంగా 1 గ్రాము (సుమారు తులంలో 11 వ వంతు) ఉదజని వాయువులో పదికోట్ల పదికోట్ల పరమాణువుల కట్టలు పదికోట్ల పదికోట్లుంటవని తేలింది. పదికోట్ల పరమాణువుల్ని వరుసగా పెడితే వొక అంగుళం పొడవుంటవి.

ఇంత సూక్ష్మపరిమాణంగల పరమాణు స్వరూపం ఎలా అర్థంచేసుకోటం? ఒక యంత్రాన్ని అర్థం చేసుకోటానికెలా దాని ప్రతిభాగాన్ని విడదీసి చూస్తామో అలాగే పరమాణువులోని ప్రతి భాగాన్ని విడదీసి శాస్త్రజ్ఞులు దానిలోతుల్ని వెదకి స్వరూపాన్ని తెలుసుకున్నారు. కొన్ని పరమాణువులు వెలువరించే కొన్ని సూచనలవల్ల కూడా పరమాణు స్వరూప, మర్థమవుతుంది.

ఊహాపథంలో పరమాణువు నొక సూర్య మండలంవలె అర్థంచేసుకోవచ్చు. పరమాణువులో సూర్యునివలెవున్న న్యూక్లియస్ (పరమాణుబీజం) చుట్టూ గ్రహములవలె ఎలక్ట్రాన్లు పరిభ్రమిస్తుంటవి.

## ఎలక్ట్రాన్ :

1752 సం॥లో మేఘాల్లోంచి గాలిపడగల ద్వారా విద్యుచ్ఛక్తిని పట్టుకున్న బెంజమిన్ ఫ్రాంక్లిన్ విద్యుచ్ఛక్తి స్వభావాన్ని యిలావర్ణించాడు: "పాజిటివ్ శక్తి నెగటివ్ శక్తిని, నెగటివ్ శక్తి పాజిటివ్ శక్తిని ఆకర్షించుకుంటవి. నెగటివ్ శక్తి నెగటివ్ శక్తికి, పాజిటివ్ శక్తి పాజిటివ్ శక్తికి విముఖత్వాన్ని కల్గిస్తవి. స్వాభావికంగా విద్యుచ్ఛక్తి ద్రవరూపము. పాజిటివ్ శక్తితో నిండినపదార్థంలోఎక్కువశక్తి వున్నందున నెగటివ్ శక్తితో నిండినపదార్థం వేపుప్రవహిస్తుంది."

1897 సం॥ దాకా విద్యుచ్ఛక్తి కణరూపమైందని కొందరు, ద్రవరూపమైందని కొందరు, లేదు పాజిటివ్ నెగటివ్ ద్రవాలు వేర్వేరని కొందరు వాదోపవాదమేఘాల్ని లేపారు. చివరకు 1897 లో ప్రొ॥ జె. జె. థాంసన్ వాయువుల ద్వారా విద్యుచ్ఛక్తిని ప్రసారంచేసి, విద్యుచ్ఛక్తి అతి సూక్ష్మకణరూపమైందని ఋజువుచేశాడు. అదే సంవత్సరంలో కాథోడ్ కిరణాలు కనిపెట్టబడ్డవి. పరిపూర్ణంగా మాయబడి, రిక్తావకాశమేర్పడ్డ గాజునాళికలో రెండు లోహపు ధ్రువాలకు విద్యుచ్ఛక్తి తాకించినప్పుడు నెగటివ్ శక్తి తాకిన ధ్రువానికి సమకోణంగా కిరణాలు ప్రసరిల్లినవి. పాజిటివ్ శక్తి తాకిన యానోడ్ ధ్రువప్రువునికి, ప్రసరిస్తున్న కాథోడ్ కిరణాల ప్రసారదిక్కును మార్చలేకపోయింది. ఫ్రెంచిశాస్త్రజ్ఞుడు జాన్ పెర్రిన్ యీ కిరణాలు లోహాన్ని తాకినప్పుడా లోహం నెగటివ్ విద్యుత్ లక్షణాల్ని పొందిందని నిరూపించాడు. ఈ కాథోడ్ కిరణప్రసారపు దిక్కును అయస్కాంతములు మార్చగల్గినవి. కనుక కాథోడ్ కిరణాలు నెగటివ్ విద్యుత్కణాలని తేలింది.

స్థలాభావంచేత యిక్కడ వివరించరాని పరిశోధనలతో థాంసన్ కాథోడ్ కిరణాల వేగాన్ని లెక్క కట్టాడు.

కాథోడ్ కిరణాలు ఉదజని, అమ్లజని, నత్రజని మొదలయిన ఏ వాయువులలోనుండివచ్చినా ఒకేలక్షణాలు కలిగివున్నట్లు తేలింది. అవి పరమాణువులు మాత్రంకాదు. అన్నిట్లోకి తేలికైన ఉదజని పరమాణువుకన్న కాథోడ్ కిరణాలు 1/2000 వంతు భారంకల్గినట్టు వూహించబడ్డది. అవి అన్ని వాయువులనుండికూడ వెలువడ్డవి గనుక ఆవాయువుల పరమాణువులనుండి విడగొట్టబడ్డ భాగాలయివుండాలి. వాటిభారాన్ని,విద్యుచ్ఛక్తిని నిర్ణయించటానికి చాలా పరిశోధనలు సాగినవి. రాబర్ట్ మిల్లికన్ అనే శాస్త్రవేత్త యీ క్రిందిపరిశోధన ద్వారా వాటి భారాన్ని నిర్ణయించాడు.

రెండు బల్లపరుపు లోహపు పలకల అరలోకి అతిసూక్ష్మపు నూనె తుంపరలు వొదిలాడు. అవి అరలోకి రాగానే పరిశీలించటానికి ఒక సూక్ష్మదర్శిని అమర్చబడ్డది. ఆ తుంపర కణాలు సూక్ష్మత్వమువల్ల నెమ్మదిగా క్రిందకు జారుతవి. తుంపరకణం అరలోకిరాగానే అరకు విద్యుచ్ఛక్తిని తాకించి విద్యుత్ క్షేత్రాన్ని నిర్మిస్తారు. వెంటనే ఆఅరలోని విద్యుచ్ఛక్తి తుంపరకు అంటుకుంటుంది. గాలిలో బొట్టు క్రిందకు పడే వేగం దాని భారపరిమాణాలమీద ఆధారపడి వుంటుంది. కనుక ఆ తుంపర పదార్థం వేగం తెలిస్తే దానిభారాన్ని కనుక్కోవచ్చు. కనుక విద్యుత్తు అంటుకోని పూర్వపు తుంపరలభారం తెలుసు. నెగెటివ్ విద్యుత్తు క్రిందిరేకుకు అంటించామనుకోండి. వెంటనే ఆ రేకు ఎలక్ట్రాన్లతో కూడుకున్న తుంపరలకు పైముఖ్యం కల్గిస్తుంది. (ఒకేవిధమయిన విద్యుత్తు విముఖత్వం పొందును కనుక-ఎలక్ట్రాన్లు నెగెటివ్ విద్యుత్తు కనుక). తుంపరల భారాన్నిబట్టి, క్రిందిరేకులో ప్రవహించే విద్యుచ్ఛక్తినిబట్టి తుంపరలకు అంటుకున్న విద్యుత్తును లెక్కకట్టాడు మిల్లికన్. అదే ఎలక్ట్రాను.

ఎలక్ట్రాన్ అంటే రాశిలో అంతిమభాగానికి సంబంధించిన విద్యుత్కణమన్నమాట. దీని పరిమాణాన్ని అర్థం చేసుకోవాలంటే: వెంట్రుక వ్యాసార్థంలో 1/10,000,000,000 వంతుంటుంది; రాశి గ్రాములో 1/1000000000000000000000000000000; విద్యుచ్ఛక్తి కొలోంబులో 1/1,000,000,000,000,000,000 వ వంతు.

ప్రసరిస్తున్న ఎలక్ట్రాన్లను నీటి ఆవిరిలోకి చొప్పిస్తే ప్రతి ఎలక్ట్రాను మేఘావృతమై ఫొటో తీయడానికి వీలయినంత పెద్దదవుతుంది. అన్ని పరమాణువుల్లోని ఎలక్ట్రాన్లు ఒకే స్వరూపంలో వుంటవి. వాటన్నింటిలోనూ ఒకే మొత్తంవిద్యుత్తు వుంటుంది. వాటన్నిటి రాశి ఒకటే. వాటి పరిమాణం ఒకటే సృష్టిలోని సర్వపదార్థాల మూల స్వరూపమైన నెగెటివ్ పాజిటివ్ విద్యుచ్ఛక్తులలో నెగెటివ్ విద్యుచ్ఛక్తి మూలకణాలు ఎలక్ట్రాన్లు.

ప్రోటాన్:

1886 సం॥లో బెర్లిన్‌లో గోల్డు స్టయిన్ శాస్త్రజ్ఞుడు వాయువులనుండి విద్యుచ్ఛక్తి ప్రవహించినప్పుడు కలిగే ఫలితాలు పరిశోధిస్తున్నాడు. ఆ పరిశోధన కొక గాజు నాళిక చాలాభాగం రిక్తావకాశ మొనర్చి, అందులో కాథోడ్, యానోడ్ ధ్రువాల నమర్చాడు. కాథోడ్ ధ్రువం మాత్రం లోహపు తెరతో నిర్మించి నాళికమధ్యలో అమర్చబడ్డది. ఈ నాళిక పరిశోధనల్లో కాథోడ్‌నుండి ముందుకు ప్రసరిస్తున్న ఎలక్ట్రాన్లే కాక కాథోడ్ వెనుకభాగంలో ఒక ప్రకాశం కనపడ్డది. నాళికమధ్యనున్న కాథోడ్ ధ్రువం వెనుకవేపు నాళిక చివరవరకు బంగారు పసుపు వర్ణపు ప్రకాశం కనపడ్డది.

కాథోడ్ ధ్రువానికి వెనుకనున్న ప్రసారం పాజిటివ్ విద్యుచ్ఛక్తి వల్లనే కల్గిన ప్రకాశమని తేలింది. ఎలక్ట్రాన్లు కాథోడ్ ధ్రువంనుండి ముందుకు ప్రసారమవుతవి. నెగెటివ్, పాజిటివ్ ధ్రువాలమధ్య శక్తివంతమైన విద్యుత్ క్షేత్రం ఏర్పడుతుంది. కాథోడ్ ధ్రువంముందున్న విద్యుత్ క్షేత్ర శక్తివలన కాథోడ్ కిరణాలు, యానోడ్ ధ్రువపువునికిని సరకు చెయ్యకుండా ముందుకు ప్రసరిస్తవి. కాథోడ్ ధ్రువానికి అంటిపెట్టుకుని వున్న బలవత్తర విద్యుత్ క్షేత్రమువలన ముందుకు సాగుతున్న ఎలక్ట్రాన్లు పరిపూర్ణ వేగాన్ని పొందుతవి. ఆ వేగం అవి ప్రసరిల్లినంతవరకు వుంటుంది.

సామాన్య పరిస్థితుల్లో చాలా ధాతువుల పరమాణువుల్లో నెగెటివ్, పాజిటివ్ విద్యుచ్ఛక్తులు సమానశక్తివంతములు కావటం వల్ల పరమాణువులు నిర్భలీకరణ విద్యుద్రూపంలో వుంటవి (Electrically neutral). పరమాణువులోని నెగెటివ్ కణాలయిన ఎలక్ట్రాన్లు పరమాణు నిర్మాణంలో పాజిటివ్ కణాలకన్న ఓదులుగా బంధితబడి వుంటవి. కనుక కాథోడ్ ధ్రువం నుండి వేగంతో ప్రసరిల్లుతున్న ఎలక్ట్రాన్లు వాటి మార్గంలోవున్న పరమాణువుల్లోని ఎలక్ట్రాన్లను విడగొట్టగా, బరువైన పాజిటివ్ బీజాణువు (న్యూక్లియస్) విడివడుతుంది. ఎలక్ట్రానుతో కూడుకునివున్నప్పుడు నిర్భలీకరణ విద్యుత్ స్థితిలో వున్న పరమాణువు, ఎలక్ట్రాను విడగొట్టబడగానే పాజిటివ్ శక్తితో నిండి ప్రకాశిస్తుంది. ఎలక్ట్రాను పోగొట్టుకున్న ఉదజని పరమాణువును ప్రోటాన్ అంటారు. ఎలక్ట్రాన్లో వున్న నెగెటివ్ శక్తికి సమమైన పాజిటివ్ శక్తి ప్రోటాన్‌లో వుంటుంది. కాని దాని రాశిమాత్రం ఎలక్ట్రానుకన్న 1840 రెట్లెక్కువ.

ఈ ప్రకాశవర్ణం గాజునాళికలోని వాయువును బట్టి మారుతుంది. నత్రజని వాయువులో ప్రకాశం బంగారుపసుపు వర్ణంగాను, ఉదజని వాయువులో గులాబివర్ణంగాను, ఆమ్లజని వాయువులో పసుపు గులాబివర్ణంగాను, బొగ్గుపులుసువాయువులో ఆకుపచ్చరంగుగాను వుంటుంది.

1815 సం॥లో విలియం ప్రౌట్ అనే ఆంగ్లశాస్త్రజ్ఞుడు ఉదజని పరమాణువు భారం వొకటి గనక సృష్టిలోని ప్రతి ధాతువుకు అదే పునాది, దానినుండే మిగతా ధాతువులన్నిటి నిర్మాణమని వూహించాడు.

1920 సం॥లో రూథర్ ఫర్డు శాస్త్రజ్ఞుడు చేసిన పరిశోధనలద్వారా ప్రోటాన్ (అంటే ఎలక్ట్రానును పోగొట్టుకున్న ఉదజని పరమాణువు) సృష్టిలోని ప్రతిపదార్థానికి మూలకణమని నిర్ధారణ చేశాడు.

**న్యూట్రాన్ :**

1920 సంవత్సరంలో రూథర్ ఫర్డు పరమాణు నిర్మాణంలో ఏవిధమైన విద్యుచ్ఛక్తిలేని, ప్రోటాన్‌తో సమమైన రాశికలిగిన కణం వొకటి వుండి వుండాలని వూహించాడు. ఆకణానికి పాజిటివ్, నెగెటివ్ శక్తులు లేనందువల్ల న్యూట్రాన్ అనే పేరు పెట్టాడు. విద్యుచ్ఛక్తి లేనందువలన పదార్థంలో స్వేచ్ఛగా దూసుకుపోయే శక్తికలిగి వుంటుందని వూహించాడు.

మరి 12 సంవత్సాలు జరిగిన పరిశోధనల్లో న్యూట్రానును గుర్తించటం సాధ్యంకాలేదు. ఈ 12 సంవత్సరాల్లోనూ పరమాణువులు కొన్ని శిథిలమయ్యే విషయంపై పరిశోధనలు జరిగినవి. 1930 సం॥లో యిద్దరు జర్మన్ శాస్త్రజ్ఞులు స్వతస్సిద్ధమైన క్షీకరణ విసర్జనాధాతువు పొలోనియంనుండి వెలువడే కిరణాలు బెరిల్లియం అనే అతి తేలిక, పటుత్వం గల లోహాన్ని శిథిలం చేయగా బెరిల్లియంనుండి అతినిశితమైన 'గమ్మా' కిరణాలు ప్రసారం కావటం చూచారు. ఈ గమ్మా కిరణాలు స్వతస్సిద్ధ క్షీకరణ విసర్జనాధాతువుల నుండి వెలువడే కిరణాలకన్న 5 రెట్లెక్కువ శక్తివంతంగా వున్నవి.

1932 సం॥లో ఫ్రెంచి జోలియట్ దంపతులు యీ కొత్త ప్రసారం పదార్థంలో యింకిపోవటాన్ని గురించి చేసిన పరిశోధనా ఫలితాల్ని బయల్పరచారు. వారు పరిశోధన కుపయోగించిన సాధన వొక క్షీకరణ విసర్జనాధారమైన ధాతువు (పొలోనియం) బెరిల్లియం లోహం, విద్యుత్పరిశోధక యంత్రం. (క్షీకరణ విసర్జనను గురించి ముందు ముందు వ్రాయబడుతుంది).

పొలోనియంనుండి వచ్చే 'గమ్మా' కిరణ ప్రసారం బెరిల్లియంమీద పడ్డప్పుడు విద్యుత్పరిశోధక యంత్రంలో విద్యుత్ప్రవాహం కనుపించింది. కాని బెరిల్లియానికి విద్యుత్పరిశోధకయంత్రానికి మధ్య కిరణాలు ఇంకిపోయే తెరపెట్టినప్పుడు విద్యుత్పరిశోధక యంత్రంలో విద్యుత్ప్రవాహం ఆగింది. కాని మధ్యవుంచిన తెర ఉదజని ధాతువు కలసిన పదార్థమైనట్లయితే విద్యుత్పరిశోధక యంత్రంలో విద్యుత్ప్రవాహం ఎక్కువైంది. ఆ మధ్యవున్న తెర ఉదజని ఎక్కువగావుండే మైనం అయినప్పుడు విద్యుత్పరిశోధక యంత్రంలో అదివరకుకన్న రెండురెట్లు విద్యుచ్ఛక్తి ప్రసరించింది. దానికి కారణం వొకటే వుండాలి.

(సశేషము)

# జనవాక్యం

సంపాదకునికి ప్రకటనార్థం పంపించిన లేఖలు యీ శీర్షిక క్రింద ప్రచురిత మవుతాయి. లేఖలు క్లుప్తంగా, కాగితానికి ఒక పక్క వ్రాసి పంపాలి.

### డాక్టరు పట్టాభిగారి ఛలోక్తులు

'స్వరాజ్యం వచ్చినందువల్ల, సన్మానపత్రాలను అచ్చువేసేవారు, నాయకుల చిత్రాలను గీస్తున్నవారు, పూలదండలగాళ్ళు, మంగళవాయిద్యాలవారు బాగుపడుతున్నారు.' అని డాక్టరు పట్టాభి సీతారామయ్యగారు నెల్లూరు మ్యునిసిపల్ సన్మానపత్రానికి సమాధానం చెప్తూ అన్నారు. పైవిషయాన్ని డాక్టర్‌గారు ఛలోక్తిగా అన్నారు అని 'ఆంధ్రప్రభ' మార్చి 24 వ తేదీన పెద్దపెద్ద అక్షరాలతో ప్రకటించింది.

డాక్టర్‌గారు సూచించిన వృత్తికార్మికులు ఎల్లప్పుడూ పనిచేసినా అన్నవస్త్రాలకు కరువే. బ్రిటిష్ ప్రభుత్వం వున్నప్పుడు ఎలా జీవిస్తున్నారో యిప్పుడూ అంతే.

ప్రస్తుత చరిత్ర ఋజువుచేసే సత్యం ఏమిటంటే, సన్మానపత్రాలను అందుకునేవారు, మేళతాళాలతో వరుసగా రెండెడ్లబళ్ళమీద వూరేగేవారు, దండలువేయించుకొని ఫోటోలు తీయించుకునేవారు, వీరే స్వరాజ్యం వచ్చిన తరువాత బాగా బాగుపడుతున్నారని; పదవీవ్యామోహం తీర్చుకుంటున్నారని; కోటి సోదరధనవంతులను మరీ ధనవంతులుగా చేస్తూ దేశభక్తి వాళ్ళ పరం చేస్తున్నారని.

ఇచ్చే ముప్పావలా డబ్బులతో మంగలి మేళగాడు మేడగట్టించగలడా? పది అణాల డబ్బులతో పూలదండగాడు పొలం కొనగలడా? చీకూచింతాపడి దేశనాయకుని చిత్రం పూర్తిచేసినా చిత్రకారుడు చింకిగుడ్డలతో తయారు! ఇక సన్మానపత్రాలను అచ్చువేసేవారి సంగతి చెప్పనవసరంలేదు: అందరికీ యిష్టముగా వుంటేకాని అచ్చాఫీసు పనివాడు నడవలేడు.

మాబోటి పేదవాళ్ల ప్రాణాలతో డాక్టరు పట్టాభిగారికి ఛలోక్తు లేమిటి!

విజయవాడ  జి సంజీవరావు

---

### పార్వతీపురం తాలూకాలో ధాన్యసేకరణ

మదరాసు ప్రభుత్వము ధాన్యం ధరలు నిర్ణయించి మార్చి నెల దాటిన తరువాత ధాన్యం విక్రయించిన రైతులకు బస్తాఒకటికి పన్నెండు అణాలు ధర తగ్గింపబడునని ప్రకటించినది. ఇలా ప్రకటించినందువలన రైతులు తమ అదనపు ధాన్యమును మార్చి నెలలోగా విక్రయింతురని, ధాన్యసేకరణ చురుకుగా జరుగునని ప్రభుత్వము ఆశించియుండవచ్చు. పార్వతీపురం తాలూకాలో మార్చినెలాఖరువరకూ ధాన్యసేకరణ ఏజంట్లు లేకను-సమర్థులు కాకను- అనేక గ్రామములలో సేకరణ ప్రారంభించనే లేదు. రైతులు ప్రభుత్వముచే ఏర్పాటుచేయబడిన ఏజంటునకుమాత్రమే ధాన్యము విక్రయించాలి. ప్రభుత్వ ఉపేక్షవలనను- ధాన్యసేకరణ ఏజంట్ల అసమర్థతవలనను జరిగిన కాలహరణమువలన ఇటువైని సేకరింపబడు ధాన్యమునకు మార్చినెల దాటినదనేమిషచే ధరతగ్గించడము అన్యాయము.

వారి ధాన్యమునకు బోనస్ చెల్లించకపోయిన కూడా ప్రభుత్వపు పొరపాటునకు రైతులను నష్ట పరచడము అన్యాయము.

కావున ధాన్యసేకరణ విధానము ఫలవంత మగుటకు ధాన్యంధరలు తగ్గింపబడవని ప్రభుత్వం వెంటనే ప్రకటించాలి. ఏజంట్లు సరైన ధరలు చెల్లించుటకు వెంటనే ఉత్తరువులు జారీచేయించాలి. లేదా ఇతరుల నేరములకు రైతులు నష్ట పడుదురు. అధికాహారోత్పత్తికోరే ప్రభుత్వము ధాన్యం ఉత్పత్తిదారుని నష్టపెట్టరాదు.

లక్షణాపురం　　　　బాబు పరాంకుశం

---

## 'సామాన్యుని' రచనలు—

చాలకాలమునుండి 'తెలుగు స్వతంత్ర'లో సంఘజీవితంలోని వివిధ విషయాలపై విభిన్న దృక్పథాలు వివరించి, 'సామాన్యుడు' పేర వారం-వారం వ్యాసాలు ప్రచురించబడు తున్నాయి. రచయిత నిశిత మేధస్సు గత మానవ చరిత్రను విమర్శనా దృష్టితో చూడగల్గి, తదనుభవముతో వర్తమాన మానవసంఘంలోని మంచిచెడ్డలను తర్కించి, శాస్త్రీయ దృక్పథంతో భవిష్యత్తును పర్యాలోకించేందుకు చేసే ప్రయత్నమే ఈ వ్యాసపరంపర అనడంలో సందేహం లేదు.

కాని ఈ సామాన్యుని రచనలు ఎంతవరకు సామాన్యుల కర్థమౌతాయనే ప్రశ్న యిటీవల ఒకరు 'తెలుగు స్వతంత్ర'లో వేశారు. సామాన్య మానవులకు అర్థమయ్యేది బాజా భజంత్రీగాళ్ల కేకలూ, తాషామర్పాల మోతలూ కాబోలు! ఇవి అర్థమయితే మనం మారాలిపొస్తుందే అనే భయం లేకపోతే, మనమూ సామాన్యులమంటే జ్ఞానమన్నా ఉందనడంలో అనుమానం లేకపోదే. కొంచెం శ్రద్ధతో ఓపికను కలిపి ఆలోచిస్తే అర్థం కాకపోవు.

యీ రచనలు సామాన్యులకున్నా, సామాన్యులకంటె ఎక్కువమనుకునేవాళ్లకూ, బాగుచేస్తున్నామని మురిసిపోయేవాళ్లకు సక్రమంగా చదివి అర్థంచేసుకో గల్గితే చాలా లాభం. తప్పెట్లూ తాళాలూ తాషామర్పాల మోతల్లోనుంచి ఒక్కసారి బైటపడి నేడు తన సంఘం ఎలా ఉంది! తనకేం కావాలి! తనక్కావలసిన మంచి ఎలా లభ్యమవుతుంది! అనే చాలా చిక్కు ప్రశ్నలకు సమాధానాలు ప్రశాంతంగా చెప్పుకుంటారు.

కిసాన్ మజ్‌దూర్ ప్రజారాజ్యం అని పలవరించే ప్రముఖులు వాళ్ల రాజ్యంలో కిసాన్‌లకూ, మజ్‌దూర్‌లకు ఉన్న వ్యత్యాసాలు వ్యత్యాసాలుగానే ఉంటాయని తెలుసుకోవడం అవసరం.

కమ్యూనిస్టులు, కలకత్తా కాన్ఫరెన్సులో తప్పులు దిద్దుకున్న తరువాత విజృంభించి అవలంబించిన కార్యక్రమంతో దేశంలో రాబోయేది కమ్యూనిజంగాదనీ, తాము తాముగానే ఉంటే కొంతకాలానికి ఈదేశంలో కమ్యూనిస్టులుండరనీ గుర్తించటానికి ఈ సామాన్యుని రచనలు చదవడం అవసరం. (అయితే ఆవేశాన్ని వదలింతర్వాతనే.)

మద్రాసు　　　　నందిని

---

## వివాహాలు - కమ్యూనల్ జీ. వో.

'తెలుగు స్వతంత్ర' ఏప్రెల్ 1 వ తేదీ సంచికలో జనవాక్యం శీర్షికకింద ఒక ఏలూరు వాస్తవ్యులు కమ్యూనల్ జీ. వో. ను బలపరుస్తూ 'కొందరు (బ్రాహ్మణులని వారి వుద్దేశ్యము) మనమంతా ఒకటే కాబట్టి కమ్యూనల్ జీ. వో. రద్దుపరచమంటున్నారు. అట్టివారంతా వర్ణాంతర వివాహముల కంగీకరిస్తారా?' అని ప్రశ్నించారు. ఈ ప్రశ్న హాస్యాస్పదమైనది. కమ్యూనల్ జీ. వో. కు, వర్ణాంతర వివాహములకును ముడిపెట్టుటలో ఏమీ అర్థంలేదు. వివాహము చేసికొనుట అనునది వ్యక్తిగత అభిప్రాయము మీద ఆధారపడి ఉంటుంది. ఆవ్యక్తి తనకు నచ్చిన పిల్లను గాని లేక ఆమెకు నచ్చిన పిల్లవానినిగాని వివాహము చేసుకొనుట సమంజసము. దీనికి, కమ్యూనల్ జీ. వో. కు సంబంధమేమిటి? ఇప్పటిరోజుల్లో ఎంతోమంది విద్యార్థులు, విద్యార్థినులు (ముఖ్యంగా) కులం పాటించకుండా ప్రేమించి వివాహములు చేసికొనుట మనము మాత్రం చూడటంలేదా?

ఏలూరు　　　　జం. వెంకటేశ్వరరావు




# విషయసూచిక

సంపుటి 1. సంచిక 37

శుక్రవారం, ఏప్రిల్ 1వ, 1949



రేపు (ఏప్రిల్ 16) కందుకూరి వీరేశలింగంగారి జయంతి.

తెలుగు స్వతంత్ర

సంపుటి-1
సంచిక-37

ఏప్రిల్ 15, 1949

ప్రచురణ:
ప్రతి శుక్రవారం

# అడకత్తెరలో ఆంధ్రరాష్ట్రం

నిశ్ఛిద్రమైన నిరాశ మానవ మనస్తత్వానికి విరుద్ధం. భవితవ్యం తలచుకొని భర్మహర్మ్యాలు నిర్మించుకొనడం వ్యక్తులకెంత సహజమో, జాతికీ అంతే సహజం. ప్రజాహృదయం ఏది వాంఛిస్తున్నదో తెలుసుకొని, ఆ వాంఛకు ఫలసిద్ధి కలిగించడానికే కృషి చేస్తున్నట్లు ప్రజలను నమ్మించడంలో కృతకృత్యులైనప్పుడు నాయకులకు ప్రజాదరణ లభిస్తుంది. అలా సంక్రమించిన నాయకత్వం ఒక్కొక్క వేళ గాఢంగా వేళ్లు పాతుకుపోయి, తన బలంవల్ల విపరీతమైన నమ్మకం సంపాదించుకుని, ప్రజాభీష్ట వ్యూహాన్నే సంకులం చెయ్యడానికి ప్రయత్నిస్తుంది.

ప్రత్యేకాంధ్రరాష్ట్రంకోసం ఆందోళన యీనాటిది కాదు. ఈ ఉద్యమం, ముప్ఫైయేళ్లు పైగా నిండి, ఉద్దండులైన వారందరి సహకారాన్నీ సంపాదించుకున్నది; ప్రత్యేకరాష్ట్ర ఆవశ్యకత, నిర్మించిన తర్వాత దానికి లభించబోయే ఆర్థికస్తోమత, ఇవన్నీ కూలంకషంగా, యీషణ్మాత్ర సంశయానికైనా తావు లేకుండా, నిరూపించబడ్డాయి. జాతీయ కాంగ్రెసు నియమావళిలో ఏనాటి నుండో ఆంధ్రభూమి ప్రత్యేకరాష్ట్రంగా వ్యవహరింపబడుతోంది; అయినా, స్వాతంత్ర్యం లభించిన తర్వాత జాతీయ నాయకులు పూర్వోత్తర విరుద్ధమైన మనస్తత్వం ప్రదర్శించడానికి వెనుదీయటంలేదు. కమిటీ నివేదిక సారాంశాన్ని వ్యాఖ్యానిస్తూ, రాష్ట్రపతి పట్టాభి ఆంధ్రుల కిచ్చిన సలహా పూర్వోత్తర విరుద్ధమైన ప్రవర్తననే రుజువు చేస్తుంది. కాంగ్రెసు గద్దెనుండి ఆంధ్రరాష్ట్ర నిర్మాణం అత్యవసరమని ఘోషించిన ధీశాలి, కొద్ది మాసముల లోపలే ప్రత్యేక రాష్ట్రం వచ్చి తీరుతుందని వాగ్దానం చేసిన ప్రజ్ఞానిధి, మదరాసు పట్టణం విషయంలో ఆంధ్రుల హక్కులు విస్మరింపబడవని అభయమిచ్చిన ప్రతిజ్ఞాశీలి, చివరకు వీటన్నిటినీ విస్మరించి, నెహ్రూ-పటేల్ నాయకద్వయ నిర్ణయాలన్నిటికీ అనుగుణంగా శిరఃకంపనం చెయవలసి వచ్చింది. అంతే కాదు: ఆ నిర్ణయాలను తూ. చా. తప్పకుండా అంగీకరించమని ఆంధ్రలోకాన్ని అభ్యర్థించవలసి వచ్చింది.

ఇండియా ప్రభుత్వం నిర్ణయించిన అసమగ్రాంధ్ర రాష్ట్రాని కంగీకరించి ప్రజలు సంతృప్తి చెందాలి: లేదా, రాష్ట్రసమస్య తిరిగి వాయిదా వేయబడుతుంది. జనాభిప్రాయమంటే, రాష్ట్ర శాసనసభలోని ఆంధ్రసభ్యుల అభిప్రాయ

మని ప్రధాని శ్రీ కుమారస్వామిరాజా విస్పష్టం చేశారు. ఆ సభ్యుల్లో అనేకులపై ప్రజలకెట్టి విశ్వాసం ఉందో అందరికీ తెలుసు. నేటి ఆంధ్రశాసనసభికుల్లో ఏ కొద్దిమందో మినహాయిస్తే తక్కిన వారంతా తమ పదవీవ్యామోహ ప్రదర్శనంవల్ల, ముఠా రాజకీయాలవల్ల, ప్రజలకు ప్రాతినిధ్యం వహించే హక్కు ఏనాడో కోల్పోయారు. అటువంటి వారా, రాబోయే ఆంధ్రరాష్ట్రానికి సరిహద్దులు నిర్ణయించేది?

రాజకీయమైన యీ ప్రవల్లిక నిర్మించి అసలు ఏ ప్రాథమికసూత్రాల ననుసరించి రాష్ట్రాందోళన బయలుదేరిందో వాటికే అచ్ఛాదన కల్గించారు. ఒకేభాష, ఒకే సంస్కృతి కల్గిన ప్రజానీకం నివసించే ప్రదేశం ఒక రాష్ట్రంగా నిర్మిస్తే పరిపాలనా సౌకర్యం ఏర్పడుతుంది; ఆర్థికంగా, సాంఘికంగా, సర్వతోముఖంగా అక్కడిప్రజలు అభివృద్ధి చెందడానికి వీలవుతుంది; అందువల్ల భారతదేశానికి మరింత పుష్టి చేకూరుతుందిగాని నీరసం రాదు. ఈ సూత్రాన్ని అంగీకరించినప్పుడు, సర్కార్లే సంపూర్ణమైన విశాలాంధ్ర నిర్మించాలిగాని, కొన్ని భాగాలు చేర్చకుండా బయట ఉంచడం ఏవిధంగా సమర్థిస్తారు? నైసర్గికంగా గంజాం, కోరాపుట్టు జిల్లాలు, బళ్లారి చిత్తూరులతో సహా వత్తమండలాలు, తెలంగాణా, ఇవన్నీ ఆంధ్రరాష్ట్రంలోని భాగాలే. ఏ ఉన్నతాధికారుల, రాజకీయనాయకుల నిర్ణయాలైనా యీ సత్యాన్ని తలక్రిందులు చెయ్యలేవు. వారిమధ్య కొన్ని ఒడంబడికలు జరిగినంతమాత్రాన ఆంధ్రరాష్ట్ర సహజస్వరూపం హఠాత్తుగా మారిపోదు. ఈ విధంగా రాష్ట్రాన్ని ఖండఖండాలుచేసి, ప్రజాభీష్టానికి వ్యతిరేకంగా, ఆంధ్రేతరులకు ధారపొయ్యడానికి ఎవరికీ హక్కులేదు.

ఇక మదరాసు పట్టణం విషయం. కమిటీ నివేదికలోనే బొంబాయి మద్రాసు పట్టణాల భవితవ్యం గురించి వేర్వేరు నిర్ణయాలు జరిగాయి. బొంబాయి ఎవరికి చెందుతుందో అనే విషయం అంత స్పష్టంగా తెలుసుకున్న నాయకత్రయం మద్రాసు విషయంలో భిన్నవైఖరి అవలంబించవలసిన అగత్యం ఎలా ఏర్పడింది? మద్రాసు పట్టణంపై ఆంధ్రులకి గల న్యాయమైన హక్కులను ఆంధ్రప్రజల పక్షాన విడనాడడానికి ఎవరికీ ప్రాతినిధ్యం లేదు. మద్రాసు ప్రభుత్వంలో ఉన్న ఆంధ్ర ప్రతినిధులు, రాష్ట్రపతి పట్టాభి, దీనికి సమాధానం చెప్పవలసి ఉంటుంది. ఎప్పుడో సుదూర భావికాలంలో యీ సమస్య పునర్విమర్శింపబడుతుందనే హామీ తృప్తికరమైనది కాదు. ఒకసారి నిర్ణయం జరిగిన యిటువంటి సమస్యలు తిరిగి విమర్శకు తీసుకురావడం అంటే ఏమిటో చరిత్రతో పరిచయం ఉన్నవారందరికీ తెలుసును. దక్షిణ భారతదేశంలో సుస్థిరమైన ప్రభుత్వాలు ఏర్పడి, నిజమైన ప్రజాస్వామికం వర్ధిల్లాలంటే, విశాలాంధ్ర రాష్ట్రం నిర్మించక తప్పదు. అంతవరకూ ప్రజలు సంతృప్తి చెందరు. ఎంత త్వరలో ఆంధ్రనాయకులిది ముఖ్యంగా గుర్తిస్తారో, దేశానికంత మేలు.

# మతగురువుల ఏలుబడికి మహాజరా?

తాడిమళ్ల జగన్నాథరావు

"మనలను సరియైన మార్గంలో నాయకత్వం వహించి నడిపించగలవారు ఒక్క మత ప్రవక్తలే. వారి స్వార్థరహితమైన, నిష్కల్మషమైన సేవ మనకు అత్యంతావశ్యకమైనది. వారే మనలను సరియైన త్రోవలో పెట్టగలరు. ప్రస్తుత పరిస్థితులలో శ్రీ అరవిందులు, రమణ మహర్షి మున్నగువారు దేశనాయకత్వాన్ని వహించాలి" అని జయప్రకాశ్ నారాయణ వెనుక ఉపన్యసించినప్పుడు ఆయనను అందరు తలోవిధంగాను విమర్శించారు. జయప్రకాశ్ యొక్క భావాలు రాజకీయరంగాన్ని వదలివేసి ఆధ్యాత్మికరంగం వైపు మొగ్గుతున్నాయని అంతా భావించారు. సోషలిస్టు పార్టీమీద, దాని ఆశయాలమీద దాడిచెయ్యడానికి పత్రికలు ఆయన వ్యక్తపరచిన భావాలను వినియోగించుకున్నాయి. కాని ఇటీవల భారతప్రధాని పండిత నెహ్రూ సహితం దాదాపు అదేవిధమైన భావాలను వ్యక్తపరిచాడు. 'రాజకీయనాయకులు సమయోచిత వర్తనులు! వారు తమ జీవితంలో నీతినియమాలకు అంతగా ప్రాధాన్యం యివ్వరు. అందుచేత మనకు మార్గదర్శకులుగా రామకృష్ణ పరమహంస, గాంధీ మహాత్ముడు మున్నగువార లుండాలి. వారి బోధనలు మనకు ఆశయాలుగా ఉండాలి. విదేశములలో భారతదేశఖ్యాతిని వ్యాపింపచెయ్యడంలో శ్రీ వివేకానందస్వామి ఒనరించిన సేవ ప్రస్తుతం మన విదేశ రాయబారులు చేస్తున్న పనికి ఏవిధంగాను తీసిపోదు.' అంటూ పండిత నెహ్రూ శ్రీ రామకృష్ణ పరమహంస జన్మదినోత్సవ సందర్భంలో ఉపన్యసించారు. గొప్ప రాజకీయ నాయకులైన నెహ్రూ, జయప్రకాశ్‌లు వెల్లడించిన భావాలనుబట్టి మనకొక సంశయం తప్పక కలుగుతుంది. రాజకీయ నాయకులకు సమయోచితవర్తన, స్వార్థము, పార్టీ కక్షలు మున్నగునవి ఉండడం సహజమే. వారు నీతి నియమాలకు ప్రాధాన్యం ఇవ్వరన్న విషయం కూడా యథార్థమైనదే. అందుచేత వారు నాయకత్వాన్ని వహించతగరా? వారి స్థానాన్ని మతప్రవక్తలకు ఇయ్యవలసినదేనా? ఈ ప్రశ్నలకు సరియైన సమాధానాన్ని సాధించడం సులభమైన విషయం కాదు.

ప్రపంచచరిత్ర చూస్తే మనకొక సత్యం గోచరిస్తుంది. ఎప్పుడైతే రాజకీయపాలన అధోగతిలోనుండి, అక్రమాలు చెలరేగి తద్వారా ప్రజల సాంఘికజీవనం పతనం చెందుతుందో అప్పుడే మతప్రవక్తలు బయల్దేరుతారు. వారి బోధనలు ప్రజల విశ్వాసాన్ని చూరగొనే సమయం అదే. క్రీస్తు, మహమ్మదు మొదలైన మతప్రవక్తలు బయల్దేరిన కాలంలో ప్రజల సాంఘిక, రాజకీయ జీవనం అధోగతిలో ఉండేది. ప్రజలలో మూఢనమ్మకాలు, పరిపాలనలో అవినీతి ప్రబలంగా ఉండేవి. అలాటికాలంలో వారు వారిబోధల ద్వారా ప్రజావిశ్వాసాన్ని పొంది ప్రజాజీవనాన్ని నూతనపంథాలో నడిపించారు. వారి జీవితకాలాల తర్వాత యావత్తు పరిపాలనాయంత్రం పూర్తిగా పరివర్తన చెందింది. కాని తరువాత చరిత్రచూస్తే క్రమంగా పరిపాలనాయంత్రం మతగురువుల వద్దనుండి తిరిగి రాజకీయ నాయకులకు సంక్రమించింది. యూరపులో పోపునకు, రాజ్యపాలకులకు జరిగిన సంఘటనలలో క్రమంగా పోపుఅధికారం సన్నగిల్లి రాజకీయ అధికారమే వ్యాప్తిచెందుతూ వచ్చింది. అన్ని రంగాలలోను ఆధిపత్యం వహించిన మతగురువుల పరిపాలన క్రమేపీ పోయి తిరిగి పాలనాధికారం పూర్తిగా రాజకీయ నాయకుల హస్తగతం కావడానికి కారణమేమిటో యోచింపవలసివుంది. ఇలాగే మధ్య ప్రాచ్యంలో రాజకీయాధిక్యమును సంపాదించిన మహమ్మదీయ మతగురువులు, కాలిఫ్‌లు, క్రమేపీ తమ అధికారాన్ని జారవిడుచుకొని రాజకీయనాయకులకే తిరిగి ఆ అధికారాన్ని సంక్రమింపచేశారు. దీని కంతటికీ కారణం పరిపాలనాధికారం, అది ఎవరిచేతు

లలోనున్నను, క్రమేపీ దుర్మార్గతను, అవినీతిని మప్పాతుంది. అధికారం అవినీతి మప్పాతుందనే సామెతకు లొంబడని ప్రభుత్వం మనకు చరిత్రలో ఎక్కడా కానరాదు. ఒక పార్టీ ఎంత ఉదారమైన ఆశయాలను బోధించినా పరిపాలనాధికార స్వీకరణానంతరం ఆ పార్టీ తన ఆశయాలను అన్నిటినీ సాధించుకోడానికి అనేక ప్రతిబంధకా లుంటాయి. రాజకీయమైన చిక్కులు అనేకం అడ్డుతగులుతాయి. సూక్ష్మంగా ఆలోచిస్తే ప్రస్తుత రాజకీయవర్గాలలో, వాటి విధానాలలో పతన మారంభమయింది. అలాటి పరిస్థితులలో మతప్రవక్తలకు అధికారం సంక్రమింపచేసినా ఫలితం ఒకలాగే ఉంటుంది. ప్రజానీకాన్ని ఉద్ధరించడమే తమ ఆశయం అని అన్ని పార్టీలు చాటుకుంటున్నా, ఆ ఆశయాన్ని ఆచరణలో పెట్టే విషయంలో వివిధరాజకీయ పార్టీల దృక్పథాలు సంఘర్షించడం జరుగుతోంది. తద్వారా పార్టీ కక్షలు ఏర్పడడం, ఒకే పార్టీలో వివిధముఠా లేర్పడడం సంభవిస్తోంది. పరిపాలనాధికారం పొందిన పార్టీ తన ముఠాదార్లనే సంతుష్టిపరచడానికి ప్రయత్నించడంతో తదుపరి పరిపాలన సాగుతోంది. ఈ విధంగా స్వప్రయోజనాలతో సమయోచితంగా నడచే ప్రభుత్వాలను తొలగించి, స్వార్థరహితంగా పనిచేసే ప్రభుత్వాలను ప్రతిష్ఠించడం ఎలా అన్నదే ప్రశ్న. దీనికి అనేకులు అనేక విధాలైన సాధనాలను సూచిస్తున్నారు. కొందరు సూచిస్తున్న మార్గాలు నవ్వు కల్గిస్తున్నాయి. మహాత్ముడు ఇండియన్ యూనియన్ ప్రథమ అధ్యక్ష పదవి నొక పేద హరిజన బాలికకు ఇవ్వాలని సూచించాడు. అట్టి వ్యక్తి వర్గకాలుష్యాలకు దూరంగా ఉంటుందని, తద్వారా ప్రభుత్వం నిష్పాక్షికంగా జరుగవచ్చని మహాత్ముని తలపు. గ్రామపంచాయతీల ఎన్నికలలో చీలికలు, అవినీతి పెరుగకుండా చూడడానికి వీలుగా ఆచార్య రంగా ఆ మధ్యన ఒక పద్ధతి సూచించారు. ఆ పద్ధతిప్రకారం గ్రామంలోని పెద్దమనుష్యుల పేర్లనన్నిటినీ చీటీలపై వ్రాసి ఒక పెట్టిలో వెయ్యాలి. ఆ పెట్టెని బాగా కుదిపి, చీటీలన్నీ పర్దుకున్నాక ఒక చిన్న బాలకుని కళ్ళకు గంతలు కట్టి ఎందరు ప్రతినిధులు కావాలో అన్ని చీటీలు తీయించాలి. అల్లా వచ్చిన చీటీలలోని పెద్ద మనుష్యులు పంచాయతీదార్లుగా నియమింపబడాలి. ఈ పద్ధతి చాణక్యునిఅర్థశాస్త్రంలోనూ ఉందనీ, ఇందులో నవ్వులాటకు ఆస్కారం లేదనీకొందరుసూచించారు.ఏమైనా నవీనభావాల రీత్యా ఈపద్ధతిని ఆచరణలో పెట్టడానికి అనేకులు అంగీకరించరు. అయితే యిక స్వార్థరహితులు పరిపాలనా నిర్వాహకులుగ ఉండేటట్లు చెయ్యడం ఎలాగన్నదే సమస్య. దానికి మిగతా దేశాల పరిస్థితులు ఎట్లున్నా, మనదేశంలో మటుకు మత ప్రవక్తలు నాయకత్వం వహించ వలసినదేనా?

పండిత నెహ్రూ చెప్పినట్లు ఇతర దేశాల్లో భారతదేశ ఖ్యాతిని వ్యాపింప చెయ్యడానికి వివేకానందుడు చేసిన కృషి మరి ఏ ఇతర హిందూదేశ రాయబారి కృషికి తీసిపోదు. రాజా రామమోహన రాయలు, శ్రీ రామ కృష్ణ పరమహంస మున్నగు వారు చేసిన సాంఘిక సేవ, మరి ఏ ఇతర ప్రభుత్వ సాంఘిక చట్టానికి తీసిపోదు. గాంధి మహాత్ముడు గావించిన శాంతియుత సమరం, మరి ఇతర స్వాతంత్ర్య యుద్ధాలకు తీసికట్టు కాదు. మహాత్ముడు మతాన్ని, రాజకీయాలను జోడించి రాజకీయాలను చక్కని దృక్పథంలో నడిపించారు. హిందూదేశం ఆధ్యాత్మికదేశం. రాజకీయాలు, మతం అల్లుకొని ఉంటాయి. ఈ పై కారణా లున్నంతమాత్రాన మన దేశాన్ని నడపగలవారు మతప్రవక్తలేనని చెప్పడం ఆచరణ యోగ్యమా అన్నదే ప్రశ్న. రాజకీయ నాయకుల స్థానాల్లో మత ప్రవక్తలనుంచాలా? అసలు అలా ఉండడానికి వారు అంగీకరిస్తారా అని అనుకుంటే అంగీకరించరనే చెప్పవలసి వస్తుంది. ఒకానొకనాడు రాజకీయాల్లో పైచెయ్యిగావుండి, విసిగి,యోగిగామారిన అరవిందుడు తిరిగి రాజకీయరంగంలో దుమక గలరా? అది సంభవంకాదనే అనాలి. ఒకవేళ మనం మత ప్రవక్తలనే నాయకులుగా పరిగణించి వారి చేతుల్లో పరిపాలనా యంత్రాన్ని పెడితే వారుమటుకు అవినీతికి లోనుకారని హామీ ఏమిటి? పోప్, కాలిఫ్‌లు తమ రాజకీయాధిక్యాన్ని నిలుపుకోగలిగేరా? ఉదాహరణగా మన రాష్ట్ర రాజకీయాల్లో రమణ మహర్షి

శిష్యులైన రెడ్డియార్ ఎంతవరకు రమణ మహర్షి ఆశయాలను ఆచరణలో పెట్టగలిగాడు? సర్వ జన సమ్మతమైన, నిష్పాక్షిక నాయకత్వం వహించగలిగాడా? మహాత్ముని శిష్యులైన అనేక కాంగ్రెసు వాదులు ఆయన ఆశయాల ప్రకారం నడచుకొంటున్నారా? వీటన్నిటినీ బట్టిచూస్తే అవినీతి, దుర్మార్గత అనేవి అధికారంవల్ల కలిగే వేనని తేలుతుంది. ఇవి వ్యక్తుల మనస్తత్వాలను బట్టి కొంత హెచ్చు తగ్గుగా కలుగుతూ ఉండ వచ్చును. అంతవరకూ ఎందుకు. పవిత్రమైన మత సంస్థ లెన్నిటిలో నేడు కుళ్లు, అవినీతి ప్రబలటం లేదు? హిందూ ధర్మాదాయల చట్టం చెయ్య డానికి కారణం అదేకదా!

మత గురువులు బోధించేవి కేవలంఆదర్శాలే. వాటిని లౌకిక వ్యవహారాలరీత్యా సాధించ వలసిన వారు రాజకీయవాదులే. మత ప్రవక్తలు, తమ పవిత్రస్థానాలను వదలి నాయకులుగా బయల్దేరితే వారూ రాజకీయవాదులే అవుతారు. అప్పుడు వారుకూడ నేటి రాజకీయవాదుల మాదిరి సమయోచిత వర్తనులుగా తయారవుతారు. కాన పరిపాలన నిష్కల్మషంగా జరగాలంటే వ్యక్తుల మనస్తత్వాలు మారవలసిందేకాని నాయకులలోమార్పు జరిగినంతమాత్రాన పరిపాలనా యంత్రంలోని అవినీతిపోదు. మహాత్మునకు, కాంగ్రెసునకు ఉన్నటువంటి సంబంధమే మతప్రవక్తలకు, రాజ కీయనాయకులకు ఉండాలి. వారి ప్రబోధాల లోని పవిత్రతను గుర్తిస్తూ, పరిపాలన నిష్కల్మ షంగా జరిపించడానికి కాంక్ష, సామర్థ్యం ఉన్న రాజకీయనాయకులు కావాలి.

---

# సంఘ నీతి

ఏప్రిల్ 10వ తేదీ ఆంధ్రపత్రికలో శ్రీ గోపీ చంద్ గారు రాసిన వ్యాసం మేధావులం దరూ చదవవలసినది. అయితే గోపీచంద్ గారు సంఘనీతిని గురించి కొన్ని ముఖ్యవిషయాలు వదిలేశారని నా నమ్మకం.

సంఘనీతి ఆచరణలో అనేక మార్పులు చెందుతూంటుంది. కాని ఈ మార్పులను మనం సాధారణంగా గుర్తించము. అయినా మన ప్రవర్తన ఈ మార్పులప్రభావానికి లోనవుతూనే వుంటుంది. అదృష్టవశాత్తూ— లేక దురదృష్ట వశాత్తూ—మనం ఈ మార్పును గమనించం గనక, మనప్రవర్తనను మనం సరీగా విమర్శించం గనక, మార్పులేని, అచంచలమైన, ఆదర్శయుత మైన నీతి ఒకటుందని- మనం దానికే కట్టుబడి నడుచుకుంటున్నామని విశ్వసిస్తాం.

సంఘనీతి ఉత్పత్తి విధానంమీద ఆధారపడి దానితో పాటే మారుతుందని కమ్యూనిస్టులు నమ్మినట్లయితే అది పూర్తిగానిజం కాదని మనం రుజువుచెయ్యవచ్చు. వర్గాలమధ్య నైతిక వైవిధ్యంలేదని కాదు: ఒకే వర్గంలోకూడా వ్యక్తి గత ఘర్షణ లున్నచోట నైతిక వైవిధ్యం గోచరిస్తూనే ఉంటుంది. ఉదాహరణకు కోర్టు కెక్కిన దాయాదులు ఒకరి సర్వనాశనం ఒకరు కోరతారు. అదే విధంగా రెండు దేశాల మధ్య యుద్ధం సంప్రాప్తమైనప్పుడు ఒక దేశంలోని మత గురువులు మరొక దేశంలోని ప్రజల చావు కొరకు బహిరంగ ప్రార్థనలు జరుపుతారు. ఈ విధంగా సంఘర్షణతో కూడిన సమాజంలోని వ్యక్తులూ, వర్గాలూ, కులాలూ, జాతులూ తమ సన్నిహితులపట్ల ఒక విధమైన నీతి, విరోధులపట్ల మరొక విధమైన నీతి అవలంబించటం జరుగు తూంటుంది.

ఏక్షణాన ఏఏవ్యక్తులూ, వర్గాలూ ఏకమై ఏవ్యక్తులకూ, వర్గాలకూ శత్రువులుగా నిలబడ తారు అనేది ఆయా వ్యక్తులనుబట్టీ, వర్గాలను బట్టీ, పరిస్థితులనుబట్టీ సులభంగా నిర్ణయించ వచ్చును. వ్యాపారం విరివిగా సాగే సమయంలో ఒకరితో ఒకరు పోటీబడి ధరలు తెగకోసేవర్తకులే సరకులు కరువై పోగానే ఒకరితో ఒకరు చేరి ధరలు పెంచేస్తారు. అదేవిధంగా



తీయుద్ధంలో మన శత్రువులుగా వుండినవారు మరొక యుద్ధంనాటికి మన మిత్రబృందంలో చేరిపోవచ్చు.

ఆచరణలోకి వచ్చే నీతి సంఘర్షణను బట్టి మార్పులు చెందుతూ వుంటుందని ప్రత్యక్షంగా కనబడుతుంది గనక వర్గపోరాటం పురస్కరించుకొని కొంత నైతిక వైవిధ్యమూ, దానిలో మార్పులనుబట్టి నీతిలోకూడా మార్పు ఏర్పడుతుం దనుకోవటంలో తప్పేమీలేదు. అయితే మార్పు చెందని నైతికసూత్రాల మాటేమిటి? 'అబద్ధం ఆడరాదు, హింస కూడదు, అందరూ సుఖంగా వుండాలి, వర్గవిభేదాలు నశించాలి' ఇటువంటి నైతికసూత్రాలు ఎవరైనా వల్లె వెయ్యవచ్చు. కాని అందరూ అన్నివేళలా వీటిని ఆచరణలో పెడతారంటే, అది కలలో మాట. ఒకవేళ ఎవరైనా తాము వాటిని ఆచరిస్తున్నామని చెప్పినా అమాయకులు తప్ప నమ్మరు. సంఘంలో పగుళ్ళున్నంతకాలమూ రెండురకాల మతవిశ్వాసాలూ, రెండురకాల దేశభక్తీ ఎట్లా తప్పవో, అట్లాగే రెండురకాల నీతికూడా తప్పదు-పైకొకటి, లోపల ఒకటి. పైకి ప్రకటించే మతవిశ్వాసాలు ఒకటి, ఆచరణలోపెట్టే మతవిశ్వాసాలు వేరొకటి; దేశంపేరిట ప్రజలను బలిచేసే దేశభక్తి ఒకటి, దేశంకోసం బలి అయ్యే దేశభక్తి మరొకటి; ఇతరులను వంచించేందుకు ప్రకటించే నీతి ఒకటి, స్వార్థంకోరకు అమలు జరిపే నీతి మరొకటి. ఈ భేదాలు కాంగ్రెసు పరిపాలనలో ద్యోతకమవుతున్నది శ్రీ గోపీచంద్‌గారు చూపనే చూపారు.

ఇక సాధనాలకూ,సాధ్యాలకూ గల సంబంధం గురించి ఒక్కమాట. దుష్టమైన సాధనాలద్వారా క్రమమైన సాధ్యాలు లభిస్తవా అనేది కేవలమూ తాత్వికమైన ప్రశ్న. తాత్విక దృష్టిలో గాంధీజీ సిద్ధాంతాన్ని కాదనగలవారు వుండరు. అయితే ఆచరణలో చూడవలసిన విషయం సాధ్యానికి సాధనం అనుకూలమైనదా అని. ఈ విషయం కూడా నైతిక దృష్టిని బట్టి భిన్నంగా వుంటుంది. జమీందారీలను పరిహారంలేకుండా రద్దుచేయటం ఉచితమా అంటే జమీందారులు సహజంగా కాదంటారు, రైతులు అవునంటారు. పరిహారం లేకుండా జమీందారీలకు ప్రభుత్వం రద్దుచేయడమే జరిగితే, ఎవరు మెచ్చుకుంటారో ఎవరు విమర్శిస్తారో మనం ఊహించవచ్చు. ఒకరి నైతిక దృష్టికి సరిగా కనబడే సాధనం మరొకరి నైతిక దృష్టికి హేయంగా కనిపిస్తుంది. అందరు మానవులకూ సమాన హక్కులూ, సమాన అవకాశాలూ, వర్గరాహిత్యమూ, దోపిడీ విధానం అంతంకావటమూ అనే సాంఘిక నైతిక ఆదర్శాల్ని ప్రకటించడం ఒక్క కమ్యూనిస్టుల జన్మహక్కు కాదు, కాంగ్రెసువారుకూడా అదే ఆదర్శాన్ని ప్రకటిస్తున్నారు. అయితే ఈ ఆశయాన్ని నిజంగా సఫలంచేసే ఏ మార్గం అవలంబించినా అది నీతి బాహ్యమని నోరు బాదుకునేవారు ఉండనే వుండొచ్చు. కేపిటలిస్టు విధానంకింద వ్యక్తిస్వాతంత్ర్యం ఏవిధంగా అమలు జరుగుతున్నదో శ్రీ గోపీచంద్‌గారు చెప్పారు. కాని నిజంగా వ్యక్తిస్వాతంత్ర్యంతో కూడిన ప్రజాస్వామికం ఎవరు అమలు జరుపదలచినా కేపిటలిస్టు వర్గాలు ఆ ప్రయత్నం నీతిబాహ్యంగా వుందని విమర్శించవచ్చు. తాను పెట్టక, అడుక్కునినా నివ్వని అమ్మ చెప్పేనీతి అజగళ స్తనంవంటుగా వుండి తీరుతుంది.

రష్యాలో అమలు జరిగిన పద్ధతులు ఏ దేశపు మధ్యతరగతి వారికీపూర్తిగారుచించకపోతే దానికి తగిన కారణం వుండనేవుంది. అదేమిటంటే రష్యాలో విప్లవం జరిగినది శ్రామికవర్గం తరఫున. అక్కడి రాజకీయాలలోనూ సాంఘిక స్వరూపంలోనూ ఆ శ్రామిక విప్లవచ్ఛాయలు వుండనే వున్నాయి. అటువంటి ఛాయలు లేకుండా సరైన మధ్యతరగతి వాసనతో కూడిన సాంఘికవ్యవస్థ నిర్మించాలంటే మధ్యతరగతి వారు కొత్త విప్లవపంథా తయారుచేసి అమలు జరుపవచ్చు. అయితే దాన్ని అమలు జరిపేటందుకు అవలంబించే విధానాలు నీతియుతమైనవో కావో మధ్యగతివారే నిర్ణయిస్తే బాగుంటుంది. కాని మధ్యతరగతి నీతికి విముఖులుగా వున్నవారుమాత్రం నిర్ణయించరాదు.

స్వరాజ్యం సుప్రతిష్ఠితం అవాలంటే—

# కాంగ్రెస్ లోకసేవకసంస్థ కావాలి

రఘుకిశోర్

కాంగ్రెసులో అవినీతి పెచ్చుపెరిగిపోయిందని రాష్ట్రపతి మొదలుకొని నాలుగణాల సభ్యుని వరకూ అదేపనిగా పలవరిస్తున్నారు. విశేష మేమంటే అవినీతికి నిలయమైన కాంగ్రెసు వాదులే అవిషయాన్ని గురించి అతిగా వాపోతున్నారు. ప్రతిఒక్కరూ గాంధీజీ సిద్ధాంతాలనే వేదికలనుండి ఎలుగెత్తి చాటుతున్నారు.

అవినీతి, తప్పుడుతనం అంతకంతకు విచ్చలవిడిగా విహారంచేస్తోంది. రాష్ట్రపతి అంతటి వ్యక్తి హిందూసమాజంలో అభివృద్ధికరమైన సంస్కారణలను ప్రతిఘటిస్తున్నాడు. పర్మిట్లకు పరుగెత్తేవారు పరుగెత్తుతునేవున్నారు; పదవులకోసం ప్రాకులాడేవారు ప్రాకులాడుతూనే వున్నారు. కాంగ్రెసు అధికారులంతా మోటారుకార్లలో తిరగడమే ముచ్చటగా భావిస్తున్నారు. అందుకని ధనికవర్గానికి, కాంగ్రెసువారికి భేదం నశించిపోతోంది.

## అవినీతివర్తనుల అజమాయిషీ:

పాపం బాపూజీకనిన స్వప్నాలేమవుతున్నాయో అర్థంకావడంలేదు. ఈ కుళ్లునంతా చూసి గుండెబ్రద్దలై చావకుండా ముందుగానే మహాత్ముడు స్వర్గోన్ముఖుడవడం కూడా కొంతవరకు మంచిదే ననిపిస్తున్నది. అయితే కాంగ్రెసు భవితవ్యం యేవిధంగా పరిణమించనున్నది? కాంగ్రెసు భవిష్యత్తుపై దేశభవిష్యత్తు ఆధారపడివుంది. కాంగ్రెసు తప్పుడుమార్గంపడితే దేశం అధోగతి పాలుగాక తప్పదు. దేశం అధోగతి పాలైతే మరోరాజకీయపార్టీ తలెత్తగలదనేది నిస్సందేహం. ఈనాడు అంతర్జాతీయ రాజకీయరంగంలో భారతదేశపు పాత్ర ఎంతో ప్రముఖమైనదని అందరూ గుర్తిస్తున్నారు. భారత నాయకులు బాపూజీ ఆశయాలను అమలులో పెట్టడానికి ప్రయత్నిస్తున్నారనీ, భారతం బాపూజీ దేశమనీ యిప్పటికీ పరదేశీయులవిశ్వాసం. కానివాస్తవాన్ని గుర్తిస్తే ఈనాడు భారతదేశం బ్లాక్‌మార్కెట్ దొంగల దేశమైంది. ఎంత దుర్మార్గుడైనా, ఎన్ని మోసాలుచేసి సంపాదిస్తున్నా, నాలుగుడబ్బులు చేతిలో వున్నవాడికే కాంగ్రెసులో పలుకుబడి గల స్థానం లభిస్తోంది. ఒక్క కాంగ్రెసే కాదు. కాంగ్రెసులో లీనమైయున్న అన్ని ప్రజా సంఘాలూ అలాగే కనిపిస్తున్నాయి. రైతు సంఘాల్లో రైతుకు స్థానంలేదు; వ్యవసాయ కూలీ సంఘాల్లో వ్యవసాయ కూలీకి ప్రాతినిధ్యం శూన్యం. కార్మికసంఘాల్లో కార్మికునకు చోటు శూన్యం; విద్యార్థి సంఘాల్లో విద్యార్థులకు సముచితమైన ప్రాతినిధ్యం సన్నగిల్లిపోతోంది. ఈనాడు త్యాగంలేని శ్రీమంతులు కాంగ్రెసుకు అండ. త్యాగశీలురు కాంగ్రెసులో లేకపోలేదు. కావలసినంతమంది వున్నారు. కాని వారి త్యాగానికి విలువ చచ్చింది. వారి కష్టాన్ని దోచుకునేవాళ్ళు పెచ్చు పెరిగిపోయారు. స్వార్థరహితమైన గాంధీభక్తుల నిస్వార్థసేవను సామాన్య ప్రజలవరకూ పోనీకుండానే కాంగ్రెసులోని శ్రీమంతులే మృష్టాన్నంలా భోంచేస్తున్నారు.

## పదవీతత్పరుల పటాటోపం:

ఇక కాంగ్రెసు సామాన్యప్రజలకెలా సేవ చేయ గలుగుతుంది? నిజాయితీగల సేవకులకు కాంగ్రెసులో యెలా స్థాన ముంటుంది!

కేంద్ర ప్రభుత్వంవారు కాంగ్రెసు సంఘాల, వాటి ఉప శాఖల, వ్యక్తుల సహాయాన్ని, సహకారాన్ని యెంతగానో అర్థిస్తున్నారు. రాష్ట్ర ప్రభుత్వాలను అభివృద్ధికర మార్గాలపై నడిపించుటకు యత్నిస్తున్నారు. అయితే కాంగ్రెసు సంఘాలు కేంద్రప్రభుత్వ కార్యకలాపాల కెంత

వరకు తొక్కడు తున్నాయి? కేంద్రప్రభుత్వపు ఆదేశాలను రాష్ట్ర ప్రభుత్వాలు, మంత్రులు, శాసన సభ్యులు యెంతవరకు పాటిస్తున్నారు! ఈ విషయాన్ని తలచుకుంటే గుండె పగులుతోంది. కాంగ్రెసు సంఘాలు, రాష్ట్ర ప్రభుత్వాలు పోరా పోరీగా యుద్ధం చేసుకుంటున్నాయి. అక్కడ నెహ్రూ, పటేలు ప్రభృతులు యెంతగా వాపోతే యేంలాభం?

దీనికంతకూ ఒకటే కారణం. త్యాగం లేని వారు కాంగ్రెసులో పెత్తనం చేస్తున్నారు. ఉరఖారాయళ్లు కాంగ్రెసులో అధికారం చేజిక్కించుకున్నారు. ముసలివాళ్లకు నాయకత్వపు మోహం మెండై పోతున్నది. కుర్రవాళ్లకు ముసలివారిపై క్రోధం యినుమడిస్తోంది. తత్ఫలితంగా యువకులంతా కాంగ్రెసునుండి విడిపడవలసి వస్తున్నది.

### గాంధీజీ కడపటి ఆదేశం:

కాంగ్రెసు భవితవ్యాన్ని గురించి బాపూజీ తన ఆఖరి సందేశాన్ని వినిపించాడు. మనమందరం విన్నాం. మనమే కాదు, యావత్తు ప్రపంచమూ విన్నది. సాంఘికంగా, ఆర్థికంగా విప్లవాత్మక పరిణామాలు రావాలన్నా రాయన. అందు కనుగుణంగా జాతీయకాంగ్రెసును రూపొందించాలని ప్రకటించారు. మహాత్ముని ఉవాచ ప్రకారం జాతీయ కాంగ్రెసు లోకసేవక సంఘంగా పరివర్తన చెందాలి; పరిశుద్ధమైన ప్రజాసంస్థగా పరిణామం చెందాలి. మహాత్ముడు మన నుండి విడిపోయాడు. అంతటితో లోకసేవక సంఘపు చిట్టా బుట్ట దాఖలయింది. మరి యెప్పటి కాలిట్టిట్టే.

### కాంగ్రెసువర్గాల కాలుష్యం:

మళ్లీ పావలా సభ్యులను చేర్పించడంలో అక్రమం, సభ్యత్వపు పుస్తకాల పంపిణీలో అన్యాయం, తత్ఫలితంగా పోటీ సభ్యత్వ పుస్తకాల ప్రత్యక్షం, పోటాపోటీతో పేర్లు వ్రాయడం, డబ్బు కలిగిన శ్రీమంతు డొక్కడే సభ్యత్వాన్నంతా జమకట్టడం, ఆ తర్వాత ఎన్నికల యుద్ధం, ఎన్నికాధికారి లంచగొండితనం, పోలింగు ఆఫీసర్ల పోకిరీతనం, చచ్చినవారి ఓట్లు పోలుగావడం, బ్యాలెట్ పెట్టెల అదృశ్యం, అపీల్సు చేయడం, ఎలెక్షన్ ట్రిబ్యూనల్ లో మళ్లీ కుస్తీపోటీలు, యిదే వరుస. మరల రాష్ట్ర జిల్లా, తాలూకా సంఘాల యెన్నికల రణరంగం. అందులో మైనారిటీవర్గాల వాకౌట్లు, పోటీ సంఘాల నిర్మాణం, రాష్ట్రసంఘాల నిర్ణయాల్ని అఖిలభారత సంఘం రద్దుగావించడం. దాంతో ప్రజల్లో కాంగ్రెసంటే తీవ్రమైన అసంతృప్తి కాంగ్రెసువాదుల యెడల నిరసన ఆనాటి కానాడు పెచ్చు పెరిగిపోతోంది. ఇవన్నీ బహిరంగ సత్యాలు. ఇన్ని కాంగ్రెసువాదు లెక్కడెక్కడ కాలుబెడతారో అక్కడల్లా ప్రత్యక్షం. గ్రామ కాంగ్రెసు సంఘం దగ్గరనుండి అఖిలభారత సంఘం వరకూ; పంచాయతీబోర్డు దగ్గరనుండి రాష్ట్ర, కేంద్రప్రభుత్వాలవరకు చర్విత చర్వణమాతూనేవున్నాయి. ఈనాడే మహాత్ముడుంటే ఎంతవాపోయేవాడో. వివిధ కాంగ్రెసువాదుల— కాదు కాదు— నాయకుల [illegible]రణాలను చూస్తుంటే ఆశ్చర్యం వేస్తోంది.

### 'రామరాజ్య' నినాదం:

మహాత్ముడు కాంగ్రెసు ఆశయం రామరాజ్యమన్నాడు. ఇప్పుడు మన నాయకులు కూడా దాన్ని ప్రతిఘటించరు. అయితే దానికి వింతవింత నిర్వచనాలిస్తూ— రామరాజ్యమంటే వేదకాలపు రాజ్యమంటాడొక సనాతన ఘరానా కాంగ్రెసు అగ్రనాయకుడు; రామరాజ్యమంటే సహకార ప్రజారాజ్యమంటాడు మరో నాయకుడు; రామరాజ్యమంటే సర్వశ్రామిక ప్రజారాజ్యమంటాడు యింకో నాయకుడు. వీటన్నింటికీ ఒకే నిర్వచనమంటాడు వేరొక నాయకుడు. ఈ రాజ్యాల్లో యే రాజ్యమయినా అర్థంకాక గుడ్లు మిటకరిస్తున్నారు, సామాన్య జనం. ఒక పెద్దనాయకు డిలా ప్రవచించాడు:

'మన హైందవ పౌరాణిక పంచాయతీ రాజ్యం ఆదర్శమయింది. అందు మాదిగవాడు చచ్చిన జంతువుల తోళ్ళనుపూని మనకు పాదరక్షలు యిస్తున్నాడు. చాకలివాడు మన మైలనంతా శుద్ధిజేసి మానవుల ఆరోగ్యాన్ని కాపాడుతున్నాడు. మంగలివాడు క్షుర శుభ్రపరచు

తున్నాడు. పురోహితుడు చచ్చినవారికి స్వర్గాన్నిస్తున్నాడు. పూజారి భక్తిభిక్ష పెట్టుతున్నాడు, జ్యోతిష్కుడు భూతభవిష్యత్ వర్తమానాలను మన కళ్ళెదుట నిలుపుతున్నాడు. వీరందరకు కృషీవలులు భుక్తి గడుపుతున్నారు. ఇదే అచ్చమైన సహకార ప్రజారాజ్యం. సిసలైన సోషలిజం, అసలైన కమ్యూనిజం, ఇదే గాంధీయ రామరాజ్యం' అని పెద్దపెద్ద కబుర్లు చెప్పాడు. ఇలాంటి రాజ్యమే రామరాజ్యమైతే దానికో సలాం అంటున్నారు కొందరు. పోతే ఇంకో నాయకుడు డిలా ప్లేటు ఫిరాయిస్తాడు. కూలీలలోకివచ్చి కూలీ రాజ్యమంటాడు, రైతులలోకివచ్చి రైతురాజ్య మంటాడు, పెట్టుబడిదార్ల మధ్య విందు లారగిస్తూ పెట్టుబడిదార్లే లేకపోతే సమాజమే లేదంటాడు. చదువుకొన్న వారివద్దకు వెళ్ళి మీరే సమాజానికి జీవగర్ర అంటాడు. విద్యార్థులమధ్య 'ఓ విప్లవ విద్యార్థీ! నీవే లేకపోతే సంఘం గొడ్డుబోతుం'దంటాడు. ఆడవాళ్ళ మధ్య 'మీరే శక్తిస్వరూపిణులు, కాళికాదేవతలు, అంబలు, జగదంబ'లని దండకం ప్రారంభిస్తాడు. సనాతనాచార్యులలో 'మీరే లోపిస్తే సమాజం కళ్లెంలేని అశ్వమౌతుం' దంటాడు. ఇదీ ధోరణి! పైపెచ్చు 'ఇవి నా మాటలుగాదు, బాపూజీ సందేశాలు, జాతీయ కాంగ్రెసు ఆదర్శాలు' అంటాడు

ఇంకో గమ్మత్తైన నాయకులున్నారు. 'ప్రజాసేవకులారా!మీరు కర్మ జీవులు, మీది నిస్వార్థ సేవ (అంటే తనది కాదన్నమాట), మీవంటి వారు మూతా రాజకీయాలతో సంబంధం పెట్టుకోరాదు (అంటే తన కుండవచ్చు). మీరు అణాకానీతో పొట్ట నింపుకోవాలి. నిరాడంబరంగా వుండాలి (ఆ మహాశయుడు పొందూరు ఖాదీ, స్పెన్సరు భోజనం సేవించవచ్చు). త్యాగమే మీ భాగ్యం, ఓర్పే మీ సంపద. బాగా కష్టపెట్టండి దేహాన్ని. ఆకాశం బ్రద్దలయేటట్టు అరవండి (అంటే స్లోగన్సు). పదవుల ప్రాకులాట మీ పనికాదు (మాది). మీకింకా అనుభవంలేదు' ఇది ఆయన ధోరణి.

## ఆత్మసంశోధన అవశ్యత :

ఇవన్నీ కాంగ్రెసు సిద్ధాంతాలేనా! బాపూజీ ఆదర్శాలేనా!

జాతీయ విప్లవకాలంలో కాంగ్రెసువాది దొక ధోరణి. అది జాతీయ పోరాటంలో త్యాగాలు చేయడమే. జాతీయ విప్లవానంతరం యింకో ధోరణి. అంటే సంఘం సంస్కరణ. ఆర్థిక రంగంలో అభివృద్ధికరమైన మార్పులు. ఇదే లోకసేవకసంఘపు విధానం. అయితే ఆమార్పుల వైపు కాంగ్రెసువాదులు కన్నెత్తైనా చూడడం లేదు సరికదా వ్యక్తులలోమాత్రం విపరీతమైన మార్పులువచ్చి పడ్డాయి.ఆ మార్పు లేమంటారా! ఆ రోజుల్లో త్యాగాన్నే ప్రధానంగా పెట్టుకొనేవారు, ఈ నాడు స్వార్థాన్నే ప్రధానాశయంగారూపొందించుకొంటున్నారు. ఆ నాడు బాధ పడడమే ముఖ్యం. ఈ నాడు భోగాలనుభవించడమే ప్రధానం. ఆ నాడు కాంగ్రెసులో రెండు ముఠాలు. ఈ నాడు అవి ఎన్ని ముఠాలుగా చీలాయో నిర్ణయించడం ఎవరికీ తరముగాదు. ఈ ముఠాలు నిర్దిష్టమైన సూత్రాలపై సాగిపోవు. ఈ నాడు ఒక ముఠాలోనున్న వ్యక్తి రేపు యింకొక ముఠాలో. ఇది కేవలంవ్యక్తిగతలాభాలకొరకే.

అయితే ఈవిధంగా కాంగ్రెసును నిశితంగా విమర్శిస్తుంటే అనేకమంది ఆగ్రహపరవశులు కావచ్చు.ఈరోజుల్లో కాంగ్రెసునువిమర్శించడం ఒక అలవాటైపోయిందని తుడిచివేసుకపోవచ్చు. అవును. కాంగ్రెసువాదులకు అవినీతి యేవిధంగా అలవాటైపోయిందో కాంగ్రెసేతరులకు విమర్శించడం కూడా అలాగే పరిపాటైపోయింది. అందులో తప్పేమిటి? అయినా యిప్పటికీ కాంగ్రెసు సిద్ధాంతాల యెడల, కాంగ్రెసు ప్రణాళికల యెడల నాకు భక్తిశ్రద్ధలు సడలలేదు. అయితే యీనాడు అధికారంలో నున్న కాంగ్రెసువాదుల ప్రవర్తన సంస్థయొక్క విశిష్టతకే భంగకరం. ప్రజల్ని కాంగ్రెసుకు దూరం చేస్తున్నారు. ఇది నాలాంటి కాంగ్రెసు క్షేమాన్ని వాంఛించే అనేకమంది యువకులకు చాలా బాధగా పరిణమిస్తున్నది. ఏరోజు కా రోజు

కాంగ్రెసునుండి అనేకమంది యువజనులు, విద్యార్థులు క్రమేపీ నిర్గమిస్తున్నారు.

## ఖద్దరుధారుల ఖ్యాతి :

నేనొక పర్యాయం రైలు ప్రయాణం చేస్తున్నాను. ఖాదీదుస్తులలోనే వున్నాను. నా ప్రక్కన మిల్లుబట్టలు ధరించివున్న యిద్దరు సామాన్యమైన చదువురాని వ్యక్తులు కాంగ్రెసు సంస్థను, వ్యక్తులను దూషించుకొంటూ నవ్వుకొంటున్నారు. నేను వూరకుండలేక కాంగ్రెసును సమర్థించబోయాను. అందులో ఒక వ్యక్తి నా సమాధానాలు చెవిని పెట్టకుండగానే ఖద్దరుకట్టినవారిని నమ్మరాదని సూత్రీకరించాడు. రెండవ వ్యక్తి మొదటివ్యక్తిని వారిస్తూ 'అలా మాట్లాడితే అరెస్టుచేయిస్తారు. వూరుకోవోయ్' అన్నాడు. మిగతా ప్రయాణీకులంతా పొట్ట చెక్కలయ్యేటట్లుగా నవ్వారు. నాకు సిగ్గుపడాలో, యేడ్వాలో అర్థంకాలేదు. ఆ తర్వాత ఆ కంపార్టుమెంటులో ప్యాసెంజర్లు ఒకరితో కొకరు నాగురించి గుసగుసలాడుకొంటున్నారు. నేనచ్చట మరి నిల్వలేక స్టేషన్ రావడంతోనే మరో కంపార్టుమెంటు చేరుకొన్నాను.' ఇది నా స్వానుభవము. ఇంతేకాదు. ఆంగ్ల ప్రభుత్వ కాలములో దొంగలాభాలను విచ్చలవిడిగా సంపాదించినవారంతా ఈ నాడు కాంగ్రెసును దుయ్యబట్టుతున్నారు. దీనికి కారణం ప్రస్తుతం కాంగ్రెసు వర్గాలలోని బలహీనతయే. ప్రతికూల పక్షాలు కాంగ్రెసును సవాలుచేస్తున్నాయి. ప్రజలను రెచ్చగొడుతున్నాయి. అరాజకానికి దార్లు వేస్తున్నాయి.

## యువకులు ముందుకు రావాలి :

రాజకీయవాదికి రానురానుసంఘంలో గౌరవం నశించిపోతోంది. రాజకీయాల యెడ ప్రజలకు అభిరుచి సన్నగిల్లిపోతున్నది. అమెరికాలో రాజకీయవాదిని మోసకారిగా భావిస్తారు. గౌరవం యివ్వరు. కారణం ఆదేశంలో రాజకీయాలకు ప్రజలకు సన్నిహితత్వం లేదు. మన దేశంలోనూ అట్టి పరిస్థితులు అనతికాలంలోనే రాకమానవనిపిస్తున్నది. ఆ తర్వాత వయోజన ఓటింగు విధానమున్నా ప్రయోజనంవుండబోదు. ప్రజలు రాజకీయవాదుల్ని శల్యపరీక్ష చేయబోరు. ఏ కొద్దిమందో ఎన్నికలలో పాల్గొంటారు. అభివృద్ధి నిరోధక వర్గాలు రాజకీయాధిపత్యం చేపడతారు.

కాంగ్రెసువాదులు అతిత్వరలో మేల్కొననట్లయితే కాంగ్రెసు భవిష్యత్తు శాశ్వతంగా లేనట్లే. అందుకు పాతనాయకత్వం, పాత మతాలు ప్రక్కకు తప్పుకోవాలి. కొత్త నాయ నాయకత్వం కాంగ్రెసు నాక్రమించుకోవాలి. గడచిన రెండు మూడుసంవత్సరాల అనుభవం అనుసరించి దేశానికి నాయకత్వం వహించాలి. అందుకు యువకలోకం ముందంజవేసి కాంగ్రెసు భవితవ్యాన్ని అభ్యుదయమార్గంలో రూపొందించాలి.



# రానున్నది

"దాశరథి"

రానున్నది యేది నిజం ?
అది వొకటే, సోషలిజం.

కలపండోయ్ బుజం బుజం,
కదలండోయ్ గజం, గజం.

అడుగడుగున యెదద నెత్రు
మడుగులుగా విడవండోయ్,

పడిపోయిన గుడి గోడలు
విడిచిపెట్టి నడవండోయ్.

ఉదయాకాశ పతాకం
ఎదలో కదలాడె నేడు,
హృదయావేశ తటాకం
నదిలా పారలాడె నేడు.

రానున్నది యేది నిజం ?

*బేసిక్ విద్యావిధానాన్ని ప్రవేశపెట్టాలని ప్రభుత్వానికి గట్టిగానే ఉంది. కాని డబ్బులేక అక్కడక్కడ మాత్రమే శిక్షణాలయాలు నెలకొల్పింది. ఆ తయారైన కొద్దిమందీ, తగిన పరికరాలు లేకనేమో, పాతతోవనే పోతున్నారు. ఈ సంస్కరణలు తొందరగా అమలుపరచాలంటే ఏం చెయ్యాలి?*

# బేసిక్ విద్యావిధానం

కె. వీరభద్రరావు

విద్యా విధానంలో సంస్కరణావశ్యకత దేశంలో మొలకెత్తటమూ, తర్జనభర్జనల్లో నలిగినలిగి మహాత్ముని వార్ధా విధానంగా రూపొంది చిగిర్చి బేసిక్ విధానంగా ఫలించటమూ జరిగి ఎంతో కాలం అయింది. కాంగ్రెసు, అధికారానికి వచ్చి ఇంతకాలమైనా, విద్యా సంస్కరణల్లో ముందంజ వెయ్యటం లేదు. ఇటీవల సెకండరీ విద్యలో సెక్రెటేరియట్, కాలేజి రెంట్ కోర్సులనీ, పౌరశిక్షణ సాంఘిక శాస్త్రాలనీ ఏవో కొన్నిమార్పులు జరిగినాయి. కాని ప్రాథమిక విద్యలో మాత్రం ఎప్పటి పాత పురాణమే సాగుతోంది. విద్యాశాఖా మంత్రుల సమావేశాల్లో కూడా ఉపన్యాసాడంబరమే గాని ప్రాథమిక విద్యకు జాతీయ ప్రభుత్వవాసనైనా తగలటమే లేదు.

బేసిక్ విధానాన్ని ప్రవేశపెట్టాలని ప్రభుత్వం గట్టిగా సంకల్పించినట్లు కనిపిస్తుంది. కాని ఆర్థికమైన స్తోమతు లేదని ఏదో కొంచెం మొత్తం బడ్జటులో కేటాయించి అది ఖర్చుపడేలాగ అక్కడక్కడ ఉపాధ్యాయులకోసం శిక్షణాలయాలు నెలకొల్పింది. అక్కడ తయారైన ఆ కొద్దిమంది ప్రాథమిక విద్యాసాగరాన్ని తిరిగి ప్రవేశించి తగిన పరికరాలు లేకనో ఏమో నూతనత్వం ప్రదర్శించలేక పాత నీళ్ళలోనే కాలక్షేపం చేస్తున్నారు. ఈ ఖర్చుపడిన సొమ్ము వ్యర్థమన్నమాటే గదా! ఇంతకన్న డబ్బు వ్యయంచేసి బాగా విజయవంతంగా సాగించేందుకు ప్రభుత్వానికి ఆర్థికంగా త్రాణ లేదు; అది ఇంతలో కలిగే సూచనా లేదు.

ఈ పరిస్థితుల్లో ప్రభుత్వమూ, బేసిక్ విద్యావిధానశాస్త్రవేత్తలూ కొంచెం ఒక రకమైన ఉదారత వహిస్తే తొందరగా సంస్కరణలు అమలు పరిచే అవకాశం కనిపిస్తుంది. మొగ, ఆడ, ముసలి, ముక్క ఉపాధ్యాయులంతా 2,3 సంవత్సరాలు ఆశ్రమవృత్తి నవలంబించి తమ్ము సేవించి ఈ నూతన పవిత్రమంత్రోపదేశం తమ వద్దనే పొందాలని బేసిక్ శాస్త్రపండితులు భావించకూడదు. ఈ నూతనవిధాన సిద్ధాంతాలను వీలైనంత తేలిక భాషలో ఉదాహరణపూర్వకంగా ప్రచురించాలి.

అయితే ట్రెయినింగ్ స్కూళ్ళలో ఉన్న పెద్ద పెద్ద ఉపాధ్యాయులే ఈ నూతన విధానానికి క్రొత్తవారైనపుడు శిక్షణ బాహుళ్యంగా ఎలా జరుగుతుందని సందేహపడవచ్చు. ఏ విద్యా విధానమైనా థీరీ (Theory), ప్రాక్టికల్ (Practical) అని రెండుభాగాలుగా ఉంటుంది. ఒక రకపు విద్యావిధానంలో శిక్షితుడైనవాడు ఎంతగొప్ప అపూర్వవిధానమునైనా కొంచెం కష్టంతో థీరీ వరకైనా అవగాహన చేసుకోగలడనే భావం కొంచెందూరం ఆలోచించైనా ధ్రువపరచుకోవాలి. ప్రస్తుత ఉపాధ్యాయులు కేవలం పశుతుల్యులే అయితే నూతన విధానం మాత్రం వారిని ఉపాధ్యాయులుగా చేయగలదా! విషయాల (Subject) వారీగా ప్రాంతీయభాషలలో విశేషవివరాల (Details)తో పుస్తకాలు ప్రచురించి పరీక్షలకు ప్రైవేటుగా వెళ్ళే అవకాశం ఉపాధ్యాయులకిస్తే వారు ప్రయత్నిస్తారు. కృతార్థులైన వారికి ఒక అదనపు ఇంక్రిమెంటంటే—అల్పసంతోషులు—ఇంకా ఎక్కువగా ప్రయత్నిస్తారు. ఆదిలో అంత ఫలప్రదం కాకపోయినా క్రమక్రమంగా ఎక్కువమంది కృతార్థులౌతారు. ఈ పద్ధతిలో యిప్పటి

ట్రెయినింగు స్కూళ్ళలో ఉపాధ్యాయులందరు ఉత్తీర్ణులౌతే క్రమంగా నూతన విధానం అక్కడే బోధనలో ప్రవేశపెట్టి నూతన విధానంలోనే ఉపాధ్యాయులను తయారుచేస్తారు.

ఇంక ప్రాక్టికల్-craft సహితం - విషయం. తరిఫీదు పొందిన పరీక్షాధికారులు నెలనెలా జరిగే సెంటరు క్లాసుల్లో విషయాల (subject) వారీగా ఆదర్శపాఠాలిస్తే ఉపాధ్యాయులు నూతన విధానాన్ని గ్రహించటమే కాకుండా అందులో అభిరుచికూడా కలిగించుకుంటారు. థీరీలో ఉత్తీర్ణులైనవారికి ప్రాక్టికల్ ఈ పరీక్షాధికారులు జరుపవచ్చు. లేక స్పెషల్ సెంటర్లు నియమించి ప్రత్యేక పరీక్షాధికారులచే జరిపించవచ్చు. ఈ విధానం క్రొత్తది కాదు. నేత మొదలైనవి నేర్పే ఉపాధ్యాయులకు పిల్లలకు పాఠంచెప్పే ప్రాక్టికల్ పరీక్ష ఈ విధంగానే జరుగుతున్నది-ప్రస్తుతంలో.

కనుక ఈ విధమైన అవకాశాలు ఉపాధ్యాయులకు లభింపజేస్తే త్వరగా విద్యావిధాన సంస్కరణలు చేతలో అమలు జరుగుతాయి. 'చాక'కి 'చాక' సరుకే తయారౌతుందనే తక్కువదృష్టితో చూస్తే ప్రయోజనంలేదు. పరీక్షల ప్రమాణం (Standard) హెచ్చుగా పెట్టుకుని సరుకునాణ్యం చెడకుండా చూసుకోవచ్చు.

# మన సాహిత్యం సరిహద్దులు దాటాలంటే—

జి. యస్. రామకృష్ణ

తెలుగు భాషలోని రచనలు ప్రచారదృష్ట్యా చాలా వెనుకబడి వున్నాయి. ఈ భాష అతిపురాతన కాలంనుంచివున్నా, ఈ సాహిత్యాన్ని ఆనాటికానాడు పెంపొందించ ప్రయత్నించేవారు తక్కువమంది లేకపోయినా, పరభాషలలోనికి ఈ సాహిత్యాన్ని తర్జుమా చేసేవారు లేకపోవుటచేత ఈ నాడు మన ఉత్తమ రచనలు సరిహద్దులుదాటిపోలేక వెనుబడివున్నాయి.

ఇంతవరకు ఎంతగానో అభివృద్ధిచెందుతూ వచ్చి, ఈ సాహిత్యాన్ని పరభాషలలోనికి తర్జుమా చేయడానికి తగిన ప్రయత్నాలు రచయితలు చెయ్యలేదు. తగిన ప్రోత్సహం ప్రజలు ఇవ్వడంలేదు. తెలుగు పుస్తకాలు కొనడం అలవాటు లేదు. అటువంటప్పుడు సాహిత్యపరులు, రచయితలు ఎంతవరకు మన సాహిత్యాన్ని వృద్ధిలోకి తీసుకొని రాగలరు? సాధారణంగా 'సాహిత్యపరులు' అనగానే, చాలామట్టుకు ఆర్థికంగా బాధపడేవారే కనబడతారు.

ఆంధ్రులమంతా మాతృభాషాభివృద్ధికి తగిన ప్రోత్సాహం ఇవ్వడం నేడు ఎంతైనా అవసరముంది. తెలుగుభాష ఇంకా ఎంతగానో అభివృద్ధి అవవలసివుంది. మన సాహిత్యం మన భాషలోనే గాక, పరభాషలలోకూడా ఎంతగానో ప్రచారం జరగవలసివుంది. అప్పుడుగాని మన రచనల మాధుర్యం, వాటిలోతుపాతులు పరభాషలవారికి తెలియవు. ముఖ్యంగా, ఈ రోజున ఆంగ్లంలోనికి, హిందీలోనికి మన ప్రముఖ రచనలు అనువదింపవలసి వుంది.

మన భాషను చూసి, మనలో మనం మురిసిపోతూ, దానికి ఎంతగా అందచందాలను తీర్చిదిద్దినా, మన సరిహద్దులను దాటనంతకాలం మన సాహిత్యం వికసించదు. మన ప్రక్కనున్న తమిళ సాహిత్యం విదేశ భాషలలోనికి తర్జుమా చేయబడి, విరివిగా ప్రచారం పొందుతోంది. విసొంపైన మధురభాష 'తెలుగు'. మన సాహిత్యాన్ని మనమే పెట్టుకొని కూర్చుంటే, దాని రుచి ఇతరులకు ఎలా తెలుస్తుంది?

ఇక- ఈ నాడు విద్యార్థులు, యువకులు హెచ్చుగా చదవకబారు నవలలు, పిట్టకథల పత్రికలు చదవటానికి; సినీమా తారలబొమ్మలతో కూడిన పత్రికలుచూడటానికి గల శ్రద్ధలో కనీసం పదోవంతయినా ఉత్తమ రచనలు, ఉత్తమ పత్రికలు కొనగలిగినంతవరకు కొని, చదవడానికి మళ్ళించడం జరిగినప్పుడే, మన సాహిత్యంలో రచనలు విరివిగా వెలువడడానికి వీలుంటుంది.

# పిచ్చి దానిమ్మచెట్టు

రచన : ఓడిస్యూస్ ఎలిటిస్ అనువాదం : శ్రీ శ్రీ

తెల్లగా వెల్లవేసిన ఈ వసారాల్లో
అనుకూల దక్షిణ వాయువులు ప్రసరించే అందమైనగదుల వెలుపల
ఇట్టే వెలుతురులోకి ఉరికేది
ఈపిచ్చి దానిమ్మచెట్టేనా, చెప్పవూ ?
ఉయ్యాలలూగే గాలుల గుసగుసల్లో
సారవంతమైన తన సంతోషాన్ని వెదజల్లేది
ఎవరు చెప్పవూ, ఈపిచ్చి దానిమ్మచెట్టేనా ?
ఉదయవేళ అప్పుడే తొడిగిన మొగ్గలతో
ఊగుతూ ఉవ్వెత్తుగా తన రంగుల పింఛం విప్పి
విజయగర్వ రోమాంచంతో తులికేది
చెప్పవూ ఈ పిచ్చి దానిమ్మచెట్టేనా ?

పాలికాపు బాలికలు పొలాల్లో నగ్నంగా
నిద్రబద్ధకపు లోతులు దులిపేస్తూ
లవంగాలు తమ పసిరిక చేతులతో సాగుచేసేటప్పుడు
చెప్పవూ ఈపిచ్చి దానిమ్మచెట్టేనా
సూర్యకాంతిని వాళ్ల తట్టల కెత్తేది ?
వాళ్లు పిలుచుకునే పేర్లని పాటలతో ముంచెత్తేది ?
చెప్పవూ ఈపిచ్చి దానిమ్మచెట్టేనా
ప్రపంచపు నీడలతో పోరాడేది ?

ఈయలాడి దినం తన్ను ఏడు నిగనిగని రెక్కలతో అలంకరించుకొని
అనంత సూర్యబింబంచుట్టూ ఆకాశ సహస్రాలను చుడుతున్నప్పుడు
చెప్పవూ ఈపిచ్చి దానిమ్మచెట్టేనా
వెయ్యికొరడాలు పుచ్చుకొని
దౌడుతీసే గుర్రాలను జూలులాగి నిలబెడుతుంది?
ఒకసారి విషాదంతో, ఒకమారు విశ్రమిస్తూ
ఈపిచ్చి దానిమ్మచెట్టేనా చెప్పవూ
ఏదో నవాశాప్రభాతాన్ని ఎలుగెత్తి చాటుతుంది ?

ఓహో చెప్పవూ ఈపిచ్చి దానిమ్మచెట్టేనా
సుదూరంలో పరవళ్లు తొక్కుతూ
వెయ్యిపడవల్ని కడుపులో ఉన్న కడలిలాగ
ఇతరుల అడుగుజాడ తెరుగని తీరాలకు
విరగబడే కెరటాలు పంపుతూ
చెప్పవూ ఈపిచ్చి దానిమ్మచెట్టేనా
ఆకుల పాకెట్ రుమాలు ఊపుతుంది ?
సరికొత్త నివ్వాలు చెరుగుతుంది !
చెప్పవూ ఈపిచ్చి దానిమ్మచెట్టేనా
తేటతెల్లని గాలికి తెరచాప లెత్తుతుంది !

నిర్లక్ష్యంగా ప్రమాదకరంగా
ద్రాక్షలతల నీలి శిఖరాలమధ్య
విందులతో వీరావేశంతో
ఎవరు చెప్పవూ ఈపిచ్చి దానిమ్మచెట్టేనా
ప్రపంచపు నడుంమీద వెలుతురుతో విరుచుకుపడి
రాక్షసి తుఫానుల ప్రసారాన్ని ప్రతిఘటించి
చెప్పవూ ఈపిచ్చి దానిమ్మచెట్టేనా
పంటలతో పాటలతో సరిగంచులు దిద్దిన
ప్రత్యూషపు పసుపుపచ్చని సింహపుజూలు పట్టుకొని
దివసకాంత కట్టుకున్న పట్టుచీరని
హఠాత్తుగా జార లాగివేస్తుంది !

చైత్రమాసపు రవికలుధరించి శ్రావణమాసపు విపంచిధ్వనించి
చెప్పవూ ఆడుతునే పాడుతునే ఈవిడ
మనకి మతులు పోగొట్టే ఈవిడ
బీభత్సాన్ని పట్టుకొని ఊపేసి
కాటుక చీకటి నీడలు రాల్పించి
సూర్యుడి గోళంలో మత్తెక్కిన పక్షుల్ని వొంపేసే ఈవిడ
సమస్తవస్తువుల హృదయాలలో
మన ప్రగాఢ స్వప్నాల గుండెలలో
విశాలంగా తన రెక్కలు విప్పుతునే ఈవిడ
ఎవరు ఈపిచ్చి దానిమ్మచెట్టేనా ?



★ సాంఘిక విషయాలను పురస్కరించుకొని వ్రాయని ఆర్థిక చరిత్ర నిష్ప్రయోజనము, రాజకీయ చరిత్ర దురవగాహము.

# సాంఘిక చరిత్ర

టి. జగన్మోహనరావు

సాంఘిక చరిత్ర అంటే రాజకీయాలు మినహాయించి వ్రాసిన ప్రజల చరిత్ర అని చెప్పవచ్చు. ఒకవిధంగా పరిశీలిస్తే ఏ ప్రజల చరిత్రనుండైనా రాజకీయాలను వదలివేయటం కష్టం. అనేక చరిత్రగ్రంథాలలో సాంఘిక విషయాలు పేర్కొనబడటం లేదు. రాజకీయాంశములకు మాత్రమే ప్రాధాన్యమివ్వబడుతోంది. అందుచేత పై విధానానికి వ్యతిరేకంగా రాజకీయ విమర్శలేకుండా సాంఘిక సమస్యలనే ఉద్ఘాటిస్తూ వ్రాయబడిన చరిత్రలుకూడ ఉపయోగంగా వుంటాయనవచ్చును. అవి రాజకీయ చరిత్రలోని లోటులను కప్పిపుచ్చవచ్చును.

ఈ రెండురకాల చరిత్రలేకాకుండా ఆర్థిక చరిత్ర అని మరొక విధమైన చరిత్ర బయలుదేరింది. సాంఘికచరిత్రను సరిగా అర్థం చేసుకోవాలంటే మానవవరకపు చరిత్ర ఎంతో ముఖ్యం. ఆర్థిక పరిస్థితులనుండే సాంఘికరంగం తయారవుతుంది. ఆ విధంగానే సాంఘిక పరిస్థితులనుండి రాజకీయరంగం తయారవుతుంది. కనుక సాంఘిక విషయాలను పురస్కరించుకొనని ఆర్థికచరిత్ర నిష్ప్రయోజనమని, రాజకీయచరిత్ర అర్థము కాజాలదని అనటం ఒక నగ్నసత్యం.

సాంఘికచరిత్ర కర్తవ్యం ఆర్థిక రాజకీయ చరిత్రలను సన్నిహితంచేయుటం మాత్రమే కాదు. దానికి ఒకవిధమైన విశిష్టత కలదని చెప్పాలి. ప్రజల దైనందిన జీవితచరిత్రను వర్ణించునదే సాంఘికచరిత్ర. దీనికి నిర్ణీతమైన సరిహద్దులు లేవు. మానవుని చరిత్రతోపాటు ఎంతో విశాలమైనది. సంఘంలోని వివిధవర్గాలమధ్య వుండే ఆర్థిక సంబంధం, సాంసారిక పరిస్థితులు, గృహజీవితవిధానం, ప్రజల కష్టసుఖాలు, ప్రకృతియెడల మానవునియందుండే భావాలు, నిత్యజీవితంలోని పరిస్థితులనుండి ఆకారమును పొందిన ప్రతియుగంలోని నాగరకత, మతాచారాలలోను సాహిత్యంలోను సంగీతంలోను మరి యితర కళలలోను నిత్యంకలుగు మార్పులు—యివన్నీ సాంఘికచరిత్రను నిర్మిస్తాయి.

జరిగిపోయిన కాలంలోని మానవుని చరిత్రను మనం పూర్ణంగా తెలిసికోగలమా అనేది ఒక చిక్కు ప్రశ్న. చరిత్రకారులు ఎక్కువ శ్రమపడి తమ పాండిత్య ఫలితంగా ఎంతో జ్ఞాపకమును మన కందచేశారు. దాన్ని అంతటిని చదవాలంటే కొన్ని యుగాలు పడుతుం దనిపిస్తుంది. కొన్ని లక్షలమంది వ్యక్తుల జీవితచరిత్రలు చదివితేనే గాని ఆ వస్తువునంతటినీ గ్రాహ్యంచేసుకోవడం కష్టం. సాంఘిక చరిత్రకారునికి అనువైన కొన్ని సామాన్యసూత్రాలు వెనకెప్పుడో జరిగిన సంఘటనల నాధారంచేసుకొని వుంటాయి. ఆసూత్రాలలోని యథార్థం తెలుసుకోవాలంటే యీచిన్న చిన్న సంఘటనలనుదాటి వెళ్ళవలసి వుంటుంది.

స్థూలదృష్టితోకూడిన జ్ఞానాన్వేషణ నిజమైన నాగరకతకు జీవనాధారము. మానవునియందలి జ్ఞానాన్వేషణ తత్పరతను పెంపొందించు వాటిలో సాంఘికచరిత్ర ప్రధానమైనది. ఊహాశక్తిని కలుగజేయుటయే అసలు చరిత్రయొక్క అందము. మనందరకు మన పూర్వులనుగూర్చి తెలిసికోవాలనే కోరిక ఉంటుంది. వారినిత్యజీవితం, వారి కష్టసుఖాలు తెలిసికోవటం మనకెంతో ఉత్సాహంగా వుంటుంది. చారిత్రిక పరిశోధకుని కార్లయిలు డ్రై యాజ్ డస్టు (dry-as-dust) అంటాడు. అయినా యీ వ్యక్తి ఒక కవి అనే చెప్పాలి. అతను తనతోటివారికి తనకు ఆనందాన్ని కలిగించిన కవిత్వాన్ని వ్యక్తపరచలేకపోవచ్చును. కాని పూర్వం ఎన్నడో జీవించిన మానవుల జీవితంలోని యథార్థవిషయాలను తెలిసికోవాలనే కోరిక అతని ప్రధానగుణం. గతించిన ప్రపంచంతో కలసిమెలసి వుండాలని అతని ఆశయం. ఆంగ్లేయ నవలా రచయిత

వాల్టర్ స్కాట్ తనజీవితాన్ని 'డ్రైయాజ్ డస్ట్' గానే ప్రారంభించాడు. ఆవిధంగా అతనికి సౌందర్యం కనిపించింది. అంటే స్కాట్ ఆ గతించిన ప్రపంచంలో పురాతన దుర్గాల్లో సామాన్యప్రజలకు తెలియని జీవనం గడిపే స్త్రీలను గురించి, వీరస్వర్గానికోసం తహతహలాడే వీరులను గురించి తెలిసికోవాలనే కుతూహలాన్ని కలిగిన మనిషి. ప్రతి ఉత్తమ చరిత్రకారునివలె కార్లయిలు గూడ యీ దృష్టినే కలిగినవాడు. సాహిత్యసీమలో యిటువంటి నైజాన్ని ప్రశంసించినవారిలో అతనుముఖ్యుడు. అతనొకవిషయంకొంచెమూపేక్షించి చెప్పాడు. గతించిన కాలంలోని మానవుని జీవితాన్ని తెలియబరచే ఏచిన్న విషయాన్నైనా డ్రై-యాజ్-డస్ట్' అనబడే చరిత్రకారుడు తెలిసికొంటాడు. ఈచిన్న విషయాలే షెల్లీ వ్రాసిన కవిత్వంకంటె మధురంగాను, స్కాట్ వ్రాసిన నవలలకంటె అందంగాను ఉంటాయి. పూర్వకాలపు నాగరతకను తెల్పు మానవుని జీవితంలోని కొన్ని సంఘటనలు ఎంతో ముఖ్యమైనవని కార్లయిలు భావం.

'గతించిన కాలం' అనే మాటలో చాలా అర్థం యిమిడివుంది. ఆమాట ఒక విధమైన విచారాన్ని నైర్మల్యాన్ని తెలియజేస్తుంది. అందులో అన్ని విధాల కవిత్వం వుండవచ్చు. జరిగిపోయినకాలానికి మన కాలానికి దూరం ఎక్కువైనకొలది ఆ అర్థం ఎక్కువవుతుంది. చరిత్ర నిజమైన కవిత్వం. యథార్థమైన సంగతులు సరైన దృష్టితో చూస్తే, కల్పితాలకంటె గంభీరంగా వుంటాయి.

చరిత్రను పూర్తిగా పరిశీలనా దృష్టితో చదివినప్పుడు భూతవర్తమానాలు రెండు సమాన ప్రాధాన్యాన్ని వహిస్తాయి. చరిత్రకారులు గతించిన మానవుని ప్రపంచంలో మునిగి తేలుతుంటారని సామాన్యంగా ప్రజలలో తప్పుడు అభిప్రాయం ఒకటి వుంటోంది. కాని నిజంగా చరిత్రకారులకు రూపంలేని యీ గతించిన వ్యక్తులే ఆకారాల్ని, భావాల్ని, ఉద్వేగాల్ని పొందుతారు. వారి దైనందిన జీవితంలోని విషయాలను సమగ్రంగా తెలిసికోటానికి చరిత్రను జాగ్రత్తతో చదవవలసి వుంటుంది. వారివృత్తులు, వారిఅలవాట్లు తెలిసికొనేటప్పుడు ఆకాలపు వ్యవసాయదారుడెంత ముఖ్యమో, భర్తరాకకోసం వేచివుండి అతనివద్దనుండి వూరిలోని వార్తలను వినాలని కుతూహలంగావుండే గృహిణికూడ అంతముఖ్యమని చెప్పాలి. ఒక యుగంలోని పద్ధతులు, నాగరకత ఆకాలపు మనుష్యులకే తెలియకపోవచ్చు. అందుచేతనే చరిత్రరచయితలపై గొప్ప భారంవుంది. గతించిన యుగాలలోని నాగరకతలోని కొన్నిగుణాల నర్థవంతంగా చేసే బాధ్యత వారిది. ఆచారా లెప్పుడు ఒకమాదిరిగా ఉండవు. సంఘానికి పునర్జీవితాన్ని కలుగచేయు యీ మార్పులవిధానాన్ని, సంఘంలోని వ్యక్తులందీ మార్పులవలన గలిగిన ఫలితాలు మున్నగునవి తెలిసికొనవలసి వుంటుంది.

తన పూర్వుల జీవితాన్ని అర్థంచేసికొన్నప్పుడే మానవుడు తన నాగరకతను తెలిసికొంటాడు. ఆ జ్ఞానమే నాగరికులైనటువంటి, అనాగరికులైనటువంటి మానవులలోని భేదాన్ని వ్యక్తపరుస్తుంది. మరచిపోయిన మన పూర్వులచరిత్ర క్షుణ్ణంగా తెలిసికోటం సామాన్య విషయంకాదు. ఓడలను నిర్మించి సముద్రాలపై ప్రయాణంసాధ్యంచేయటంకంటె అసాధ్యమైందని చెప్పవచ్చు. చారిత్రిక దృష్టి సాధించుటకు సత్యం అవసరం. కవితాదృష్టి మూలాధారం. కనుకనే చరిత్రయందు విజ్ఞానదృష్టి, సాహిత్యదృష్టి మిళితమై వున్నాయి. అంటే విజ్ఞానానికి ఆధారమైన యథార్థవిషయాలనే చరిత్ర కూడ సంగ్రహిస్తుంది. అంతటితో చరిత్రకు జీవం చేకూరదు. మానవుని జీవితం భావంతం చేయాలంటే చరిత్ర యీ యథార్థవిషయాలను మెరుగుపెట్టాలి. అందుకు చరిత్రకారుడు కవి హృదయాన్ని కలిగివుండాలి.

సాంఘికచరిత్రలోని అందం యిదే. మానవజీవితం యింతవరకు ఎన్నోయుగాల నావరించుకొంది. ఇంకా ఎన్నో యుగాలవరకు సాగిపోతుంది. ప్రస్తుత నాగరకతను అర్థంచేసుకోటానికిగాని, రాబోవు నాగరకతా విధానాన్ని నిర్ణయించటానికిగాని మానవుని పూర్వచరిత్ర— ముఖ్యంగా సాంఘికదృక్పథంనుండి— స్పష్టంగా తెలిసికోవాలి.

(ఆధారం: G. M. Trevelyan)




( క్రిందటి సంచిక తరువాయి )

ముమ్మడిబల్లాళునితో హొయ్సల రాజ్యము తుదముట్టినది. కన్ననూరు కుప్పరణక్షేత్రమున నతని సైన్యము సర్వనాశనమైనది; అతని చెఱవలన బొక్కసము శూన్యమైనది; కారణముచే రాష్ట్రమనాథమైనది. మరణానంతర మతని కుమారుడు విరూపాక్ష బల్లాళుడు రాజ్యాధిపతియై క్రీ. శ. ౧౩౪౩ వ సంవత్సరమున బట్టాభిషేకము జేసికొనెను; కాని యతనికి బలములేదు; కోశములేదు; నిర్వాహకత చాలదు. శత్రుబాధలేకపోయిన నతడును దన పెద్దలవలె రాజ్యము జేసియుండును. కాని రాజ్యమునకు సంభవించిన విపత్తు సాధారణఱచుకొని కొందరు నాయకులును సామంతులును ద్రోహము సేయగడగిరి. వారితో సఖ్యము జేసికొని హొయ్సల రాజ్యాక్రమణ కదియె యనుకూలసమయమని తలచి విజయనగర రాయలెత్తి వచ్చెను. విరూపాక్ష బల్లాళుడు రాష్ట్రసంరక్షణకేమి కట్టుబాట్లు చేసెనో తెలియదు. హొయ్సలరాజ్యములో నూటికిమించిన సంఖ్యగల పట్టణములను దాను జయించి శత్రువుల యధికారమును దొలగించి విడిపించితినని బుక్కరాయలు దన శాసనములందు జెప్పుకొనియుండుటచేత దేశము విజయనగరము వారికి సులభముగ స్వాధీనపడలేదని తెల్లమగుచున్నది. హొయ్సల దళము లేకమై రాజ్యసంరక్షణకు బ్రయత్నపడకున్నను అడుగడుగునకును కర్ణాటకులు విజయనగర సైన్యముల నరికట్టుచుండిరి. కాని ప్రయోజనము లేకపోయెను. విరూపాక్ష బల్లాళుని పట్టాభిషేకము జరిగిన మూడు మాసములలోపల హొయ్సల రాజధాని ద్వారసముద్రము బుక్కరాయలకు స్వాధీనమైనది. రాష్ట్రమంతయు వశపడుటకు మఱి మూడేండ్లు పట్టినవి. హొయ్సల రాజ్యముతోపాటు తుళువ దేశముగూడ రాయల యేలుబడి క్రిందికి వచ్చినది. ఇట్లు హొయ్సల తుళురాజ్యములను సాధించిన పిమ్మట క్రీ.శ.౧౩౪౬ వ సంవత్సర మార్చి ౧౮ ది నాడు హరిహరరాయలు శృంగేరియందు విద్యాతీర్థ శ్రీపాదుల యధ్యక్షతక్రింద విజయోత్సవము సల్పెను. ఆ యుత్సవకాలమున నచటికి హరిహరరాయలును అతని తమ్ములును కుమాళ్లును అల్లుండ్లును సామంతాది సమస్త నియోగివర్గమును వచ్చిరి. హరిహరరాయలు పెక్కు దానముల నిచ్చెను. పైజెప్పిన విజయముల మూలమున రాయరాజ్యము విశేషముగ పెంపొంది, పూర్వసముద్రము మొదలు పశ్చిమ సముద్రము వఱకును వ్యాపించెను. హరిహరరాయల పట్టాభిషేక కాలమున చిన్న సంస్థానమైయుండిన విజయనగరము మఱి పది యేండ్లకు విస్తారమగు రాజ్యమై మారెను. హరిహరరాయలు పూర్వ పశ్చిమ సముద్రాధిపతి యాయెను.

మధురసుల్తానుపై దండయాత్ర:— హొయ్సలరాజ్య ధ్వంసమువలన విజయనగర రాయలకు సంప్రాప్తమైనది వారి యేలుబడి యందుండిన రాష్ట్రమొక్కటియేకాదు; రాష్ట్రముతోగూడ బల్లాళ రాయల యాశయములును నన్యరాష్ట్రములతోడి వారి సంబంధ బాంధవ్యములును సంక్రమించినవి. దాక్షిణాత్యహిందువులకు నాయకుడైన ముమ్మడిబల్లాళుడు హిందూ స్వాతంత్ర్యపునఃప్రతిష్ఠకై మధుర సుల్తానుతో బోరుచు రణరంగమున నిహతుడాయెకదా. ఆ యుద్దేశముతోడనే నూతన హిందూసామ్రాజ్య

ప్రతిష్ఠకు గడగిన విజయనగరరాయల కాతని ప్రయత్నమును గొనసాగించుట యవశ్యము కర్తవ్యమాయెను. మఱియు బల్లాళరాయని మరణానంతరము ద్రావిడదేశమున మహమ్మదీయుల యాటోపము హెచ్చెను; సంబువరాయలు మధురసుల్తానుతో యుద్ధమున నోడి బందీకృతుఁడాయెను; తొండమండలమంతయును మరల మహమ్మదీయు లాక్రమించుకొనుటకు సిద్ధమైయుండిరి. కావున హరిహరరాయలు ద్రావిడదేశ హిందూజన సంరక్షణకొఱకు మధురసుల్తానుపై దండు పెట్టవలసివచ్చెను.

ఈ దండయాత్ర వృత్తాంత మంత విశదముగ దెలియదు; కాని ముఖ్యాంశములు స్పష్టముగ విదితమగుచున్నవి. దీనికి ముఖ్యసేనాధిపతి బుక్కరాయల పుత్రుడు కుమారకంపణ్ణ. సైన్యమంతయును నేకవాహినిగ నడువలేదు; రెండు పాయలై సాగినది. ఒకటి పశ్చిమోత్తరమున కుమారకంపణ్ణ నాయకత్వము క్రింద ముల్బాగలు నుండి బయలువెడలి తూర్పుకనుమలలోని లోయ మార్గములగుండ కూచి చేసిపోయి తిరువణ్ణామల ప్రాంతమున విడిసెను; అచటినుండి కుమారకంపణ తమ్ముడు సావణ కొంత దండుతో బయలుదేరి చోళదేశమును జొచ్చి కరూరు ప్రాంతసీమల నాక్రమించుకొనెను. మఱియొకటి యుత్తరమున నుదయగిరినుండి మొదటి కంపణ్ణ కుమారుడగు వీరసావణ్ణ యాధిపత్యముక్రింద తీరదేశముగుండ కంచిమీదుగ నడచిపోయి చోళమండలము బ్రవేశించి తంజావూరు ప్రాంతభూముల నాక్రమించుకొనెను. విజయనగర సైన్యముల రాకను విని సుల్తాను దన సైన్యములను గూర్చుకొని వారి నెదిరించి తఱిమివేయుటకొఱకు వచ్చెను; ఉదయగిరి సైన్యములతో నతనికి భీమసంగ్రామము నడచినది. ఉదయగిరి సామంతులలో బ్రముఖుడైన సాళువమంగి పరాక్రమమువలన మధురసేన పరాజయము నందెను; సుల్తాను బందీకృతుడాయెను; సాంబువరాయలు చెఱనుండి విముక్తుడై వీరసావణ్ణ సాళువమంగుల సహాయమువలన కుమారకంపణ యనుగ్రహమును బాత్రుడై నిజరాజ్యమున సుప్రతిష్ఠితుడాయెను. ఈ కారణమున వీరసావణ్ణయును సాళువమంగియును సాంబువరాయ స్థాపనాచార్య యను బిరుదును బడసిరి.

మధురపై దండయాత్ర ఇట్లు జయప్రదముగ కొనసాగినది. సుల్తాను యుద్ధమున బరాజితుడగుటయేగాక శత్రువులచే బట్టుపడి చెఱసాల జిక్కెను. మధుర మహమ్మదీయరాజ్య మనాథయైనది. అమీరు లొండొరులతో గలహింపుచుండిరి. రాజ్యస్థితి యిట్లరాజకమై విజిగీషాపరులైన శత్రువుల జైత్రయాత్రాప్రయత్నముల కనుకూలమై యుండినను తురక దొరతనమును గూలద్రోసి హిందువుల యధికారమును మరల నెలకొల్పుటకు వలనుపడలేదు. దీనికి ముఖ్యకారణము భారతీయ రాజకీయ వాతావరణమున గలిగిన మార్పు. క్రీ. శ. ౧౩౫౧ వ సంవత్సరమున ఢిల్లీ సుల్తాను మహమ్మదు బిన్ తుఘ్లాకు పరలోకగతుడాయెను. అతనికి సంతతి లేకపోవుటవలన నతనియనంతరము నతని జ్ఞాతి ఫిరోజుశాహు తుఘ్లాకు ఢిల్లీ సింహాసనము నధిష్ఠించెను. ఫిరోజుశాహు సుల్తాను మహమ్మదువలె యుద్ధప్రియుడు గాడు; అంతటి మహావీరుడు శక్తిసామర్థ్యములు గల దళనాయకుడును గాడు. కాని నష్టమైపోయిన సామ్రాజ్య భాగములను మరల సాధింపవలయునన్న యాసమాత్ర మాతని విడువలేదు. కావున ఢిల్లీ సామ్రాజ్యపీఠముపై సుస్థిరుడై నెలకొనిన తరువాత దక్షిణ హిందూస్థానమున నూతనరాజ్యములను బాలించిన ప్రభువుల కందఱికిని దన యాధిపత్యము నంగీకరించి కప్పము గట్టవలసినదని ఫర్మానాల నంపెను. అట్టి ఫర్మానా యొకటి మధురకు క్రీ. శ. ౧౩౫౩ వ సంవత్సరమున జేరినది. అప్పటికే మధుర సుల్తాను విజయనగర సైన్యముచే బట్టుపడి చెఱపోయి యుండుటచే నమీరులందఱేకమై యోచనచేసి ఢిల్లీసుల్తాను ఫర్మానాను దిరస్కరించి పంపివేసిరి. కాని వారికి బెదురుగల్గినది. ఫిరోజుశాహు తమ రాజ్యమును జయించుటకు బ్రత్యక్షముగనో గూఢముగనో ప్రయత్నము సేయునన్న శంక వారి హృదయములందు నాటినది. అదియట్లుండగా విజయనగరసైన్యము లేనిమిషమునైన దమపైబడి పూర్ణహాని సేయగలవని వారికి నిశ్చయమైనది. ఈవిపత్సమయమున శత్రువులను నిగ్రహించి తమ యధికారమును నిల్పు

గల సాయము డెవ్వడును దమవారిలో గాన రాలేదు. ఇక తమకు రక్షణకలుగు మార్గమెద్ది? యని చింతింపగడగిరి. వారిదృష్టి దేవగిరిపై పునకు బారినది. సుల్తాన్ అల్లావుద్దీన్ గంగూ తమ శత్రులకు శత్రుడు. కావున అతడు తమకు సహజ మిత్రుడు. అతని నాశ్రయించిన తమకు గల్గియుండు కష్టములను తరించి గట్టెక్కుటకు సాధనము దొరుకకపోదని వారు నిశ్చయించి, తమలో ముఖ్యులైన వారిని దేవగిరికి రాయబార మంపిరి. సుల్తాన్ అల్లావుద్దీను వారి యెడ సుముఖుడై రాయబారమును జిత్తగించి వారితోడి సఖ్యమున కొడంబడెను. మధుర మహమ్మదీయులతో స్నేహముదనకు లాభకారియని యతడెఱుగును. విజయనగరరాయల యధికార మనుదిన మతిశయించుచుండెను; హొయ్సలులను జయించికర్ణాటకమును పలురాజ్యములనుగబళించిరి. హొన్నావురు సుల్తాను వారి కాశ్రితుడు; క్రీ. శ ౧౩౪౭ వ సంవత్సరమున హరిహరరాయల సైన్యము లతనితమ్ముడు మారపనాయకత్వమున చంద్రగుప్తినుండి బయలువెడలి వనవాసి కదంబరాజ్యము జయించి స్వాధీనపఱచుకొనెను. తన పురోవృద్ధికి వారి ప్రాబల్యమును దగ్గించుట యత్యంతావశ్యకము. క్రీ. శ ౧౩౪౫ వ సంవత్సరమున దన పట్టాభిషేకమైన మరుసటి వర్షమున నొకదండయాత్రను విజయనగర గడిదేశముపై సాగించియున్నను, నందువలన దనకు విశేష లాభముగలిగినదికాదు. మధుర వారితో సఖ్యము గుదుర్చుకొనిన విజయనగరరాయలతో యుద్ధమున వారు సహాయ భూతులు కాగలరు. కావున అల్లావుద్దీన్ వారిరాయబారము నంగీకరించి తన యల్లుని (కుర్బతె హాసన్ గంగూను) మధురకు సుల్తానుగ నియమించి యచటికంపి, మధురపై నడచుచుండు విజయనగర దండయాత్ర నాపుటకొఱకు సైన్యములతో దేవగిరినుండి బయలువెడలి కృష్ణాతుంగభద్రలయంతర్వేదిపై గూచి చేసెను. హరిహరరాయలకు మహమ్మదీయులతో నుభయపార్శ్వములనుండియు నేక కాలమున యుద్ధము సేయుట భరమాయెను. కావున మధుర దండయాత్రను దాత్కాలికముగనాపి, మధుర తురకలకంటె బలాధికుడైన బహమనీ సుల్తానుతో బోరాటము సేయుటకే తన యావచ్ఛక్తిని వినియోగించెను. ఈ యుద్ధవృత్తాంతము మన కింకను స్పష్టముగ దెలియరాదు. సుల్తాను అల్లావుద్దీను హాసన్ గంగూ విజయనగరరాయల నోడించి తుంగభద్రపర్యంతముగల రాష్ట్రమును స్వాధీనము జేసికొనెనని మహమ్మదీయ చరిత్రకారులు వ్రాసియున్నారు. విజయనగర శాసనము లందు హరిహరరాయలు సుల్తాను నోడించి విజయుండాయెనని చెప్పియున్నది హైదరాబాదురాజ్యములోని శాసనములన్నియు ప్రకటింపబడిన గాని ఈ యుద్ధమెట్లు తుదముట్టినదియు నిర్ధారించుటకు వీలులేదు; కాని కృష్ణా తుంగభద్రల యంతర్వేది యంతయు గాకపోయినను జాల భాగమునైనను హరిహరరాయలు గోలుపోయిన ట్లున్నది.

ఈ యుద్ధము జరుగుచుండగనో లేక యది ముగిసిన తరువాత అల్పకాలమునకో హరిహర రాయలు దేహము చాలించెను. ఇతని మరణము క్రీ. శ. ౧౩౫౫ న సంభవించెనని చరిత్రకారుల యభిప్రాయము; కాని యుండిపియందొక శాసనమున నితడు శా. శ. ౧౨౭౭ నకు సరియైన దుర్ముఖావర్ష ఫాల్గుణ శుక్లపక్షము నందింకను రాజ్యము సేయుచుండినట్లు చెప్ప యుండుటవలన క్రీ. శ. ౧౩౫౭ వ సంవత్సరమున నితడు సజీవుడై యుండెనని తెలియుచున్నది.

పట్టాభిషేకము జేసికొనిన పిమ్మట హరిహర రాయలిరువదేండ్లు విజయనగరమును పాలించెను. చరమదశయందు కృష్ణాతుంగభద్రాంతర్వేదియందును నంతకెంక నుత్తరమందును గొంత రాష్ట్రము నష్టమయిపోయినను హరిహరరాయల రాజ్యారంభమున జిన్న సంస్థానముగ నుండిన విజయనగరము తూర్పు పశ్చిమ సముద్ర తీరముల దాకు విస్తారరాజ్యమై యభివృద్ధి నందినది. ఈ యభివృద్ధియంతయు హరిహరరాయల మూలముననే కలిగినదని యెంచరాదు. రాజ్య సంపాదనయందును ప్రజాపాలనయందును అతని సోదరులును వారి పుత్రులును అతనికి దోడ్పడిరి. మొదటి తమ్ముడు కంపణ, క్రీ. శ. ౧౩౪౩ వ సంవత్సరమున ఉదయగిరికి రాజ్యాధిపతిగ నియమింపబడెను. ఇతడు క్రీ. శ. ౧౩౫౪ వ సంవత్సరము వఱకును నా రాజ్యవ్యవహారములను విచారింపుచుండి కాలధర్మము నందెను. ఇతనికి వేద

భాష్యకర్త సాయణమాధవాచార్యుల తమ్ముడు సాయణాచార్యులు మంత్రియై కార్యమునందును ఖడ్గమునందును దోర్దైయుండెను. కంపణకు పుత్రులిద్దఱు కలరు. పెద్దవాడు వీరకావణ్ణ. క్రీ.శ. ౧౩౪౬ వ సంవత్సరమునుండి తండ్రికి రాజకార్యనిర్వహణయందు తోడై దళనాయకుడై యుండెను; క్రీ. శ. ౧౩౫౭ వ సంవత్సరమున కుమార కంపణకు ప్రాపుగ మధురపై దండయాత్రను నడపెను. రెండవ వాడిమ్మడి సంగముడు. ఇతడు సాయణాచార్యుల శిష్యుడు. తండ్రి మరణానంతరము దనయన్నతో గూడ నీత డుదయగిరి రాజ్యమును గొంతకాలము పాలించెను. హరిహరరాయల రెండవ తమ్ముడు బుక్కరాయలు. ఇతడేరాజ్యాభివృద్ధికి ముఖ్యకారకుడు. శాసనములందితడు పాండవమధ్యముని వంటివాడని ప్రశంసింపబడి యున్నాడు. ఆద్యమునుండియు నితడు శ్రీరామునికి సౌమిత్రివలె తోడునీడయై సంచరింపుచు సర్వకార్యములందును చేదోడు వాదోడై మెలగుచుండెను. మొట్టమొదట నితడుదయగిరిని జయించెను; అచట దన కుమారుని విరూపణ్ణను పాలకునిగ నియమించి, హొయ్సల రాజ్యగడిప్రదేశమున గలహముపుట్టగా నచటికి బోయి పెనుగొండను సాధించెను. తరువాత క్రీ. శ. ౧౩౪౩ వ సంవత్సరమున హొయ్సల రాజ్యముపై నెత్తిపోవుచు విరూపణ్ణ నుదయగిరి నుండి పిలువనంపి పెనుగొండ నతని కప్పగించి దిగ్విజయయాత్ర వెడలెను. క్రీ. శ. ౧౩౪౩-౧౩౪౬ ల మధ్య హొయ్సల రాజ్యమును సంపూర్ణముగ జయించి స్వాధీనపఱచుకొనెను. కొంతకాలము బుక్కరాయలు యౌవరాజ్యపదము నధిష్ఠించెను; తరువాత రాయ పదమును బడసి హరిహరరాయలతో గలసి రాజ్యపాలన మొనర్చెను. బుక్కరాయలకు పుత్రులు పలువురు గలిగిరి. విరూపణ్ణ కుమారకంపణ్ణ లింతకుముందు పేర్కొనబడి యున్నారు. వీరుగాక హరిహర భాస్కర భవదూర సాయణలు సుప్రసిద్ధులు. అందఱును రాజ్యాభివృద్ధికి నిరంతరము కృషిసేయుచు దమ తండ్రికి సర్వకాలములందును ననుకూలురై తోడ్పడుచుండిరి.

బుక్కరాయలకు వెనుకటివాడు మారపు. ఇతడు మొదట చంద్రగుప్తిరాజ్యమును బాలించుచుండెను. తాను హరిహరరాయలక్రింద యువరాజుగ నుంటినని యితడు చెప్పుకొనియున్నాడు. ఇది బుక్కరాయలు రాయపదమును బొందిన పిమ్మటనై యుండవచ్చును. మారపు క్రీ. శ. ౧౩౪౬ ప్రాంతమున దండువెడలిపోయి వనవాసికదంబరాజ్యమును జయించెను. ఇతనికి చౌండప మాధవుడు మంత్రియు సేనాధిపతియునై యుండి రాజ్యపాలనమందును రణరంగమందును సహాయభూతుడై యుండెను. మాధవమంత్రి గొప్ప విద్వాంసుడు. మతముచే నతడు శైవుడు. కాశీవిలాసక్రియాశక్తి శిష్యుడు. ఆగమములాతనికి కరతలామలకములు. శైవమును బ్రచురించుటకొఱకతడు సూతసంహితకు వ్యాఖ్యానమును రచించెను.

హరిహరరాయల కడగొట్టు తమ్ముడు ముద్దప. ఇతని చరిత్ర మనకేమియు దెలియదు. హరిహరరాయలతో గూడ నితడు ములుబాగలు రాజ్యమును బాలించుచుండిన ట్లొకానొక శాసనమందు జెప్పియున్నది.

పై జేర్కొనిన తమ్ములును వారి పుత్రులును అనుచరులును గాక హరిహరరాయలకు రాజ్యపాలనయం దనేకులు మిత్రులు హితులు మంత్రులు మున్నగువారు తోడ్పడియున్నారు. వీరియం దగ్రగణ్యుడు విద్యారణ్యస్వామి. బుక్కరాయలకు ఉదయగిరిని జయించుటకు సహాయభూతుడై యుండిన సాయణ మాధవాచార్యులే సన్యసించినపిమ్మట విద్యారణ్యులను నామము ధరించిరనియు, గావున మాధవాచార్యులును విద్యారణ్యులును నేక పురుషులే కాని భిన్నవ్యక్తులు గారనియు ప్రాచీన కాలమునుండియు నొక ఇతిహాసము పరంపరగవచ్చుచున్నది. మాధవాచార్యులచే విరచితములైన పరాశరమాధవీయాది గ్రంథములయందు దేవేంద్రునికి బృహస్పతి యెట్లో తానునట్లే బుక్కరాయలకు కులగురువునని చెప్పియున్నాడు. విజయనగరస్థాపనయందు సంగమ రాజపుత్రులకు మాధవ విద్యారణ్యస్వాములవారొనర్చిన మేలింతకుముందే వర్ణింపబడియున్నది. రాజ్యస్థాపనతో దనకార్యమంతయు సంపూర్ణముగ ముగిసినదని యాయన

యనుకొనలేదు. ప్రారంభదశయందు మాధవ విద్యారణ్యులు విజయనగర సంస్థానమును గంటిని రెప్పవలె సంరక్షించుచుండెను. కాని రాష్ట్ర పాలనయం దాయన అవంతయేనియు జోక్యము కలిగించుకొనలేదు. మంత్రమాత్ర సహాయుడు. ధర్మోద్ధరణ మెట్లు సేయవలయునో, రాజ్యము నెట్లభివృద్ధినందింపవలయునో, రాజధర్మ మెట్టిదో తెలియజెప్పుచు సంగమ రాజపుత్రులకు ఆయన మార్గదర్శకుడాయెను. మఱియు వైదిక ధర్మపున రుద్ధారణ క్షత్రియులగువారిముఖ్యధర్మమని తెలియ జెప్పి మ్లేచ్ఛదోషావసన్నమై మాసిపోవుచుండిన ఆర్యధర్మమును మరల నెలకొల్పి హిందూ మతమునకును సంస్కృతికిని యమూల్య మయిన సేవయొనర్చి సంగమరాజపుత్రుల కీర్తిని ఆచంద్రార్కతారకస్థాయిగ నిలిపెను. మాధవ విద్యారణ్యుల వారికి మహోద్యమమున నాతని యనుజన్ముడు సాయణాచార్యులవారు తోడ్పడిరి.

సాయణాచార్యులు వేదవేదాంగపారంగతుడు. సర్వశాస్త్ర విశారదుడు. ధనుర్వేదకుశలుడు. వేదార్థమును విశదీకరించుట కాయన వేదములకన్నిటికి వ్యాఖ్యానమును రచించెను. ఈ కార్యమునందు దాక్షిణాత్య విద్వాంసు లనేకులాయనకు దోడ్పడిరి. సాయణ పుత్రులకృషివలన వైదిక ధర్మము మరల భరతఖండమున నెలకొన్నది. వీరి ప్రోత్సాహమువలన విద్వాంసులును శాస్త్రజ్ఞులును పెక్కు ప్రాచీనవైదిక శాస్త్రగ్రంథములకు వ్యాఖ్యానములను వ్రాయుటయేగాక నూతన గ్రంథరచనకు గడగిరి. వారి యునికివలన విజయనగరము వాస్తవముగ విద్యానగర మాయెను.

మాధవ విద్యారణ్యుల తరువాత పెన్నదగిన వాడు చంద్రభూషణ క్రియాశక్తి. ఈయన క్రియాశక్తి గురుపీఠమున కధిపతి. రాజకుటుంబమునం దనేకు లీతనికడ శైవదీక్షను బుచ్చుకున్న శిష్యులే. చంద్రభూషణాచార్యుడు వేదములతో పాటు శైవాగమములన్నిటిని మథించి యందలిసారమును విశ్లేషముగ గ్రోలిన మహామహుడు. కళానిధి. ఆయన యెఱుగని శాస్త్రము లేదు. మతవిషయము లందును విద్యావిషయములందును చంద్రభూషణాచార్యులవారి యభిప్రాయములు సమకాలికుల కాదరపాత్రములై యుండెను.

హరిహరరాయల కాలమునను తరువాతను రాజ్యపాలనమందు దోడ్పడిన మంత్రులు పెక్కండ్రు గలరు. వీరిలో ముఖ్యుడు అనంతరసు. ఇతడు ఆంధ్ర నంద వైదిక బ్రాహ్మణుడు. రాష్ట్రమును పాలనా సౌకర్యార్థము సీమలు నాడులు స్థలములుగ విభజించి, కర్ణికమిరాసుల నేర్పఱచి, కావలికట్టుబాట్లు గావించి, పాలనను జక్కని పద్ధతులమీద నడపుటయందు హరిహర రాయల కితడు కుడిచేయివలెనుండి జేసెను. మఱియు నితడు కృషీవలుల మేలుగోరి వ్యవసాయమునకు వలసిన జలమునకు గొదవగానీకుండ పెక్కు చెఱువుల ద్రవ్వించెను. ఇతని సేవకు మెచ్చి హరిహరరాయ లితనికి దన యాస్థానమున సర్వశిరః ప్రధానుని పదమిచ్చి చిక్క ఉదయలను బిరుదమిచ్చెను.

(సశేషము)




సత్యం : ఒకగీతం!

మధు : ఊహూ.

సత్యం : పాడవూ! బ్రతిమాలుతున్నాను.

మధు : ఊహూ.

సత్యం : ఏమిటీ! ఎన్నిసార్లని అడిగేను! ఒకపాట పాడకూడదూ! కల్పసుమంలాంటి నీకెంపు పెదవులు కదిలితే: ఆ కోమల పెదవుల లోనుంచి సన్నటి మధురగానం వినవస్తే నాకెంత ఉత్సాహం! ఎంత ఆనందం! పాడవూ మధూ.

మధు: పాడను. ఒకపాటయినా రాదు, యీ హృదయకాంతిలో పాడాలంటే నా కసలు పాటే రాదు.

సత్యం : రాదూ!

మధు : నిజంగా రాదు.

సత్యం : మరి మనవూరి పడమటికొండమీద కూర్చుని—సాయంత్రం చెట్లు పొడుగ్గా నీడలు చాపుకని-కొండనీడ దేవాలయశిఖరంమీద పడుతుందీ, అప్పుడు మన దేవాలయపు ధ్వజస్తంభం చివరి గంటలు మందంగా జోకొడు తూంటవీ—

అప్పుడు నిన్నెవ్వరూ యీ పాట పాడు, అది పాడు అనకుండానే నీ యిష్టం వచ్చినట్లు పాడ తావు. నేను ఎప్పు డడిగినా పాడవు! ఏం.

మధు: అవును అదే చిత్రం-నేను పాడాలను కొన్నా సరే ఒక్కొక్కప్పుడు నాకే పాటా రాదు. ఎవరో బలవంతంగా నన్ను పాడనివ్వన ట్లుంటుంది.

సత్యం: అయితే కాని మధూ! నీ కన్ని పాటలు అంత శ్రావ్యంగా ఎలా వస్తాయి! నీ కెవరు నేర్పుతారు?

మధు: నా కెవరు నేర్పుతారు? నా కెవరి తోనూ మాట్లాడాలని వుండదు అసలు. ఊరికే ఏవో ఆలోచిస్తూ, నీ పెదవులమీది మందహాసం నీ చెక్కిళ్ళ నునుపు ఎప్పుడూ చూస్తూవుండాలని వుంటుంది. ఇంకా నీ కళ్ళలోని తేజస్సు ఎప్పుడూ నాకోసం వెతుక్కున్నట్లు భావించుకొంటే ఎంతో బాగుంటుంది. అవును కాని, నీ పెదవుల మీది నిరంతర మందహాసం నీ కెవరిచ్చారు?

సత్యం: ఎవరిచ్చారో చెప్పనా? ఎవరో?-ఎవరో?- నీకు అన్ని పాటలు ఎవరు నేర్పారో వారు! నిత్యం రోజూరోజూ ఉదయమనక సాయంత్రమనక ఎప్పుడూ నాదగ్గరకి ఎవరు పంపుతారో వారు!

మధు: కానీ సత్యం! ఒక్కొకపుడు నీ పాదాలు నా హృదయానికి హత్తుకోవా లను కుంటాను. జన్మజన్మలకీ నీకు కృతజ్ఞురాలనుగా వుండాలి అనుకుంటాను. నీకు 'మధు' అంటే జన్మలకీ అలాంటి సంబంధం యిష్టమేనా?

సత్యం: ఇష్టంకదూ! మధూ! ఇష్టం! ఇష్టం! ఇష్టంకంటె ఎక్కువైన యిష్టం!-

మధు: నేను స్వర్గంలోవున్నా యింత ఆనందం పొందివుండను. నీ సముఖంలో స్వర్గం అనుభవిస్తున్నా. రా- దగ్గరగా రా- సత్యం-పాట కతీతమైన ఆనందం, సౌఖ్యం పొందు తున్నా నిప్పుడు. ఇప్పుడు ఏపాట పాడినా వెలితిగానే కనబడుతుంది నాకు. నీ ప్రేమ అనే గానంలో మునిగిపోతున్నా!

సత్యం: ఇంత సుందరమైన  ...ంటే! ఊహించుకోనయినా లేదు. ఎందుకు  పాటలు?

మధు: నీ విశాలమైన వక్షస్థలానికి నా శిరస్సు చేరుస్తున్నాను.

సత్యం: లభ్యంకాని నీ శిరస్సూ, అనుమాన మైన నీ నేత్రాలు, సాటిలేని నీ బుజాలు వరు సగా ముద్దులతో- అభిషేకం చేస్తున్నాను.

మధు: అణచరాని, అర్థంగాని ఒక శక్తి నీకు హత్తుకుపొమ్మని చెపుతూంది నాకు. సత్యం! యింకా గట్టిగా నలిపివెయ్యి నీ కౌగిలిలో-

సత్యం: (అరమూతలు పడ్డ 'మధు' పెద వులపై ముద్దు పెట్టుకుంటు) మధూ! నువ్వే నేను! నేనే నువ్వు!

[ తెర ]

2

మధు: నీలో కలసిపోయాను.

సత్యం: నీలో కలసిపోయాను.

మధు:

పొడుపుకొండపై
మిల మిల మెరిసే
అరుణకాంతిలో
జీవకళలలా
మెరిసిపోదాములే!
కడలిగర్భమున
వినీలకాంతిలా
కలసిపోదాములే!

సత్య: నిర్మల గంగా ప్రవాహినిలాగుంది నీ వాక్కు.

మధు: గంభీరమైన కడలికీ నీకూ సామ్యం వుంది.

సత్యం: ఏ తృష్ణా ఏకాంక్షా లేకుండా నీ కంకితంచేసుకున్నాను జీవితం.

మధు: ఏ పూర్వపుణ్యంవల్లనో నీలోనికి చేర్చుకున్నావు.

సత్యం: నాకు కావలసినది ఏమీలేదిక— నీతో ఆకాశ వీధిలోని కెగిరిపోవటం తప్ప.

మధు: అమృతంచేత పునర్జీవి నైనట్లు ...శ్వంలో, ప్రేమలో, అగ్నిలో ఆహుతిలో, ఆకాశములో తేజస్సులో గోచ

శించే గంభీరత నీకండ్లలోనూ కనబడుతూంది యిప్పుడు-

మధు : కళాశిల్పివైన నిన్ను నా తలపులలో మగ్నము చేసి, నా హృదయ సింహాసనమున నధిష్ఠితుని చేసి, నా కన్నులలో నింపుకున్నాను. అదే వాటి తేజస్సు.

సత్యం : సత్యమును పెనవేసికొన్న నీ జీవితమును చుట్టివేసి నిన్నలము కొంటాను.

మధు : తల్లి 'పాప'ను కౌగిలించినట్లు.

# 3

మధు : ఎవరు నీవు!

సత్యం : నీ వెరుగవా ?

మధు : ప్రేమవిహంగము రెక్కలు చప్పుడు చేయకుండా ఆకాశంనుండి దిగివచ్చినపుడు—నువ్వు దానిపై నెక్కి వచ్చావా! అప్పుడు నాకు కనపడలేదేం ? నువ్వా ! నిన్ను నే నెరుగుదును. నేను పుట్టినప్పటినుండీ ఎరుగుదును. అంతేకాదు- అది సరికాదు- జన్మాంతరముల నుండీ ఎరుగుదును.

సత్యం : తెలుసుండీ ప్రశ్నలు వేసేవారి కేవరు చెపుతారు ?

మధు : ఎవ్వరూ చెప్పరా ?

సత్యం : చెపుతారా ?

మధు : ఏమో ! ఎందుకు చెప్పకూడదు ? విశ్వంలో నాకు తెలిసిన ప్రతి సుందరవస్తువునూ మళ్ళీ మళ్ళీ ప్రశ్నిస్తాను- మళ్ళీ మళ్ళీ సమాధానం పొందుతాను.

సత్యం : నేనూ సుందరవస్తువులలోని ఒక వస్తువునా ?

మధు : కాకేమి ?- నీ సౌందర్యము నన్ను హత్తుకొంటున్నది. చిన్నతనపు చిలిపి చేష్టలు వదలుతూన్న కురంగరాజు విహరించేటప్పటి సౌందర్యమును జ్ఞప్తికితెచ్చే నువ్వు—

సత్యం : అగు !

మధు : ఎందుకు? ఎందుకు నీకా సౌందర్యం? ఎందుకు నాకి లేనిపోని కలత ! ఏమీ లేదబ్బాయి ! ఏమీలేదు! నువ్వే సౌందర్యానివి- చిత్రకళవి- సంగీతానివి- అన్నీ. విశ్వంలోని సమస్త సంతోషమూ, కాంతీ- మరి విజ్ఞానమూ-

సత్యం : అన్నీ నువ్వే-

మధు : నువ్వు సత్యం, సుందరం-

సత్యం : నువ్వు సత్యంకంటె- సుందరంకంటె మధురమైన 'మధు'.

మధు : సత్యం !-

సత్యం : మధూ! నా హృదయం - హృదయంలోని సౌహార్దం.

మధు : నేనాస్థానానికి తగుదునా సత్యం! చెప్పు. ఆవేశంతో- కాంక్షతో-ఆశతో వుండే యీ నేను ఆ స్థానానికి ఎట్లా అర్హత సంపాదించుకోనేది? సత్యం! నిజంగా నన్నుకూడా- పట్టిమనిషిని 'నిర్మలం' చేసివేసే-అచంచలమైన ప్రేమతో నింపేశావు.

సత్యం : నువ్వే—

మధు : కాదు సత్యం! కాదు. నువ్వే చేశా వీ పని-యీ ప్రపంచంలో ఎవ్వరూ చేయలేని ఆ పని చేశావు. అదే చూడు-నేను పట్టి ఆశతో పాపలా నీవొళ్లో నిదురపోవాలి అనుకుంటాను. నీ కళ్లూ, అనంతమైన నీ మనసూ యింకేమీ దర్శించకుండా నాలోనే నిల్పుకోవాలి అనుకుంటూ దురాశతో నిద్రపోతాను. విశ్వమంతా అలముకొని రక్షించే నీ విశాలభావంలో ఏ మూల యిముడగలను?

సత్యం : అదేదో చిత్రం! నువ్వలాగంటావు. నువ్వంటున్నదేమో? అయినా-నిజమే, ఒక్కొకప్పు దనుకుంటాను నువ్వు లేనపుడు 'నేను విశ్వమే అయిపోదాను'-కాని అది సాధ్యమా- ధవళమై జ్వలించే చంద్రుని చూపులోనూ, ధగధగా వెలిగే సూర్యుని తీక్ష్ణతలోనూ వుండే భావమే నీలోనూ చూస్తాను. ఎందుకూ-అంత ఆ వేదనతో అట్లా కుమిలిపోతావు?

మధు : చల్లనైన నీలోని అమృతం తాగి సుఖించేందుకు.

సత్యం : పాపాయి కన్నిమాటలు వచ్చును- కాని ఎందుకంత ముగ్ధగా వుంటాడు?

మధు : అమ్మ మాటలు అమ్మ నోటితో నేర్పితే నేర్చుకోవాలని.

సత్యం : నువ్వా అంతే!

మధు : నేనూ అంతే—

సత్యం : ఏం-ఎందు కలా అయినావు-నీవు 'పాపాయి'వే. నేను అమ్మనా! అదే సందేహం-

నేనే-ఆ మాతృత్వానికి తగిన-ఓ-ఆశక్తే నా కుంటేనా?

మధు : లేదూ? ఉంది, సత్యం. సమస్త శక్తులూ కలిపి నిన్ను చేశారు దేవతలు. భూమి మీద-అదృష్టవంతుల కమృతంలా-నా కిచ్చారు. ఎవరో యిచ్చేశారు, నిన్ను నా కిచ్చేశారు.

సత్యం : ఏమో! మధూ! ఎంత చిత్రంగా మాట్లాడుతావు! నిన్ను మొదటచూచినప్పటి నుంచీ ఏదో జ్ఞప్తికి వస్తూంది నాకు. స్పష్టము కాని ఏదో భావము - అప్పటినుంచీ కలత పెడుతూంది. మధూ! మిత్రులతో, బంధువులతో - లోకంతో పోల్చి చూదామనుకుంటాను నిన్ను- నాకు సాధ్యంకాదు. శిల్పి సృష్టించే బొమ్మనూ, కవి నిర్మించే మహా గీతాన్ని దాటి పోయావు. దేవీ! అమూల్యమగు నీ సౌందర్యమునకు, అపూర్వమగు నీ సౌహార్దమునకు ఏదో కొరత ఉన్నట్లు యీ భయంకరభావము - పిశాచిలా నన్ను వెన్నాడుతుంది. మనః పరిపక్వములేని నావూహాతో నీ గుణరత్నరాశిని విభాగించటం సాహసమే! . ను - ఖిన్నపడకు, నిజమో ఏమో - తోచినప్పుడు చెప్పకోవద్దూ? పోనీ వెళ్ళిపోదామా!

మధు : వద్దు!

సత్యం : చల్లని వెన్నెలలో చిన్నమబ్బులు లెక్కపెడుతూ ఆడుకొందమా?

మధు : ఊఁ హుఁ.

సత్యం : నా ఒళ్లో పడుకో నిచ్చేదా?

మధు : ఊఁ.

సత్యం : రా-యిట్లా దగ్గరగారా యిక్కడకు. వీణ వాయించడం జ్ఞప్తికితెచ్చే నీవ్రేళ్లు ఎంత అందంగా ఉంటాయి మధూ!

మధు . చెప్పు! స్వస్థచిత్తంతో వింటాను. ఇప్పుడు మాట్లాడు. నీ నోటినుండివచ్చే ప్రతి మాట - యీ హృదయకోశంలో దాచుకోవాలని! - నీ దగ్గరేవుంటే ఏమీ భయంలేకుండగా దాచుకోవచ్చును. అవునా?

సత్యం : ఊఁ హూఁ!

మధు : నవ్వుతావేం!

సత్య : మధూ! ప్రేమంటే ఏమిటి చెప్పు!

మధు : చెప్పనా, (సత్యం పెదవి ముద్దుపెట్టుకుని) యిది.

సత్యం : అది ముద్దు.

మధు : ముద్దూప్రేమా ఒకటే!

సత్యం ; ఒకటే! ఒకటా - ఏమో!

మధు : ఒకటే, చూడు - నువ్వు గాఢంగా, మధురంగా యీపళం నీ పెదవులతో తాకినపుడు గులాబీపూవులతో ఒత్తినట్లుంటుంది. ఆనందంతో సోలిపోయి కళ్లుతేలవేసి - అమరత్వంపొందే - అట్లాంటి ప్రేమకదూ! ఇది ప్రేమే - కాదనకు సత్యం! ఇది ప్రేమే.

సత్యం : కాదనటం లేదు.

మధు : ఇంక నిద్రపోదాం -

సత్యం : ఊఁ

(తెర)

౪

మధు : నిన్ను చూస్తేనే నాకు చాలు. పొంగిపోగలను. నీవెందుకలా కలవరపడతావు! నిద్రలోలేచి ప్రశాంతంగా నిద్రించే నీ ముఖం చూస్తునుగదా- చూస్తున్నకొద్దీ- ఆ శాంతిలో ఏదో -అసంతృప్తి-ఊఁ హుఁ అదేదో కల్లోలంలా అగుపడుతుంది. నేనప్పుడు భగ్నమై-భయంతో వణకిపోయి నిన్నే కావిలించుకు-పడుకోబోతాను. నిర్మలమైన రాత్రివేళల యిట్లా ఎన్నిసార్లు నిద్రాభంగం చేశానో?

సత్యం : అదేదో అలవికాని అసంతృప్తి మనల్ని వెన్నాడి చంపుతోంది.

మధు : అసంతృప్తి? నాకలావుండదు. కాని ఏదో పతనమైపోతున్నట్లుంటుంది. అదేదో నాకు తెలియదు. ఏం- అట్లా అయిపోతున్నావేం! ఎందుకూ? వీణవాయించనా! నాపాట శ్రుతిగా కలిపి పాడేదా?-

సత్యం : ఇప్పుడువద్దు మధూ? యీసుందర గానం- యీ విశాలావనిలోని సౌందర్యం నాకు కాదు.

మధు : ఏం సత్యం! అట్లా అయిపోతావు!

సత్యం : అవునుకానిమధూ!—మనం పడుకొనేది ఎక్కడ?

మధు : మేడమీద- యీ గదిలో— యీ తల్పంమీద.

సత్యం : చెబుతున్నా విను. నేను స్వయంగా చూచాను, చెట్లకింద పడుకునేవాళ్ళని. వాళ్ళలా నేనూ-

మధు : (ఆశ్చర్యపడుతుంది)

సత్య : అసలనుకునేవాడిని వాళ్ళలావుందా మని. కాని ఆలోచిస్తే తెలిసింది వాళ్లూ నువ్వూ నేనూ యింతకంటె యింకోకవిధంగా బతకవచ్చునని. అట్లా ఆశ్చర్యపోతావేం? వాళ్ళకీ మనకూ సమానమైన సుఖంగావుండే యిల్లు కట్టుకోవచ్చును.

మధు : మరి ధనం కావాలి?

సత్యం : మన కింత ఎందుకు?

మధు : అంటే?

సత్యం : ఓముగ్ధాదేవీ! అంటే ఏమీలేదు. మనం- అంటే నీవూ నేనూ, బీదలూ, కార్మికులూ కర్షకులూ అంతా మనుష్యులమేనా?

మధు : ఆ—

సత్యం : అందరం గాలి పీలుస్తున్నామా? నీరు త్రాగుతున్నామా?

మధు : గాలి పీలుస్తున్నాం-నీరు త్రాగుతున్నాం-భోజనం చేస్తున్నాం!

సత్యం : లేదు! అది లేదు. భోజనం చేయటంలేదు. కొందరు భోజనం చేయటంలేదు. చేయటానికి తిండి ఏదీ-లేదు-వాళ్ళకి దొరకనివ్వటంలేదు. దొరికితే గాలిలా నీళ్లలా వాడుకొనేవారే-కాని వాళ్లకి తిండిని కొందరు ఎందుకో దొరకనివ్వరు?

మధు : మరి వాళ్లెలా బతుకుతున్నారు-ఓ, ధర్మంవల్ల-కాదా?

సత్యం : ధర్మం-ఏం ధర్మం-వాళ్లు బతకటం లేదు. వాళ్లు బతికేటంత ధర్మ మెవ్వరూ యివ్వరు.

మధు : మరి?

సత్యం : ఏమీలేదు - వాళ్లు చావటానికి మాత్రమే పుట్టారు. వాళ్లు చస్తున్నారు. ఈ ధనికుని-యీ దురాశాపరుని అర్జనావ్యామోహంలోనే వాళ్ల జీవితాలు లయం!

మధు : అంటే?—

సత్యం : అంటేనా? అవసరము లేనంత ధనము పోగుచేసికొని కొన్ని అధర్మ సూత్రాలతో దానిని బంధించి ఆడిస్తున్నారు-కొందరు. ఈ భూదేవి తమ స్వంతం అని దౌర్జన్యంగా ఆక్రమించుకున్నారు.



మధు : అసలది వాళ్ళదా!

సత్యం : వాళ్ళదీ కాదు-వీళ్ళదీ కాదు-అందరిదీని. ఆ భావమే నశించింది అందరిలోనూ.

మధు : అందు కేం చేయాలి?

సత్యం : అందుకేం చేయాలి?—అదే-అదే విషయం రాత్రింబగళ్లు తలపోసినా తీరని సమస్య. నాకూ-నా దుఃఖానికీ, తీరని ఆ వేదనకూ యిదే మూలం. ఎప్పుడో ఓరోజు వస్తుంది-ఆనాడు అన్నీ చక్క నవుతవి అనుకుంటూ-ఎన్నోనాళ్లు వృథాచేశాం. ఇప్పుడెంతో శీఘ్రంగా చేయాలి ఎన్నోపనులు. మొదట మనం వీటిని వదలివేయాలి.

మధు : అవును సత్యం! వదలివేయాలి-ఇదిగో వదిలేస్తున్నాను. ఈ రోజునుంచీ నాకీ ఆభరణాలేమీ అక్కరలేదు. సామాన్యమైన దుస్తులు తప్ప నాకేమీ అవసరం లేదు-సామాన్యమైన ఆహారంకంటె ఎక్కువ ఏమీ తినను. ఇదిగో - హృదయంతో కోరుకుంటున్నాను- నన్నాశీర్వదించు. నీ అడుగుచాయలలో రానీ- నేనూ యీ విశ్వసేవలో మగ్నమై పోతాను. ఏ అజ్ఞాతసీమలకైనా పోతాను. ఈ సేవే నీవు-సత్యం!

సత్యం : దేవీ! పోతున్నాము. ఇదే మొదలు. ప్రయాణము సాగిద్దాము విశ్వసేవలో యిద్దరమూను.

మధు : అవును మహాకవీ! అవును జ్ఞప్తికి వస్తున్నవి. ఆనాటి పాటలు అవి నిజమై పోతున్నవి.

జాగుసేయక దేవి లేచిరావమ్మ
ఆతల్లి సేవకై పోవాలి మనము.
సస్యశ్యామలవర్ణ వస్త్రముందాల్చి
కాంతులు కురిపించు తిలకంబు దిద్ది
దివ్యతేజస్వినీ వెడలిపోవాలి
జాగుసేయక దేవి లేచిరావమ్మ !

[ తెర ]

(తరువాయి వచ్చే సంచికలో)

# కామన్ వెల్త్ చర్చలు

పసిఫిక్ ఒడంబడికను గురించిన ఆలోచన నిర్మాణాత్మక విధానం కాదు; కమ్యూనిజం ఆకర్షణ కది సమాధానం కాదు. అది భయాందోళన సూచిస్తుంది. ఆసియా ప్రజల జీవన ఆయప్రమాణాన్ని అభివృద్ధి చెయ్యడానికి ఎంతమాత్రం తోడ్పడ లేదు. వ్యావసాయిక యంత్రసామగ్రి అవసరమైన చోట, తుపాకు లిస్తానంటుంది. నీటి పారుదలకు ఆనకట్టలు అవసరమైన చోట, యాటంబాంబ్ ప్రయోగాశ్రయాలు నిర్మిస్తానంటుంది.

కిందటి అక్టోబరు నెలలో ఉపక్రమణ జరిగిన కామన్‌వెల్తు రాజ్యాల సమాలోచనల కొనసాగింపుగురించి చర్చించడానికి బ్రిటన్ ప్రత్యేకంగా పంపిన రాయబారులు ఆస్ట్రేలియా, న్యూజీలెండ్, పాకిస్తాన్, సిలన్, ఇండియా, దక్షిణాఫ్రికా, కెనడా దేశాలు సందర్శించడం సబబుగానే ఉంది. అయితే, అది యీ సమయంలో సందర్భపడ్డం ఆసియాలో జరుగుతున్న సంఘటనల ఉద్ధృతాన్నిబట్టే అని విశదమవుతోంది; ఆసియాఖండపు ప్రతి భాగంలోను వివిధరూపాలుగా, వివిధస్థాయిల్లో సాంఘిక విప్లవమొకటి ప్రవర్ధమాన మవుతోంది. ఈ దూతల లక్ష్యం-ఆ విప్లవవాహిన్ని అరికట్టడానికి యత్నం చెయ్యడమా? లేక సాంఘికంగా వెనువెంటనే అనన్యమైన మార్పు రావలసిన అవసరం గుర్తించి, సుహృద్భావంతో సహకారం నెరపడానికి మార్గాలు, సాధనాలు వెదకడమా? శ్రేష్ఠతరమైన నవీన సామ్రాజ్యభావనను ప్రతిబింబించే సూత్రంకోసం అన్వేషిస్తున్నామని వాళ్లు ప్రకటన చేశారు. ఈ రాయబారులు వాస్తవాగా కృషిస్తూన్నది-విప్లవానికి ఆయువుపట్టుగా ఉన్న ఆసియా భూభాగంచుట్టూ వ్యూహరచన పరంగా చక్రబంధం నిర్మించడానికి అనువుగా కుదురుకొన్న దేశాలమధ్య కొన్ని కొత్త మిత్రత్వసంబంధాలు మాత్రమే అయి వూరుకునే ప్రమాదం ఉంది.

డా॥ ఇవాట్ సూచించినట్టు-కామన్ వెల్తుకు చెందిన ఎనిమిది సభ్యదేశాలలో ఐదు ఆగ్నేయ ఆసియాలోను, పడమటి పసిఫిక్ ప్రాంతంలోను ఉండడం; ఆవిధంగా ఆ దేశాలకు భౌగోళికంగా అధిక ప్రాధాన్యం రావడం వాస్తవమే. కాని వాటి ఆంతరంగిక రాజకీయాలను మాత్రం అలక్ష్యంచెయ్యడానికవీలు లేదు; నిజానికి, ఆసియా భూభాగంమీద ఉన్న దేశాలలోని సాంఘిక సమస్య లెటువంటివంటే-వాటి పరిణామం యిప్పుడా ప్రభుత్వాల నాయకులతో చర్చింపబడుతూన్న ఒడంబడికలను కష్టతరం గావించడమే కాకుండా, అప్రధానం చెయ్యగలదు కూడా. ఆసియాలో కలిగే అసంపన్నపు పరిణామాలనుండి ఆస్ట్రేలియా, న్యూజీలెండులకు కొంతకాలం వరకు రక్షణ కల్పించవచ్చు; కాని తక్కిన పసిఫిక్ ప్రాంతాన్ని ఆర్థికసంక్షోభం ఎదుర్కొన్న పక్షాన్ని, తామిప్పుడు అనుభవిస్తూన్న రాజకీయ ప్రశాంతి, ఆర్థికసౌభాగ్యము కాలనియతి లేకుండా కొనసాగడానికి వలను పడదన్న యథార్థవిషయం ఆదేశాలు ఉపేక్షించడానికి వీల్లేదు.

సామ్రాజ్యవ్యవస్థను యిప్పటికంటె సమ్మతికరమైన నిబంధనావళిని సూత్రీకరించడం, కమ్యూనిజం ప్రాబల్యాన్ని జయప్రదంగా నిరోధించడానికి దోహదపడుతుందని భావించడం తెలివి తక్కువ. రైతాంగంపట్ల దాని ప్రయోజనం శూన్యం. పాశ్చాత్యుల ఆధిపత్యం వారికి స్వానుభవమే; ఆ అనుభవంమీద పాశ్చాత్యులగూర్చిన వారి అభిప్రాయాలు ఆధారపడి ఉంటాయి. కామన్‌వెల్తు రాజ్యాల పరస్పర సంబంధబాంధ

వ్యాటకు చెందిన పరిణామాత్మక విధానాల గురించిన దుర్గ్రాహ్యమైన సూత్రీకరణాలు, మాటలు ఎంత చాకచక్యంతో పొదిగినప్పటికీ, పార్లమెంటులో ప్రకటనలు చెయ్యడానికి లక్షణంగా ఉండవచ్చు. రైతాంగానికి కావలసినవి—భూ భాగ్యాలు, శాంతి గౌరవాలు. ఆస్ట్రేలియా ప్యాట్ తెండులను మినహాయిస్తే, ఆసియా జనాభాలో ముప్పాతికవంతు రైతాంగమే ఉంటారు. సామ్రాజ్యం మూలభావంలో ఉదారమైన పరిణామం వచ్చి ఉండవచ్చు- యీ సందర్భంలో అతిప్రధానమైన మార్పులు చెయ్యడానికి బ్రిటిష్ గవర్నమెంట్ నిజంగా యోచిస్తూండవచ్చు- కాని తరతరాలుగా సాగిన దోపిడీ విధానం, ఎంత నైపుణ్యంతో ప్రచారం చేసినా మాయని మచ్చ. ఈ ప్రయత్నం ఫలప్రదం కావాలంటే: పర్యవసానంలో అవలంబించే విధానం జన సామాన్యపు అక్కరలు తీర్చేదిగా ఉండాలి. స్వాతంత్ర్యం సాధించుకున్నట్టిగాని, సాధించడానికి సిద్ధంగా ఉన్నట్టిగాని దేశాలలో యీ సిద్ధాంతం మరింత నిజమవుతుంది.

ఈ దృక్పథంతో చూసినట్టయితే, పసిఫిక్ ఒడంబడికను గురించిన ఆలోచన నిర్మాణాత్మక విధానం కాదు; కమ్యూనిజం ఆకర్షణ నది తగ్గించలేదు. అది అకారణభయాన్ని సూచిస్తుంది. ఆసియా ప్రజల జీవన ఆయప్రమాణాన్ని అభివృద్ధి చెయ్యడానికి గవ్వెత్తు కూడా ఉపకరించలేదు. వ్యావసాయిక యంత్రసామగ్రి అవసరమైనచోట, తుపాకు లిస్తానంటుంది. నీటి పారుదలకు ఆనకట్టలు అత్యవసరమైనచోట, యాటంబాంబు ప్రయోగాశ్రయాలు నిర్మిస్తానంటుంది. సైనికసహాయం కమ్యూనిజాన్ని ఓడించలేదనడానికి ఏదైనా నిదర్శనం అవసరమైతే, అది చైనాలో అమెరికా విధానం పూర్తిగా విఫలంకావడంలో కనిపిస్తూనే ఉంది. పశ్చిమరాజ్యాలు భారంవహించి ఏర్పాటుచేసే రక్షణపుటొడంబడికలో, సైనికసహాయ మొక అంగంగా విధిగా ఉండగలదు. కాబట్టి, ఆ ఒడంబడిక ఆసియాలోని యితరప్రాంతాలలో వేరు ఫలితాలు కలిగిస్తుందని నమ్మడానికి వీలులేదు- చైనాలోకంటె ఎక్కువ కాలం పట్టితే పట్టవచ్చు నంతే.

స్వాతంత్ర్యోద్యమాన్నో, సాంఘిక విప్లవాన్నో సమర్థించే యే విధానమయినా, యే సంస్థ అయినా - దానిమీద కమ్యూనిస్టు ముద్రవెయ్యడం యీరోజుల్లో పరిపాటికావడం వల్ల, ఇండియా - ఆగ్నేసియాల కమ్యూనిస్టు పార్టీలప్పుడే ప్రబలమైన రాజకీయనాయకత్వం సంపాదించుకున్నట్టే తరుచు వూహించడం జరుగుతోంది. కాని అది నిజంకాదు. ఫ్రెంచి సామ్రాజ్యతత్వం బలవంతంగా తెచ్చిపెట్టిన యుద్ధంలో కమ్యూనిస్టులు ప్రతిఘటనను నడిపించడంవల్ల, జాతీయశక్తులన్నిటితోటి సహకరించడం వల్ల - వీట్ నామ్ రిపబ్లిక్ లో కమ్యూనిస్టుపార్టీకి అజమాయిషీ వచ్చింది. ఇతరచోట్ల, నిరుటి మార్చి నెలలో కలకత్తా మహాసభ నిర్ణయించిన ప్రత్యక్ష విప్లవాత్మకమైన పార్టీవిధానం యెలా పరిణమించిందంటే: బర్మాలో, చిన్న కమ్యూనిస్టువర్గము కరెన్ల జాతీయతత్వాన్ని రెచ్చగొట్టడం ద్వారా సంక్షోభపరిస్థితులకు; మలయాలో, రాజకీయరంగంలో భయోత్పాదక చర్యలకి; ఇండోనీషియన్ రిపబ్లికులో, బాధ్యతారహిత విప్లవానికీ; ఇండియాలో, పారిశ్రామికప్రాంతాలలో ఫలంప్రదంగాని సమ్మెలకీ - దారితీసింది. ప్రతీ ప్రాంతంలోనూ, మితవాదులైన కమ్యూనిస్టు నాయకులు విదేశీయమైన జోక్యంవల్ల దేశీయమైన కమ్యూనిజానికి తగిలిన దెబ్బను గుర్తించారు; కమ్యూనిజమంటే లోపల అభిమానమున్న చాలామంది, పార్టీలిప్పుడు నడుస్తూన్న తీరును చూచి, వీటికి ప్రజామోదంలేదనీ, అవి ఫలశూన్యమైన పోరాటమే తెచ్చిపెడతాయనీ అర్థంచేసుకున్నారు.

అయినప్పటికీ, ఇండియా- ఆగ్నేయ ఆసియాలలోని రాజకీయ చైతన్యం పొందినయువకులందరూ మార్క్సు సిద్ధాంతవాదులనీ; చైనా కమ్యూనిస్టుల విజయం, మా సెటూంగ్ 'నూతన ప్రజాస్వామ్యం' వారిలో చాలామందిని లోగొన్నాయనీ గుర్తించక తప్పదు. అటువంటి విధానం పశ్చిమఖండంతో సహకరించడానికి వ్యతిరేకంకాదు; అయితే పాశ్చాత్యులతోడి సహకారం ఈ దేశాలని సోవియట్ రష్యాతో యుద్ధంలోమాత్రం యిరికించకూడదు. ఈ విధంగా—శక్తులు సూదుకుంటూన్న సిద్ధాంతా

ఉతో, కడుపునిండా తిండిలేని ప్రజానీకాలతో కట కట లాడుతున్న ప్రపంచంలో—తన అసంఖ్యాకమైన జనసందోహాలతో, అపారమైన వస్తు సంపదతో- ఆసియాఖండం సామరస్య సాధనకీ, శాంతిస్థాపనకీ సహాయభూతం కాగలదు. కాని పసిఫిక్ ఒడంబడికమీద ప్రస్తుతం కనిపిస్తూన్న దీక్ష, యుద్ధం అనివార్యం అన్న భావాన్ని ప్రోత్సహిస్తోంది; కమ్యూనిస్టు చైనా కిది, ధ్యాంగ్సోని సోవియట్ సరిహద్దుచెయ్యడానికి ఒడబడే పరిస్థితిని కల్పిస్తోంది. అటువంటి సైనిక సమాధానానికి ఒడబడడానికి ఆగ్నేయ ఆసియా దేశాలకు అమెరికా విధానంలో అంత విశ్వాసం లేదు. ఇండియాలోను, ఆగ్నేయ ఆసియాలో కొన్ని ప్రాంతాలలోను మంచిపేరు గడించుకున్న బ్రిటన్‌లోని లేబర్ ప్రభుత్వం, కమ్యూనిస్టులకు వ్యతిరేకంగా జైత్రయాత్ర పేరిట, కామన్‌వెల్తు రాజ్యాలను యుద్ధానికి సన్నద్ధమయేటట్లు పురికొల్పడానికి తన ప్రతిష్ఠను వినియోగించుకున్నట్లయితే, అది దారుణ పరిణామాలకు దారితియ్యగలదు. సామ్రాజ్య వ్యవస్థను పరిత్యజించిన యీ నవీన భావన రాబోయే యుద్ధంలో కోరగాని మిత్రత్వ సంబంధంకూర్పడంకన్న చేసే ఉపకారమింకొకటిలేదా?

ఆగ్నేయ ఆసియాప్రజలు తమ దేశాలను పునర్నిర్మించుకోడానికి, తమ ప్రత్యేక పరిస్థితులకనుగుణంగా సామ్యవాద వ్యవస్థను పెంపొందించుకోడానికి, ఎక్కడవీలైతే అక్కడ, వారితో సహకరించే పనికి పూనుకోవలసిన తరుణంవచ్చింది. క్రితం డిసెంబరు నెలలో ఆస్ట్రేలియాలో సమావేశమైన ఆసియా దూరప్రాచ్యాల ఆర్థిక విషయాల విచారణ సంఘం కొన్ని ఉపయోగకరమైన తీర్మానాలుచేసింది. ఈ సంఘానికి కార్యనిర్వహణాధికారంలేదు. ఇది కేవలం యింకొక అంతర్జాతీయ వాస్తవాంశ సేకరణ సంస్థమాత్రమే కానవసరముందా? ఈ సంఘపు ప్రతిపాదనలలో ఇండియా, ఆగ్నేయ ఆసియాలు చుట్టివచ్చిన ప్రత్యేక రాయబారులు చర్చింపదగ్గ ఉపయోగకరమైన ప్రాతిపదిక ఏదీలేదా? లేక యీ నూతన సామ్రాజ్యానుబంధపు ప్రతినిధులు కేవలం సైనిక సమస్యలను గురించి చర్చించడానికి మాత్రమే వచ్చిన యుద్ధ సందేశహరులేనా? ఈ వరకే ఇండో-చైనా, ఇండోనీషియా, మలయాలలో వలసరాజ్య ప్రజలమీద యుద్ధంసాగిస్తూన్న పశ్చిమఖండం యిప్పుడు ప్రపంచయుద్ధానికే ప్రయత్నాలు చేస్తూన్నదని నిరూపించడానికి యీ రాయబారాలను దాఖలాగా వినియోగించుకుంటే, క్రెమ్లిన్‌లోని రాజకీయయుద్ధ నాయకులను విమర్శించడానికి వీలుందా?

పారిశ్రామికదేశాలు యీ ఖండానికి భారీ యంత్రాలు,ముఖ్యసాధనసామగ్రి యిచ్చితోడ్పడవలసిన అవసరాన్ని ఆసియాదూరప్రాచ్యాల ఆర్థిక విషయాల విచారణసంఘం సూత్రప్రాయంగా అంగీకరించింది. పారిశ్రామికాభివృద్ధి సలహా సంఘం స్థాపనవిషయమై సోవియట్ ప్రతినిధి సుముఖత్వం ప్రదర్శించాడు. ఇతర నిర్మాణాత్మక యోచనలతోపాటు - వరదల నిరోధాని కొక కార్యాలయం నెలకొల్పడాన్ని గురించీ (ప్రతి సంవత్సరము యీ ప్రాంతంలో వరదలవలన విశేషమైన జననష్టము, ఆస్తి నష్టము జరుగుతూండడం కద్దు), సాంకేతిక విద్యావిషయకమైన శిక్షణ నివ్వడానికి క్రితం డిసెంబరులో అంతర్జాతీయ కార్మిక సంస్థ (I. L. O.) మొదలు పెట్టిన పథకంగురించీ చర్చించడం జరిగింది. ఆర్థికాభివృద్ధికి ప్రధానమైన సాధన సామగ్రిని, భారీయంత్రాలను దిగుమతి చేసుకోడానికి చాలిన ధనసంపత్తి యీ ప్రాంతానికి లేదని విచారణ సంఘం గుర్తించింది. అందుచేత పెట్టుబడి పెట్టగల వ్యక్తులవలన, పునర్నిర్మాణాది కార్యక్రమాలకు అప్పులిచ్చే ఇంటర్‌నేషనల్ బాంక్ వంటి పరపతి సంస్థలవలన సమకూడే సౌకర్యాలను వినియోగించుకునే నిమిత్తం ఆసియాదేశాలు నిర్దిష్టకార్యప్రణాళికలనుఏర్పరించుకొనవలసిందని యింకొక ఉపయోగాత్మకమైన తీర్మానంద్వారా సిఫారసుచేసింది. ఇవి కార్యరూపమైన సహకారానికి దోహదంచేసే నిర్మాణాత్మక యోచనలు. ప్రాబల్యంకోసం జరిగే పెనగులాటలో సిద్ధాంతాల పరంగాను, సైనికవ్యూహాల పరంగాను బాంబుల ప్రయోగ స్థలాలవడానికి బదులు—పైవిధంగా అయితే, ఆసియా దూరప్రాచ్యాలు శాంతియుతమైన అభివృద్ధికీ, పశ్చిమఖండంతో సహకారానికి తావళాలు కాగలవు.

—'New Statesman and Nation 'నుండి




అంగర వెంకటకృష్ణా రావు

డాబామీద వెల్లకిలా పడుకొని ఆకాశంపై గారడీ చూస్తున్నాను. బహుళపంచమి రాత్రి. మలయమారుతం ధనవంతుడి పత్నీమణి కారులో వెన్నెలవిహారం చేస్తున్నట్టు గర్వాలసంచాన విశేషాలు చూపిస్తూంది. తెల్లని అంచుగల కోమల నీలజలదఖండికల నడుమ చంద్రుడు దాగుడు మూత లాడుతున్నాడు.

అప్పుడు కలిగింది నాకు సందేహం! ఈ వెన్నెల ఎంతోమంది హృదయాలలో వుల్లాసం కలిగించింది. ఎందరు విరహిజనులో దీనిలో కరకర వేగిపోయేరు. విరహవ్యథలే లేని కవులు, 'ఏవిరహార్తుడేని' అని ఎన్నో ఊహించుకుని విలపించేరు——

ఇక యీ జ్యోత్స్నా వికాసంలో ప్రవాస దుఃఖితులు మొట్టులు కొట్టారు. ఇంకా యింకా అజ్ఞాతవ్యక్తుల్నికూడా తల్చుకుని ఘోరున ఏడ్చేరు ఎందరో!

అయితే ఒక్కగాని ఒక్కమానవుడు-కవిత్వం కోసం కవిగాని మానవమాత్రుడు, పైవారందరూ బాధపడే రుజాకీణాంకం, కుతపకాలరవికూడా కనిపెట్టలేని స్ఫటిక హృదయుడు 'బహుళ పంచమి జ్యోత్స్న భయపెట్టుతోంది' అని ఆక్రోశించాడు.

ఎందుకు 'భయపెట్టుతూంది'?—ఎందుకు!

మేఘాలు పరుగెడుతున్నాయి - యవని కాభ్యంతరము అప్పుడప్పుడు పొందుతున్నాడు చందమామ - వెలుగు నీడలమధ్య, లేచిపడు తూన్న కనురెప్పలతో - కితకితలుపెట్టే చిరుగాలి చిక్కుడుకాయలవంటి ప్రేష్ఠ శరీరంమీద పరుగిడుతున్నా, ఆలోచనాలు పని చేయక పోయినా, సందేహం సందడిస్తోంది.

అప్పుడే దక్షిణాకాశకోణంలో, కరాళ మేఘముక్త అయిన ఒక లేతచుక్క మినుకుమంది. ఆ చుక్క నా వెంపే చూస్తున్నట్టు - అది యేవో అవ్యక్త భావాలని నాతో చెప్పుకుందామని, హృదయభారం ఆ విధంగా తగ్గించుకుందా మని ప్రయత్నిస్తున్నట్టయింది.

నేనా కరాళమేఘముక్త అయిన ప్రవాళ తారవెంపు చూస్తూంటే, ఆవేదనానిలంవల్ల వూగి వూగి ఒక్కసారి 'రాలినెత్తురు క్రక్కుకుంటూ పేలిపోతుందే'మో అని భయం గొలిపి—కను కున్నట్టు పుటుక్కున తెగి జరజర జారిపోతూంది.

నేను ప్రాపిరి బిగబట్టి చూస్తున్నాను-డాబామెట్లవంటి మేఘశకలసోపానాలమీంచి శరవేగంతో జారి పరుగెత్తి—నా ఆశ్చర్యం యినుమడించేట్టు తళుక్కుమనివచ్చి నా ముందు పడింది.

ఆ చుక్క! ఒక చక్కని పద్మాలుగళ్ల చుక్క! రెండు బుగ్గలమీద మెరిసే కన్నీటి బొట్లు ఆమె దుఃఖావస్థ తెలియజేశాయి- సంస్కారహీనమైన జుట్టు, చెంపకు చేరడేసి కళ్లల్లోంచి హృదయంలోకి దూసుకుపోయే చూపులు, ఆమెలో ప్రచ్ఛన్నమైన వుద్రేకాన్ని తెలియజేస్తున్నాయి.

నే నామెను చాపమీద కూచోమన్నాను.

గాభరాలో నే నా పిల్లపేరు అడగలేదు. అంచేత ఆమె అప్పటికీ యిప్పటికీ చుక్కే!

'నీ సందేహం తీర్చడానికి వచ్చాను' అని కొంచెం దగ్గరగా జరిగింది—చుక్క...

* * *

పదిహేడు ఏండ్లక్రిందట నా తండ్రి సబ్ రిజిస్ట్రారుపని చేస్తూ, సత్యాగ్రహసందర్భంలో వుద్యోగానికి రాజీనామా యిచ్చి కాపురస్థలం అయిన రామగిరి జమీందారీ

గ్రామం చేరుకున్నాడు సకుటుంబంగా. అప్పటి నుంచీ ఆయన గాంధీగారి అడుగుజాడలలో నడుస్తూ దేశసేవకీ, ప్రజాసేవకీ తన జీవితాన్ని అర్పణం చేశాడు.

ఉద్యోగరాహిత్యంతో కొంతరాబడి తగ్గినా, స్వగ్రామంలో చిన్న భూమిచెక్క వుండడం వల్ల కేవలం దరిద్రం అనుభవించే అవస్థపట్టలేదు మా కుటుంబానికి.

కాని మా తండ్రి ఉనికి ఆ జమీందారుకు ఏమీ అనుకూలంగా లేదు—గాంధీగారు వుపదేశించిన సత్యం, అహింస అక్షరాలా అమలు జరిపే అచంచల స్వభావుడే కాకుండా, మా తండ్రి మంచి నైతికపుష్టి కలిగిన సమాజసేవకుడు. మా తల్లితోటే అతనికి కాంతలమీద మోహం పోయింది. స్వాతంత్ర్య సమరయోధుడు కాగానే, కనకంమీద కూడా ఆశ నశించి పోయింది. అంచేత వివిధ పరిస్థితులలో జమీందారు మా తండ్రిని స్వపక్షోన్ముఖుడిని చెయ్యడానికో లేక కార్యరంగంనించి విరమింప చెయ్యడానికో, ప్రయోగించిన అస్త్రాలు ఏమీ పనిచెయ్యలేదు.

దేశరాజకీయాలను క్రమంగా అనుసరిస్తూ, వుద్యమాలు తప్పిపోకుండా దీక్షగా పనిచేస్తూ, స్వగ్రామంలో గొప్పచైతన్యం కలిగించి, నిద్రిత మానవుల్ని మేలుకొలిపి, జమీందారుకు పరమ శత్రువు- సింహస్వప్నం అయేడు.

మా భూముల్ని జమీందారు స్వాధీనపరచుకున్నాడు-, ఇంట్లోంచి వెళ్ళగొట్టేడు- చర్విత చర్వణంగా చెప్పడంకన్న, ధనవంతుడు ధన హీనులమీద జరిపే హింసాకాండ అంతా జరిపేడు.

దరిద్రం అనుభవిస్తూ లాఠీ దెబ్బలుతింటూ, జైళ్ళు అలంకరిస్తూ, అవమానం అనుభవిస్తూ మా తండ్రి ఆ గ్రామంలో కొంతమంది ఆదరమే ఆధారంగా, దేశసేవే తన పరమావధిగా, దేశ ముక్తి తన పరమలక్ష్యంగా, సత్యాహింసలు తోడుగా జీవితం సాగించేడు!

మొదటిసారి కాంగ్రెసు పదవులు స్వీకరించినప్పుడు ఎన్నికలలో మాతండ్రి పడ్డ కష్టం, జమీందారు జరిపిన దారుణాలు తలుచుకుంటే గుండెలు యిప్పటికీ దద్దరిల్లుతాయి.

(ఆమె నేత్రాలు నిప్పుల్లో మెరిశాయి. నేను వింటున్నాను ఊపిరి బిగబట్టి.)

అప్పటికి నాకు ఎనిమిదేళ్లుంటాయి-మిడిమిడి జ్ఞానం. కాని దేశభక్తివాసన గల వాతావరణంలో పుట్టడంవల్ల, చేతులు జోడించడం తెలిసిన నాటినుంచీ ప్రతి వుదయం మూడు రంగుల జండాకు మొక్కడం అలవాటు అయివుండడంచేత-నా లే గుండెలలో కూడా



మిదేవో భావాలుపుడుతూండేవి.

చదువు, సంస్కారం,పరిజ్ఞానం లేకపోయినా అహింసాతత్త్వం నాకు అంతగ నచ్చింది కాదు - పోలీసు వాడు మా తండ్రిని లాఠీతో కొడుతూంటే ప్రక్కనున్న యిటిక పెద్ద పుచ్చుకుని వాడితల ఎందుకు పగలగొట్ట లేదని మా తండ్రితో వాదించే వాన్ని.

కాలానుసరణంగా వయస్సు అయన రుధిరంలో శాంతరసం పోషించుకొన్తూ, నా నెత్తురులో వుద్రేకతరంగాలు రెచ్చగొట్టింది. నాకు పళ్ళాలుగోళ్లు వచ్చాయి.

చరిత్ర పురాణాదియుగాల్లో ముందెన్నడూ అహింసను గెలవలేదని-ధన బలగర్వితులైన నర రూప రాక్షసుల్ని దారుణ హింసామార్గాన్నే జయించాలని తండ్రితో వాదించేదాన్ని.

దేశనాయకులు పదవులకు రాజీనామాలుపెట్టి అంధితులైపోయారు - అప్పుడు మా తండ్రి కూడా జైలు అలంకరించేడు——

నిలవడానికి నీడలేని పరిస్థితిలో, తండ్రి జైలు పాలై పోగానే, నాలో ఒక మహాభీకరశోకదేవత గజ్జకట్టిన కాళ్ళతో నర్తించింది.

వీధుల్లో కార్లు పరుగెడుతూంటే - పెద్దపెద్ద హోటళ్లలో కప్పులు సాసర్లు గలగలమంటుంటే టిప్పాప్ చీరెలు ఒయ్యారంగా వీచి షికార్లు చేస్తూంటే - స్వతంత్రం ఎవరికోసంకావాలి, త్యాగం ఎవరు చెయ్యాలి అని నన్ను నేను ప్రశ్నించుకుని ఏడ్చేను.

రోజుకు పదిహేను గంటలు నూలు వడికితే నాకు ఒక పూట తిండి దొరకడం కష్టం అయేది.

హఠాత్తుగా వినబడ్డది ఆగస్టు విప్లవ శంఖారవం! నాలో అణగివున్న ప్రతీకారాగ్ని ప్రజ్వరిల్లి నాల్కలు జాపింది. విసిరి పారేశా రాట్నం ఒకమూల. నడుం బిగించి విప్లవరంగంలో దూకా! పరుగెడుతూన్న నాకెదురుగా ఆకాశం మీద ఝాన్సీదేవిగుఱ్ఱంమీదకృపాణపాణితో ప్రత్యక్షం అయి నన్ను దీవించింది.

(ఆమె నేత్రాలు అగ్నికుండాలవలె వెలిగాయి. ఆమె ప్రవాళాధరం స్పందించిపోయింది. కాని మరు నిమిషం ఆమెముఖం విషాద మేఘాచ్ఛాదితం అయింది.)

కాని, కాని నాజీవితకుసుమం విప్లవాగ్నిలో భస్మం అయింది. నావలె ఎందరెందరో వుడుకు నెత్తుటి యువజనులు నేటి స్వతంత్రభారతానికి బలి అయిపోయేరు.

తెల్లటోపీకి ఎఱ్ఱటోపీ నేడు సలాములు చేస్తూంది- ఖద్దరు బట్టలకి సీమనూలు సూటులు కాళ్ళు పిసుకుతూన్నాయి. కాని-

(ఆమెకు మాట పెగలడంలేదు- వెక్కి వెక్కి ఏడుస్తూంది.)

కాని నాతండ్రి ఆరోగ్యంచెడి- వృద్ధాప్యంలో, పక్షిలా అల్లాడుతున్నాడు. ఖద్దరు తువ్వాళ్లు అమ్ముకుని వచ్చే కమిషన్ అడ్డు పెట్టుకుందికి ప్రయత్నిస్తున్నాడు మృత్యువుకంట పడకుండా!

(ఆమె బావురుమని ఏడ్చింది - నా గుండె దహించుకుపోయింది. కాని ఏం చెయ్యగలను!)

అనిత్యమైన అనవ్యమైన యీ వెన్నెలలో మరుగుపడిపోయి, చరిత్రహీనంగా వున్న నా శోకమయ జీవితాన్ని కనిపెట్టే అత డెవరో 'బహుళపంచమి జ్యోత్స్న' భయ పెట్టుతోంది' అని విలపించి వుండాలి-నీ సందేహం తీరిందో లేదో గాని నాగోడు కొంత చెప్పుకుని నా హృదయభారం తగ్గించుకున్నా. ఇక సెలవు" అని ఆమె వచ్చినమార్గాన్నే మేఘశకల సోపానా రెక్కి ఆకాశంలో అంతర్థానం అయింది.

'ఇదిగో యిదిగో - మీ తండ్రి ఎక్కడున్నాడు?' అని అరిచాను.

'వెల్లకిలా కాండోలా పడుకుని పాడు కలలు కనకపోతే ఒత్తిగిలిపడుకోరాదూ' అని చెప్పిన చరిచింది ఒక్కచరుపు 'విన్నారి'.



ప్రేమ అంటే ప్రేయసీప్రియులు ఒకరి కళ్లల్లోకి ఒకరుచూస్తూ కూర్చోవడం కాదు. ఇద్దరూ కలిసి ఒకేలక్ష్యంవేపు దృష్టిసారించడం-(ఒక పాశ్చాత్యకవి)

# పునాది రాళ్లు

కనకదండి గోపాలకృష్ణశాస్త్రి

మా బ్రతు కెగుడు దిగుడు
మణగియుందు మడుగున
అందరము నొకగుట్ట బిడ్డలమె రాళ్లమే

ఉంటిమో యుడిగితిమొ
కంటి కగపడరాము
వెలుగు జాడలు లేవు
వేడి జాడలు లేవు
కష్ట సుఖముల భేద
మిష్టమయి మరచితిమి
అందరము నొకగుట్ట బిడ్డలమె రాళ్లమే

అంబరము నొరసికొని
సంబరము మెయి మరచి
దినరాజు రేరాజు
దివ్య శోభలలోన
తలక్రిందుల యిపోవు
గులకరాళ్లల్లార!
అందరము నొకగుట్ట బిడ్డలమె రాళ్లమే

ఒరులు కదిపినగాని
సిరి సంపదలు లేవు
అన్నమో సున్నమో
అందరకు నొకటియే
పరులు నవ్వినగాని
భయము గొన మిసుమంత
అందరము నొకగుట్ట బిడ్డలమె రాళ్లమే

వాన వరదల నేల
వ్రాలిపడునది మీరె
పిడుగులకు భిన్నమయి
చెడిపోవునది మీరె
ఏమేమి యొ[illegible]లయిన
మేమె యటు లుండునది
అందరము నొకగుట్టబిడ్డలమె రాళ్లమే

ఎన్నెన్ని మాపయిని
కన్నెత్తి నిలచినవొ
అన్నియును కూలినవి
మన్నులో కలసినవి
వానకో వరదకో
వజ్ర పాతమునకో
అందరము నొకగుట్టబిడ్డలమె రాళ్లమే

మేడ గోపురము పయి
మింట మెరసిన యంత
మీరొకరు మేమొకరు
కాము కాలే మెపుడు
శాశ్వతమ్మిది యొకటె
సత్యమిది యొక్కటే
అందరము నొకగుట్ట బిడ్డలమె రాళ్లమే



# సభ్యతాభివ్యాం

వేమూరి సుబ్బరామశర్మ

ఆ రోజున ఎండ తీక్షణంగా ఉన్నది. కొద్ది కొద్దిగా వేడిగాలులు సాగినై. జేబుగూడా ఖాళీగాలేదు. నడక సాగటం కష్ట మనిపించింది. శరీరం వేడెక్కుతూన్నట్లనిపించి ఒక రిక్షాను సమీపించాను. ఆ రిక్షావాడు ముఖంమీదదాకా తలగుడ్డ కప్పుకుని కాళ్లను ఒక విధంగా ముడుచుకొని రిక్షాలోపల కునుకుతీస్తున్నాడు. నా అవసరం, వాడి అవసరం మనస్సులో ఉంచుకుని నెమ్మదిగా వాడిని తట్టిలేపాను. అనేకసార్లు ఆ సమయానికే వాడి బండిమీదే ఆఫీసుకు వెళ్ళటం చేత, కళ్లు నులుముకుని ఒక్కసారిగా లేచి, తలగుడ్డ సరిచేసుకుని రిక్షాకి కట్టిన మువ్వ మ్రోగించాడు. నా స్థానంలో నేను కూర్చున్నతర్వాత-వాడు ఎండలోను, నేను నీడలోను- రిక్షాకదిలింది.

నేను పనిచేసే ఆఫీసు బజారుకు మైలు, మైలున్నర దూరానికి తక్కువ ఉండదు. బజారులో వెళ్లాల్సినది మాత్రం మూడు ఫర్లాంగులే ఉంటుంది. కాని రిక్షామువ్వ ఇక్కడే ఎక్కువసార్లు ధ్వనిచేయవలసి ఉంటుంది. ఒక మలుపు తిరిగిన తరువాత ఎత్తుపల్లాలు అంతగాలేని రోడ్డుమీద రిక్షావేగం హెచ్చింది.

రిక్షావాడు శరీరాన్ని దాచుకోలేదు. అతని నల్లని శరీరం, వంపులు తిరిగి బండబారిన కండలు, జబ్బలు మండుటెండలో కాలుతూ మెరుస్తున్నై. వేగంతో పాటు అతని వీపుమధ్యగా, రెండు పర్వత సానువులమధ్యగా పారే సెలఏరు మాదిరిగా, వెన్నుపట్టిమీదుగా ఘర్మజలం ప్రవహించి అతని బట్టను తడుపుతోంది. ఈ దృశ్యం జాలిగా, బాధాకరంగా కనిపించింది నాకు. ప్రపంచంలో శ్రమకు తగ్గ ఫలం కల్గుతోందా; మానవుడు దినదినానికి నాగరికు డౌతున్నాడా—అనే సందేహాలు కల్గినై. ఆలోచనలలో మునిగిన నేను కొద్దిగా జేర్లబడి రిక్షాలో ఒరిగాను. ఎండతీవ్రత వల్ల కాబోలు నా కనురెప్పలు బరువై జాగ్రదవస్థ, నిద్రావస్థకాని స్థితిలోకి నన్నీడ్చినై. ఒక చిన్న కారు కనురెప్పపాటులో మమ్మ దాటి పెద్ద ధూళిని, పొగను లేపి పోయింది.

రిక్షా రెండు నిముసములాగి మరల మువ్వ మోతతో కదిలింది.

రిక్షావాడు కారు నుద్దేశించికాబోలు యిట్లన్నాడు- 'అబ్బ, ఈ కారువాళ్ళకెంత పొగరు! అసలు, యంత్రాలన్నీ ఇంతే- మనుష్యుల కళ్ళలోను, నోళ్ళలోను దుమ్ముచల్లుతై. అంతేనంటావా అశ్వమా!'

ప్రక్కనుమాదగా ఒక అశ్వశకటం రిక్షాతోపాటు నడుస్తోంది. అవధిలేని ఆశ్చర్యంతో వాళ్ళ ఇద్దరి సంభాషణ విన్నాను.

అశ్వం రిక్షావాని వంకకు తల త్రిప్పి, 'ఓహో మనుష్యుడా మాట్లాడేది. అవునవును. కార్లు, రైళ్ళు, విమానాలు వచ్చింతర్వాత అన్నింటితో పాటు గుఱ్ఱపుబండి అవసరం కూడా చాలా తగ్గిపోయిందిలే' అన్నది.

అశ్వం సకిలించింది. దానికి రిక్షావాడు కొద్దిగా నవ్వాడు. అశ్వానికి కోపం, ఉక్రోషం కల్గి, 'ఎందుకల్లా ఇకిలిస్తావ్ మానవుడా! నీ బ్రతుకుకు నువ్వుగూడా ఇతరులకు చూసి నవ్వడమా. మీ మానవుల బుద్ధి వక్రమార్గాలలోకి ప్రవహిస్తున్నదనడానికి నీ ఇప్పటి పరిస్థితి చాలు తార్కాణంగా' అని ఎత్తిపొడిచింది.

తెల్లబోయిన రిక్షామానవుడు, 'నా కర్థమవలేదు నువ్వు చెప్పేది. ఏం, మానవుడు తన

మనుష్యశక్తిని ధారపోసి శోధించి అణు శక్తులను కూడా బట్టబయలు చెయ్యడంలేదా?' అని అన్నాడు.

'ఓయి పిచ్చివాడా! మానవుడిని ఏవేవో చేశానని వెనకవేసుకు వస్తున్నావు గాని నీ సంగతి నీకర్థమైందా! ఒక వాహనాన్ని సృష్టించిన మనుష్యుడే ఇంకో మానవుడిమీద సవారీ చెయ్యడానికి దానిని ఉపయోగించడం కూడా బుద్ధి కుశలతే అంటావు కాదూ?' అని ఎగతాళి చేసింది అశ్వం.

రిక్షవాడు ఎక్కువ కాలం ఆలోచనకు వ్యర్థం చేయకుండా, ఇట్లా అన్నాడు: 'ఐతే ఈ రిక్షాని బజారులో ఉచితంగా, బహుమానంగా మా షాహుకారుకి ఇచ్చారను కున్నావా? రెండు పచ్చనోట్లు పారవేస్తేగాని ఈ రిక్షా రాలేదు. రోజూ ఆయనకు నాకు వచ్చేదానిలో అర్ధరూపాయి యిస్తూ వుంటే రెండు సంవత్సరాలైన తర్వాత బండి నాస్వాధీనం చేసేస్తాడు. డబ్బును వడ్డీకి అప్పియ్యడమన్నా ఇదైనా ఒకటే. అంతే.'

మధ్యలో అందుకుని అశ్వం 'ఇంకేం స్వంతం కూడా అవుతుందీ, చాలా బాగున్నది. శాశ్వతంగా పతనమై మానవత్వాన్నే మరచేందుకు విడిపించుకునే వీలులేని అవకాశం కల్పించాడు మీ షాహుకారు! ధనం వడ్డీకిచ్చినా కొంత సహించవచ్చు. కాని అది నీ స్వంతమవడంలో ఎంత కుటిలత్వంతో కూడుకున్న తంత్రం ఉన్నది' అన్నది.

చిన్న బుచ్చుకున్న ముఖంతో రిక్షావాడు: 'ఎందుకలా ఎగతాళిచేస్తావ్. నాకూ ఏదో బాడుగ వస్తోంది. ఎలాగో అలాగు గడుస్తోంది.'

అశ్వం పకలించి 'ఈ వేదాంతం నీకుకూడా అబ్బిందీ. చేతకానితనాన్ని, పేదరికాన్ని తృప్తిలో ఎందుకు కప్పిపుచ్చుకుంటావ్? సిగ్గులేదా నీకు ఆమాట లనడానికి? ఎట్లాగో అట్లాగు బతి పుచ్చుకుంటున్నావా-నీ గుడిసె ప్రక్కనేగా నా యజమాని ఉన్నది; ఎన్నిసార్లు నీ భార్య కుస్తులుపడుకున్నదో నాకు తెలియదను కున్నావా!'

వెలా తెలాపోయిన రిక్షావాడు దగ్గుత్తికతో 'అంతా తెలుసా నీకు!' అని మాత్రం అనగలిగాడు. అప్పటి అతని ముఖం పాషాణాలను ద్రవింపజేస్తుంది.

'అన్నీ తెలుసు. ఒక్కమాట విను. నీ రోజు ఆదాయమంతా కలిపితే నేను రెండుమార్లు రైలుస్టేషనుకు వెళ్లి తిరిగి వచ్చినందు కిచ్చే బాడుగలో సగం ఉండదు.' అన్న అశ్వం మాటలకు వాడు దీనంగా నెమ్మదిగా, 'పశువుతో కూడా సామ్యంలేదా-నాకు, ఈ మానవుడికి!'

'అఁ లేకేం - దేనిలోనూ సమానత్వం లేకపోయినా నీస్థితి, నాస్థితిమాత్రం సమానమే బళ్లులాగడంలో...'

అశ్వం మందగమనాన్ని చూసి బండివాడు తన చర్నాకోలును విసరాడు. అది బాధతో, 'అబ్బ...ఓ మానవుడా, ఇక వెడతాను', అన్నది.

'ఒక్క సందేహం తీర్చిపో అశ్వమా,' అని జాలిచూపులు కురిపించాడు రిక్షా మానవుడు.

'కాదుకాదు-అశ్వం మనిషికన్న త్వరగా పరుగెత్తుతుంది; లేకపోతే నా యజమానిని చూశావూ - ఆ మానవుడి అభిమానానికి దెబ్బ తగులుతుంది. వెడతాను...నీ అనుమానాలు వెనుక వచ్చే వృషభం తీరుస్తుందిలే.' అని గంభీరంగా పకలించి టకటకమంటూ అశ్వశకటం పరుగుతీసింది.

అశకటం అట్లా పోవడం, ఒక వృషభ శకటం దానిస్థానే తయారవటం ఒక్కసారిగా జరిగినై. ఇదంతా ఏదో చిత్రంగా స్వప్నసీమల్లో విహరిస్తూన్నట్లున్నది నాకు. రిక్షావానిలోని మానవత్వాన్ని మేలుకొలిపేందుకు వృషభం ఏంమాట్లాడుతుందో అని ఆశ్చర్యంతో, శ్రద్ధతో వాళ్ల సంభాషణ విన్నాను.

రిక్షావాడు, 'ఏం వృషభమా! నా అనుమానాలు తీర్చవూ?' అని ప్రశ్నార్థకంగా ప్రక్కకు చూశాడు. వృషభం మాట్లాలేదు.

'ఏం మాట్లావేం? నీకు మాటలురావూ?' అని నాలుగైదు మార్లు అరచిన తర్వాత 'ఛీ!' అని మాత్రం నిరసనగా విదిలించింది.

'ఎందుకట్లా అసహ్యించుకుంటున్నావూ?'— అన్న వాడిమాటల్లో అశ్వంవలెనే పరిహాసం చేస్తుందనే భయం లేకపోలేదు.

వృషభం బుసకొట్టి, ముక్కును ఇటూ అంటూ కదిలించి, అసహ్యంకాక మరేమిపుండాలి మీమీద! మానవుల మనస్సు మీదనేకాకుండా, మాంసంమీదగూడా అధికారం చలాయించటం నీగ్రోబానిసలవ్యాపారాన్ని గుర్తుకు తెస్తోంది. ఏదో-"

మధ్యలో అందుకుని కొద్దిగా వికసించిన ముఖంతో రిక్షావాడు, "ఆఁ, నా అనుమానం సరీగా అక్కడే—నాగరకత, ప్రజాస్వామ్యం, సామ్యవాదం- ఇవన్నీ నిజంగా ప్రపంచంలో అసలు జరుగుతున్నాయా?"

మానవుడిని ఎగతాళిచేయడానికి అదను దొరకిందనే సంతోషంతో కాబోలు వృషభం మెడను కదిలించగా గంటలు మ్రోగినై. ఇట్లా జవాబు చెప్పింది- "ఓయి అమాయకుడా! ఆ మాటలన్నీ, వినడానికి మకరందాన్ని మరిపిస్తై. అంతే అవి అధికారంలోకి వచ్చేందుకు ఒక మానవుడు ప్రజలమీద వెదజల్లే మత్తుమంత్రాలు; పడక కుర్చీలో రాజకీయ శాస్త్రజ్ఞులు అనుభవించే ఊగటేకలలు. ఈ విషయాల్లో ఊహాకీ వాస్తవికానికీ మధ్యనున్నదూరం ఇంతా అంతా కాదు. ఆ పదాలను అడ్డంగా పెట్టుకుని ఎంత ద్రోహం జరుగుతోందో తెలుసా! ధనికుడు ఇంకా ఇంకా ఐశ్వర్యవంతుడౌతున్నాడు; పేదవాడు ఇంకా ఇంకా నిరుపేదగా తయారై శల్యావశిష్టుడౌతున్నాడు."

రిక్షావాని ముఖంలో ఆశారేఖలు మెరిసినై; విషాదపు చీకటులు విడిపోతున్నై. అతడు "ఐతే మరి దీనికి నివారణోపాయం ఏమీలేదా" అని ప్రశ్నార్థకంగా అన్నాడు. తన అనుమానం పూర్తిగా తీరుతుందనే ఉత్సాహంతో.

"అన్నింటి విషయం నేను చెప్పలేను; కాని నీ అవస్థకు ఒకటే ఉపాయం. అది ప్రభుత్వం రిక్షాలను బహిష్కరించటమే. ఐతే నీజీవనం ఎట్లా గడుస్తుందని నీ సందేహం. దానికి ప్రభుత్వమే త్రోవ చూపాల్సి ఉంటుంది. వ్యక్తిగతంగా ఎవ్వరూ ఏమీ చెయ్యలేరు.' అని వృషభం చెప్పే సంగతిని రిక్షావాడు శ్రద్ధతో విని ఇంకేం ప్రశ్నించడానికి బుద్ధిపుట్టక ఈ మాటలు మాత్రం అన్నాడు: 'అబ్బ, నీకెన్ని విషయాలు తెలుసు. అశ్వంకంటే తెలివిగల దానివల్లే ఉన్నావే!'

'నీకు తెలియని సంగతులన్నీ వింతగానే కనిపిస్తాయి. సరే, నే వెడతాను. ఎక్కువసేపు మాట్లాడితే మీ మనుష్యులకు అనుమానాలు అధికమౌతై...ఐనా ఇంత నెమ్మదిగా నీతో నడచే అలవాటుకూడా లేదు. వెడతాను,' అని వృషభం వేగంగా నడక సాగించింది.

రిక్షావాడుకూడా వేగం హెచ్చించి, 'మళ్ళీ జన్మలో తప్పకుండా నువ్వు మానవుడై పుట్టు వృషభమా,' అని దీవన పూర్వకంగా అన్నాడు చివర మాటలుగా.

వేగం తగ్గించి వృషభం కంగారుగా, 'వద్దు వద్దు; మానవజన్మ ఎంత విషాదభరితమో అర్థమైంది. రిక్షావాడుగానే జన్మిస్తే అది విషాదకరమైన స్థితే ఔతుంది. ఇంకనేమీ మాట్లాడకు. వెనుక మహిషం వస్తుంది. నీకు సరియైన స్నేహితుడు దొరుకుతాడులే.' అని ఎగతాళిగా గంటలు మ్రోగించుతూ రిక్షా వానిని దాటిపోయింది.

రిక్షా మానవునిగుండె దిగజారి పోయిందనే అనుకున్నాను. వాడు ఒక్కసారిగా పెద్ద నిట్టూర్పుతో 'లేదులేదు, నేను భరించలేను. నా మానవత్వం ఎంత దెబ్బతిన్నదో నా కర్థమైనదిప్పుడు. మహిషంతో కూడా పోల్చుకొని ఇంకా ఇంకా కుమిలిపోలేను.' అని పెద్దపెద్ద అంగలేస్తూ పరుగులెత్తుతున్నాడు. అతగాడి వేగానికి నా శరీరం బాగా కుదిలి, కదిలించినట్లయింది. నేనప్పటిదాకా చూస్తున్న దృశ్యం, వింటూన్న మాటలు అంతకంతకు దూరమై అదృశ్యమైనై.

'అయ్యగారూ, దిగండి బాబూ' అంటూన్న రిక్షావాడి కేకలు నన్ను పూర్తిగా జాగ్రదవస్థలోకి తీసికొనివచ్చినై. కళ్ళు నులుముకుంటూ ఆశ్చర్యంతో కంగారుగా లేచి నిలబడ్డాను. నా చేయి జేబులోనికిపోయి ఒక పావలాను వాడికిచ్చింది; నా కాళ్ళు మేడమెట్లు ఎక్కి ఆఫీసులోనికి దారి తీసినై.

ఇంగ్లీషు | ప్రపంచ సాహిత్యం | జాన్ గాల్స్‌వర్దీ

# ఆమె కోసం

ఆ సాయంత్రం అతనికి భోజనం సరిగా సయించలేదు. పొగచుట్ట కూడా సగం కాల్చి పారేశాడు వికారం పెట్టడంచేత. మేడమీద ఉన్న పిల్లల పడకగదిలోకి నెమ్మదిగా చేరుకున్నాడు. గదిలో ఒక గుడ్డిదీపం వెలుగుతోంది. ఆ కాంతిలో ఒక చేతిని తలక్రింద పెట్టుకొని నిద్రపోతూన్న తన మనమరాలి ముఖం అస్పష్టంగా కనిపిస్తోంది. చూస్తూ కిటికీలో కూర్చున్నాడు. గుర్రాలసాలలో ఒక గుర్రం గిట్టలతో భూమి తన్నుతూ చప్పుడుచేసింది. ఆ పసిపాపలా నిద్రపోతే ఎంత బాగుంటుంది!

కిటికీతలుపులు తెరచి బయటకు చూశాడు. అప్పుడే చంద్రోదయం అవుతోంది. అంత ఎర్రని చంద్రుడిని ఎప్పుడూ చూసిన జ్ఞాపకం లేదు. దూరంగావున్న చిన్న అడవి, పచ్చటి పొలాలు మాసిపోయే చివరి సూర్యకిరణాలలో కునికిపాట్లు పడుతున్నాయి. సౌందర్యదేవత ప్రకృతిని అలుముకు పోయింది. అది అతనికి చాలా ఆనందదాయకం. 'నేను చాలారోజులు జీవించాను.' అతడు ఆలోచనలో పడ్డాడు. 'అన్ని అనుభవాలూ పొందాను. సౌందర్యం అంటే తెలుసునని అంటారు నన్నెరిగినవాళ్లు. ఈ రాత్రి చంద్రుడిలో ఏదో స్ఫురిస్తోంది'. కళ్లు మూసుకున్నాడు. ఆమె- ఆమె సౌందర్యం. ఇక తాను కళ్లు తెరవననే ఆలోచన ఆవహించింది. అలాగే ఆలోచిస్తూ అందులో నిమగ్నుడైపోయి కొద్దిగా కునికిపాట్లుపడ్డాడు. గభాలున లేచాడు ఆలోచనలోనుంచి. తన ఆరోగ్యం పాడయిపోయింది. డాక్టరుకి చూపించాలి. కాని ఈ వయస్సులో! వెన్నెల తనగదిలోకి పాకుతుంది. నీడలు. నీడలే కదులుతాయి రాత్రి. పక్షులు, చెట్లు చేమలు అన్నీ నిద్రపోతూ తమ నీడలని వదులుతాయి చంద్రుడికి. ఆ నీడలే మెల్ల మెల్లగా పాకి తోటలోవున్న పెద్ద దుంగపైకి చేరుకుంటాయి. జ్ఞాపకం వచ్చింది. ఆమె, ఆమె ప్రియుడు. వింత ఆలోచన. ఆమె యింకా జీవించివుందా? ఎప్పుడేనా వస్తుందా? మూర్తీభవించిన విశ్వలావణ్యం ఆమె. తాను ఎంతగా ప్రేమించాడు! ఈ ముసలితనంలో ఆమె తన ప్రక్కని కనబడుతో వుంటే చాలును; ఆమె ఎంత అందకత్తె! లేచి నుంచున్నాడు. అనుకోకుండానే కిటికీ వూచలని గట్టిగా పట్టుకుంటే ఆలోచనలన్నీ విడిపోయి బాహ్యప్రపంచం జ్ఞాపకం వచ్చింది. నెమ్మదిగా మనమరాలి మంచందగ్గరకుపోయి నుంచున్నాడు. పాప నెమ్మదిగా కదిలింది. తనని తీక్షణంగా చూస్తూందని కనిపెట్టేట్లు. తన గదిలో అద్దం ముందు నిలబడి తన ప్రతిబింబం చూసుకున్నాడు. నొక్కుకుపోయిన బుగ్గలు. ఎముకల పోగు. కొద్దిగా భయం కలిగింది. కాని అతనిది లొంగిపోయే స్వభావం కాదు.

ఉదయాన్ని లేచేసరికి నీరసంగా కనిపించింది. డాక్టరుకోసం కబురు పంపించాడు. బయట తిరగవద్దని, చుట్టలు కాల్చడం మానమని డాక్టరు సలహా నిచ్చాడు. తనకేమాత్రం అలా చేయడం ఏమీ కష్టంలేని పని. కావలసినవన్నీ తన దగ్గరకే తీసికొచ్చి పెడతారు సేవకులు. అస్వస్థతగా ఉంటే పొగ వాసన కిట్టనే కిట్టదు. పొద్దున్న అంతా అలాగే మంచంమీద పడుకున్నాడు. పత్రిక పేజీలు త్రిప్పుతూ ఏమీ-

తోచక. తన పెంపుడు కుక్క కూడా మంచం ప్రక్కగా నేలమీద పడుకుంది తోడుగా.

భోజనంతో కూడా ఒక టెలిగ్రాం తీసుకొచ్చాడు వంటవాడు.

'నీ ఉత్తరం అందినది. వెంటనే వస్తున్నాను. సాయంత్రం నాలుగున్నరకు కలుసుకుంటా.'

ఆమె వస్తుంది. జీవించి ఉన్నదన్న మాటే. తనను వదలి వెళ్లిపోలేదు. వస్తుంది ఆ సాయంత్రం. శరీరం పులకరించింది. నుదుటిమీదకి చేయి పోనిచ్చి చూసుకున్నాడు అప్రయత్నంగా. వేడిగా వుంది.

కొద్దిగా మాత్రం భోజనం చేయగలిగాడు. మిగిలినవన్నీ పక్కకు త్రోసి పారేసి కూర్చున్నాడు కదలకుండా, పనివాడు భోజనంబల్ల శుభ్రంచేసి బయటకు పోయేవరకు.

ఆమె వస్తుంది. హృదయం వేగంగా కొట్టుకుంది. వెను వెంటనే కొట్టుకోవడం మానేసినట్టు స్ఫురించింది. ఆమె వస్తూవుంటుంది. మూడుగంటలయింది. పాత పాటలు చదువుకుంటూ వుంటుంది గదిలో. పనివాళ్లు నిద్రపోతూ ఉంటారు. సందడిలేకుండా లేచి మేడక్రిందికి దిగివచ్చాడు. సావడిలో ఒంటరిగా పండుకొన్న పెంపుడు కుక్క వెంబడించింది. దుస్తులు వేసికొని బయటికి వచ్చాడు. ఆమెను తోటలోనే కలుసుకొని ఆహ్వానిద్దామని అతని వుద్దేశం. ఎండ ఎక్కువగా వుండడంచేత అంతదూరం పోలేనని భయం కలిగి దగ్గరగా వున్న చెట్టునీడని కుర్చీలో కూర్చున్నాడు నవ్వుతో. కుక్క కూడా యజమాని ప్రక్కనే కూర్చుంది. పక్షుల కూతలతో, ఎండనీడల సమ్మేళనంతో ప్రకృతి ఆనందదాయకంగా వుంది. నిమిషాలు సంతోషంతో చెలరేగి పరుగులెత్తుతున్నాయి. ఆమె వస్తుంది. తనను వదలి వెళ్లిపోయిందనుకున్నాడు. కాని అలాగు చేయలేదు. వస్తుంది. ఆలోచనలో పడ్డాడు. చెట్లచాటునుంచి తన వేపు వస్తుంది. ఒయ్యారంగా వూగుతూ. గడ్డిపూల మధ్యనుండి సౌందర్య దేవతలాగు. తనుమాత్రం కదలడు. ఆమే తన దగ్గరకి వచ్చి అంటుంది—'కొద్దిగా ఆలస్యం అయింది క్షమించూ'—అని. ప్రక్కనే వున్న ఉయ్యాలలో కూర్చుంటుంది, తను చూడడానికి అనువుగా. 'ఆరోగ్యం బాగా వుండేది కాదు. కాని ఇప్పుడు బాగానే వుందిలే' అంటాడు తను. పెంపుడు కుక్క ఆమెపైబడి పాకులాడుతుంది. తన యజమానికి ఆమె అంటే చాలా ఇష్టం అని తెలుసు దానికి.

చెట్టుకింద చల్లగావుంది. పచ్చిక బీడులో ఆవులు మేస్తున్నాయి తోకలతో ఈగల్ని తోలుకుంటూ. తోటలోనుంచి 'లెవండర్' వాసన కొట్టింది. ఓ. అందుచేతనే తుమ్మెదలు (పెద్ద తుమ్మెదా చిన్న తుమ్మెదా అన్నీ) అంత కులాసాగా ఎగురుతున్నాయి, తేనె తాగుతూ. తను మాత్రం అంత ఆనందంగా ఇదివరకెప్పుడూ ఉండలేదు. హృదయం గంతులేస్తూ వుంది తేనె త్రాగి.

మాదలసాలలో గడియారం నాలుగు గంటలు కొట్టింది. ఒక అరగంటలో ఆమె వస్తుంది. ఈ లోపుగా చిన్న కునుకు తీసికోవచ్చు. రాత్రి బొత్తిగా నిద్రలేకపోయింది. ఆ తరువాత శరీరం ఎంత తేలికగా హాయిగా వుంటుంది! అప్పుడు ఆమెని కలుసుకోడానికి ఆహా ఎంత బాగుంటుంది! కుర్చీలో వెనక్కు ఒరగి కళ్లు మూసుకున్నాడు.

* * *

ఒక గులాబిరేక గాలికి ఎగిరి అతడి మీసాల మీద నిలిచింది ఉచ్ఛ్వాస నిశ్వాసాలకు కదులుతూ. టోపీమీద ఒక తుమ్మెద వాలింది. కాలి బూట్లమీదికి ఎండ పాకింది. నిద్రలో అతడు ముందుకు వాలాడు.

గడియారం నాలుగుగంటల పదిహేను నిమిషాలు కొట్టింది. పెంపుడుకుక్క లేచి చూచింది యజమానివైపు. కాలు కదిపింది లేపడానికి. యజమాని కదలలేదు. లేచి తొడలమీదకు దూకి చూచింది ముఖంలోకి. తొందరగా క్రిందికి ఉరికి యజమానివైపు చేరి బారచూచింది. మొరగడం మొదలు పెట్టింది పెద్దగా. అతడి మీసాలమీద నిలిచిన గులాబీ రేకు అలాగే నిలిచిపోయింది చలనం లేకుండా!

(అనువాదం: జి. సత్యమూర్తి)

# నా దైనిక సమస్యలు

## 1

ప్రతి మానవుడి జీవితంలోనూ యేదో వొక కొరత వుంటూనే వుంటుంది. సామాన్యంగా ఆ కొరతకూ డబ్బుకూ ముడిపెడుతూ వుంటారు. ధనమూల మిదం జగత్ అని వాదిస్తారు. దానితో మొదటివాళ్ళనోళ్లు యిట్టే కట్టేస్తారు. కాని నాకు ధనంతో నిమిత్తంలేదు. మానవత్వాన్ని గ్రహించి సంఘుకాలుష్యాన్ని కడిగివేయటానికి ప్రయత్నించటానికి పనికిరాని యీ పిరికిపందలు యెంత ధనవంతులైనా ఏమీ ప్రయోజనము లేదు.

నేను పుట్టినది మధ్యతరగతి కుటుంబములో. పెరిగిందీ, యీనాడు జీవచ్ఛవములా పెరుగుతున్నదీ మధ్యతరగతి కుటుంబములోనే. అమ్మకు యిష్టము లేకపోయినా, నాన్న బలవంతము మీద మూడవఫారంవరకు చదివినాను. పెద్దదాన్ని అయినాను. చదువు వద్దనే విషయములో అమ్మ నోరు పెద్దదయింది. నాన్న కాదన లేకపోయాడు. చదువుకు స్వస్తి చెప్పాను. వెతికి వెతికి గుమాస్తా వుద్యోగము చేస్తూన్న వొక బి. యే. కి యిచ్చారు నన్ను. విశేషంలాంటి సంబంధమని వేనోళ్ళ పొగడారు. మా శారదంత అదృష్టవంతురాలు భూతలంలోనే లేదన్నారు. రత్నంలాంటి పిల్లవాడిని తెచ్చారు మీ నాన్న, యింక అంతా నీ అదృష్టంలో వున్నది అన్నది అమ్మ. అవును. అమ్మమాటలు యెప్పటికీ అబద్ధము కావు, అంతా నా అదృష్టములోనే వున్నది. అసలు అదృష్టమనేది వుంటేగా జరగటానికి. రెండు సంవత్సరాలు నా భర్తతో కాపరంచేశాను. మా సంసారాన్ని చూసి రతీ మన్మథులన్నారు, చిలకాగోరింక లన్నారు. ఇంకా యేమేమో అన్నారు. అన్నీ నిజమే ఆ రెండు సంవత్సరాల్లో.

అదృష్టదేవత రెండేళ్లు యేకదీక్షగా మా భార్యా భర్తలను అంటిపెట్టుకుంది. మూడో యేడు ప్రవేశించింది- యీ ఘోరం జరుగుతుందని కల్లోనైనా అనుకోలేదు. అదృష్టదేవత మమ్మల్ని శాశ్వతంగా వదలి వెళుతూ నా భర్తను మృత్యుదేవత కర్పించి పోయింది. అంధకారకూపమైన జీవితాన్ని ధగద్ధగాయమానంగా మెరిసే వెలుగనుకొని భ్రమించాను. అసంశపథాల్లో అనేక అనుభవాలతో లాలించి కొండ శిఖరాల కెక్కించి, యిప్పుడే వస్తా నుండమని చెప్పి మాయమైనట్లయింది నా బ్రతుకు. రేకెత్తిన లజ్జాభారంతో కుమిలిపోయాను. పెళ్ళినాడు నీ అంత అదృష్టవంతురాలు లేదని పొగడినవారే యీ సంఘటన జరిగిన తర్వాత నీ అంత దురదృష్టవంతురాలు భూమిమీద పుట్టబోదన్నారు. ఆ నాడావిధంగా పొగడిన నోటితోనే యీనాడు నా దురదృష్టానికి నన్ను దూషించారు.

పదోరోజున నా అలంకారాలు శాశ్వతంగా తీసివేసేముందు నా ముఖం చూడటానికి అనేకులు సందేహించారు. తమ పుస్తెలకు పసుపురాచుకొని పసుపుకొమ్ములు కట్టుకొని చాటు చాటుగా తిరిగారు. కొంతమంది నన్ను పురుగుమాదిరిగా చూశారు. ఆ నాడు నాతో మాట్లాడటానికి తహతహలాడే నా బంధువర్గము, స్నేహితురాండ్రు, యేకకంఠంతో నేనొక అదృష్టహీనురాలనని వుద్ఘాటించారు. కొంతమంది యీ రోజు వరకు నా ముఖము చూడలేదు. ఆనందమయ జీవితమున ఆదిమ ఘట్టమయిననూ సాంతముగా ప్రారంభించకపోగా అంతిమఘట్టము ప్రవేశించినందుకు నా దురదృష్టమేనని నన్ను నే నిందించుకున్నాను. విచారముతో కుమిలిపోయే నా హృదయం విచ్ఛిన్నం కావలసిందే. కాని కాలేదు ఈ అనుమానంతో కుమిలిపోయి విరక్తి చెంది బావులకు చెరువులకు పరుగెత్తలేదు గుండె నిబ్బరంతో మనసు చిక్కపట్టుకొని నా పుట్టింట్లోనే జీవితశేషాన్ని గడుపుతున్నాను. నాతోటివారంతా భర్తలతో కాపురంచేస్తూ,బిడ్డ

అనుకుంటూ, పెళ్లిళ్ళకూ పేరంటాలకూ ముస్తాబై కులుకుతూ ఒయ్యారంగా పోతూ వుంటే నామనస్సు దేవినట్లుఅవుతుంది. ఇదివరకుదాకా పలుకరించేవారంతా నన్నిప్పు డెవరూ పలుకరించరు. అప్పుట్లో నన్ను వివాహాది శుభకార్యాలకు భోజనానికి కూడా పిలువరు. వీధివెంట వూరేగింపు వస్తుంటే నేను పెరటిలో వుండవలసిందే. నా పూర్వజన్మ సుకృతంవల్ల నాకీ శాశ్వత కళంకం దాపురించిన మాట వాస్తవమే. నాభర్త పోయినాడనే దుఃఖము జన్మతః నేను జీవించి వుండేటంతవరకూ వుండేదే. నా స్థితిని చూచి జాలిపడేవి లేకపోగా, నన్ను చూచినందువల్ల, నాతో మాట్లాడినందువల్ల, నన్ను వాళ్ల యింటికి పిలిచినందువల్ల నేను వారిని పీక్కుతింటాననో, నమలి మింగుతాననో వాళ్లభయం. మా అమ్మా, నన్ను నవమాసములు మోసి కన్నది. నేనూ అందరి మాదిరిగానే పెరిగాను. అందరూ తినే పదార్థములే తింటున్నాను. నా వివాహము శాస్త్ర సమ్మతముగా, వైభవముగా జరిగింది. ఆ రోజున నన్ను వీళ్లంతా అనంతపథానికి యెత్తి బ్రహ్మరథం పట్టినవాళ్లే. నేనూ వీళ్లమాదిరి సంసార సౌఖ్యాన్ని కొంతవరకు అనుభవించాను. నేను భర్తతో కాపురము చేయనని మొరాయించలేదు. నాకు భర్త అవసరంలేదని పెంకి సమాధానము లివ్వలేదు. కాని నా కీగతి పట్టింది. నాకూ మానాభిమానాలు, చీముసెత్తురు లున్నవి.

అటువంటప్పుడు సంఘం నన్ను యిదివరకు మాదిరిగా గౌరవించకపోయినా, నీచులనుచూచినట్లుగానూ, కూరలలో పురుగును చూచినట్లుగానూ యెందుకు చూస్తారో నాకర్థం కావడం లేదు. వీళ్లకు నేను చేసిన అపచారం యేమిటి?

వితంతువనగానే యీ విధముగా చూడబడాలా? ఇంక నా జీవితమంతా తోటివారి తిట్లకూ, తిరస్కారాలకూ గురికావలసిందేనా? ఈ విధంగా నా సోదరీమణులు యెంతమంది కృశించిపోతున్నారో యెవరయినా ఆలోచించారా? యింక మాకు గత్యంతరము లేదా?

విజయవాడ — మా. శారద

## 2

మాది ఆర్థికంగా చితికిపోయిన సంసారం. మా పూర్వీకులెవ్వరూ మా భావిజీవితానికై ఏ ఒక్క స్థిరమైన ఏర్పాటూ చెయ్యలేదు. వాళ్లకి మమ్మల్ని గురించిన ఆలోచన లేకపోయింది. మా తండ్రిగారు నా మూడవయేటనే చనిపోయారు. అప్పటినుంచి మా తాతగారు (తల్లి తండ్రి) నన్ను పెంచి చదివించారు. నేను నాల్గవ ఫారం చదువుతూండగా ఆయన కూడా మరణించారు.

మా తాతగారు బ్రతికున్నప్పుడు ఆయనవద్ద మా అమ్మగారు హిందీ నేర్చుకున్నారు. తరువాత ఆమె విశారద ప్యాసయ్యారు. మా తాతగారి మరణానంతరం సంసారభారం మా అమ్మగారి భుజస్కంధాలపై పడ్డది. ఆమె హిందీ ప్రైవేట్లుచెప్పి, వాటివల్ల వచ్చే కొద్దిరాబడితో కుటుంబం నిర్వహిస్తూండేవారు. ఆమె ప్రైవేట్లు చెప్పడం కొందరికి నచ్చలేదు. 'ఆడేమిటి? ఆడది రోడ్డుమీద వెళ్ళి ప్రైవేట్లు చెప్పడమేమి'టని వ్యాఖ్యలు సాగించారు. నోరు నొక్కుకున్నారు. విరగబడి చూడడం ఆరంభించారు. ఆమె మాత్రం లక్ష్యపెట్టక అవిధంగా నన్ను స్కూల్ ఫైనల్ వరకూ చదివించారు. స్కూల్ ఫైనల్ లో మా పాఠశాలకు ప్రథముడనుగా ప్యాసయ్యాను. పై చదువులేనిదే ఉద్యోగం రాదు. అందులోనూ బ్రాహ్మణుడంటే.

భావికార్యక్రమాన్ని గూర్చి తీవ్రంగా ఆలోచించాం. మాకు ఆప్తులనబడేవారి సలహాలు పొందాం. 'ఎక్కడైనా గుమాస్తాగా చేరమనీ, టైపూ- షార్టుహాండూ నేర్చుకోమనీ, పెద్ద పరుగులకు పోవద్దనీ, అందనిమ్రానులకు అర్రు చాచవద్దనీ, పరుగెత్తి పాలుత్రాగేకంటే నిలువబడి నీళ్లు త్రాగడం మంచిదనీ' ఎవరికి తోచిన సలహా వారిచ్చారు.

ఆ సంవత్సరమే మా ఊళ్ళో ఒక టెక్నికల్ పాఠశాల స్థాపించారు. అదృష్టం కలిసి రావడంవల్ల దాంట్లో సివిల్ యింజనీరింగు డిప్లొమా కోర్సులో నాకొక సీట్ లభించింది. మూడేళ్లు చదవాలి. సీట్ రావడం ఒక ఎత్తూ, చదవడం ఇంకొక ఎత్తున్నూ! అంతా సిరికిమందుపోశారు.

దిగదీశారు. జడిపించారు. కాని మాఅమ్మగారు మాత్రం పట్టినపట్టు విడువక నన్ను ప్రోత్సహించి ఆ పాఠశాలలో ప్రవేశపెట్టారు. పుస్తకాలూ, అవీ కొన్నారు. ఏ లోటూ జరుగకుండా చూశారు. అట్లానే, ఆ యిబ్బందులలోనే నా స్కూలుకూ, యింటికీ కావలసినవి సర్దసాగారు.

చదువునిమిత్తం సహాయానికని ఒకరిద్దరు ధనవంతులవద్దకు వెళ్ళాను. 'రేపు, మాపు' అని త్రిప్పి, త్రిప్పి ఒకాయన మూడునెలల తరువాత రూ 9 ల నిచ్చాడు. మా స్కూలు మా యింటికి సరిగా మూడు మైళ్లుంటుంది. నడచి వెళ్ళడం అసాధ్యం. అందుకు సైకిల్ కావాలి. 'ప్రొద్దున్నే షికారుగావెళ్ళి, సాయంత్రం చల్లబాటువేళ వచ్చేయ్ నడచి' అని పెద్దలు తిరుగా సలహాలిచ్చారు. మేం వెళ్ళి అడగకపోయినా వాళ్లు మాత్రం సలహాలివ్వకమానరు పాపం! ఈయిబ్బందులలోనే నెలకు రూ 10 ల చొ॥న వాయిదాల ప్రకారం యిస్తామనే నిర్ణయంతో ఒక సైకిల్ కొనుక్కోవలసి వచ్చింది. వచ్చే రూ 50 ల జీతంలో 10 సైకిల్కు పోగా మిగతాది ఖర్చు పెట్టాలి. ఒక్కొక్కరి సలహా వింటూంటే బుర్ర తిరిగిపోయేవి. చదువు జరుగదేమో అనిపించేది.

ఇట్లా ఉంటూండగా నా అదృష్టంకొద్దీ మా అమ్మగారికి బాలికాపాఠశాలలో హిందీ ఉపాధ్యాయిని పని లభించింది. కొంచెం ఒడుదొడుకులు తగ్గినై. రెండు సంవత్సరాలు గడచినై. ఇక ఈ మూడో సంవత్సరంలో యిప్పుడు మూడునెలలు గడవాలి. ఇంటిపన్ను, స్కూల్ జీతం అన్నీ ఒకేనెలలో ముంచుకువస్తాయి. చాలా క్లిష్టంగా ఉంటుంది పరిస్థితి.

ఎక్కడైనా అప్పుచేద్దా మంటే అప్పిచ్చేవారులేరు. 'అప్పిచ్చువాడు, వైద్యుడు' అనే పద్యం స్ఫురణకువచ్చి పట్టణం వదిలేద్దా మని పిస్తుంటుంది. అప్పుతెస్తే తీర్చుకోవడం ఎట్లా అనేదొకసమస్య. 'దినదిన గండం, నెయ్యేళ్ళ ఆయుష్షు' అన్నట్లుంది నాచదువు పరిస్థితి. ఇంతవరకూ ఎన్ని ఆటంకాలు వచ్చినా చదువు ఆగలేదు. ఇక ఆగదని నానమ్మకం. ఆయినా అప్పు తప్పుడు ఎట్లానా ఆనే భయంవేస్తుంది. ఏం చెయ్యలేక బాధపడ్తూంటాను. ఈ చదువే నా దైనికసమస్య అయిపోయింది.

కాకినాడ మూరేమండ రామారావు

# 3

నేను నివసించేది ఒక చిన్న గ్రామంలో. ఇతర గ్రామములతో పోల్చి చూస్తే జన సం ఖ్య యెక్కువే కాని గవర్నమెంటుకు చెల్లించవలసిన భూమి పన్ను కొద్దిగా తక్కువ. భూమి పన్ను యెక్కువ వచ్చు గ్రామములకు యిచ్చినన్ని సౌకర్యములు మా గ్రామములవంటి తక్కువ పన్ను చెల్లించు గ్రామములకు యివ్వరని కొందరు చెపుతారు. పూర్వపు బ్రిటిషు ప్రభుత్వమువలె నేటి మన నెహ్రూ ప్రభుత్వముకూడ పాక్షికముగా వ్యవహరిస్తుందా? అని నా సందేహము.

మావూరుకు యెట్టి వైద్య సౌకర్యమూ లేదు. ఆసుపత్రి అవసరమువస్తే పది మైళ్లదూరములోనున్న తాడేపల్లిగూడెం అను తాలూకా కేంద్రమునకు వెళ్లవలసి వుంటుంది. పోనీ యెవరినైనా తక్కువ డిగ్రీలో డాక్టరు పట్టా పొందిన వైద్యుని తీసుకువద్దామా అంటే మావూరు రావటానికి యేవగించుకుంటారు. అయిష్టత చూపుతారు. ఒకవేళ మా అదృష్టము బాగుండి వస్తే వారం పదిరోజులలో తిరుగు ప్రయాణము సాగిస్తారు. ఆడవారు ప్రసవకాలంలో పడు బాధచూస్తే మా నిస్సహాయతనుగూర్చి, ప్రభుత్వపు అనాదరణనుగూర్చి యేమేమో ఆలోచనలు పరంపరగా హృదయంలో పుడుతుంటాయి. ఈ సంగతే లోగడ రెండు మూడు సార్లు 'లేఖలు' శీర్షిక క్రింద ప్రచురించవలసినదిగా వార్తా పత్రికలకు యిచ్చాను. అయినా మాగోడు వినేవారు కన్పించటము లేదు.

పోనీ ప్రసవపు సమయమునకు డాక్టరుగారిని తీసుకవద్దామంటే ఆయనకు ఒక మంచి గుర్రపు బండి రానుపోను కుదర్చటం, యిచ్చుటకు వచ్చినందుకు కొంత నష్టపరిహారం (యితర పనులు చాల పోతాయి కనుక), చికిత్సచేసినందుకు బిల్లు మొత్తం దగ్గర దగ్గర నలభై రూపాయలు ఖర్చు పెట్టవలసి వుంటుంది. సరే ఆయనతో, నర్సు సర్వెంటు వస్తారు. వాళ్లకు కొంత యిచ్చి

సంతోష పెట్టాలి. మొత్తం డాక్టరుగారు ఒక సారి వచ్చి వెళ్లినందుకు యాభై రూపాయిలు ఖర్చు పెట్టాలి. ప్రొద్దుటే లేచి పొలం వెళ్ళి పెట్టి చాకిరీ చేస్తేనేగాని యింటిలో కుండలు డింకీలు కొడతాయి. ఇట్టి భుక్తికే చూసుకోడమా! అటు డాక్టరుగారి కోసం తిరగడమా!

ఈ లాంటి దైనిక సమస్యలు చూచి పట్టలేని నిస్పృహాతో, ఎప్పటికైనా మార్పు రాదా అను ధైర్యముతో వుజ్వల భవిష్యత్తుకోసం యెదురు చూస్తున్నాను.

ఆవపాడు — అడివి రామచంద్రరావు

# 4

అక్షరాభ్యాసం చేయించలేని ఇంటిలో పుట్టాను. ఆరవయేటనే నెలకొక్క రూపాయి వేతనం పొంది, గృహభారంతో క్రుంగిపోతున్న తండ్రితో సహకరించాను. ఇప్పటికి ముప్పైఏళ్లు వయస్సొచ్చింది. నా 13 వ యేడొచ్చేసరికి పుస్తక విక్రయకర్తలవద్ద. అందించే వుద్యోగంలో పేర్లుగుర్తించే చదువు అబ్బింది. అక్కడ 17 వ యేడొచ్చేసరికి వ్రాయడం, చదవడం వచ్చింది. అయితే యీ చదువు యే వొక్కరి సహాయంతో ఆర్జించింది గాదు. ఇక వ్యాసాలు, కథలు, పుస్తకాలు వ్రాయాలని కాంక్ష. గృహభారం అధికమైపోతున్నా ఉపవాసాలు సాగిస్తూనే 2 యేండ్లు వచ్చేసరికి చాలా కాంక్ష తీరింది. వ్రాసినవన్నీ అచ్చుకావడానికి రైల్వే పుస్తక ప్రకాశకుల సహకారం ఎక్కువైంది. ఇంకా మాసపత్రికలు తావిచ్చాయి. ఎన్నిరకాల మారుపేరులతోనో యివినిండిపోయేవి. ఇట్లాగే యే తక్కువమొత్తం ఆర్జించుకొన్నా, స్వతంత్రజీవనమే పరమావధిగా పెట్టుకొని ఎన్నో వ్యాపారాలు చేశా. అన్నింటా అభివృద్ధియే; ఇంటిలో దారిద్ర్యం తొలగిపోయింది. ఈ స్థితి మా దారిద్ర్యం గుర్తించిన అసూయాపరులకు హేళనగా, విశాలహృదయులకు ఆశ్చర్యంగా వుండేవి. నా దినదినాభివృద్ధిలో నాకాంక్షలు చాలా యీడేరాయి. సంస్కరణసంఘాలు మొదలు దేశంలో అన్నిసంఘాలకు అవకాశం చిక్కినంతలో తెరచాటు నాయకత్వం వృద్ధిపొందింది. సంపాదని అభివృద్ధి అట్టే వున్నందున వ్యయం హెచ్చు మీరింది. ఈ వ్యయభారం నిష్ఫలమైంది యేదీ కామగదా యను సంతృప్తిలో వెనుకచూపు తొలగిపోయింది. ఆదాయానికి వృత్తి వర్తకమే. ఇక యుద్ధపుదినాలు, యేదిపట్టినా బంగారమే. డబ్బు దాచుకొనే బుద్ధికి దూరమైన నాకు, ఎన్నిఖర్చులు అవుతున్నా మిగులుతూనే వుంది.

ఇంత సంపాదనలో ప్రభుత్వపు యావత్తు టాక్సులు చెల్లించేవారిలో నికరంగా నేనొకడనని అనుకోడం కూడా వుండేది. అంతా జాగ్రత్తగానే వ్యవహరించాను! ఏనాడు యే డాంబికమును ప్రదర్శించలేదు, ధార్మికజీవనం తప్ప. ఇక 1945, 1947 ల్లో వచ్చింది తలకుమించిన వ్యాపారనష్టం. బాగా పతనం జరిగింది వున్నదిపోగా, తీర్చలేని ఋణాలు సహించలేని అసూయాపరుల లోకం, దూరంగా ఆలోచించే శక్తిగలవారు, సాటి వర్తకులు యేమేమొ అనుకున్నారు. లోకులు సొమ్మేం వెచ్చించామన్నారు. భుక్తికి దూరం కాగా, నానాబాధలుపడుతూ నేటికి, ఇన్కంటాక్సు, సేల్సుటాక్సు స్వల్పమొత్తాలు కట్టవలసి మిగిలిపోతే, విధిగా వారిచర్యలకు తలొగ్గక తప్పేమార్గం కన్పడదు. మొదలంటా యెగవేసేవారికి యేచిక్కులు కన్పడవు. పండ్లక్షరబడినాలో గల ప్రభుత్వపన్నుల క్రమరూపం నిరూపించినా మార్పులేదు. ఎన్నిరూపముల్లో యెన్నో సహాయాలు పొందినవారు కూడా, యీ పతనానికి తేవపడకపోగా, అందరికి అడిగిందే తడవుగా ఖర్చుపెడితే చిక్కులురావా అన్నారు. ఏమిటో చిత్రం మరి! భావిలో యేమి కానున్నదో!!

విజయవాడ — పతితజీవి

క్రిందటివారం యీ శీర్షిక కింద ఉత్తమరచనకు 10 రూపాయలు బహుమానం పొందినవారు: బి. యస్. పి. రావు, జోలార్ పేట.

ఈ వారం ఉత్తమరచన బహుమతి వచ్చేవారం ప్రకటించబడుతుంది–[సం.]

# జనవాక్యం

సంపాదకునికి ప్రకటనార్థం పంపించిన లేఖలు యీ శీర్షికక్రింద ప్రచురితమవుతాయి. లేఖలు క్లుప్తంగా, కాగితానికి ఒక పక్క వ్రాసి పంపాలి.

## అడకత్తెరలో ఆంధ్రరాష్ట్రం

నెహ్రూ-పట్టాభి-పటేల్ కమిటీ ఆలోచించి, ఆలోచించి ఒక నివేదిక తయారుచేశారు. నిజానికి, థార్ కమిటీవారి రిపోర్టుమీద వీళ్లుచేసిన 'ఇంప్రూవ్‌మెంటు' ఏమీ లేకపోయినా, తెలివైనవాళ్లు గాబట్టి, ఒక తమాషా చేశారు. 'భాషాప్రయుక్తంగా రాష్ట్ర నిర్మాణంచేస్తే ఏమవుతుందో చూడటానికిగాను, ముందు మద్రాసు రాష్ట్రంలోని ఆంధ్ర, ఆంధ్రేతర భాగాన్ని విడగొట్టిచూదాం...' అన్నారు. అయితే, ఇదైనా వెంటనే జరుగుతుందనుకొనటానికి ఆస్కారంలేదు. రాష్ట్రాన్ని పునర్నిర్మాణం చెయ్యవలసి వచ్చినప్పటిమాట ఇది. ఇక 'ఆంధ్రరాష్ట్రం, యిదిగో వస్తున్నది, వచ్చే ఏప్రిల్ నాటికి...' అని మన మద్రాసు మంత్రులు చెప్పటంలో ఆంతర్యం ఏమిటో విశదంగా లేదు. హైదరాబాదు ఎలాగే ఉంటుంది గాబట్టి, తెలంగాణా ప్రజలు, కోరుకున్నప్పటికీ, నూతనంగా ఏర్పడబోయే(?) ఆంధ్ర రాష్ట్రంలో చేరటానికి వీలులేదు. (స్వయం నిర్ణయ సూత్రం...?) పైగా, ఆంధ్రులు గనక మద్రాసు నగరాన్ని వదులుకొనకపోయినట్లయితే, ఆంధ్ర రాష్ట్రం ఇప్పట్లో రావటానికి వీలులేదు. కాబట్టి, మనకివచ్చే ఆంధ్రరాష్ట్రం ఎట్లా ఉంటుందో ఊహించుకోవచ్చును.

త్రిమూర్తుల కమిటీ రిపోర్టు బైటపడిన తర్వాత, 'సర్వెంట్స్(?) ఆఫ్ ఇండియా సొసైటీ'కి చెందిన శ్రీ కోదండరావుగారు, 'ఇక భాషాప్రయుక్త రాష్ట్రోద్యమం ఆపివెయ్యండి!...మనం మొదటిసారికీ, చివరసారికీ కూడ భారతీయులం(?)గా ఉందాం' అని ఒక విన్నపం చేశారు. ఈ 'భారతీయులు' అనేది ఏమిటో అర్థంగాకుండా ఉన్నది. 'మగవాళ్లం, ఆడవాళ్లం అనకండి...అంతా మనుష్యులమే అనండి' అన్నట్లుగా ఉంది. కోదండరావుగారి దండోరా. ప్రపంచాన్నంతా కబళించటానికి నోరు తెరచుకొని వస్తున్న నాజీజాన్ని ప్రతిఘటిస్తున్న అవాంతరపు సమయాల్లో, 'క్విట్ ఇండియా' ఉద్యమాన్ని లేవదీసి, బ్రిటిష్‌వారిని ఎదిరించిన యీ కాంగ్రెస్ అగ్రనాయకులు—యీ నాడు అత్యవసరంగా ఉన్న రాష్ట్ర నిర్మాణాన్ని వాయిదా వెయ్యటానికి, 'దేశం మునుగుకపోతున్నది' అని కారణం చెప్పటంలో ఎంత వరకు ఆత్మవంచన లేకుండా ఉన్నది? ఈ కల్లబొల్లి కారణాలకు మోసపోయి, మన నాయకులు వదలకుండా కోరుకుంటారా? లేక, సత్వర విశాలాంధ్రరాష్ట్ర నిర్మాణానికి అనువైన పథకాన్ని తయారు చెయ్యటానికి పూనుకుంటారా?

మద్రాసు మనది కాకుండా పోతున్నదే, అని బాధపడవలసిన అవసరం ఒకటున్నది. మద్రాసు మనకుగాకపోవడం (అన్యాయమైనా) అక్రమం మాత్రంగాదు. మనము తల్చుకుంటే లక్ష మద్రాసు నగరాలు నిర్మించుకోగలం. శరీరానికి బాధలేకుండా, కుళ్లిపోయిన వేలు నరికివేసినట్లే, మద్రాసు వదులుకొని అయినా

సత్వరరాష్ట్ర నిర్మాణానికి వీలు కలుగుచేసికోవలసిన అవసరం ఉంది.

బ్రిటిష్‌వాళ్లు వెళ్లిపోతూ, ఇండియాకు 'సంస్థానాల సమస్య' ప్రసాదించిపోయినారు. ఇక ఇండియా గవర్నమెంటు వాళ్లు (ఒకవేళ ఇస్తున్నట్లయితే) ఆంధ్రరాష్ట్రం ఏర్పరుస్తూ, మద్రాసు రాష్ట్రంలో లేని ఆంధ్రుల సమస్య నొకటి మనకి ప్రసాదించబోతున్నారు. 'సంస్థానాల సమస్య' పరిష్కారం అయిపోతున్నట్లే, ప్రస్తుతం ఏర్పడబోయే ఆంధ్రరాష్ట్రంలోనికి రాని ఆంధ్రుల సమస్యకూడ, వారి సహాయసంపత్తితోటి, మనం పరిష్కరించుకోగలం. కాబట్టి, ఏదో ఒకటి, ముందు ఆంధ్రరాష్ట్రం రావటం ప్రధానం.

వాల్తేరు 'నడింపల్లి'

౨

అగ్రనాయక త్రయనిర్ణయం ఏమో చేస్తుందని ఎదురుచూస్తే థార్ కమిటీయే మేలనిపించ జేసింది. మన పట్టాభిగారు రాజకీయ ధురంధరులు కాబట్టి మిగిలిన వారితో ఏకీభవించక తప్పలేదు. 'పట్టాభిగారివంటివారే ఔనన్నపుడు మద్రాసు వదులుకోవా'లని ఆర్థిక మంత్రిగారి ఉద్ఘాటన. 'పదవులు తాత్కాలికము'లన్న రామస్వామి రెడ్డియారు మాటలు వేదవాక్కులు. తన కోసం ఆంధ్రులు మద్రాసు వీడవలెనని గోపాలరెడ్డిగారనుట తెలుగు వారికి గొడ్డలి పెట్టు—పట్టాభిగారు మిగతావారితో ఏకీభవించెదరని అగ్రనాయకత్రయం ఏర్పడ్డనాడే అనుకున్నాము. అలాగే అయింది. ఈత్రిమూర్తులు ఏర్పడ్డ నాడే రాష్ట్రం గగనకుసుమ మని అనుకున్నాము. అలాగే మనమనుకుంటే అలాగవుతున్నది. ఇప్పట్లో ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి అష్టమ శని వదలదు. శనియేకాకుంటే భాషా ప్రయుక్త రాష్ట్రనిర్మాణానికి పునాదివేసిన పట్టాభిగారు ముఖావాన్ని శాక్యముగా చూపడ మెందుకవుతుంది?

కొవ్వూరు 'ధర్మశ్రీ'

3

రాష్ట్రం కావాలని మితిమీరి ఆందోళన చేసేటట్టయితే, మా ఇచ్ఛానుసారంగా-అంటే గంజాం



"పవళక్కొడి" తమిళచిత్రంలో అభినేత్రి
టి. ఆర్. రాజకుమారి

కోరాపుట్టి మున్నగు ప్రాంతాల మినహా- విభజించిన భాగమే మీకు దక్కుతుందనిన్నీ, లేదా కొన్నాళ్ళపాటు- అంటే యీ పరిస్థితులు దాటిపోయేవరకు- శాస్త్ర ఓపికపట్టి ఉన్నారా, మీరు కోరినట్లుగా సక్రమంగా, న్యాయరీత్యా రాష్ట్రం లభిస్తుందనిన్నీ ఆంధ్రుల నుద్దేశించి ఉపదేశించిన నాయకత్రయ చర్యను హర్షించవలసిందే. దాని వెనువెంటనే మద్రాసుపై గల హక్కులు ఆంధ్రులు వదులుకోవాలని హెచ్చరించడం, ఆంధ్రులయెడ తీరని అపచారము. బొంబాయి నగరాన్ని ఎవరికీ చెందకుండా ప్రత్యేకంగా విభజించాలనిమాత్రం అన్నారు. మద్రాసులో తమిళులతో ఆంధ్రులున్నట్లు, బొంబాయిలో మహారాష్ట్రులతో గుజరాతీయులున్నారు. ప్రాంతీయరీత్యా తగు ఆధారాల్ని బట్టి (ఆంధ్రులకు అన్యాయం జరుగుతోందని తెలిసికూడ) మద్రాసు ఒక్క తమిళులకే చెందాలని తలచిన కాంగ్రెసు అధిష్ఠానవర్గము,

ఇటువంటి ప్రాంతీయరీత్యానే అనేక ఆధారాల్నిబట్టి మహారాష్ట్రులకు చెందవలసిన బొంబాయి నగరాన్ని మాత్రం కూడా వున్న గుజరాతీయులను తృప్తిపరచటంకోసమై ప్రత్యేకంగా విభజించాలని తీర్మానించింది ఇటువంటి పక్షపాతంతో కూడుకున్న శాసనాలు అమలు పరచిన కాంగ్రెసు హైకమాండనే పెద్దలలో ఆంధ్ర అగ్రాసనాధి నాయకు లిద్దరుండికూడా పై విషయంయెడల పల్లెత్తుమాట అడ్డంకి చెప్పక పోవడం చూస్తోంటే ప్రాతినిధ్యంతో నిమిత్తం లేకుండా వారు వ్యక్తిగతంగా సంచరిస్తున్నారని తెలుస్తుంది. ఇవ్వాళ మద్రాసుపైగల హక్కును వదులుకోమన్నారు. రేపు రాష్ట్రవాంఛ తగదని సూక్తులు చెప్తారు. అన్నింటికి మనం గంగిరెద్దులా తల లూపవలసిందేనా? ఇప్పటికైనా జరిగిపోయిన అన్యాయాన్ని, జరగబోనున్న పక్షపాతాన్ని ఆంధ్రనాయకులు తెలుసుకుని ఉమ్మడిగా ఒక గమ్యాన్ని నిశ్చయించుకోడం తప్ప, గత్యంతరంలేదు. లేకపోతే అనాదిగా వారిపై పెట్టుకున్న ఆశలు, వారియెడలగల నమ్మకంతో కూడిన గౌరవం, ఆంధ్రుల హృదయకుహరాలనుండి తొలగిపోయే దినాలు రాగలవు.

విశాఖపట్నం — కె. జనార్దనరావు

---

## ఒక కాంగ్రెసు సేవకుని అనుభవం

నేను 1920 సంవత్సరం నుండి కాంగ్రెసు వాదిని. 1929 లో మా నాయనగారి పేరుతో శ్రీ గురునాథ గ్రంథాలయము స్థాపించి భాషా సేవ చేయుచుంటిని. మా గ్రామ ధాన్య సేకరణ సందర్భమున, కాంగ్రెస్ చే నా యింటిమీద, ప్రజాప్రభుత్వమునందున్నా బ్రిటిష్ పంథా పీడని వ్యక్తులు దాడి చేయించి కొన్నివేల రూపాయిల నష్టమొనర్చిరి. ప్రజాపరిపాలనయందుకూడా కాంగ్రెసువారు నష్టపడుట శోచనీయము. ఇట్టి కష్టనష్టములతోనైన కాంగ్రెస్ సేవ, భాషాసేవ ఏమరక చేయుచున్నాను. నిక్కమైన ప్రజా ప్రభుత్వము ఏనాడు పరిపాలన చేయునో కదా!

కృష్ణాపురం — కోన ఆదినారాయణవర్మ

## నేటి పరీక్షలు

ఈ రోజుల్లో యే పత్రిక తిరగవేసినా, ప్రస్తుత విద్యావిధానం గురించి, అది యేవిధంగా మార్పు చెందాలి అన్న విషయంగురించి ఒక సంపాదకీయమో, ఒక ప్రముఖుని ఉపన్యాసమో తరుచు చూస్తుంటాము. భావి భారత సౌభాగ్యం ప్రస్తుతం యువతీ యువకుల కిచ్చే విద్యమీదే ఆధారపడి వుందన్న విషయం పలువురు విద్యావేత్తలు దానియందు చూపే శ్రద్ధను బట్టియైనా మనం గ్రహించవచ్చు. వాదాలు. వివాదాలు యెక్కువగా వినిపిస్తున్నాయి కాని, మన విద్యావిధానంలోని అసలు లోటుపాట్లను యెవరు గుర్తించినట్లు కనబడదు. విద్యాబోధనలోనే ఎన్నో తప్పులు కనబడుతూంటే, ఆ బోధన



“వేలైక్కారి” తమిళ చిత్రంలో ఒక సన్నివేశం

మాతృభాషలో [illegible], పరాయి భాషలో జరిగితేనేం! [illegible] గరపే యీ బోధనా ఫలితములు భాష మార్చినంతమాత్రాన తగ్గిపోతాయా! పారశీకుల పాఠ్యభాగములలో చేర్చినంతమాత్రాన విద్యార్థులకు క్రమమైన నడవడి కలుగుతుం దనుకోవడం పొరపాటు.

హిందూదేశంలోని యీనాటి విద్యా విధానంలో రెండు గొప్పలోట్లు కనిపిస్తున్నాయి. విద్యార్థిని పరీక్ష చేసే ప్పుడు అతని బుద్ధి కుశలతను పరీక్ష చెయ్యకుండా, జ్ఞాపకశక్తిని పరీక్ష చెయ్యడం మొదటిది. ఈ విద్యావిధానం అతనికి క్రమమైన నడవడిని, ప్రవర్తనను నేర్పలేకపోవడం రెండవది.

మన దేశంయొక్క విజ్ఞానం అభివృద్ధిచెంది, విశాలదృక్పథం యేర్పడి, పరిపక్వదశకు రావాలంటే బాలురయొక్క సహజశక్తులను పెంపొందింప జేయ్యాలి. అది అత్యావశ్యకం. విద్యావిధానంలోని లోట్లు, అంతిమ లక్ష్యములను యెరుకోవడంలోని లోట్లు మనల్ని మన దేశానికి గాని, విశాల ప్రపంచానికిగాని మన ధీశక్తిని వినియోగించనియ్యకుండా ఆటంకం గలిగిస్తున్నాయి. విద్యార్థియొక్క అంతర్గమైన శక్తులన్నీ అతనిలోనే అణగారిపోయి వుంటున్నాయి. వాటిని యేవిధంగా వినియోగపరచాలో, అభివృద్ధి పరచాలో అతనికి తెలియదు. ఉపాధ్యాయుండు తెలియచెప్పడు. తెలియచెప్పడానికి అవకాశం లేదు. కారణం? పరీక్షలే మన ఏకైకలక్ష్యం. ప్రత్యేకశాస్త్రాలలో అభిరుచిగలిగి, కృషిచేసి నూతన విషయములను కనిపెట్టిన విద్యార్థులెవరైనా వుంటే వారు యీ విద్యా విధానం వలననే సాధించారనుకోనవసరంలేదు. ఇది లేకపోయినా వారు కొనసాగించి వుండేవారు.

ఒక వంద విషయాలనుకంఠస్థం చేసి, వాటిని వినియోగించి, నిత్యమూ తన కెదురయ్యే సమస్యలలో వేటినీ పరిష్కరించలేని విద్యార్థికంటె, కొద్ది విషయములను జ్ఞాపకముంచుకొని, తన బుద్ధి కుశలతతో వాటి నుపయోగించి తన సమస్యలను పరిష్కరించుకొనే విద్యార్థి వెయ్యిరెట్లు మెరుగు. వివిధవిషయములు మన మెదడులో నిలువచేసుకొనడం అంతిమ లక్ష్యంగా ఊహించబడ్డది. ఇంతవరకూ, బ్రిటిష్‌వారు మనల్ని ఆలోచనా పటిమలేని, వినయ విధేయతలుగల గుమాస్తాలుగా తయారుచేసి ఉపయోగపరచుకొన్నారు. కాని ప్రపంచరాజ్యాలలో తలమానికముగా హిందూదేశము యీనాడు యెన్నబడుతూ వున్న ప్పుడు, పూర్వపద్ధతే యిప్పుడుకూడ ఆచరణలో వుండాలా? ప్రాత విద్యావిధానమనే విషవృక్షాన్ని కూకటివ్రేళ్ళతో త్రవ్వి పారెయ్యాలి. పరీక్షాపద్ధతిని సంస్కరించాలి. ఉపాధ్యాయుల సహాయం అక్కరలేకుండా విద్యార్థులు తమ సమస్యలను తామే సాధించడం మొదటినుంచీ అభ్యసించాలి. ఈ మార్పు కాలక్రమేణా జరగాలిగాని విప్లవం వల్ల జరుగదు.

పామర్రు 'సూరి'

---

## లా కాలేజీ మార్పు

ఆంధ్రా యూనివర్సిటీ లా కాలేజీని బందరు నుండి వైజాగ్‌కు మార్చబోతున్నారు. విశాఖపట్నంలో హాస్టలు సౌకర్యం లేకపోగా విడిగా యిండ్లయినా దొరకటం కష్టం. విశాఖపట్టణం తరుగుప్రాంతమగుటచే హాస్టలులో భోజన సౌకర్యంలేదు. నీటిసౌకర్యం సంగతి ఆలోచించితే, విశాఖపట్టణములో నీటిబాధ చెప్పరానిది. మచిలీపట్నంలో లాకాలేజీకి అనేక బిల్డింగులు లభ్యం కాగలవు. లాకాలేజీ బందరు నుండి వైజాగ్ మారుట కాలేజీ విద్యార్థులకు, ఉపాధ్యాయులకు కూడా యిష్టము లేదు. ఎక్కడో చాలా దూరానవున్న వైజాగ్ వెళ్లుటకన్న మద్రాసు లా కాలేజీకి వెళ్లుట సుఖము. అందుచే లా కాలేజీ అభివృద్ధి, విద్యార్థుల సౌకర్యము కోరినట్లయితే ఆంధ్ర విశ్వవిద్యాలయాధికారులు లా కాలేజీని బందరునుండి వైజాగ్‌కు మార్చరాదు.

బందరు బలుసు రామకృష్ణారావు